శ్రీః

# పరశురామ పంతుల రామమూర్తి
# శుకచరిత్ర - సవిమర్శక సమీక్ష

**(మూల సహితము)**




రచయిత

**డా॥ నడిపినేని సూర్యనారాయణ,** M.A., Ph.D.

**వినోదరాయనిపాలెం - (Via) అమ్మనబ్రోలు - 523 180, ప్రకాశం జిల్లా.**

**శ్రీః**

**పరశురామ పంతుల రామమూర్తి**

**శుకచరిత్ర - సవిమర్శక సమీక్ష**

**(మూల సహితము)**

by

Dr. NADIPINENI SURYA NARAYANA

ప్రతులు : 500

ద్వితీయ ముద్రణ : శ్రీరామనవమి, 2020.

పుటలు : 248

వెల : రూ. 100/-

ప్రతులకు :

1. **శ్రీసచ్చిదానంద తపోవనం**
   కత్రాళ్ళకొండవద్ద, తుని
   తూ. గో. జిల్లా., ఆంధ్రప్రదేశ్

2 Dr. NADIPINENI SURYANARAYANA,
   Vinodarayanipalem,
   (Via) Ammanabrolu - 523 180.
   Prakasam Dist.,

3. RAVI MOHAN RAO,
   404, Janjanam Complex,
   **CHIRALA** - 523 155.
   Prakasam Dist.,
   **Cell : 94401 15411**

D.T.P.:
P. PARVATHI
Cell : 7416586775.

Printed at :
KARSHAK ART PRINTERS
Hyderabad.

# ధ్రువీకరణ పత్రం

**డా॥ జె. మునిరత్నం**
అసిస్టెంట్ ప్రొఫెసర్
తెలుగు అధ్యయన శాఖ
శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం
తిరుపతి – 517 502.

**"పరశురామపంతుల రామమూర్తి శుకచరిత్ర సవిమర్శక సమీక్ష"**
అనే ఈ Ph.D. సిద్ధాంత వ్యాసం
**ఎన్. సూర్యనారాయణ** స్వయంకృషిచే రూపొందించడం
నిజమని పరిశోధనా పర్యవేక్షకుడిగా నేను ధ్రువీకరిస్తున్నాను.

తిరుపతి.
తేది. 19.05.1999. **జె.మునిరత్నం.**

# స్పష్టీకరణ పత్రం

**"పరశురామపంతుల రామమూర్తి శుకచరిత్ర – సవిమర్శక సమీక్ష"** అనే ఈ పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసాన్ని **ఎన్. సూర్యనారాయణ** అనే నేను నా స్వతంత్ర పరిశోధన ఆధారంగా శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగు అధ్యయన శాఖ అసిస్టెంట్ ప్రొఫెసర్ డా॥ జె. మునిరత్నం గారి పర్యవేక్షణలో సిద్ధం చేశాను.

ఈ సిద్ధాంత వ్యాసాన్ని ఎప్పుడూ, ఏ విశ్వవిద్యాలయానికి కానీ మరి ఏ ఇతర సంస్థలకు కానీ ఏ ఇతర పట్టం కోసం కానీ, డిప్లొమా లేదా బిరుదు కోసం కానీ సమర్పించ లేదని స్పష్టపరుస్తున్నాను.

తిరుపతి. **ఎన్. సూర్యనారాయణ**

తేది. 19.05.1999. పరిశోధకుడు.

# నా ముందు మాటలు

సహృదయులైన విద్వజ్జనులారా! "నా ముందు మాటలు" చదివి, సద్బుద్ధితో, సానుభూతితో నా ఈ పుస్తకం, పరిశీలించి, నాకు – నా గురువులకు, ఆదరాభిమానములు ప్రదర్శింప ప్రార్థన.

అది 1964 సంవత్సరం. ఆంధ్రవిశ్వకళాపరిషత్తులో, నేను ఎం.ఏ. తెలుగు చదువుచున్న రోజులు. ఎవ్వరో! మహానుభావులు మా గ్రామంలో; మా ఇంటిలో – (వినోదరాయుని పాలెం – ప్రకాశం పంతులు గారి జన్మస్థానంలో) 'శుకచరిత్ర' వేదాంత ప్రబంధం వదలి వెళ్లారు. ఎవ్వరో! ఎందుకు వదలి వెళ్లారో! తెలియదు. "శుకచరిత్ర" వేదాంత ప్రబంధం. 1987లో నా పిహెచ్.డి.; కోసం విషయం (Topic) అయ్యింది.. 'పరశురామపంతుల రామమూర్తి శుకచరిత్ర – సవిమర్శకసమీక్ష' ఈ విషయంతో, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం వారు నాకు 1999లో పిహెచ్.డి. డిగ్రీ ఇచ్చారు. ఇది "శుకచరిత్ర" ప్రబంధం కారణంగా నాకు గలిగిన లౌకిక ప్రయోజనం. ఈ ప్రబంధ, పఠనం కారణంగా, నాకు వైరాగ్యం కలిగింది. 1927లో ఈ ప్రబంధం ఒకసారి అచ్చయినా, మరల అచ్చు కాలేదు. ఎందరికో ఈ ప్రబంధం గూర్చి తెలియదు. ఈ గ్రంథం ఎక్కువ మంది చదవాలి పరశురామపంతుల రామమూర్తి 'శుకచరిత్ర' వేదాంత ప్రబంధం అందరికి అందుబాటులోకి రావాలి. ఈ విధంగా నేను గురుఋణం, ఋషిఋణం తీర్చుకోవాలని, దీన్ని అచ్చు వేయించుచున్నాను. ఆ "సర్వేశ్వరి" దయ, గురుకృప వల్ల నా ప్రయత్నం సఫలం అవుతుందని, ఆంధ్రపండిత మహాశయులు సహృదయంతో పఠిస్తారని, వైరాగ్యశాంతియుతులవుతారని, ఆశిస్తూ,

విద్వజ్జన విధేయుడు, గురుభక్తుడు
**డా॥ నడిపినేని సూర్యనారాయణ**
వినోదరాయునిపాలెం – 523 180.

ప్రథమ ముద్రణ :సెప్టెంబరు 2004
ద్వితీయ ముద్రణ : ఏప్రిల్ 2020

# హితులకు నతులు

ప్రప్రథమంగా నా పరిశోధనకు పర్యవేక్షణ చేపట్ట చక్కని శీర్షికను సూచించి, పరిశోధనకు నా చేత శ్రీకారం చుట్టించిన పరిశోధన పరమాచార్యులు కీర్తిశేషులు ఆచార్య జి. నాగయ్య గారికి,

ఆచార్య నాగయ్యగారి ఆకస్మిక మరణానంతరం నా పరిశోధనకు మార్గదర్శకులుగా వ్యవహరించి పరిశోధన సజావుగా కొనసాగేందుకు సహకరించిన సహృదయులు కీర్తిశేషులు ఆచార్య యం. సుబ్బారెడ్డి గారికి,

నా పరిశోధన విజయవంతం కావడానికి అనేక విధాలుగా సహకరించిన సహకరిస్తున్న నాటి నేటి శాఖాధ్యక్షులు ఆచార్య కె. సర్వోత్తమరావు గారికి, ఆచార్య పి. నరసింహారెడ్డి గారికి, ఆచార్య ఎస్వీ చంద్రశేఖర్ గారికి,

ఆచార్య యం. సుబ్బారెడ్డి గారి ఆకస్మిక మరణానంతరం నా పరిశోధనకు పర్యవేక్షకులుగా వ్యవహరించి, పరిశోధనపారం ముట్టేందుకు సర్వవిధాలా సహకరించిన డా॥ మునిరత్నం గారికి,

విషయసేకరణలోను, విశ్లేషణలోను తోడ్పడిన మిత్రులు డా॥ కె. ఆనందన్ గారికి,

నా సిద్ధాంత వ్యాసాన్ని సమగ్రంగా చదివి, సలహాలిచ్చిన సహృదయులు డా॥ యం. గోవిందస్వామి గారికి,

ఎప్పటికప్పుడు నా పరిశోధనా ప్రగతిని పరామర్శిస్తూ, ప్రోత్సహిస్తూ సముచితంగా సహకరించిన సాహిత్యోపాసకులు, సన్మిత్రులు శ్రీ ఐ. సాయిబాబా గారికి,

నా పరిశోధనకు తోడ్పడిన ప్రాచ్య పరిశోధనాగారం కాకినాడ వారికి, ఆంధ్ర విశ్వవిద్యాలయం వారికి, వేటపాలెం గ్రంథాలయం వారికి, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ గ్రంథాలయం వారికి,

నా పరిశోధన విజయవంతం కావడానికి అనేక రూపాలతో సహకరించిన అందరికీ కృతజ్ఞతాపూర్వక నమోవాకాలనందజేస్తున్నాను.

**ఎన్. సూర్యనారాయణ**

**(నడిపినేని సూర్యనారాయణ)**

# ఉపక్రమణిక

నాకు విద్యార్థి దశనుంచి సాహిత్యమంటే అపారమైన అభిమానం. అందులోనూ ప్రాచీన సాహిత్యం పట్ల మక్కువ ఎక్కువ. పుస్తకసేకరణ, పుస్తకపఠనం నాకు చాల యిష్టమైన కార్యక్రమాలు.

ప్రాచీన సాహిత్యం మీద పరిశోధన చేయాలనే ప్రగాఢ కాంక్ష నాలో ప్రజ్వరిల్లించి తాత్త్వికగ్రంథాలన్నా, వేదాంతగ్రంథాలన్నా నాకు ప్రత్యేక శ్రద్ధ. కాబట్టి వాటిమీద పరిశోధన చెయ్యాలని నాలో కోరిక కలిగింది.

ఆంధ్రసాహిత్యంలో అనేక తాత్త్వికగ్రంథాలు వేదాంతగ్రంథాలు వెలిశాయి. నామమాత్ర ఇతివృత్తాన్ని ఆధారంగా చేసుకొని తాత్త్వికవిషయాలను, వేదాంతవిషయాలను పూసగ్రుచ్చినట్లు బోధించడానికి అవి ప్రయత్నించాయి. వాటి ప్రయత్నం సఫలం కావాలంటే సామాన్య పాఠకునికి సహితం అవి అందుబాటులోకి రావాలి. ఆ గ్రంథాల్లోని వివిధ అంశాలను విడమరచి తేటపరచడం ద్వారా వాటిని సామాన్య పాఠకుడి చేరువకు తీసుకు రావచ్చు. కాబట్టి ఈ దశలో పరిశోధన పరిశీలన జరగవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉందని నాకు అనిపించింది.

పరశురామపంతుల రామమూర్తిగారు శుకచరిత్రను రచించారు. దీనిలో అయిదు ఆశ్వాసాలు ఉన్నాయి. ఈ కావ్యంలో అచంచల వైరాగ్య సంపన్నుడైన శుకుడు శుకుడు వరుడుగాను, ముక్తికన్య వధువుగాను రూపొందడం విశేషం. ఇందులోని వేదాంత విషయాలను, యోగవిషయాలను, సాంఖ్య విషయాలను సామాన్య పాఠకుడికి కూడా అందుబాటులోకి తీసుకొని వచ్చే లక్ష్యంతో పరిశోధనను కొనసాగించాను.

కాకినాడలోని ప్రాచ్య పరిశోధనాగారంలోను, వేటపాలెం గ్రంథాలయం లోను విషయసేకరణ చేశాను. ఎందరో పెద్దలను కూడా కలుసుకొని వారి సలహాలు పుచ్చుకొని పరిశోధనాపథంలో పయనించాను. ఈ సిద్ధాంత వ్యాసం ఈ విధంగా రూపుదిద్దుకుంది.

ఈ సిద్ధాంత వ్యాసంలో అయిదు అధ్యాయాలు ఉన్నాయి. మొదటి అధ్యాయంలో గ్రంథకర్త పరశురామపంతుల రామమూర్తి జీవితం, రచనలు చోటు చేసుకొన్నాయి. శుకచరిత్ర కావ్యేతివృత్తాన్ని రెండవ అధ్యాయం ఆవిష్కరించింది. శిల్పానికి సంబంధించిన వివిధ విశేషాలను మూడవ అధ్యాయం చర్చించింది. శుకచరిత్రలో చోటుచేసుకున్న యోగ, సాంఖ్య, తాత్త్విక విశేషాలను నాల్గవ అధ్యాయం ఆవిష్కరించింది. అయిదవ అధ్యాయం తాత్త్విక గ్రంథాల్లో శుకచరిత్ర స్థానాన్ని పరామర్శించింది. ఈ సిద్ధాంత గ్రంథాన్ని ఆంధ్ర పాఠకలోకం ఆదరిస్తుందని ఆశిస్తున్నాను.



# విషయసూచిక



**అధ్యాయం - 2**



**అధ్యాయం - 3**



## సరస్వతి స్తుతి

శ్లో॥ సరస్వతి నమస్తుభ్యం వరదే కామరూపిణి ।
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా ॥

శ్లో॥ సరస్వతీం చ తాం నౌమి వాగధిష్ఠాతృదేవతామ్ ।
దేవత్వం ప్రతిపద్యన్తే యదనుగ్రహతో జనాః ॥

శ్రీః

# 1. పరశురామపంతుల రామమూర్తి జీవితం - రచనలు

ఒక కావ్యాన్ని చదివినప్పుడు కవి కల్పించిన కమనీయ శిల్పం పాఠకుని హృదయాన్ని తాకుతుంది. తద్వారా అతడు రసానుభూతిని అలౌకిక ఆనందాన్ని పొందగలుగుతాడు. వెంటనే కావ్యాన్ని ఏ కవి వ్రాసి ఉంటాడో తెలుసుకోవాలన్న కుతూహలం పాఠకునికి కలుగుతుంది. ఆ కుతూహలమే కవి కాలాన్ని, జీవిత విశేషాలను వెలికి తీసుకొనిరావడానికి దోహదం చేస్తుంది. కవిత్వం సార్వజనీన సార్వకాలిక సత్య ప్రతిపాదకంగా ఉంటుంది. అదే సమయంలో రచనా కాలం నాటి ప్రజల ఆచార వ్యవహారాలు కూడా కావ్యాల్లో నిక్షిప్తమై ఉంటాయి. కాబట్టి కవి కాలాన్ని తెలుసుకొని ఆ కాలంనాటి ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిస్థితులను ఊహించడానికి అవకాశం ఏర్పడుతుంది.

కవి కాల నిర్ణయానికి పరిశోధకులు ప్రధానంగా ఏడు రకాల ఆధారాలను గ్రహిస్తారు. 1. కావ్యావతారికలు, 2. ఆశ్వాసాంత గద్యలు, 3. కవికాలం నాటి శాసనాలు, 4. కైఫియత్తులు, 5. సమకాలికుల రచనలు, 6. తదనంతర కవుల రచనలు, 7. సాహిత్య చరిత్రకారుల రచనలు.

### 1.1 కావ్యావతారికలు :

కవిగూర్చి, కవిపోషకులను గూర్చి, కావ్య రచనా ప్రాముఖ్యాన్ని గూర్చి తెలిపేవి కావ్యావతారికలు. తెలుగు కావ్యాలలో ఈ విధమైన రచనా సంప్రదాయానికి శ్రీకారం చుట్టినవాడు నన్నయ. ఆయన అలా చేయడం వల్ల చారిత్రక విషయాలు గ్రంథస్థం కావడానికి అంకురార్పణ జరిగింది. అనంతర కవులు కూడా తమ కావ్యాల్లో తమను గూర్చి తమ కృతి పతులను గురించి వారికి సంబంధించిన విశేషాలను గూర్చి ప్రస్తావించారు. ఇలా చరిత్ర రచనకు ఉపయోగపడే ఈ అవతారికా రచనకు ఆద్యులు నన్నయాదులే.

కావ్యావతారికలలో ఎలా చారిత్రక సత్యాలు నిక్షిప్తమై ఉంటాయో తెలియజేస్తూ డా॥ జె. నాగయ్యగారు ఇలా అన్నారు. "**కృతిపతులను బట్టియు, కృతిపతి వంశావళిని వర్ణించు సందర్భమున కవి తెలిపిన చారిత్రక విషయములను బట్టియు, పూర్వకవి స్తుత్యాదులను**

**బట్టియు, శాసనాది ప్రమాణములను బట్టియు, కావ్యములోని భాషా శైలులను బట్టియు కవి కాలమును నిర్ణయింపవచ్చును. కవుల గ్రంథములలో ఆయా కవుల పేర్లు వారి పోషకుల చరిత్రములు లభ్యమగును. కవులను పోషించిన రాజులు మంత్రులు చారిత్రక పురుషులైనచో వారి కాలమును బట్టి కవుల కాలమును స్పష్టముగా తెలిసికొనవచ్చును."** డా॥ జె. నాగయ్య గారు ఏ ఏ ఆధారాల ద్వారా కవి కాలాన్ని నిర్ణయించడానికి ఆస్కారం ఉందో తెలియజేశారు.

అలాగే శ్రీ టేకుమళ్ల అచ్యుతరావు గారు తమ విజయనగర రాజ్యచరిత్ర అనే గ్రంథంలో వరాహపురాణ ప్రాముఖ్యాన్ని గూర్చి తెలియజేస్తూ, **"ఈ గ్రంథము యొక్క ప్రాముఖ్యము దీనియందు కథా స్వారస్యము కంటె నిందు బొందుపరుచబడిన విజయనగర రాజ్యచరిత్ర వృత్తాంతములపై నాధారపడియున్నదని"** నా అభిప్రాయము. ఈ కవులు తమ యధిపతియైన తుళువ నరసరాయల యొక్కయు నతని ప్రభువైన సాళువ నృసింహ రాయల యొక్కయు వంశ చరిత్రములను సావధానముగా వ్రాసియు బెక్కు అపూర్వ విషయములు చేర్చియు నాంధ్ర చరిత్ర పరిశోధకులకు నిక్కమైన సాయ మొనరించిన వారైరి. టేకుమళ్ల అచ్యుతరావు గారి అభిప్రాయంలో కావ్యావతారికలు చరిత్ర నిర్మాణంలో ప్రబలంగా తోడ్పడతాయన్నది తేలింది.

శ్రీ తేరాల సత్యనారాయణ శర్మ గారు తమ **'తెలుగు కావ్యాలలో అవతారికలు – చరిత్ర'** అనే గ్రంథంలో కవికాశ్రయదాతలైన ప్రభువుల చరిత్రను తెలిసికొనడానికి అవతారికలు ఎలా ఉపయోగపడతాయో తెలియ జేశారు. మన తెలుగు కవుల గురించి ఎక్కువ భాగము వారు జీవించియున్న కాలమేదో కనుగొనుటకు ప్రత్యక్షమగు ఆధారములు కానరావు. స్వయముగా తమ కాలము గురించి తాము వ్రాసుకొన్నవారే మిక్కిలి అరుదు. ఇట్టి పరిస్థితులలో ఇతరాధారమును వెదుక వలసి యుండుట తప్పనిసరియగును. ఇతరాధారములకన్న అది కవికాశ్రయ దాతలైన ప్రభువుల చరిత్రను తెలుసుకొనుటకు దప్ప అన్యము గాదు. ఇట్లు ఒకదానికొకటి పరస్పర సంబంధము గలుగుట కానరాగలదు. తెలుగు అవతారికలలో వ్రాసినంత ఇట్టి సమాచారము లభించుట పేర్కొన దగియున్నది.!!

శుకచరిత్ర కావ్యకర్త పరశురామపంతుల రామమూర్తి తన కావ్యావతారికలో తన తండ్రిని గూర్చి చెప్పుకొన్నాడు. తన తండ్రి తన గురువని కూడా తెలియజేస్తున్నాడు. తన తల్లి లింగాంబ అని కూడా వ్రాసుకొన్నాడు.

**అమ్మహా లింగమూర్తి లింగాంబికా, కు**
**మారుడ, దదీయ సేవానుపరుడ, పరశు**
**రామపంతుల కులకంజరాజి కర్య**
**మాకృతిని బొల్చు రామనామకుడనేను.**

అని చెప్పుకొన్నాడు. అదిగాక తాను రచించిన మరో కృతి "**వివేకసారము**" లో తండ్రిని ప్రశంసిస్తూ పది సీసపద్యాలు రచించాడు. రామమూర్తి తండ్రి లింగమూర్తి మంచి పేరు ప్రఖ్యాతులున్న కవి. అందువల్ల తండ్రి చరిత్ర ద్వారా కుమారుని కాలాదులను గుర్తించడానికి వీలుంది. ప్రస్తుతం దొరికిన ఆధారాలు కూడా లింగమూర్తికి సంబంధించినవే ఉన్నాయి.

**1.1.2. ఆశ్వాసాద్యంత పద్యాలు - ఆశ్వాసాంత గద్యలు :**

ఆశ్వాసాంత పద్యాల వల్ల కూడా కవి కాలాన్ని గూర్చి తెలిసికొనడానికి అవకాశం ఉంది. వీటిలో కృతి పతిని గూర్చిన సంబోధనలు ఉంటాయి. తద్వారా కొన్ని చారిత్రక విశేషాలను తెలుసుకోవచ్చు. షోడశకుమార చరిత్రకు అవతారిక లభించకపోయినా ఆద్యంత పద్యాల వల్ల కృతిపతి అయిన సూరనామాత్యుని గూర్చిన విశేషాలు తెలుస్తున్నాయి. అలాగే ప్రబోధ చంద్రోదయములో ద్వితీయాశ్వాస ప్రారంభ పద్యంలో కృతిపతిని సంబోధిస్తూ పలికిన పద్యం వల్ల ఆయనకు సంబంధించిన విశేషాలు బహిర్గతమౌతాయి.

ఆశ్వాసాంత గద్యల వల్ల ఎలా చారిత్రక సత్యాలను వెలికి తీయడానికి అవకాశం ఉందో డా॥ జె. నాగయ్యగారు ఇలా వివరించారు. "**కావ్యావతారికల వలెనే ఆశ్వాసాంత గద్యలు కూడా సాహిత్య చరిత్రకు చాల ముఖ్యమైనవి. ఆశ్వాసాంత గద్యలందు కవిని గురించియు, అతని కావ్యమును గురించియు పెక్కు విషయములు తెలియు చున్నవి.**" అని చెప్పారు.

డా॥ జె. నాగయ్యగారు ఆశ్వాసాంత గద్యల వల్ల గల ఉపయోగాల్ని తెలియజేశారు. వీటిలో – 1. సంగ్రహంగా కథావిషయం ఉంటుంది. 2. గ్రంథం సంపూర్ణమా? అసంపూర్ణమా? తెలుస్తుంది. 3. కవులను గూర్చిన విశేషాలు ఉంటాయి. 4. రాజాశ్రయంలో వర్ధిల్లిన కవులు తాము ఆయా రాజుల వల్ల రాజచిహ్నాలను పొందినట్లు చెప్పడం వల్ల రాజుల చరిత్రను తెలుసుకోవచ్చు. కావ్యకర్త వంశాదికం అవతారికలో లేకపోతే కొందరు ఆశ్వాసాంత గద్యలో పొందుపరుస్తారు. తద్వారా కవి వంశాదికం తెలుసుకోవచ్చు.

శుకచరిత్ర ఆశ్వాసాంత గద్యలో పరశురామపంతుల రామమూర్తికవి "**ఇది శ్రీమద్గురు లింగమూర్తి చరణకమల సేవావిధేయ సద్గురు కరుణా కటాక్ష వీక్షణానుగ్రహోపలక్షిత శ్రీ రామమంత్రోపాసనా ప్రకార జ్ఞానధౌరేయ తన్మంత్రాధిష్ఠాన దేవతా తత్త్వానుసంధాన లక్షణ భాగధేయ వేదాంత కవితా విచిత్ర విజ్ఞేయ బ్రహ్మ విద్వజ్జనగేయ పరశురామపంతుల రామమూర్తి నామధేయ ప్రణీతంబైన శుకచరిత్రంబను వేదాంత గ్రంథంబునందు సర్వంబును పంచమాశ్వాసం సంపూర్ణం**"అన్నారు. ఈ కావ్యంలోని ఆశ్వాసాంత గద్యవల్ల కవికి లింగమూర్తి గురువని, తత్ గురుని అనుగ్రహం వల్ల శ్రీ రామమంత్రోపాసకుడయ్యాడని వేదాంతపరమైన

కవిత వ్రాసే సామర్థ్యం పొందాడని శుకచరిత్ర అనే వేదాంత గ్రంథం వ్రాశాడని తెలుస్తూ ఉంది. ఈ ఆశ్వాసాంత గద్య వల్ల కవి చరిత్రకు సంబంధించిన విశేషాలు అతిస్వల్పంగా తెలుస్తున్నాయి. ఈ గద్యలో పేర్కొనబడిన లింగమూర్తి తండ్రి అని కావ్యావతారికలోని పద్యం వల్ల తెలుస్తూ ఉంది.

**1.1.3. సమకాలికుల రచనలు :**

తెలుగు కవుల జీవితకాలాన్ని లేదా ఆ కవికృత కావ్యరచనా కాలాన్ని తెలిసికోవడానికి సమకాలికుల రచనలు ఉపయోగపడతాయి. రాయల కాలంలోని అష్టదిగ్గజకవుల రచనల వల్ల ఆ కాలంనాటి కవులను గూర్చి కూడా తెలిసికోవడానికి అవకాశం ఉంది. ముఖ్యంగా ఆయా కవులు చెప్పిన చాటువులు కూడా కాల నిర్ణయానికి తోడ్పడతాయి.

కావ్యకర్త రాజయినప్పుడు అతని ఆస్థానంలోనికి వచ్చిన కవుల, పండితుల చరిత్రకారుల రచనలు కూడా కవి కాల నిర్ణయానికి తోడ్పడతాయి. ఉదాహరణకు రఘునాథభూపాలుని కాల నిర్ణయానికి ఆ కాలంనాటి సంస్కృతి చరిత్ర తెలిసికొనడానికి పోర్చుగీసువారు, డచ్చివారు, ట్రాంక్వ్బార్ మిషినరీలు, రోమన్ కేథలిక్కు మిషనరీలు వెలువరించిన రచనలు ఉపయోగ పడతాయి.

పరశురామపంతుల రామమూర్తి కాలనిర్ణయానికి ఉపయోగపడే సమకాలికుల రచనలు చాలా స్వల్పం. కానీ పరశురామపంతుల రామమూర్తి కాలానికి చెందిన దండాపంతుల రచనలు వల్ల రామమూర్తి కాలాన్ని నిర్ణయించడానికి అవకాశం ఉంది. పరశురామపంతులతో బాటు మహారాష్ట్ర నుండి దండాపంతు, శ్యామాపంతులనేవారు వచ్చారు. వీరి సంతతివారికి క్రమంగా వీరి పేర్లే ఇంటిపేర్లు అయ్యాయి. అలా పరశురామపంతుల వంశానికి, దండాపంతు వంశానికి, శ్యామాపంతు వంశానికి అవినాభావ సంబంధం ఉండేది. దండాపంతుల మల్లేశుడు, పరశురామపంతుల రామమూర్తికృత శుకచరిత్రకు శుద్ధప్రతి వ్రాసినట్లు ఈ క్రింది పద్యం వల్ల తెలుస్తూ ఉంది.

**దండా పంతుల కుల పరి**
**మండన మల్లేశ నామ మహితుడు మహిలో**
**పండిత నుత శుక చరితము**
**దండిగ లిఖియించె భానుతనయార్పణ గాన్.**

ప్రతి రచనా కాలం తెలియదు. దండాపంతుల మల్లేశుని కాలం తెలిసినప్పుడు కవికాలం తెలిసికోవడానికి అవకాశం ఉంది. కానీ దండాపంతుల మల్లేశుడుకవిగా గుర్తింపు ఉన్నవాడైనా

అతని జీవిత విశేషాలు తెలియవు. కనీసం ప్రతి రచనా కాలం అయినా తెలిసి ఉంటే తద్వారా కావ్య రచనా కాలం గుర్తించడానికి వీలుండేది.

**1.1.4. శాసనాలు :**

ఆయా కాలాల్లో రాజులు, మంత్రులు, దండనాయకాదులు వేయించిన దానశాసనాలు కూడా కవుల చరిత్రలను తెలిసికొనడానికి ఉపయోగపడతాయి.

మనుమంచిభట్టు '**హయలక్షణ విలాసం**' అనే కావ్యాన్ని రచించి సాళువ కంపరాయలకు అంకితమిచ్చాడు. ఈ కంపరాయ తండ్రి ఔబళరాయలు. క్రీ.శ. 1422లో శ్రీ మన్మహామండలేశ్వర మీ సరగండకతారి సాళువకంపయ్య దేవ మహారాజుల శాసనం ఒకటి లభించింది. దీనిని నిడుదవోలు వెంకటరావు గారు ప్రకటించారు. వీటివల్ల మనుమంచిభట్టు కాలనిర్ణయం చేయడానికి వీలయిందని చాగంటి శేషయ్యగారు ఇలా వ్రాశారు. **శ్రీ పంతులుగారి పరిశోధనల వలన చరిత్రకారులకగపడకుండా దాగియున్న కంపభూపతి బయలు పడుటయు, మనుమంచిభట్టు కాలము సరిగా నిర్ణయమగుటయు తటస్థించినది.** ఇలా శాసనాలు కవి కాలనిర్ణయానికి దోహదం చేస్తున్నాయి. రామమూర్తికి సంబంధించిన ఏ శాసనాలు దొరకనందువల్ల ఆయన కాలాన్ని శాసనాధారంగా నిర్ణయించడానికి వీలులేదు.

**1.1.5. కైఫియత్తులు :**

కైఫియత్తులలో కల్పిత కథలు, పౌరాణికాంశాలు, స్థానిక చరిత్రలు ఉంటాయి. కైఫియత్తులు కూడా చరిత్ర పునర్నిర్మాణంలో ఎలా తోడ్పడతాయో తెలియజేస్తూ డా॥ యస్. వాణీకుమారి గారు "**తమ కైఫియతులు చారిత్రక, పౌరాణికాంశాలు**" అనే సిద్ధాంతగ్రంథంలో ఇలా అన్నారు. కైఫియతులలో కల్పిత కథలను, అద్భుత పౌరాణికాంశాలను పక్కన పెడితే చరిత్రకు కావల్సిన ముడిసరుకు లభిస్తుంది. ముఖ్యంగా కైఫియతులలో ఇవ్వబడిన శాసనాలు చరిత్ర పరిశోధనకు ఆధారంగా నిలుస్తున్నాయి. కొన్ని కైఫియత్తులు ఓరుగంటి ప్రతాపరుద్రుని సంగతులు, విద్యారణ్య కైఫియతులు, చోళరాజుల కైఫియతులు, కొండవీడు కైఫియతులు వంటివి కేవలం చరిత్రను దృష్టిలో పెట్టుకొని వ్రాయబడ్డవిగా కనిపిస్తున్నాయి. దీనిని బట్టి కైఫియతులు చరిత్ర కిచ్చిన ప్రాముఖ్యం ద్యోతకమవుతున్నది.

కైఫియతులలో ఆయా రాజులు పోషించిన కవుల ప్రస్తావన కూడా ఉంటుంది. కాబట్టి రాజుల కాలం ద్వారా కవి కాలాన్ని నిర్ణయించడానికి అవకాశం ఉంది. పరశురామపంతుల రామమూర్తి కవికి సంబంధించిన కైఫియతులు లేవు గాని కవి వంశానికి చెందిన స్థానిక

గాథలున్నాయి. వాటిద్వారా కవి కాలాన్ని నిర్ణయించడానికి అవకాశం ఉంది. వీటిని కవి అభిజాత్యం గూర్చి చర్చించే సందర్భంలో ఉట్టంకించడం జరుగుతుంది.

**1.1.6. తదనంతర కవుల రచనలు :**

తరువాతి కవుల రచనల్లో పూర్వకవుల విషయాలు పొందుపరచబడి ఉంటాయి. వాటి ద్వారా పూర్వకవులను గూర్చి తెలిసికోవడం కొంత సులభమవుతుంది. కుమార ధూర్జటి తన **పెదకాళహస్తీశ్వర మాహత్మ్యము**లో తన పూర్వుడైన ధూర్జటిని గురించి తెలియజేశాడు.

శుకచరిత్ర కర్త రామమూర్తి కవివంశంలోని వాడు అనంతరామకవి. ఈయన **సీతా విజయ చంపూ** కావ్యాన్ని సంస్కృతంలో రచించాడు. కావ్యారంభంలో లింగమూర్తి గురుమూర్తిని, ఆయన పుత్రుడు రామమూర్తిని, అతని పౌత్రుడు లింగమూర్తిని ప్రశంసిస్తూ శ్లోకాలు వ్రాశాడు.

"శివ ఇవ విలసిన్ యః స్వోపరత్యానితాంతం
విధి సుతసన్యోభక్తి భావేన దాంతం
శుక ముని ఇవ సన్యో భూరి వైరాగ్యతః తం
మనసి గురువరేణ్యం చింతయే రామమూర్తిమ్"

**1.1.7. సాహిత్య చరిత్రకారుల రచనలు :**

కందుకూరి వీరేశలింగం పంతులు గారితో ఆంధ్రకవుల చరిత్ర వ్రాయటం ప్రారంభ మయింది. ఆనాటి నుండి నేటి వరకు వీటిపై లెక్కలేనన్ని రచనలు వచ్చాయి.

పరశురామపంతుల రామమూర్తి జీవితకాలాదుల్ని గూర్చి తెలిపిన వారిలో వీరేశలింగం పంతులు, శేషాద్రి రమణ కవులు, ఆచార్య యస్వీ జోగారావు, డా॥ కె. గోపాలకృష్ణారావు, డా॥ ఆరుద్ర, ఆచార్య బి. రామరాజు, ఆచార్య జె. నాగయ్యలు పేర్కొనదగినవారు.

**1.1.7.1. వీరేశలింగం పంతులు :**

వీరేశలింగం పంతులు తమ కవుల చరిత్రలో రామమూర్తి తండ్రి పరశురామపంతులు లింగమూర్తిగారిని గూర్చి వ్రాస్తూ, "ఆర్వేల నియోగి బ్రాహ్మణుడు. రామమంత్రికిని తిమ్మాంబకును పుత్రుడు మహాదేవయోగి శిష్యుడు. ఈతడు 150 ఏండ్ల క్రింద నుండి యుండునని" అన్నాడు.

**1.1.7.2. శేషాద్రి రమణ కవులు :**

గురుమూర్తి లింగమూర్తి వ్రాసిన **శ్రీసీతారామాంజనేయసంవాదము** 1934లో

ప్రకటించబడింది. శేషాద్రిరమణకవులు దానికి పీఠిక వ్రాస్తూ రామమూర్తిగారి తండ్రిని గూర్చి విపులంగా తెలియజేశారు. వీరు కవికాలనిర్ణయాన్ని గూర్చి వ్రాస్తూ, సీతారామాంజనేయ సంవాదం గ్రంథకర్త పుత్రుడగు రామమూర్తి రతీమన్మథ విలాసము నెత్తి వ్రాసి యంతమునునిట్లు వ్రాసియున్నాడు. ప్లవంగ సంవత్సర జేష్ట శు.13 గురువారము వరకు పరశురామపంతుల రామన్నగారు రతీమన్మథ విలాసము పూర్వప్రతిలోనున్న క్రమాన వ్రాసిరి. ప్రతి జీర్ణతరముగ నుండుట వలనను, ఈ రామమూర్తి క్రింద నుదాహరింపబోవు వంశవృక్షము ప్రకారము 30 సంవత్సరములు వయస్సు గల రాధాకృష్ణరావు గారికి ఆరవ పురుషుడగుట వలనను, గాల నిర్ణయము సులభముగా జేయవచ్చును. తరమునకు ముప్పది సంవత్సరముల చొప్పున లెక్కించినచో, రామమూర్తి కవి 180 సంవత్సరముల క్రింద నుండి యుండును. (1934–180–1754 ప్లవంగలో) గ్రంథ వయస్సును బట్టి నేటికి 180 ఏండ్లు గడిచినట్లూహించినచో – నీ కాలము కొంచెము పైకి బోయి ప్రతి 200 సంవత్సరముల క్రింద – వ్రాసినట్లేర్పడును. ఇంతియగాక గ్రంథకర్త మునిమనుమడగు రామకృష్ణ సోమయాజి 98 సంవత్సరములు జీవించి 30 సంవత్సరముల క్రింద పరలోక గతులైన, 98+30 128 సంవత్సరముల క్రింద జనించిన వ్యక్తికి పై తరపు మూడవ పురుషుడు 90 ఏండ్ల పై కాలముననుండెననుకొన్ననూ రామమూర్తి కాలము 180 సంవత్సరములుగానను. లింగమూర్తి యిప్పటికి 220 సంవత్సరముల క్రింద గ్రంథ రచన గావించి ప్రౌఢ వయస్సున నుండెననుకొనవచ్చును. అనగా క్రీ.శ. 1710 ప్రాంతమున గ్రంథ రచనా కాలము కావచ్చును. (1934×220–1714). ఇది కవి వంశజులతో సంప్రదించి నిర్ణయించిన కాల నిర్ణయము.".

శేషాద్రిరమణ కవులు 1920 లోనే వావిళ్ళవారు ప్రకటించిన **సీతారామాంజనేయసంవాదం** గ్రంథానికి 1917 లోనే పీఠిక వ్రాశారు. అందులో పరశురామ పంతుల వంశవృక్షాన్ని ఇస్తూ వంశంలో కడపటి వాడైన పట్టాభిరామయ్యను గూర్చి ఇలా వ్రాశారు. "ఈ పట్టాభిరామయ్యకు వయస్సు 40 సంవత్సరములుండును. ఈయన వద్దనుండి తరమునకు ముప్పది యేండ్ల చొప్పున లెక్కించినచో ప్రకృత కవి యిప్పటికి రమారమి 150 సంవత్సరముల పైకాలము వాడగును. (1917 –150 – 1767) అధ్యాత్మ రామాయణము శుక చరిత్రలోనగు గ్రంథములను రచించిన మహాకవియు, లింగమూర్తి కవికుమారుడు శిష్యుడునగు రామమూర్తి తన తండ్రి లిఖించిన రతీమన్మథవిలాసమునకు శుద్ధప్రతి వ్రాయుచు గ్రింద "ప్లవంగ సంవత్సర జేష్ఠ బ. 13 గురువారము వరకు పరశురామ పంతుల రామన్నగారు రతీమన్మథ విలాసము పూర్వప్రతిలోనున్న క్రమాన వ్రాసిరి' అని వ్రాసికొానెను. జీర్ణ మయమై యున్న గ్రంథము వలనను, ప్లవంగ సంవత్సరమప్పటికి బదియేండ్ల క్రిందను, డెబ్బది యేండ్ల క్రిందను గతించినది

కాక నూట ముప్పది సంవత్సరముల క్రింద గతించినదై యుండును. అంతకు ముందు లింగమూర్తిగారు రమారమి యిరువది సంవత్సరముల క్రింద నుండెనను కొనిననూ సీతారామాంజనేయ సంవాదమిప్పటికి నూట యేబది సంవత్సరముల క్రింద అనగా క్రీ.శ. 1766 ప్రాంతములో విరచించబడియుండుననుట నిస్సందేహము" అని వ్రాసిన పీఠికకు కాలనిర్ణయంలో స్పష్టమైన తేడా ఉండడం గమనార్హం. 1917 లోని పీఠికలో కావ్యం 1766లో వ్రాయబడిందని, 1934లో వ్రాసిన పీఠికల్లో కావ్యం 1710లో వ్రాయబడిందని తెల్పడం పరిశీలనార్హం.

### 1.1.7.3 ఆచార్య యస్వీ. జోగారావు :

**ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర**లో కవి నివాసము వరంగల్లు సమీపముననున్న మట్టెవాడ. కాలము 1814 ప్రాంతమట. (15) అని ఆచార్య యస్వీ జోగారావు గారు తెలియజేశారు. వీరు కాల నిర్ణయానికిక చూపిన ఆధారం గోలుకొండ కవుల సంచిక. ఈ సంచిక 1914లో వెలువడింది. ఇందులో ఈ కవి 120 సంవత్సరాల క్రింద ఉండేవాడని తెల్పారు. అంటే 1914 – 120 = 1794 కాని వీరు కాలనిర్ణయానికి తగిన ఆధారాలు తెలుప లేదు.

### 1.1.7.4 డా॥ ఆరుద్ర :

**సమగ్రాంధ్ర సాహిత్య సంపుటి 12**లో డా॥ ఆరుద్ర గారు రామమూర్తి గారి తండ్రిగారిని గూర్చి చెబుతూ – "పరశురామ పంతుల వారి కుటుంబంలో ఎన్నోవాడో గాని క్రీ.శ. 1710 ప్రాంతంలోనే లింగమూర్తిగారు వరంగల్లు సీమలో తెలుగు కవిత్వం చెప్పసాగాడు" అని చెప్పి లింగమూర్తి కాలం 1710గా చెప్పారు. ఆరుద్రగారు కాలనిర్ణయానికి ఎలాంటి ఉపపత్తులు చూపలేదు.

### 1.1.7.5 డా॥ కే. గోపాలకృష్ణారావు :

'**ఆంధ్ర శతక సాహిత్య వికాసము**'లో క్రీ.శ. 1800 ప్రాంతమున జీవించిన పరశురామపంతుల రామమూర్తి ఈదులవాయి రామశతకము, పరశురామ శతకద్వయము మహిజా మనోహర శతకము అను గ్రంథముల రచించెను అని డా॥ గోపాల కృష్ణారావు తెలియ జేశారు. డా॥ గోపాల కృష్ణారావు గారు కవి కాలనిర్ణయంపై దృష్టి కేంద్రీకరించలేదని పై వివరణ వల్ల తెలుస్తూ ఉంది.

### 1.1.7.6 డా॥ బి. రామరాజు :

1967 స్రవంతిలోని తమ వ్యాసంలో లింగమూర్తి కాలాన్ని గూర్చి చెబుతూ 1798 ప్రాంతమున లింగమూర్తి సజీవుడై యుండియుండునని తెలియజేశారు.

**1.1.7.7 ఇతర రచనలు :**

డా॥ రత్నాకర బాలరాజు గారు '**శ్రీ పరశురామ పంతుల లింగమూర్తి గురుమూర్తి కృత శ్రీసీతారామాంజనేయ సంవాద కావ్యము – ఒక సమాలోచనాత్మక పరిశీలనము**' అనే తమ పిహెచ్.డి. సిద్ధాంత గ్రంథంలో లింగమూర్తిగారి కాలనిర్ణయానికి పూనుకొని శేషాద్రి వేంకట రమణ కవుల అభిప్రాయాన్ని, డా॥ బి. రామరాజుగారి అభిప్రాయాన్ని, బ్రహ్మశ్రీ వఝ్ఝల నారాయణ శాస్త్రులు, శ్రీమాన్ టి. దేవరాజ సుధీమణి వంటివారు చెప్పిన ఐతిహ్యాన్ని మాత్రం చెప్పి తమ అభిప్రాయాన్ని వ్యక్తీకరించలేదు.

ఇప్పటివరకు పరిశీలించిన అభిప్రాయాలను బట్టి పరశురామపంతుల రామమూర్తి కాలాన్ని గూర్చి ఆధారాలతో నిరూపించిన వారు లేరని చెప్పాలి. సాహిత్య చరిత్రకారులకు ప్రధానంగా పరశురామపంతుల లింగమూర్తి గారి రచన **శ్రీసీతారామాంజనేయసంవాద కావ్యము** ఎక్కువగా రుచించడం వల్ల దానిపైననే తమ దృష్టిని కేంద్రీకరించారు. అందువల్లే లింగమూర్తిగారి కాలనిర్ణయానికి ప్రయత్నించారు.

లింగమూర్తిగారి కాలనిర్ణయానికి కూడా వారికి తగిన ఆధారాలు దొరకలేదు. లింగమూర్తిగారి కొడుకు రామమూర్తి గారిని గూర్చి, "ప్లవంగ సంవత్సర జ్యేష్ఠ శు.13 గురువారము వరకు పరశురామపంతుల రామన్నగారు రతీమన్మథ విలాసము పూర్వ ప్రతిలో నున్న క్రమాన వ్రాసిరి" అని చెప్పడం వల్ల దాన్ని ఆధారం చేసుకొని, కాలనిర్ణయం చేయడానికి పూనుకొన్నారు. కాని ఎవరు గాని ప్రతి రచనాకాలాన్ని స్పష్టంగా పేర్కొనలేదు. వేంకట రమణ కవులు 1917 సంవత్సరంలో పీఠిక వ్రాస్తే 1920లో వావిళ్ల వారు దాన్ని ప్రకటించారు. అలాగే 1930లో బహుశా పీఠిక వ్రాస్తే 1934 లో దాన్ని ప్రచురించి ఉండాలి. ఎందుకంటే ఆ పీఠికలో పేర్కొన్నట్లు 'యిప్పటికి 220 ఏండ్ల క్రింద' అనటం వల్ల 1934 నుండి 220 ఏండ్లు తీసివేస్తే 1714వ సంవత్సరంలో గ్రంథరచన జరిగి ఉండాలి. కాని 1710లో జరిగింది అనటం వల్ల 'యిప్పటికి' అదే సంవత్సరాన్ని 1930 గానే గ్రహించాలి. అయితే 1917 సంవత్సరం నాటి సిద్ధాంతానికి, 1930 నాటి సిద్ధాంతానికి దాదాపు 56 సంవత్సరాలు వ్యత్యాసం వచ్చింది. తీరా ఇది కవి వంశజులతో సంప్రదించి నిర్ణయించిన కాల నిర్ణయం అన్నారు. అంటే కవి వంశజులలో ఒకడైన రామకృష్ణ సోమయాజి 98 సంవత్సరాలు జీవించి చనిపోయాడని కవి వంశజుల దగ్గరున్న ఆధారం ద్వారా వేంకటరమణ కవులు నిర్ణయించారు. అంటే వీరు ఆ గ్రామం వెళ్ళిన 30 సంవత్సరాలకు ముందే, అంటే 1900లోనే రామకృష్ణ సోమయాజి మరణించి ఉండాలి. దీని ప్రకారం ఒక్కొక్కరికి 30 సంవత్సరాలు లెక్క గట్టితే–

లింగమూర్తి 1712 లో జన్మించి ఉండవచ్చు.

రామమూర్తి 1742లో జన్మించాడని ఊహించవచ్చు.

లింగమూర్తి 1772లో జన్మించాడనేందుకు వీలుంది.

రామకృష్ణ సోమయాజి 1802లో పుట్టి ఉంటాడని చెప్పవచ్చు.

రామకృష్ణ సోమయాజి మరణతేదీ అతని వయస్సును బట్టి చూస్తే రామమూర్తి కవి 1742లో పుట్టి ఉండవచ్చు. 'రతీమన్మథ విలాసం' కావ్య ప్రతి రచనాకాలం ఎఫిమరీస్ ఆధారంగా 1787 జూన్ 27వ తేది అంటే రామమూర్తి కవికి 45 సంవత్సరాల వయస్సు ఉన్నప్పుడు దీనికి ప్రతిని సిద్ధంచేసి ఉండవచ్చు. అప్పుడే "**శుక చరిత్ర**" కావ్య రచనకు పూనుకొని ఉండవచ్చు. ఎందుకంటే రామమూర్తి తన కృతులన్నిటిలో ఈ 'శుకచరిత్ర'లో చక్కని ప్రతిభను చూపాడు. అంతకు పూర్వమే కవి గ్రంథ రచన సాగించినట్లు, వేదాంత కవితా విచిత్ర విజ్ఞేయ అన్న వాక్యం ద్వారా తెలుస్తూ ఉంది. అంటే శుకచరిత్ర రచనకు పూర్వమే వేదాంత పరమైన రచనలు చేసి ఉండవచ్చునని తెలుస్తూ ఉంది. మహిజా మనోహర శతకం, ఈదులవాయి రామశతకం, పరశురామ శతక ద్వయము, జీవన్ముక్తి ప్రకరణము, వివేకసారము, సీతారామాంజనేయము మొదలైన వేదాంత గ్రంథాలన్ని రచించిన తర్వాత పరిణతి చెంది 'శుక చరిత్ర' అనే వేదాంత ప్రబంధాన్ని రచించి ఉంటాడని ఊహించవచ్చు. రామకవి రచనల్లో ఈ 'శుకచరిత్ర' చాలా ఉత్కృష్ట రచనగా ఉండడం వల్ల ఈ కావ్యాన్ని కవి తాను 45 సంవత్సరాలకు పై బడిన వయస్సులో రచించి ఉండవచ్చు.

అదీగాక 'రతీమన్మథవిలాసం' ప్రతిని వ్రాయడానికి మరొక కారణం ఊహించడానికి వీలుంది. తాను అంతకుపూర్వం రచించిన కావ్యాలు అన్నీ వేదాంతపరమైనవే. కథా రహిత రచనలు ప్రస్తుతం తాను వ్రాయడానికి పూనుకొన్న రచన కథాత్మకం. ప్రబంధోచితరచన. అదీగాక వ్యాసుడు, ఘృతాచి, శుకుడు, ముక్తికన్యల శృంగారాన్ని వర్ణించాలి. తన తండ్రి ఒక శృంగార కావ్యం వ్రాసి ఉన్నాడని, రామకవికి తెలుసు కాబట్టి లింగమూర్తి యుక్త వయస్సులో వ్రాసిన రతీమన్మథవిలాసం తన కావ్యరచనకు దోహదం చేస్తుందేమో నన్న ఉద్దేశంతో బహుశా 'రతీమన్మథవిలాసం' ప్రతిని వ్రాసి ఉండవచ్చు. ఏది ఏమైన శుకచరిత్ర రచన 1787 తర్వాతే జరిగిందని ఊహించడానికి వీలుంది.

### 1.2 రామమూర్తి కవి అభిజాత్యం :

పరశురామపంతుల రామమూర్తి కవి మూల పురుషుడు పరశురామ పంతు. రామమూర్తికవి గానీ, రామమూర్తి తండ్రి లింగమూర్తిగానీ తన వంశ క్రమాన్ని వర్ణించ లేదు. కానీ వారిద్దరూ గురుపరంపరను చక్కగా వర్ణించారు.

శేషాద్రి రమణ కవులు పరశురామ పంతుల లింగమూర్తి రచించిన 'సీతారామాంజనేయ సంవాదము'ను 1934లో ప్రకటిస్తూ లింగమూర్తి వంశవృక్షాన్ని ఇచ్చారు.

శ్రీజానకీరామమూర్తి తిమ్మాంబిక - 1680
లింగమూర్తి గురుమూర్తి లింగాంబిక - 1710
రామమూర్తి శుకచరిత్ర కర్త - 1740
లింగమూర్తి - 1770
రామకృష్ణ సోమయాజి వేణాంబిక క్రీ.శ. 1800
సీతారామయ్య అనంతరామయ్య దశరథరామయ్య కోదండరామయ్య - 1830
పట్టాభిరామయ్య 1860

| | |
|---|---|
| రాధాకృష్ణయ్య | అమృతబాయమ్మ |
| 1900 | 1930 |
| వరకు జీవించారు. | వరకు జీవించారు. |

అమృతబాయమ్మ వరంగల్లులోని మట్టెవాడలో లింగమూర్తి, అతని వంశీయులు నివసించిన గృహంలోనే నివసించేది. ఆ ఇంటిలో శ్రీరామానుగ్రహంగా లభించిన షట్చక్ర సీతారామ సాలగ్రామం, శ్రీరామమాడ, శ్రీరామపంచాయతనం, మరకత శివలింగం, స్పటిక గణపతి అనే అర్చామూర్తులకు నిత్యపూజానైవేద్యాదుల్ని యథావిధిగా జరిపిస్తూ ఉండేది.

పరశురామపంతుల రామమూర్తి కవి పూర్వులను గూర్చి తెలిసికోవడానికి మనకు దొరికే ఆధారాలు మూడు, 1. రామమూర్తి కవి, లింగమూర్తి కవి రచనలు, 2. మట్టెవాడలోని కవి వంశజులిచ్చిన తాళపత్రాలు, 3. కవివంశజుల వాఙ్మూలం. ఈ ఆధారాలతో కవి వంశజులలో సుప్రసిద్ధుడైన పరశురామపంతుల లింగమూర్తిని గూర్చిన విశేషాలే ఎక్కువగా తెలుస్తూ ఉన్నాయి.

ఔరంగజేబు పాదుషా మహారాష్ట్రంపై దండెత్తినపుడు అతని సైనికులు చేసిన అకృత్యాలను భరించలేక అనేకమంది మహారాష్ట్ర దేశాన్ని విడిచి అన్య ప్రాంతాలకు వలస వెళ్లారు. వారిలో దండాపంతు, శ్యామాపంతు, పరశురామ పంతులు తమ కుటుంబాలతో ఆంధ్రదేశానికి వచ్చారు. వారి సంతతి వారికి క్రమంగా వారి పేర్లే గృహనామాలుగా ఏర్పడ్డాయి. ఈ విధంగా పరశురామ పంతుల అనే ఇంటి పేరుగలవారు వరంగల్లుకు సమీపంలోని సెనగవరంలో నివసిస్తూ అక్కడి నియోగి బ్రాహ్మణులతో సంబంధబాంధవ్యాలు ఏర్పరుచుకున్నారు. నియోగి బ్రాహ్మణులు తమ పేర్ల తర్వాత మంత్రి, అమాత్య పదాలను చేర్చుకొంటారు. పరశురామపంతుల వంశంవారు కూడా తమను నియోగులుగా చెప్పుకోవడం వల్ల కొందరి పేర్ల తర్వాత మంత్రి పదం చేరింది. రామమూర్తి తండ్రి లింగమూర్తి తన తండ్రి రామయ్యను రామమంత్రిగా వ్యవహరించాడు.

లింగమూర్తి రచనలవల్ల అతనికి నారాయణగురు, మహాదేవ గురు అనే ఇద్దరు గురువులని తెలుస్తూ ఉంది. సీతారామాంజనేయసంవాద ఆరంభంలో దేవతాస్తుత్యనంతరం.

**"అరయ మద్బాల్యంబున**
**గారవమున జిత్త శుద్ధికరముగనాకున్**
**దారకయోగము దెలిపిన**
**నారాయణగురువులను మనంబునగొలుతున్**" (18)

అనడం వల్లను, అతని మరో రచన **సాంఖ్యతారకామనస్కయోగ సీసతారావళి** త్రయము నందలి సీసతారావళి త్రయం పద్యాల చివర "**చెప్పె నారాయణ స్వామి శిష్యుడైన లింగమూర్తి మహాగురు లింగమూర్తి**" అనే మకుటం ఉండడం వల్లనూ ఈయన మొదటి గురువు నారాయణుడని తెలుస్తూ ఉంది. నారాయణుడు సాలెవాడు. మహామహిమాన్వితుడు, జ్ఞానసంపన్నుడు, తత్త్వజ్ఞాని, ఆయన దగ్గర లింగమూర్తి అనేక విషయాలు నేర్చుకొన్నాడు. అయితే తాను శూద్రుడైనందున ఆధ్యాత్మిక విషయాలు బోధించడానికి అర్హత లేదని చెప్పి నారాయణుని గురువు మహాదేవశాస్త్రి దగ్గర యోగరహస్యాలను గ్రహించమని చెప్పి పంపాడట. ఆయన ఆదేశానుసారం లింగమూర్తి మహాదేవగురువుదగ్గర యోగరహస్యాలను తెలిసికొన్నాడని ఒక ఐతిహ్యం ఉంది.

లింగమూర్తి రచనలలో మొదటిదిగా భావింపబడే '**రతీమన్మథవిలాసము**'లో "శ్రీ మదాంజనేయ చరణకమల సేవా విధేయ" అనడం వల్ల ఈ రచనా కాలానికి లింగమూర్తి నారాయణునిగాని, మహాదేవగురునిగాని ఆశ్రయించలేదని తెలుస్తూ ఉంది. సీతారామాంజనేయ కావ్య రచనా కాలానికి నారాయణగురుని మహాదేవగురుని స్తుతించడం వల్ల బాల్యం గడచిన తర్వాత వారిని ఆశ్రయించి తారకయోగాన్ని శ్రీరామమంత్రాన్ని గ్రహించాడని చెప్పవచ్చు.

శేషాద్రి రమణ కవులు స్వయంగా వారి వంశజుల నుండి గ్రహించిన వాఙ్మూలసారాన్ని ఈ క్రింది విధంగా చెప్పారు. "లింగమూర్తి మనస్సు పరిశుద్ధము చేయు తారక యోగము కతన బరమార్థము తెలిసికొననుత్సాహము గలవాడై మహాదేవగురువర్యుల సన్నిధికేగ సంకల్పించి మంథెనకేగి, యటదర్శించి, శ్రీరామ మంత్రోపదేశము నొందెను. కొన్నాళ్లు గురుకులవాసము చేసి లింగమూర్తి యటనుండి సెలవు గైకొని సమీపమున నున్న పుణ్యక్షేత్రమగు రామగిరి దుర్గమునకేగి యచట పురశ్చరణము గావించెను. శ్రీరాముడు బ్రాహ్మణ రూపమున దర్శన మొసంగి బంగారు శ్రీరామమూర్తియు, స్ఫటిక వినాయక విగ్రహమును నొసంగి, వీనిని స్థానచలనము గావింపక గృహమున నుంచి పూజింపుము. సప్తపురుషాంతరముల వరకు నీయింట నివియుండి సమస్త శుభములు ప్రసాదింపగలవని సెలవిచ్చి యదృశ్యమయ్యెను.

లింగమూర్తి యపుడు వరంగల్లునకు జేరిన మట్టెవాడకు వచ్చి గృహనిర్మాణము గావించి యందీయర్చనా స్వరూపముల జేర్చి పూజించుచు గ్రంథరచన మొనరించి రాజయోగాను సారముగా జీవితము గడిపెను. నాటినుండి నేటివరకు నీయర్చామూర్తులకు వీరి వంశజులు స్థానచలనము కలిగింపలేదు. లింగమూర్తి కవికిపుడు ఏడవ పురుషాంతరము గడుచుచున్నది. లింగమూర్తి సమాధి స్వగృహమునకు మిగుల జేరువలో నరసంపేట పోవు రాచబాటకు నావలనున్నది. కడచిన తరము వరకు సమాధికడ పూజాపురస్కారములు జరిగెడివి.” (19)

లభించిన పలురకాల ఆధారాలను బట్టి పరశురామపంతుల లింగమూర్తి కవికి సంబంధించిన విశేషాలు కొద్దిపాటైన తెలుస్తున్నాయి గాని అతని కుమారుడు రామమూర్తి కవి జీవిత విశేషాలు తెలియడం లేదు. పితృభక్తి పరాయణుడిగా, గురుభక్తి పరాయణుడిగా తండ్రి అడుగుజాడల్లోనే పయనించి, ఆధ్యాత్మసోపానాలనధిరోహించి కృతకృత్యుడయ్యాడని మాత్రమే ఊహించవచ్చు.

లింగమూర్తికవి తాను రచించిన కావ్యాల్ని గూర్చి తెలుపక పోయినా ఆ కవి వంశజుల రచనల వల్ల ఆయన క్రింది రచనలు చేసినట్లు తెలుస్తూ ఉంది.

1. **రతీమన్మథ విలాసము**
2. **జీవన్ముక్తి ప్రకరణము**
3. **నారద పరిమేష్ఠి సంవాదము**
4. **సాంఖ్య యోగము**
5. **తారక యోగము**
6. **మనసా శతకము**
7. **సీతారామ సంవాదము (సీతపాట)**
8. **ఆత్మారామ శతకము**
9. **గోవింద శతకము**
10. **పంచరత్నములు**
11. **సీతారామాంజనేయ సంవాద కావ్యము.**

పరశురామపంతుల రామమూర్తి కవి వంశంలోనివాడు అనంతరామయ్య. ఇతడు 19వ శతాబ్ది మధ్యభాగంలోనే ఉండేవాడని తెలుస్తూ ఉంది. ఇతడు **సీతావిజయచంపూ ప్రబంధము** అనే సంస్కృత కావ్యాన్ని రచించాడు. ఇది అసంపూర్ణం. కేవలం మూడు స్తబకాలు మాత్రమే ఉన్నాయి.

రామమూర్తికవి వంశంలోని వారిని గూర్చి, లింగమూర్తిని గూర్చి తెలియ జేస్తూ శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారు "శ్రీ.... 2. రామమూర్తి కుమారుడు లింగమూర్తి . అతనిని గురించిన వివరములు తెలియవు. 3. లింగమూర్తి కుమారుడు రామకృష్ణచయనులు. ఈయన వైదికకర్మనిష్ఠాపరుడు. చయనాంతమైన యజ్ఞాదులు చేయుటచేత ఇతనికి చయనులు అన్న బిరుదనామము వచ్చినది. పితృపితామహుల నాటినుండి పరంపరగా వచ్చుచున్న శ్రీరామమంత్రమును పురశ్చరణముచేసి మంత్రసిద్ధుడై గురుపీఠమునెక్కి పల్లకిలో సంచారము సేయుచు శిష్యకోటికి వేదాంతరహస్యములను బోధించిన కీర్తిశాలి. 4. ఈయన కుమారులును శ్రీ లింగమూర్తికి అయిదవ తరమువారునునగు సీతారామయ్య, అనంతరామయ్య, దశరథరామయ్య, కోదండరామయ్య అనువారిలో సీతారామయ్య, తర్కశాస్త్రవేత్త, అనంత రామయ్య జ్యోతిశ్శాస్త్రవేత్త అంతేగాక వీరు నలుగురును రామమంత్రోపాసకులు, పండితులు, కవులు, గ్రంథకర్తలునై యుండిరి. పై నలుగురిలో చిన్నవాడైన కోదండరామయ్య కుమారుడు పట్టాభిరామయ్య. పట్టాభిరామయ్య కుమారుడు రాధాకృష్ణరావు. ఈ 6,7 తరముల వారిలో సంస్కృతాంధ్రములకు బదులు రాజకీయ విద్యలు ప్రవేశించినవి." (20) అని వివరించారు.

కవిపండితవంశంలో జన్మించిన పరశురామపంతుల రామమూర్తికవి కూడా తండ్రి అంతటివాడై అనన్యకీర్తిసంపదలను సంపాదించి తెలుగుసాహితీలక్ష్మికి భూషణాలుగా అనేక రచనలు చేశాడు.

**1.3 రామమూర్తికవి రచనలు :**

రామమూర్తి కవి వ్రాసిన గ్రంథాల్ని గూర్చి అభిప్రాయభేదాలున్నాయి. డా॥ సన్నిధానము రామతారక పరబ్రహ్మశాస్త్రిగారు తమ '**ఆంధ్రతత్త్వకావ్యములు**' అనే సిద్ధాంత గ్రంథంలో రామమూర్తి కవి శుకచరిత్రము, ఆధ్యాత్మరామాయణము, వివేకసారము మొదలయిన గ్రంథాలను పదింటిని వ్రాశాడని చెప్పారు. వీరి అభిప్రాయం ప్రకారం ఆధ్యాత్మరామాయణము, శ్రీ రామహృదయము, వేదాంతకీర్తనలు అలభ్యాలు.

అలాగే డా॥ రత్నాకర బాలరాజు తమ సిద్ధాంతగ్రంథం 'శ్రీ సీతారామాంజనేయ సంవాద సమాలోచనాత్మక పరిశీలనము' లో ఇలా అన్నాడు. "వీరిలో రెండవవాడైన రామమూర్తి తన తండ్రి వలననే శ్రీరామమంత్రోపదేశమును బొంది శ్రీరామానుగ్రహధన్యుడై మహాకవిగా, రాజయోగధురంధరుడుగా, మహాప్రతిష్ఠను బొందెను. ఈ మహాకవి రచించిన గ్రంథములివి.

1. శ్రీరామహృదయము (ద్విపద)
2. జీవన్ముక్తి ప్రకరణము - పద్యములు

3. వివేక సారము
4. వేదాంత కీర్తనలు
5. ఈదులవాయి రామశతకము
6. పరశురామ శతక ద్వయము
7. మహిజా మనోహర శతకము
8. ఆధ్యాత్మరామాయణము
9. శుకచరిత్రము
10. సీతారామాంజనేయము (గేయ ప్రబంధము) (21)

ఆచార్య యస్వీ. జోగారావు కూడా తమ గ్రంథం యక్షగానవాఙ్మయ చరిత్రలో ఆధ్యాత్మ రామాయణము రామమూర్తికవి కృతంగా పేర్కొన్నాడు.

రామమూర్తి కవి ఆధ్యాత్మ రామాయణము వ్రాయలేదని కొన్ని ఆధారాల వల్ల తెలుస్తూ ఉంది.

కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయములో ఉండే ప్రతుల్ని పరిశీలిస్తే, 1. శ్రీ రామహృదయము, 2. వేదాంత కీర్తనలు, 3. ఆధ్యాత్మ రామాయణము, లింగమూర్తి వ్రాసినట్లు తెలుస్తూ ఉంది.

లింగమూర్తి వ్రాసిన **నారదపరమేష్టిసంవాద** కావ్యములో–

**"ఇదియు నారద పరమేష్ఠి సంవాదము**
**పరగ పరశురామపంతుల కుల**
**భవుడు లింగమూర్తి పరికింప చెప్పెను**
**విదితముగను నాంధ్ర విధముగాగ"** (22) అన్నాడు.

ఆధ్యాత్మరామాయణమునకు 'నారదపరమేష్టిసంవాదము, రామహృదయము, రమాతత్త్వ–చరిత, రామగీత, శ్రీరామకథామృతము' అను నామాంతరాలు ఉండడం వల్ల నారదపరమేష్ఠి–సంవాదము అనే ఆధ్యాత్మరామాయణము లింగమూర్తి రచించాడని చెప్పవచ్చు.

ఇప్పటి వరకు పరిశీలించిన అంశాల్ని బట్టి పరశురామపంతుల రామమూర్తి రచనలు ఏడు అని చెప్పవచ్చు. వాటిలో **శతకాలు** మూడు. 1. మహిజా మనోహర శతకము, 2. ఈదులవాయి రామశతకము, 3. పరశురామ శతకద్వయము. **యక్షగానములు** రెండు – 1.సీతారామాంజనేయము, 2. జీవన్ముక్తి ప్రకరణము. **ప్రబంధాలు** రెండు – 1. శుకచరిత్ర, 2. వివేకసారము.

**1.3.1 మహిజా మనోహర శతకము :**

'అంబాల' పురిలో వెలసిన శ్రీరాముని సంబోధిస్తూ యౌవనంలో ముక్తి మార్గాన్ని తనకు బోధించడానికి కవి దీన్ని రచించాడు. ఈ శతకాన్ని గూర్చి తెలుపుతూ డా॥ కే. గోపాల కృష్ణారావు తమ ఆంధ్ర శతక సాహిత్య వికాసములో ఇలా అన్నారు – "ఈ కవి ఆత్మపరమాత్మల తత్త్వమును సంగ్రహముగ నిరూపించి మానవుడు పరమాత్ముని అంశమున జన్మించిన వాడను భావమును మనోహరముగ వ్యక్తీకరించెను. ఈ బాంధవ్యమునను సరించి తనకును శ్రీరామునకు నెట్టి భేదము లేదనియు నిరువురేకాంశముగల వారనియు నిరూపించి ముక్తిలో భాగము పొందుట తన హక్కుగా చాటి మోక్షము నర్థించెను.

సాధారణముగ వివిధ అవతారముల గూర్చి శతకములు వ్రాసినవారు పద్యాలు వ్రాశారు. కాని ప్రత్యేకముగ అవతార విశేషములను వర్ణించ లేదు. రామమూర్తి కవి రామావతార విశేషములనేబది పద్యములలో రమణీయముగ వర్ణించెను. 1. కైక దుశ్చర్య, 2. సీతారాముల అరణ్య వాసము, 3. రావణుని దుష్టనీతి, 4. సీతాపహరణము, 5. శబరి శ్రీరామునకు ఫలములను కానుకగా నొసగుట, 6. వాలివధవృత్తాంతములు క్రమము ననుసరించి వర్ణింపబడినవి" (23)

ఈ శతకము 1933లో ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రికలో ముద్రింపబడినది. ఇదిగాక అదే సంవత్సరంలో శతకసముచ్చయములో కూడా చేర్చి ముద్రించారు.

**1.3.2 ఈదులవాయి రామశతకము :**

రామమూర్తి కవి ఈదులవాయి గ్రామంలోని శ్రీరాముని స్తుతిస్తూ, ఈ శతకాన్ని రచించాడు. ఇది అముద్రితం. కాకినాడ ప్రాచ్యలిఖిత పరిశోధనాగారంలో దీని తాటాకుల ప్రతి ఉంది. 14 తాటి ఆకుల్లో చంపక, ఉత్పలమాలా ఛందస్సులతో 100 పద్యాలున్నాయి.

ఇందులో మొదట దశావతారల వర్ణన ఉంది. దాశరథి శతకాన్ని తలపించే పద్యాలు ఇందులో ఉన్నాయి.

**"నృపులు గణింప సత్కవులు నిర్వృతి నొంద జనానురక్తిగ**
**ల్గ పరశురామ పంతులకుల ప్రభవుండగు రామమూర్తి యు**
**క్త పదములొడ్డి పద్య శతకంబొనరించెను దీని ధాత్రిలో**
**నెపుడు వెలుంగ జేయుమిక నీదులవాయి పురాధినాయకా"**

అని వ్రాయడం వల్ల పదౌచితిని పాటించి శతక రచన సాగించినట్లు తెలుస్తూ ఉంది.

కవికి శరణాగతి, భక్తి ప్రపత్తులు మెండుగా ఉన్నాయి. పాంచరాత్ర ఆగమ ప్రభావం కవిమీద కనిపిస్తుంది. ప్రద్యుమ్న, అనిరుద్ధ, వాసుదేవ, అధోక్షజ మొదలైన విష్ణునామాల వివృతి చేశాడు. వాసుదేవ తత్త్వాన్ని తెల్పి భక్తుల స్మరణ సద్గతికి కారణంగా పేర్కొన్నాడు. రాముడు అన్నిచోట్ల ఉన్నా ఆయన్ని తెలుసుకొనేవారు లేరని, రాముని దివ్యమంగళ విగ్రహాన్ని వారికి దర్శింప జేశాడు.

కవి సాంఖ్యయోగ సాధకుడుగా జీవితాన్ని ప్రారంభించి 'నీవే నేను' అని తెలియజేశాడు. సర్వం రామమయమని భావించాడు. హృదయ పరివర్తనతో పాటు కావ్య పరిణతి కూడా జరిగింది. శుకచరిత్ర రచనాంతరం ఈదులవాయి రామశతకాన్ని వ్రాసినట్లు తెలుస్తూ ఉంది.

**1.3.3 పరశురామ శతక ద్వయము :**

పరశురామపంతుల రామమూర్తి తన అనుభవాన్ని వ్యక్తీకరించడానికి సరళ శైలిలో 'పరశురామ శతకాన్ని' రచించాడు. ఇందులో 200 కంటె అధికంగా పద్యాలుండటం చేత శతకద్వయము అని పిలవడం జరిగింది. కవి తన ఇంటిపేరును మకుటంగా ఉంచి (పటు గుణాభిరామ పరశురామ అనేది మకుటం) నట్లు తెలుస్తూ ఉంది.

లింగమూర్తి కృత సీతారామాంజనేయసంవాదంలో తారకయోగం, సాంఖ్యయోగం, అమనస్కయోగం అనే ఈ మూడు యోగాల వివరణ విశదంగా ఉంది. దాన్ని రామమూర్తి కవి సరళంగా, అందరికి అర్థమయ్యే రీతిలో చెప్పాలన్న ఉద్దేశంతో వేమనలా ఆటవెలది పద్యాలలో ఈ శతకాన్ని రచించాడు.

పరశురామ శతకం ప్రారంభంలో ప్రబంధాల్లోలా దేవతా స్తుతి ఉంది. మొదటి పద్యంలో విష్ణువును తరువాతి పద్యాల్లో బ్రహ్మను, విఘ్నేశ్వరుని స్తుతించాడు. దేవతాస్తుతి తర్వాత గురుస్తుతి ఉంది.

ఈ పరశురామ శతకము 1929లో ఆంధ్రసాహిత్య పరిషత్ పత్రికలో అచ్చయింది. ఇదిగాక కాకినాడ ప్రాచ్యపరిశోధనాగారంలో 17 తాటి ఆకులపై ఒక్కొక్క ఆకులో ఒకవైపు ఆరు పద్యాలు వ్రాయబడి ఉన్నాయి. రెండు వైపుల 12 పద్యాలు చొప్పున మొత్తం 204 పద్యాలున్నాయి. దీని నెంబరు ట.3508, 83/9 ఇదిగాక 2290 నెం. 164/2 నెంబరు గల ప్రతి పురాతనమయింది. ఇది శిథిలావస్థలో ఉంది. ఇందులో మొత్తం 206 పద్యాలున్నాయి.

**1.3.4 సీతారామాంజనేయము :**

రామమూర్తికవి తండ్రి లింగమూర్తి కృత సీతారామాంజనేయసంవాదానికి అప్పటికి వ్యాఖ్యలు

లేనందువల్ల అందులోని విషయాలను గ్రహించడం కష్టమని భావించి రామమూర్తి ముముక్షువులకు అందులోని సారాంశం సులభగ్రాహ్యం కావడానికి దాన్ని గేయ ప్రబంధంగా వ్రాశాడు. దీన్ని తన తండ్రి లింగమూర్తికే అంకితమిచ్చాడు. ఇందులోని కీర్తనలు రాగ, తాళయుక్తంగా ఉన్నాయి. గద్య పద్యాలు కూడా ఉన్నాయి. కథ గురుశిష్యుల సంభాషణగా సాగింది. అద్వైతతత్త్వవేత్తగా, అపరోక్షానుభవంగల గురువు తన శిష్యులకు తారకయోగం, సాంఖ్యయోగం, అమనస్కయోగం అనే మూడు యోగాల తత్త్వాన్ని బోధించాడు. శిష్యుడు తన గురువు కరుణతో ముక్తికాంతను కనుగొన్నాడు. అమనస్కయోగాన్ని వివరిస్తూ, "**మనంబు లేమి అమనస్కము**" అన్నాడు. **శివ పాహి శంభో** అనే మకుటంతో సంస్కృతంలో ఒక శివాష్టకం ఇందులో వ్రాయబడింది. ఇందులో పాటలు, దరువులు ప్రయోగించే సమయంలో కూడా కవి సలక్షణమైన భాషను ప్రయోగించాడు. కవి సంస్కృతాంధ్రభాషలలోనూ సంగీత సాహిత్యాదులలోనూ అద్వితీయప్రతిభగలవాడుగ కన్పిస్తున్నాడు.

### 1.3.5 జీవన్ముక్తి ప్రకరణము :

పరశురామపంతుల రామమూర్తికవి జీవన్ముక్తి పొందడానికి మనిషి చేసే ప్రయత్నాన్ని దాని పర్యవసానాన్ని ఇందులో చక్కగా వర్ణించాడు. కవి రామభక్తునిగా ఉండి, క్రమంగా కృష్ణ భక్తుడుగా మారడం ఇందులో కన్పిస్తుంది. ఈ పరిణామం జీవన్ముక్తి ప్రకరణము అనే యక్షగానం ద్వారాను వివేకసారమనే కావ్యం ద్వారాను బహిర్గతమౌతూ ఉంది.

కవి గ్రంథ ప్రారంభంలో దేవతాస్తుతి గావించాడు. విఘ్నేశ్వరుని, శివపార్వతులను, పంచ బ్రహ్మలను, మహాదేవగురుని లింగమూర్తిని స్తుతించాడు.

ఈ యక్షగానం అముద్రితం. కాకినాడ ప్రాచ్య పరిశోధనాలయంలో రెండు ప్రతులున్నాయి. ఒకటి ప్రాచీనప్రతి, రెండవది మొదటిదానికి నకలు అరటావు సైజు, 25 పుటలు. చేతివ్రాతలో నున్న కాగితపు ప్రతులివి. కవి ఇందులో తమ గీతాలకు ఆధ్యాత్మలు అనే పేరు పెట్టాడు. శ్రీశంకరాచార్యులకు చండాలరూపంలో ఉండే విశ్వేశ్వరునకు జరిగిన సంవాదం ఈ యక్షగానంలో తెలుపబడింది. శంకరుని **మనీషాపంచకము**ను కవి పాటరూపంలో వ్రాశాడు. శివునికి, రామునికి, కృష్ణునికి భేదమే లేదని బోధించాడు. కృష్ణుని లీలలను స్మరించాలని చెప్పాడు. దీనిని ఒక విధంగా 'అధ్యాత్మభాగవతము' అనవచ్చు. భాష సరళంగా ఉండి, నిత్యవ్యవహారంలో ఉండే పదాలు కూడా ఇందులో చోటు చేసుకోవడం విశేషం.

### 1.3.6 వివేకసారము వేదాంత ప్రబంధము :

దీనిని రామమూర్తికవి నాలుగు ఆశ్వాసాలుగల ప్రబంధంగా మలిచాడు. వ్యాసకృత

మహాభారతం శాంతిపర్వంలోని నరనారాయణీయ వృత్తాంతం ఆధారంగా కవి దీన్ని రచించాడు. ఈ గ్రంథంలోని కథలను భీష్ముడు ధర్మరాజునకు చెప్పాడు. వైశంపాయనుడు జనమేజయునికి, కృష్ణుడు అర్జునునికి ఈ కథలను చెప్పారు. ఈ కృతిని కవి శ్రీరామునికి అంకిత మిచ్చాడు.

ఇందులో నారాయణ నారద సంవాదంలో శ్వేతద్వీపంలోని ముక్త పురుషుల వృత్తాంతం 24 రకాలైన తత్త్వాలు ఉన్నాయి. ఉపరిచరవసువు కథ చెబుతూ అహింసా సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. ఆ తర్వాత విష్ణువు అవతారాల వర్ణన చేశాడు. నరనారాయణులతో నారదుని సంభాషణ, నారదుని తపస్సు, వాసుదేవుని తత్త్వబోధ ఇందులో ఉన్నాయి. ఇదిగాక వైశంపాయనుడు జనమేజయునితో ఏకాంతిక ధర్మాన్ని తెలిపాడు. ఇందులోని అజామిళుని వృత్తాంతాన్ని భాగవతం నుండి గ్రహించి వివరించాడు. ఇందులో నారాయణుని దివ్యనామ స్మరణ ముక్తికారక మని చెప్పాడు. ఈ గ్రంథాన్ని సకల వేదాంత గ్రంథాలలోని సారంగా సంగ్రహించి వివేక సారమనే సార్థకనామకరణం చేశాడు. ఇది అముద్రిత గ్రంథం. దీని ప్రతి కాకినాడ ప్రభుత్వ ప్రాచ్య గ్రంథాలయంలో తాళపత్ర రూపంలో ఉంది.

### 1.3.7 శుకచరిత్ర :

రామమూర్తి రచనల్లో కథావస్తువునకు ప్రాధాన్యమిచ్చి రచించిన ఏకైక గ్రంథం. కల్పనగా శుకునికి, ముక్తికన్యకకు జరిగిన వివాహం ఇందులో చక్కగా వివరింపబడింది. శుకచరిత్రను కవి తన నవనవోన్మేషశాలినియైన ప్రతిభను ప్రదర్శించి చక్కని ప్రబంధంగా తీర్చిదిద్దాడు. శుకచరిత్ర కావ్యంలోని వర్ణనాలంకార విశేషాదులను, రసౌచితిని, యోగశాస్త్ర విషయాలను తరువాతి అధ్యాయాలలో పరిశీలిద్దాం.



### అధోజ్ఞాపికలు

1. తెలుగు కావ్యావతారికలు కీ.శే. ఆచార్య జి. నాగయ్యగారు. పుట. 259
2. విజయనగర రాజ్య చరిత్ర, 11 అధ్యాయం, పుట 2144-245.
3. తెలుగు కావ్యాలలో అవతారికలు - చరిత్ర, ప్రస్తావన - 11.
4. శుకచరిత్ర 1-41.
5. తెలుగు కావ్యావతారికలు, పుట 282 (కీ.శే. ఆచార్య జి. నాగయ్యగారు)
6. శుకచరిత్ర 5 ఆ
7. శుకచరిత్ర, వ్రాతప్రతి
8. నిడుదవోలు వేంకటరావు.
9. ఆంధ్రకవి తరంగిణి, సంపుటం 6, పుట. 108
10. కైఫియతులు - చారిత్రక పౌరాణికాంశాలు, పుట-125
11. చరిత్రకెక్కని చరితార్థులు, ఆచార్య బి. రామరాజుగారు, పుట - 171-172
12. కవుల చరిత్ర, కందుకూరి వీరేశలింగం, పుట - 280
13. సీతారామాంజనేయసంవాదము, పీఠిక - II, పుట - 17
14. సీతారామాంజనేయసంవాదము, పీఠిక - II, పుట - 17
15. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, పుట-363
16. సమగ్రాంధ్ర సాహిత్యం, సంపుటం - 12, పుట - 19
17. ఆంధ్ర శతక సాహిత్య వికాసము, పుట - 118
18. సీతారామాంజనేయసంవాదము, దేవతాస్తుతి, పీఠిక - II, పుట - 11
19. సీతారామాంజనేయసంవాదము, పీఠిక - 11, పుట - 10
20. సీతారామాంజనేయసంవాదం, పీఠిక - 11, పుట - 18
21. శ్రీసీతారామాంజనేయసంవాద సమాలోచనాత్మకపరిశీలనము, పుట- 28-29
    - శ్రీ రత్నాకర బాలరాజుగారు
22. నారద పరమేష్ఠి సంవాదము, వ్రాతప్రతి, 178/20
23. ఆంధ్ర శతక సాహిత్య వికాసము, పుట - 8,9
24. ఈదులవాయి రామశతకము, తాటాకుల ప్రతి.



శ్లో॥ అగజాననపద్మార్కం గజాననమహర్నిశమ్ ।
అనేకదం తం భక్తానాం ఏకదంతముపాస్మహే ॥

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥



## శ్రీ గురుస్తుతి

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుః సాక్షాత్ పరంబ్రహ్మా తస్మై శ్రీగురవే నమః ॥

శ్లో॥ అఖండమండలాకారం వ్యాప్తం యేన చరాచరమ్ ।
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురవే నమః ॥

శ్లో॥ అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా ।
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః ॥

శ్లో॥ అనేకజన్మసంప్రాప్తకర్మేంధనవిదాహినే ।
ఆత్మజ్ఞానాగ్నిదానేన తస్మై శ్రీగురవే నమః ॥



# 2. శుకచరిత్ర కావ్యేతివృత్తం

**2.0** ఇతివృత్తం అంటే కావ్యశరీరం అంటే కావ్యంలోని వస్తువు. దీన్నే భరతుడు '**ఇతివృత్తం తు నాట్యస్య శరీరం పరికీర్తితం**' అన్నాడు.'ధ్వన్యాలోకానికి వ్యాఖ్యానం వ్రాస్తూ సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారు కావ్యేతివృత్తం ఇలా ఉండాలంటాడు. "విభావ, భావ, అనుభావ సంచారుల యౌచిత్యము గలిగి రమణాయముగా కథాశరీరమును గ్రహింపవలెను. ఇతివృత్త గతమగు అనౌచిత్యములున్న వానిని తొలగించి రసోచితముగా దానిని మార్చవలెను. రసాభివ్యక్తినుద్దేశించి యనగా శాస్త్రమర్యాదను పాటించుటకై రసోపస్కారములుగాని, సంధి తదంగములను గూర్చరాదు. ఆ యా ఘట్టములందు రసోద్దీపనమును, రస ప్రశమనమును సముచితముగా గావింపవలెను. ఆరంభింపబడి యాగిపోయిన అంగిరసమును మరల ననుసంధింపవలెను. సామర్థ్యమున్నది గదాయని యలంకారములను గూర్చక యనురూపముగా మాత్రమే కూర్చవలెను. ఇది ప్రబంధము రసాదివ్యంజకమగుటలో నిబంధనము'. (1)

ధ్వనికారుని లక్షణాన్ని శిల్పదృష్టితో పరిశీలించినప్పుడు చాలా మంది కవులు కావ్య వస్తువుపై దృష్టి కేంద్రీకరించరు. కాని వస్తుపటుత్వం లేకపోయినా కవి తనప్రతిభాపాటవాలతో కావ్యాలను రమణీయంగా, రసపూర్ణంగా రచించి, కొన్ని లోపాలను పూడుస్తూ, ఉంటాడు. శుకచరిత్రలోని ఇతివృత్తం వేదాంతతత్త్వప్రతిపాదకం. కవి నిబద్ధ రచయిత. అతని కావ్యం కూడా నిబద్ధరచన. "కొందరు కవులు స్వావలంబి తత్త్వాది నివేశులై కావ్యముల ఇతివృత్తముల నెన్నుకొందురు. ఆధునిక సాహిత్య దార్శనికుల పరిభాషలో ఇట్టివారిని నిబద్ధకవులు అనవచ్చును. ఉద్యమాశయ సిద్ధికి కవిత్వమును సాధనముగా నియోగించు కవి నిబద్ధ రచయిత." (2) కవికి శ్రీరామ చంద్రుడు సాక్షాత్కరించి "శాంతిపర్వంబు నందు తత్త్వబోధంబును భీష్మ బోధితంబును, ధర్మబోధ్యంబునునై సకల సుకవిజన నికర ప్రకటతత్త్వచరితంబకు శుకచరితంబు" రచించుమని కోరడం వల్ల ఈ కావ్యంలోని కథ తత్త్వప్రతిపాదకమని సుస్పష్టమౌతుంది.

ధ్వన్యాలోకములో ఆనందవర్ధనుడు

"**అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః**
**యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే**" అన్నాడు.

సాహిత్యమీమాంసలో–

"**అస్మిన్నపారే సంసారే కవిరేవ ప్రజాపతిః**
**యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే**" – అని ఉంది.

అంటే ప్రజాపతి ప్రపంచాన్ని సృష్టించినట్లు కవి కావ్యప్రపంచాన్ని సృష్టిస్తున్నాడు. భగవంతునికి చరాచర ప్రకృతి సమస్తం శరీరమౌతుంది. కవి యోగివంటివాడు. ఇతడు పరబ్రహ్మాంతర్గత సౌందర్యాన్ని కావ్యం ద్వారా సాక్షాత్కరింపజేసుకొని బ్రహ్మానందాన్ని పొందుతాడు. దీన్నే పి.యస్. శ్రీనివాసాచార్యులు గారు తమ The Philosophy of Beautiful - అనే గ్రంథంలో ఇలా అంటారు – "Poetry has the closest affinity to mystic experience and the poet who has a same sight of divine beauty communicates by the magic of his words, his inner vision, and induces the same exalted mood in them." 3

తత్త్వవేత్త అయిన కవి భౌతిక, ఆధ్యాత్మిక తత్త్వసమ్మేళనంగా తన కావ్యాన్ని తీర్చిదిద్దుతాడు. తాను ప్రతిపాదించాలనుకొన్న సిద్ధాంతాన్ని దేశకాల పాత్రతల ననుసరించి చెబుతుంటాడు. "A person with literary talent turned to the types ot literary expression most used in his day and if he had true genius modified them and reshaped them into greatness" 4.

అన్న జాక్సన్ మాటలు ఇందుకు ప్రబల నిదర్శనం. మానవుని చాతుర్వర్గ వ్యుత్పత్తికి ఇహపరాలకు కావ్యం సహాయకారిగా ఉంటుందని ప్రాచీన ఆలంకారికుల అభిప్రాయం.

"**ధర్మార్థకామమోక్షేషు వైచక్షణ్యం కలాసు చ**" – కావ్యప్రకాశము 1–2

"**చతుర్వర్గఫలప్రాప్తిః సుఖాదల్పధియామపి కావ్యాదేవ**" – సాహిత్యదర్పణము 1–2

"**కావ్యం న దృష్టార్థం చ ప్రీతికీర్తిహేతుత్వాత్**" –కావ్యాలంకారసూత్రవృత్తి 1–1–5

పైన వివరించిన ముగ్గురి అభిప్రాయాల్లో కావ్యం ఇహపరాలకు సహాయకారిగా ఉంటుందని తెలుస్తూ ఉంది.

**2.1** శుకచరిత్రలో ఇతివృత్తం ధర్మార్థకామమోక్షాలనే చతుర్వర్గఫలప్రాప్తిని కలుగజేస్తూ ఉంది. రామకవి తన కావ్యాన్ని భౌతిక, ఆధ్యాత్మిక తత్త్వప్రతిపాదకమైన ప్రబంధంగా తీర్చిదిద్దాడు. కవి తన కృతిని ప్రబంధంగా తీర్చిదిద్దడానికి మూలంలోని కొన్ని సన్నివేశాల్ని తీసివేయడమో, కల్పించడమో, పెంచడమో చేసి పాఠకులకు రసానందాన్ని కలిగించడానికి ప్రయత్నించాడు. తన ఆశయమైన పారమార్థికతత్త్వాన్ని పాఠకుల హృదయంలో సుస్థిరంగా నిలిపేందుకు

ప్రయత్నం చేశాడు. మూలకథకు కవి చేసిన మార్పులు, చేర్పులను పరిశీలించిన తర్వాత కావ్యంలోని అందచందాలను చూద్దాం.

**2.1.1 ప్రథమాశ్వాస కథ :**

రాజర్షి జనకుడు మిథిలా నగరానికి రాజు. అతని భార్య ప్రజ్ఞ. ఒకనాడు జనకుడు నిండు సభ చేశాడు. ఉత్తమ సంతాన ప్రాప్తికి మార్గం సూచించమని సభలోని బుధులను సవినయంగా ప్రార్థించాడు. అయినా సభలోని వారెవ్వరూ సమాధానం చెప్పలేక పోయారు. జనకుడు సంతానం పొందే సాధనం కోసం అన్వేషింప సాగాడు. కాలంతరంలో దీర్ఘజీవి, పరాశర సగోత్రుడు మహాయోగి అయిన పంచశిఖుడు జనకుని సభకు వచ్చాడు. జనకుని ప్రార్థనపై సంతానం పొందడానికి 'సమాధి' అనే యజ్ఞాన్ని చేయుమని సలహా ఇచ్చాడు. అతని ఆజ్ఞానుసారం జనకుడు సమాధి యజ్ఞం చేశాడు. ఆ యజ్ఞం నుండి ఆత్మ సౌఖ్యం అనే అమృతాన్ని సంగ్రహించి తన భార్య ప్రజ్ఞకు ఇచ్చాడు. ఆమె ఆ అమృతాన్ని భుజించి గర్భవతి అయింది. 10 నెలలు నిండిన తర్వాత ఆమెకు ముక్తికన్యక జన్మించింది. ఆ సమయంలో జనకుడు సత్పురుషులకు అనేక దానాలు చేశాడు. ముత్తైదువలు ముక్తి కన్యకకు స్నానాదికాలు చేయించి జోలలు పాడి నిద్ర పుచ్చారు.

ముక్తికన్యక దినదిన ప్రవర్ధమానంగా పెరిగి యౌవనవతి అయింది. జనకుడు ఆ కన్యకు తగిన వరుని అన్వేషించసాగాడు. తన కుమార్తెకు తగిన వరుడు 'శుకయోగి' అని గ్రహించి అతనికి తన బిడ్డను ఇవ్వాలన్న నిశ్చయానికి వచ్చాడు. దీనితో ప్రథమాశ్వాసం ముగుస్తుంది.

**2.1.2 ద్వితీయాశ్వాస కథ :**

రెండో ఆశ్వాసంలో శుకుని జనన వృత్తాంతం ఉంది. వ్యాసుడు మేరు పర్వతం మీద కర్ణికార వనంలో పుత్రునికోసం శివుని గూర్చి ఘోర తపస్సు చేశాడు. వ్యాసుని తపస్సుకు మెచ్చి శివుడు ప్రత్యక్షమై అభీష్టాన్ని కోరుకోమన్నాడు. వేదవ్యాసుడు పంచభూతాల వంటి తేజోబలం గల పుత్రుని కోరుకున్నాడు. శివుడు అతని కోరికను మన్నించి అలాంటి కొడుకే జన్మిస్తాడని చెప్పి అంతర్హితుడయ్యాడు. వ్యాసుడు సంతోషాంతరంగుడై స్వస్థలానికి వచ్చాడు.

వ్యాసుడు అగ్నికార్యపరుడై అరణిని గ్రహించి మథించసాగాడు. ఆ సమయంలోనే ఘృతాచి అనే అప్సరస అక్కడికి వచ్చింది. వ్యాసుడు ఆమె సౌందర్యాన్ని చూసి ముగ్ధుడయ్యాడు. ఘృతాచి అతని ఇంగితాన్ని గ్రహించి అతనిని వంచింప దలచింది. వెంటనే ఆడు చిలుక రూపం దాల్చింది. వ్యాసుడు కామపీడితుడై ఆ చిలుకను ఆలింగనమొనర్చి, మోవినొక్కి ఆమెతో కలిశాడు. వెంటనే వ్యాసుని వీర్యం అరణిలో పడింది. వ్యాసుడు శిఖికార్యసక్తిలో అరణిని మథించాడు. ఆ సమయంలో తండ్రితో సమానమైన దివ్యతేజస్సుతో శుకుడు జన్మించాడు.

ఆకాశగంగ స్త్రీ రూపంతో వచ్చి శుకునికి మంగళ స్నానం చేయించింది. బాల్యోపచారాలు చేసి పోషించింది. ఆకాశం నుండి కృష్ణాజినం, నవరత్నఖచితమయిన కనకదండం పడ్డాయి. బ్రహ్మ శుకునికి బంగారు కమండలం ఇచ్చాడు. ఈశ్వరుడు ఉపనయనం చేయించాడు. శుకునికి తండ్రిలాగే పుట్టుకతోనే వేదవిద్య అబ్బింది.

శుకుడు దేవగురువై బృహస్పతిని ఉపాధ్యాయుడుగా పరిగ్రహించాడు. అతని వద్ద సకలశాస్త్రాలు అభ్యసించాడు. వేదవేదాంగాలు చదివి తన తండ్రి వ్యాసుని దగ్గరికి వచ్చాడు. అయినా శుకుడు శాస్త్ర చింతన లేక లౌకిక విషయాలపైన, ఆటపాటలమీద ధ్యాస ఉంచసాగాడు. వ్యాసుడు కుమారుని సక్రమ మార్గంలో పెట్టడం కోసం జ్ఞానబోధ చేశాడు. శుకుడు పితృ ఉపదేశంతో యోగసాంఖ్య జ్ఞాన సంపన్నుడయ్యాడు. ఇది ద్వితీయాశ్వాస కథ.

**2.1.3 తృతీయాశ్వాస కథ :**

తృతీయాశ్వాసంలో కథ చాలా తక్కువ. ఇందులో శుకునికి వ్యాసుడు బోధించిన యోగసాంఖ్యజ్ఞానాన్ని గూర్చిన విషయాలే ఎక్కువగా ఉన్నాయి. ఈ ప్రపంచం అనిత్యమని పత్నిపుత్రాదులు, ధనం వస్తువాహనాలు, పదవి – ఇత్యాదులు సకలం అశాశ్వతమని చెప్పాడు. దేశకాలాలు అనిత్యాలని, భూత భౌతిక ప్రపంచమంతా అనిత్యమేనని, జీవులు అనిత్యాలు, పరమార్థమే నిత్యం, సత్యం అని చెప్పాడు. ఈ సందర్భంలో రామమూర్తి కవి వివిధ గ్రంథాలలోని భావాలను గ్రహించి అమృతానుభవం కల్గించినట్లు అతని పద్యం వల్ల తెలుస్తోంది.

"మధుకరంబు లనేకమైన సుమంబులంగల తేనియల్
యధికతం గొని తెట్టెబెట్టిన యట్లు పెక్కు విధంబులన్" – శుకచరిత్ర 3–28

శాస్త్రజ్ఞానాన్ని అందించాడు. **యమ, నియమాది అష్టాంగయోగాన్ని, హంస మంత్రాన్ని, అజపాజపవైశిష్ట్యాన్ని** ఈ ఆశ్వాసంలో కవి వర్ణించాడు.

**2.1.4 చతుర్థాశ్వాస కథ :**

చతుర్థాశ్వాసంలో కూడా కథ మృగ్యం. పరశురామపంతుల రామమూర్తి కవి తండ్రి లింగమూర్తి వ్రాసిన సీతారామాంజనేయ సంవాదము కావ్యంలోని విషయాలే ఈ ఆశ్వాసంలోనూ చోటుచేసుకొన్నాయి. ఇందులో రాజయోగం అత్మానుభవం తెలుపబడ్డాయి. **తారకయోగం, ముద్రలు, దశవిధనాదాలు, పరహంసార్థం** ఇందులో నిక్షిప్తమై ఉన్నాయి. ఇవిగాక సాంఖ్యయోగం, అమనస్కయోగం ఈ ఆశ్వాసంలో సంగ్రహంగా చెప్పబడ్డాయి. కవి ఈ ఆశ్వాసాన్ని అంతా యోగశాస్త్రవిషయాలను తెలియజేయడానికి వినియోగించినట్లు తెలుస్తూ ఉంది.

**2.1.5 పంచమాశ్వాస కథ :**

చతుర్థాశ్వాసంలో యోగవిద్యను బోధించిన వ్యాసుడు పంచమాశ్వాసంలో శుకునికి గృహస్థాశ్రమధర్మాన్ని తెలిపి పెళ్లికి పురికొల్పాడు. వ్యాసుడు తన కొడుకు శుకుణ్ణి జనకుని దగ్గరకు పాదచారియై వెళ్లమన్నాడు. అలా వెళితే జనకుడు మెచ్చుకొని తన కూతురు ముక్తికాంతను పెళ్లిచేస్తాడని చెప్పాడు. తండ్రి ఆదేశానుసారం శుకుడు మిథిలానగరానికి ప్రయాణమయ్యాడు. దారిలో నారదుడు ఎదురయ్యాడు. ముక్తికాంత రూపురేఖావిలాసాదులను చక్కగా వర్ణించి చెప్పాడు. నారదుని మాటలు విన్న శుకుడు మోహపరవశుడయ్యాడు. మన్మథుని దూషిస్తూ మిథిలానగరానికి వచ్చాడు. నగరు వాకిట కావలివారు నిరోధించారు. అయినా ఆ తర్వాత మంత్రికి చెప్పి వారి అనుమతితో రాజగృహానికి దారి చూపారు. శుకుని రాకను పురోహితుడు జనకునికి విన్నవించాడు. జనకుడు ఎదురువెళ్లి అర్ఘ్యపాద్యాదులు ఇచ్చి లోనికి తీసుకొని వెళ్లాడు. శుకునికి సేవచేయడానికి భృత్యులను నియమించాడు. ఆ తర్వాత రాజులకు అసాధ్యమైన ప్రకృతి యంత్రాన్ని, అవిద్యాయంత్రాన్ని ఏర్పాటు చేయించి స్వయంవరం చాటించాడు.

ముక్తికన్యక స్వయంవరానికి మతధీరులు, శాస్త్రవిచారులు ఆత్మనిర్దేశకులైన ఎందరో వచ్చారు. వచ్చినవారికి రాజసేవకులు సదుపాయాలను కల్పించారు. ఒకనాడు స్వయంవరసభను ఏర్పాటు చేశారు. ముక్తికన్యక సభామధ్యంలో నిలిచింది. వచ్చినవారంతా తమ విద్యలను ప్రదర్శించి మాయా యంత్రాన్ని కూల్చడానికి ప్రయత్నించి విఫలు లయ్యారు. ఆ తర్వాత శుకుడు తన వాదపటిమతో మాయా యంత్రాన్ని కూల్చాడు. ముక్తికన్యక శుకుని మెడలో వరమాల వేసింది. ముక్తికన్యక శుకుల వివాహం సంప్రదాయబద్ధంగా జరిగింది. ఈ శుకముక్తికన్యల వివాహం కేవలం కల్పన మాత్రమే; రూపకాలంకారమే :- శుకుడు తన భార్యతో తండ్రి వ్యాసుని వద్దకు వచ్చాడు. వ్యాసుడు వారిని చూసి చాలా సంతోషించాడు. శుకుడు గృహస్థాశ్రమ జీవితాన్ని చక్కగా గడిపాడు. ఆ తర్వాత ముక్తిని పొందుటకై తండ్రికి నమస్కరించి వాయువేగంతో కైలాసానికి వెళ్లాడు. అక్కడ శుకుడు మనస్సును నిగ్రహించి ఆత్మధారణ చేశాడు. శుకమహాముని యోగం చేయడం వల్ల ఆకాశంలో ఖగేంద్రునిలాగా ఎగిరిపోయాడు.

శుకుడు పితృభక్తితోను, విమలాత్మతోను ఈ సిద్ధిని పొందాడని సిద్ధులు భయపడ్డారు. తన తండ్రికి తోడుగా ప్రకృతినే ఉంచి, తాను స్వర్గానికి వెళ్లాడు. అమరులు దీనికి సంతసించి పుష్పవృష్టి కురిపించారు. శుకుని స్వర్గప్రాప్తితో శుక చరిత్ర కావ్యం సుఖాంతమౌతుంది.

**2.2 సంస్కృత సాహిత్యం - శుకచరిత్ర :**

శుకచరిత్ర కథాంశాన్ని వ్యాసభారతంలోని శాంతిపర్వం నుండి తీసుకొన్నట్లు తెలుస్తూ

ఉంది. శుకుని గూర్చిన ప్రస్తావన (కథ) నారదీయ పురాణం, దేవీభాగవతం, స్కందపురాణం, వాయుపురాణం, విష్ణుపురాణం, మత్స్యపురాణం, భాగవతం వంటి పురాణాలలోనూ, భారతమంజరి, మహాభారతంలోనూ కన్పిస్తూ ఉంది.

**2.1 నారదీయ పురాణం :**

ఇందులో మొత్తం 25 వేల శ్లోకాలు ఉన్నాయి. నారదుడు దీన్ని చెప్పడం వల్ల దీనికి నారదీయ పురాణం అని పేరు కలిగింది.

వ్యాసుడు పుత్రుని కాంక్షించి నూరేండ్లు తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమయి సంతానాన్ని అనుగ్రహించాడు. శుకుడు పెద్దవాడై తన తండ్రి దగ్గర విద్యను నేర్చి జ్ఞానియై అతని కోరికపై శ్వేతద్వీపానికి వెళ్లాడు. అక్కడ సనత్కుమారుడు శుకునికి జ్ఞానాన్ని బోధించాడు. శ్వేతద్వీపం నుండి తిరిగి వచ్చాడు. ఆ తర్వాత వైకుంఠం వెళ్లి అక్కడ వైకుంఠవాసుణ్ణి గొప్పగా స్తుతించాడు. వాసుదేవుడు శుకునికి ముక్తిని ప్రసాదించాడు.

ఈ పురాణంలో శుకుడు జనకుని దగ్గరికి వెళ్లినపుడు జనకుడు భూమిపై కూర్చోవడం వర్ణింపబడింది. భాగవత శ్రవణానికి, ప్రచారానికి శుకుడు భూలోకానికి వచ్చి బదరికాశ్రమంలో ఉంటూ భాగవత ప్రచారం చేశాడని ఇందులో ఉంది.

**2.2.2 దేవీభాగవతం :**

శుకుని చరిత్ర దేవీభాగవతం ప్రథమ స్కంధంలో ఉంది. వ్యాసుడు కొడుకు కావాలని శివుని శతవత్సరాలు ప్రార్థించాడు. శివుడు ప్రత్యక్షమై సంతానం కలుగుతుందని చెప్పి అంతర్ధానమయ్యాడు. ఒకరోజు అగ్నికార్యం కోసం వ్యాసుడు అరుణులను ఏరుకొనివచ్చి వాటిని బాగా ఒరిపిడి చేశాడు. ఆ ఒరిపిడి నుండి అగ్ని పుట్టింది. అప్పుడే శివుని వరం గుర్తుకు వచ్చింది. ఆ అగ్నినుండి మహాతేజస్వి అయిన కొడుకు పుడితే బాగుండునని వ్యాసుడు తపించాడు. భార్యలేకుండా తాను ఎలా పుత్రుని పొందగలనన్న అనుమానం వ్యాసునికి వచ్చింది. ఆ ఆలోచనల్లో ఉన్నప్పుడే ఘృతాచి అటువైపు వచ్చింది. వ్యాసుడు ఘృతాచి రాకను సహించలేక పోయాడు. వ్యాసుని మనస్సు గ్రహించిన ఘృతాచి ఆయన తనను శిక్షిస్తాడేమోనన్న భయంతో శుకి రూపం దాల్చింది. వ్యాసుడు శుకి రూపంలోని ఆమెను మోహించాడు. తత్ఫలితంగా అతనికి రేతః పతనమయింది. ఆ రేతస్సు అగ్నికార్యం కోసం తెచ్చిన అరణులపై పడింది. వ్యాసుడు దాన్ని గ్రహించకుండా యజ్ఞకార్యంలో నిమగ్నుడై ఆ అరణులను బాగా మథించాడు. అరణుల ఒరిపిడివల్ల అగ్ని పుట్టింది. అందులోనుండి శుకుడు పుట్టాడు.

శివుడు శుకునికి ఉపనయనం చేసినట్లు ఇక్కడ లేదు. (శుకదేవుడు) (శుకుడు పితరుల కుమార్తె పీవరిని వివాహం చేసికొన్నట్లు చెప్పబడింది. వ్యాసుడు శుకుని జనకుని దగ్గరకు జ్ఞానార్జన కోసం పంపాడు. వ్యాసాశ్రమానికి వచ్చేనాటికే శుకుడు గృహస్థాశ్రమాన్ని స్వీకరించినట్లు ఉంది. ఈ విషయం "ఆశ్రమాదాశ్రంగచ్ఛేత్" దేవీ భాగవతం 18/22 అనే వాక్యం వల్ల తెలుస్తూ ఉంది. శుకుడు పీవరి ద్వారా కృష్ణుడు, గౌరప్రభు, భూరి, దేవశ్రుత అనే కొడుకులను, కీర్తి అనే కుమార్తెను పొందాడు. శుకుడు గృహస్థాశ్రమాన్ని చక్కగా నిర్వహించి తుదకు ముక్తి పొందాడు.

**2.2.3 స్కందపురాణం :**

ఇది వ్యాసుని కృతులలో రెండవది. మహాభారత రచనానంతరం దీన్ని రచించాడు. అన్ని పురాణాలలో ఇది చాలా పెద్దది. ఇందులో 81వేల శ్లోకాలు ఉన్నాయి.

ఈ పురాణంలో కూడా శుకుని జనన వృత్తాంతం ఉంది. వ్యాసుని భార్య వాటిక. ఆమె వటికేశ్వరుడు అనే శివలింగాన్ని స్థాపించి పుత్రుడి కోసం ప్రార్థించింది. శివుని వరం వల్ల ఆమె గర్భం ధరించింది. శుకుడు వాటిక గర్భంలో 12 సంవత్సరాలున్నాడు. కడుపులోని శిశువు వల్ల తల్లికి భారం కలుగుతుందని వ్యాసుడు శుకుణ్ణి బయటకు రమ్మని అంటాడు. కాని శుకుడు తాను బయటకు వస్తే విష్ణుమాయ తనను ఆవరిస్తుందని, అందువల్ల బయటకు రాదలచుకోలేదని చెప్పాడు. ఆ తర్వాత వ్యాసుడు ద్వారకలోని కృష్ణుణ్ణి తీసుకొనివచ్చాడు. తల్లి గర్భం నుండి బయటకు వచ్చినా, తన మాయ ఆవరించదని కృష్ణుడు శుకునికి భరోసా ఇచ్చాడు. కృష్ణుడు ఇచ్చిన హామీని పురస్కరించుకొని శుకుడు బయటకు వచ్చి వెంటనే తపస్సు చేయడానికి అడవికి వెళ్లాడు. శుకుడు అడవికి వెళ్లిన తర్వాత అతని తల్లి మరల శివుని గూర్చి తపస్సు చేసి కపింజలుని పొందింది. (ఇద్దరు శుకుల కథ కలదు.)

**2.2.4 వాయుపురాణం :**

కురుక్షేత్ర సంగ్రామం క్రీ.పూ. 1500 నుండి 1000 మధ్య జరిగినట్లు చెబుతున్నారు. కనుక ఈ పురాణం క్రీ.పూ. 1400 నుండి 900 లోపు రచింపబడి ఉండాలని భావిస్తున్నారు. వాయుదేవునిచేత పఠించబడింది కాబట్టి దీనికి వాయుపురాణమని వ్యవహారనామం. ఇందులో 24వేల శ్లోకాలు ఉన్నాయి. వాయుపురాణం 37వ అధ్యాయంలో శుకుని గూర్చిన విశేషాలు ఉన్నాయి. కాళి పరాశరుని వలన కృష్ణద్వైపాయనుని కన్నది. ద్వైపాయనునికి అరణికి శుకుడు పుట్టాడు. శుకునికి పీవరికి ఐదుగురు కొడుకులు, ఋచి అనే ఒక కుమార్తె కలిగారు.

**"ఉత్పద్యన్తే చ పీవర్యాం షడిమే శుక సూనవః ।**
**భూరిశ్రవాః ప్రభుః శంభుః కృష్ణో గౌరశ్చ పంచమః ॥"**

– వాయుపురాణం 70వ అధ్యాయం 85వ శ్లోకం

**"కన్యా కీర్తిమతీ చైవ యోగమాతా దృఢవ్రతా ।**
**జననీ బ్రహ్మదత్తస్య పత్నీ సా త్వణుహుస్య!"**

– వాయుపురాణం 70వ అధ్యాయం 86వ శ్లోకం

వాయుపురాణం 70వ అధ్యాయంలో శుకుని కొడుకు భూరిశ్రవుడని, 73వ అధ్యాయంలో భూరిశ్రుతుడని చెప్పబడింది. పురాణకర్త కృష్ణద్వైపాయనుని కుమారుడు శుకుడు తన కుమార్తెను (కీర్తిమతి) అణుహునకిచ్చి వివాహం చేశాడు. బ్రహ్మదత్తుని కుమారుడైన విష్వక్సేనునికి శుకుని తండ్రి అయిన వ్యాసుడు శిష్యుడు. శుకుని కంటె 200 ఏండ్లు ఎక్కువగా ఉన్న అణుహునికి శుకుడు పిల్లనిచ్చాడనడం సరికాదు. కాబట్టి 'కీర్తిమతి' అనే పేరుగల స్త్రీకి తండ్రి శుకుడు గాక మరొక శుకుడై ఉండవచ్చుననిపిస్తుంది.

**2.2.5 విష్ణుపురాణం :**

ఇందులో మొత్తం 3000 శ్లోకాలు ఉన్నాయి. ఇది ఆరు విభాగాలుగా చేయబడింది. మహాపురాణ లక్షణాలు దాదాపు ఇందులో ఉన్నాయి. విష్ణుపురాణంలో 4వ అంశ 19వ అధ్యాయంలో శుకుని గూర్చి చెప్పబడింది.

**"పరాశరకులోత్పన్నో శుకో నామ మహాయశః**
**వ్యాసాదరణ్యాం సంభూతో విధూమోగ్నిరివ జ్వలన్ ।**
**సా తస్య పితృకన్యాయాం పీవర్యాం జనయిష్యతి**
**కృష్ణం గౌరం, ప్రభుం శంభుం తథా భూరిశ్రుతం జయం**
**కన్యాం కీర్తిమతీం షష్టీ యోగినీం యోగమాతరమ్"**

(విష్ణుపురాణం 4వ అంశ, 19వ అధ్యాయం శ్రీధరీయ వ్యాఖ్య)

శుకునికి, పీవరికి జన్మించిన సంతానం ఆరుమంది. వారు. 1. కృష్ణుడు, 2. గౌరుడు, 3. ప్రభుడు, 4. శంభుడు, 5. భూరిశ్రుతుడైన జయుడు అనే పుత్రుడు. 6. కీర్తిమతి అనే కుమార్తె.

**2.2.6 మత్స్యపురాణం :**

ఇందులో మొత్తం 15 వేల శ్లోకాలు ఉన్నాయి. విష్ణువు మత్స్యావతార మెత్తినపుడు స్వయంగా దీన్ని పఠించాడట. అందుకే దీనికీ పేరు వచ్చింది. మత్స్యపురాణంలో

**"భవిష్యతి చ తే కన్యాకృత్వీ నామ యోగినీ ।**
**పాంచాలాధిపతిర్దేయామానుష్యస్య త్వయా తదా ॥"** –మత్స్యపురాణం, 15వ అ. 9శ్లో.

**జననీ బ్రహ్మదత్తస్య యోగసిద్ధాచ గౌః స్మృతాః ।**
**కృష్ణో గౌరః ప్రభుః శంభుః భవిష్యన్తి చ తే సుతాః ॥** - మత్స్యపురాణం, 15అ. 10శ్లో.

వ్యాసపుత్రుడు శుకుడు అతని భార్య పీవరి (గౌః ఇక్కడ చెప్పబడింది). వారికి కృష్ణుడు, గౌరుడు, ప్రభుడు, శంభుడు అనే కొడుకులు, కృత్వి అనే కుమార్తె పుట్టారు. ఈ కృత్వి అణుహుని భార్య బ్రహ్మదత్తుని తల్లి కాని ఇందులో పేర్కొనబడిన కృత్వి వాయుపురాణంలోని కీర్తిమతి ఒకటే కావచ్చు. అలాంటి సందర్భంలో అక్కడి శుకుడే ఇక్కడి శుకుడు కావచ్చు. మత్స్యపురాణంలో మరో శుకుని ప్రస్తావన కూడా వుంది. **శుకస్య దయితా పత్నీ సాధ్యానాం కీర్తివర్ధినీమ్** మత్స్యపురాణం - 15 అధ్యాయ 11 శ్లోకం. ఈ శుకుని భార్య గౌః అని పేర్కొనబడింది.

**2.2.7 క్షేమేంద్రుని భారతమంజరి :**

క్షేమేంద్రుడు వ్యాసభారతాన్ని సంక్షిప్తంగా చేసి భారతమంజరి పేరుతో రచించాడు. ఈ గ్రంథంలో 630-31 పేజీలలో శుకుని వృత్తాంతం ఉంది. క్షేమేంద్రుడు వ్యాసభారతంలోని అంశాలను కొన్నిచోట్ల యథాతథంగాను మరికొన్ని చోట్ల పరిహరించి వ్రాసాడు. వ్యాసుడు శివుని గూర్చి నూరు సంవత్సరాలు తపస్సు చేసినట్లు భారతమంజరిలో లేదు. వ్యాసుడరతు-దయినా, ఆయనకు అరణియందు శుకుడు పుట్టాడు. శుకుడు పుట్టిన తర్వాత పితరులకు నమస్కరించి తపస్సు చేసుకోవడానికి వెళ్లిపోయాడు. తన తండ్రి ఆదేశానుసారం పాదచారియై జనకునిదగ్గరకు వెళ్లినట్లు ఇందులో లేదు. మార్గమధ్యంలో చీన హుణ దేశాల ప్రసక్తి లేదు.

జనకుని భవనంలో సుందర స్త్రీలు శుకుని సేవించారు. వారి చిఱునవ్వులకు దగ్ధుడైన కాముడు తిరిగి బ్రతికినట్లు ఈ కావ్యంలో ఉంది. వికారం కలిగించే అనేక హేతువులున్నా, శుకుడు మాత్రం చలించలేదు. శుకుడు జ్ఞానార్థియై జనకుని దగ్గరకు రాగా, అతనిని రత్నాసనంపై కూర్చోబెట్టి జనకుడు భూమిపై కూర్చున్నాడని అనుచితవర్ణన ఇందులో పరిహరింపబడింది. నారదుడు శుకునికి చేసిన హితబోధ సంక్షిప్తంగా చెప్పబడింది. నారదుడు హితబోధ చేసి వెళ్లిన తర్వాత శుకుడు నిర్వేదం పొందాడు. సరిత్తీరానికి వచ్చి తండ్రికి నమస్కరించి, తాను అక్కడ నుండి వెళ్లడానికి అనుమతి కోరాడు. వ్యాసుడు క్షణం ఆగమన్నా ఆగక వెళ్లిపోయాడు. అలా వెళ్లి పోయిన శుకుని గూర్చి వ్యాసుడు చాల పరితపించాడు. శివుడు ప్రత్యక్షమై అతని దుఃఖాన్ని పోగొట్టాడు. ఆ తర్వాత శుకుడు పితరుల కన్య పీవరిని పెళ్లాడి కీర్తిమతి అనే పుత్రికను పొందినట్లు ఇందులో ఉంది.

**2.2.8 మహాభాగవతం :**

వ్యాసుడు పుత్రార్థియై మేరుపర్వతంలోని కర్ణికార వనంలో శివుని గూర్చి తపస్సు

చేయసాగాడు. శివుడు అతని తపస్సునకు మెచ్చి సాక్షాత్కారించాడు. వరం కోరుకోమన్నాడు. వ్యాసుడు పంచభూత సమతేజస్కుడైన పుత్రుని ప్రసాదించమని కోరుతాడు. శివుడు అతనికా వరమిచ్చి అంతర్ధానమయ్యాడు.

కొంతసేపటికి ఘృతాచి అనే అప్సరస అక్కడకు వచ్చింది. వ్యాసుడు ఆమె రాకను భరించలేకపోయాడు. ఆమె శాపభయంతో చిలుకరూపం ధరించింది. వ్యాసుడు అరణిని మథిస్తుండగా, మన్మథ వికారం వల్ల వీర్య స్ఖలనం అయింది. అది అరణిపై పడింది. అరణిని మథించడం వల్ల ఏర్పడిన అగ్ని నుండి తండ్రి పోలికలు కల్గిన బాలుడు పుట్టాడు. శుకరూపంలోని ఘృతాచి వలన స్ఖలితమైన వ్యాసుని వీర్యంతో జన్మించడం వల్ల ఆ బాలునికి శ్రీశుకుడు అని పేరు పెట్టారు.

ఆ బాలుడు పుట్టిన వెంటనే ఆకాశగంగ సాకారయై వచ్చి అతనికి మంగళస్నానం చేయించింది. ఆకాశం నుండి కృష్ణాజినం, దండం అతని ఎదుట పడ్డాయి. పుష్పవృష్టి కురిసింది. దేవదుందుభులు మ్రోగాయి. శంకరుడు అతనికి ఉపనయనం చేశాడు. బాల్యంలో బృహస్పతి వద్ద విద్యను నేర్చుకొన్నాడు. అయినా శుకుడికి గృహస్థం, వానప్రస్థం కంటే సంన్యాసాశ్రమంపై కోరిక కలిగింది. పాదచారిగా జనకుడి దగ్గరకు వెళ్లి జ్ఞానాన్ని ఆర్జించమని తండ్రి కొడుకుతో చెప్పాడు. తండ్రి ఆదేశానుసారం శుకుడు జనకుడి దగ్గరకు వెళ్లాడు. జనకుడు అతనికి పూర్ణకుంభంతో స్వాగతం పలికాడు. శుకుడు జనకునితో "మధ్య రెండు ఆశ్రమాలు వదలి చతుర్థాశ్రమం స్వీకరించవచ్చునా?" అని ప్రశ్నించాడు. జనకుడు "ప్రథమాశ్రమంలోనే సుస్థిర జ్ఞానం లభించిన వాడికి మిగిలిన ఆశ్రమాలతో పనిలేదు. నిష్కామంగా తపమాచరించినవాడు బ్రహ్మాన్ని పొందుతాడు." అన్నాడు. తన సంశయాన్ని తీర్చుకొన్న శుకుడు దిగంబరుడై లోకసంచారం చేయసాగాడు. వ్యాసుడు భాగవతం రచించి తన పుత్రుని చేత చదివించాడు. ఇది ఇందులోని ఇతివృత్తం.

**2.3 తెలుగులో శుకచరిత్ర :**

తెలుగు సాహిత్యంలో శుకచరిత్రను గూర్చి సమగ్రంగా తెలియజేసే కావ్యాలు లేవు. రామమూర్తికవి ఒకడే శుకచరిత్రను గూర్చిన సంపూర్ణ కావ్యం రచించాడు. కాని తెలుగులోని కొన్ని కావ్యాలలో శుకుని ప్రస్తావన ఉన్నా అది సంస్కృతంలోని పురాణ సాహిత్యానికి అనువాదమో, అనుసరణమో అయి ఉండడం గమనార్హం.

**2.3.1 ఆంధ్రమహాభారతం :**

తిక్కన వ్యాసభారతాన్ని అనువదించాడు. ఇందులో శాంతిపర్వంలో ఈ శుకచరిత్ర ఉంది.

తిక్కన భారతంలోని శుకుని వృత్తాంతానికి కొన్ని మార్పులు చేశాడు. కాని కొన్ని చోట్ల మాత్రం మూలానుసరణంగా రచన సాగించాడు.

తిక్కన వ్యాసుడు నూరేండ్లు తపస్సు చేశాడన్న దాన్ని పరిహరించాడు. తిక్కన "వేదవ్యాస సంయమితత్ ప్రదేశమున యోగబలమూర్జితముగ దపం బొనరించె" అని శివుని గూర్చి తపస్సు చేశాడని మాత్రం చెప్పాడు. శివుడు ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు. పంచ భూత సమతేజుడైన సుతుని కోరాడు. శివుడు వరమిచ్చి వెళ్లిపోతాడు. వ్యాసుడు అగ్నికార్య పరునిగా అరణిని పుచ్చుకొని మథించాడు. అప్పుడే వచ్చిన ఘృతాచిని చూసి కామమోహితుడయ్యాడు. అయినా ధైర్యం అవలంబించి అరణిని మథించాడు. సంయమియైన వ్యాసుడు అరణిని మథింపగా అందుండి శుకుడు పుట్టాడు.

శుకుడు మోహితుడై సామాన్యుల వలె వర్తించాడు. అందువల్ల వ్యాసుడు శుకునికి హితబోధ చేశాడు. ఆ తర్వాత సంశయ నివృత్తి చేసికొని రమ్మని వ్యాసుడు శుకుని జనకుని దగ్గరకు పంపాడు. జనకుని అంతఃపురంలో 50 మంది వేశ్య స్త్రీలు శుకుని సేవించారు. శుకుడు జనకుని దగ్గర బోధపొంది సంశయ నివృత్తి చేసికొని విరాగియై ముక్తిని పొందాడు.

### 2.3.2 వేంకటాచల మాహాత్మ్యము :

వరాహపురాణంలోని కథను తీసుకొని అంబటి వేంకటప్పయ్య **వేంకటాచలమాహాత్మ్యము** రచించాడు. అందులో ఆకాశరాజు తన కుమార్తె పద్మావతిని శ్రీనివాసునికి ఇవ్వాలనుకున్నాడు. ఆలోచన నిమిత్తం బృహస్పతిని పిలిచాడు. ముహూర్తం నిశ్చయించమని కోరాడు. బృహస్పతి అలాగే చేశాడు. ఆ తర్వాత ఆకాశరాజు పిల్లనడగటానికి వచ్చిన వకుళాదేవితో తన కుమార్తెకు ఆత్మీయుడైన శుకుని శ్రీనివాసుని దగ్గరకు దూతగా పంపాడు. శుకుడు శ్రీనివాసుని దగ్గరకు దూతగా వెళ్లి పద్మావతి చెప్పి పంపిన విధంగా చెప్పాడు.

### 2.3.3 శ్రీవేంకటేశ్వర విజయము :

నిర్వచన పురాణ ప్రబంధాన్ని బులుసు వేంకటేశ్వర్లు రచించాడు. ఈ ప్రబంధంలో కూడా ఆకాశరాజు బృహస్పతిని పిలిచి తన కుమార్తె పద్మావతిని శ్రీనివాసునికిచ్చి పెళ్లి చేయబోతున్నట్లు చెప్పాడు. బృహస్పతి అందుకు చాల సంతోషించాడు. శ్రీనివాసుని విషయం తనకంటె శుకునికి బాగా తెలుసన్నాడు. అందువల్ల ఆ మునివర్యుని పిలిచి ఆపై ఒక నిశ్చయానికి రమ్మని సలహా ఇచ్చాడు. ఆకాశరాజు తన తమ్ముని పిలిచి శుకుని తోడ్కొని రమ్మన్నాడు. శుకముని వచ్చి తనను రప్పించిన విషయం తెలుపుమని కోరాడు. అప్పుడా ఆకాశరాజు "దేవా! నాకుమార్తె పద్మావతి అనే అందాల రాశి ఉంది. ఆమెను పెండ్లి చేసుకోవాలనే ఉద్దేశ్యంతో శ్రీనివాసుడు

ఒక సుందరిని దూతికగా పంపాడు. ఆయనకు పిల్ల నివ్వడంలో గల మంచి చెడ్డలను నాకు తెలియజేయవలసింది" అని శుకుని కోరాడు. శుకుడు ఆ తర్వాత పద్మావతికి అన్నివిధాల తగినవాడు శ్రీనివాసుడే అన్నాడు. వెంటనే ఒక అమల పత్రంపై సువర్ణాక్షరాలు వ్రాసి అంగీకారాన్ని తెల్పుమని ఆకాశరాజుకు సూచించాడు. ఆ అజ్ఞానుసారం ఆకాశరాజు కమ్మరాసి దాన్ని శుకుని ద్వారా పంపాడు. ఆ తర్వాత పెళ్లి నిర్ణయ మయింది. పెళ్లికి మునులు, దేవతలు, వైష్ణవ జనులు, ఆలుబిడ్డలతో కపిలతీర్థమార్గం గుండా వెళ్లారు. అక్కడ పద్మసరోవరం దగ్గరున్న శుకుడు శ్రీనివాసుని తన ఆతిథ్యం స్వీకరించమన్నాడు. వేంకటేశ్వరుడు "మునివర... పూతవనమున బ్రహ్మచారివై ఉన్న నీవు అందరికి విందు చేయడం సాధ్యమా" అన్నాడు. అయినా ముని బలవంతం చేయగా అతని ఆతిథ్యాన్ని స్వీకరించాడు.

### 2.3.4 శ్రీవేంకటాచలమాహాత్మ్యము :

ఇది వచనంలో వ్రాయబడిన ఒక వివరణాత్మక గ్రంథం. వేంకటేశ్వరుని కథలున్న అనేక పురాణాల్ని, కావ్యాల్ని పరిశీలించి పరవస్తు వేంకట రామానుజస్వామి ఈ గ్రంథాన్ని రచించారు. ఇందులోని శుకుని వృత్తాంతం బులుసువారి వేంకటేశ్వర విజయాన్ని పోలి ఉంది.

### 2.3.5 కథల తారతమ్యం :

శ్రీవేంకటేశ్వరుని పెళ్లికి సంబంధించిన కథలలోని శుకముని పాత్రలో కొంత తేడా కన్పిస్తుంది. శ్రీవేంకటేశ్వర విజయం, శ్రీవేంకటాచల మాహాత్మ్యములలోని కథలలో శుకముని వేంకటేశ్వరుని గుణగణాల్ని గూర్చి ఎక్కువగా పొగిడి ఆకాశరాజు ఉత్తరాన్ని శ్రీనివాసుని దగ్గరికి తీసుకొని వెళ్లాడు. కాని అంబటి వెంకటప్పయ్య వ్రాసిన కావ్యంలో శుకుడు పద్మావతికి ఆత్మీయుడుగా వర్ణింపబడ్డాడు. పద్మావతి శుకుని ద్వారా వర్తమానం పంపినట్లూ, పద్మావతి చెప్పిన ప్రకారం శ్రీనివాసుని దగ్గర ఆమె మాటల్ని చెప్పినట్లు, వేంకటప్పయ్య కావ్యంలో చెప్పబడింది. వరాహపురాణంలో 'చిలుక' అని చెప్పడం వల్ల వేంకటప్పయ్య ఆ చిలుకనే శుకమునిగా మార్చాడని చెప్పవచ్చు.

### 2.3.6 శుకచరిత్ర యక్షగానాలు :

ఆచార్య యస్వీ. జోగారావుగారు తమ ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్రలో శుకచరిత్రము అనే యక్షగానం ఒకటి ఉన్నట్లు తెలియజేశారు. దీన్ని రచించినవారి పేరు అందులో లేదు. సూర్యనారాయణ శాస్త్రి సుత అని మాత్రం ఉంది. ఈ సూర్యనారాయణ శాస్త్రి ఎవరో తెలియదు. 20-12-1900లో దీని ప్రతి వ్రాయబడింది. నేదునూరి గంగాధరం గారు తూర్పు గోదావరి జిల్లా చొప్పెల్ల గ్రామ వాస్తవ్యులైన శ్రీ వాడ్రేవు శేషగిరి రాయకవిగారి నుండి దీన్ని సంపాదించారు.

ఈ కవి దీన్ని ఎవరో పాడగా వ్రాసుకొన్నారట. దీనిని సదికొల్లాపేట వేణుగోపాలునకు అంకితం చేశాడు కవి. జనకునకు ప్రజ్ఞ వలన అంతరంగిక యజ్ఞఫలంగా ముక్తికాంత పుట్టింది. ఆమె యుక్తవయసుకు రాగా శుకునితో వివాహం జరిగింది.

తంగుటూరు వేంకటరామయ్య 1916లో పద్మావతీ పరిణయము అనే యక్షగానాన్ని రచించాడు. ఇందులోని కథ వరాహపురాణంలోని కథలాగా ఉంది.

**2.3.7 వేంకటాచలమాహాత్మ్యము :**

తరిగొండ వెంగమాంబ రచించిన మరో గ్రంథం. ఇందులో ఆరవ ఆశ్వాసంలో శుకమార్తాండ సంవాదం ఉంపది. దీన్ని వాసిష్ఠ రామాయణము నుండి గ్రహించి, రచయిత్రి ఇక్కడ సముచిత రీతిని పొందుపరిచింది. పద్మపురాణ మూలంలో శుకుడు సూర్యమండలంలో పడిపోతూ ఉంటాడు. వ్యాసుడు పుత్రునికోసం అంగలారుస్తూ ఉంటాడు. అప్పుడు సూర్యుడు అతనిని నిలిపి బ్రహ్మచారి అయిన నీవు పితృాణాన్ని తీర్చి వెళ్లుమన్నాడు. వెంటనే శుకుడు సూర్యుని మాటకు ఎదురాడకుండా తన ఛాయనే పుత్రునిగా సృజించి వెళ్లాడు.

కాని వెంగమాంబ కావ్యంలో సూర్యునితో కొంతసేపు మాట్లాడి వెళ్లినట్లు చెప్పింది. సూర్యుడు శుకునితో 'నా స్వరూపం అయిన జీవతత్త్వాన్ని విశదీకరించమని కోరాడు. శుకుడు సృష్టి తత్త్వాన్ని ఎనిమిది గద్యపద్యాలలో విపులంగా వివరించాడు. వేదోక్తమైన కర్మలు ఆచరణీయాలే ఐనా దేహం జలబుద్బుదంలాగా అనిత్యం కాబట్టి ముముక్షువు కర్మారణ్యంలో ప్రవేశింపదు. ఇంతకు ముందు నేనీ విషయమై మాతండ్రి వ్యాసుని అడిగితే ఆయన నన్ను జనకుని దగ్గరకి పంపాడు. ఆ మిథిలేశుడు "**విజ్ఞానం అబ్బటానికై చతురాశ్రమాలు నడిపించాలని, జన్మాంతర వాసనల వల్ల సదమల విజ్ఞానం ఉదయించినపుడు వర్ణాశ్రమాతీతుడవటమే విహితధర్మం**" అని నాకు ఉపదేశించాడు అని సమాధానం చెప్పినట్లు పేర్కొనబడింది.

**2.3.8 మడికి సింగన వాసిష్ఠ రామాయణము :**

యోగవాసిష్ఠాన్ని వాసిష్ఠ రామాయణమనే పేరుతో అనువదించిన మొదటి కవి మడికి సింగన. ఇతడు 16వ శతాబ్దివాడు. మూలంలోని వైరాగ్య ప్రకరణంలోని ముప్ఫై ఆరు శ్లోకాలలో ఉన్న శుకచరిత్రలో గల జనకుడు శుకుని పరీక్షించిన విధానాన్ని వివరించకుడా పన్నెండు గద్య పద్యాలలో ఆ కథను ముగించి ముముక్షు ప్రకరణంలో చేర్చాడు. మూలంలోని శుకుని ముముక్షు లక్షణాలు ఇందులో వివరిస్తే ముముక్షు వ్యవహార ప్రకరణంలో చేర్చడానికి అవకాశం ఏర్పడి, ప్రయోజనకరంగా ఉండేది. మిథిలాధిపతి అయిన జనకుడు శుకునికి ఇచ్చిన సమాధానం మూలంలో లేదు. అయినా మడికి సింగన సమయోచితంగా రెండు పద్యాల్లో కల్పించాడు.

**"అనఘా! చిత్పురుష, దొక్కడె**
**విను మన్యము లేదు, తత్త్వవిధ మిట్టిదగున్**
**దన సంకల్పమె బంధము**
**తన సంకల్ప క్షయంబు తగముక్తియగున్.**
**ఇది తత్త్వ నిశ్చితార్థము**
**విదితం బిది తప్పులేదు వేఱొక్కటి నీ**
**మది దృశ్యము దిగి నాడవు**
**పదిలంబుగ నిదియు వట్టి భ్రాంతి దొఅగుమీ"**

– వాసిష్ట రామాయణము 1వ ఆశ్వా. 143–144

**2.3.9 తరిగొండ వెంగమాంబ వాశిష్ట రామాయణము :**

సంస్కృతవాఙ్మయంలో వెలసిన తాత్త్వికకావ్యాలలో వాశిష్ఠ రామాయణం అగ్రశ్రేణికి చెందింది. దీనిని తరిగొండ వెంగమాంబ తెలుగులో రచించింది.

వెంగమాంబ మూలంలోని మొదటి మూడు ప్రకరణాల వృత్తాంతాన్ని ఆది ప్రకరణంలో ఇమిడ్చి వ్రాసింది. ఈ ఆది ప్రకరణంలో శుకుని వృత్తాతంతం ద్విపదల్లో ఇమిడ్చి రచించింది. రాముడు తనకు మోక్షార్హత ప్రసాదించే సద్గురువును గూర్చి చింతిస్తున్న సమయంలో విశ్వామిత్రుడు అయోధ్యకు వచ్చాడు. శ్రీరాముని విచారాన్ని తెలిసికొని, రాముణ్ణి ఊరడించి ఇలా చెప్పాడు, "రామా! నీకు తెలియని జ్ఞానం లేదు ఐనా గురుముఖతః వినాలనుకొన్నావు. ఇలాంటి కోరిక నీకు బాల్యంలోనే కలగడం విశేషం. నీలాగ పూర్వం శుకుడు మోక్షధర్మాలు తెలిసి కూడా తండ్రి అయిన వ్యాసుని అడిగాడు. ఆయన చెప్పిన సమాధానం శుకుని సందేహాన్ని తీర్చలేదు. వ్యాసుడు అతన్ని జనకుని దగ్గరకు పంపాడు. శుకుడు జనకుని ద్వారా తన సంశయాన్ని తీర్చుకొని నిర్వికల్పసమాధి ద్వారా మోక్షం పొందాడని తరిగొండ వెంగమాంబ రచనలో ఉంది. (ఈ ఘట్టం కాలవ్యత్యాసం కలిగి ఉంది.) (ANACRONISM).

**2.3.10 శుకచరిత్ర వేదాంత ప్రతిపాదన :**

ఈ కావ్యంలో ఐదు ఆశ్వాసాలు ఉన్నాయి. అందులో మొత్తం 1196 గద్యపద్యాలున్నాయి. వాటిలో దాదాపు 596 గద్య పద్యాలు వేదాంత ప్రతిపాదకంగా ఉన్నాయి. అంటే దాదాపు కావ్యంలో సగభాగం అన్నమాట. శుకచరిత్ర పీఠిక వ్రాసిన చల్లా పిచ్చయ్య శాస్త్రి "ఇది యొక యపూర్వ వేదాంత గ్రంథము. జగత్ప్రసిద్ధమగు సీతారామాంజనేయసంవాదమను గ్రంథమునకు వివరణము. కవియు, దత్కృతికర్త కుమారుడే ఇమ్మహానుభావుడు తన తండ్రి వలెనే సకలోపనిషత్సారవేత్త. శుకుని రీతి భూతమయుదు. భట్టుమూర్త్యాదుల బోలు శ్లేషకవి. పశ్యవాక్కు

అపూర్వకల్పనాప్రపంచాపరవిరంచనుడు. ఉభయభాషాపాండితీదురంధరుడు. సాక్షాత్ప్రదర్శిత మోక్షలక్ష్మి వ్యక్తి. ప్రచండ దుర్మత ఖండనా ఖండకళా విశారదుడు. ఆంధ్రభాష యందు గ్రమశిక్షణగా దత్త్వమునుపదేశించు గ్రంథములలో నియ్యదియే కనిష్టికాధిష్ఠితమని వక్కాణింపనగు" అన్నాడు. ఈ గ్రంథంలో రెండు ఆశ్వాసాలు పూర్తిగా వేదాంత ప్రతిపాదకంగా ఉన్నాయి. మూలంలో ఇంత విస్తృతంగా వేదాంత చర్చ లేదు. అదీగాక తన కావ్యావతారికలో ఈ కవి "తత్త్వచరితంబు శుకచరితంబు గలుగునది సంక్షేమ రూపంబుగావున నయ్యర్థంబు విస్తరించి యొక్క బంధుర బంధీకృతానుబంధ ప్రబంధంబగు ప్రబంధంబుగా రచియించి మదర్పింతంబు సేయుము" అని వ్రాసుకోవడం వల్ల ఈ కావ్యంలో వేదాంత ప్రతిపాదక పద్యాలే ఎక్కువగా ఉన్నాయని తెలుస్తుంది.

తృతీయాశ్వాసంలో శుకుడు సాధనచతుష్టయసంపన్నుడై మోక్షసాధన మార్గాలలో సులభ మార్గం తనకు చెప్పమని అడిగాడు. వ్యాసుడు గురులక్షణం, గురుధ్యానం, శిష్యలక్షణం, శుశ్రూషా విధానం మొదలైన విషయాలను చెప్పాడు. ఆ పిమ్మట ఉపాసనా క్రమం, పూజాక్రమం, స్మరణం, అష్టాంగాలతో కూడిన యోగం, అష్టసిద్ధులు, రాజయోగ లక్షనం, ముద్రాలక్షణం, ఆకాశ పంచక స్వరూపం, ప్రపంచోత్పత్తి ప్రకారం ఈశ్వర హంస స్వరూపం, జీవహంస లక్షణం, సాంఖ్యయోగం, పరమాత్మ లక్షణం, తత్త్వమసి మహావాక్యార్థం, సాధన చతుష్టయం, మహావాక్య చతుష్టయ విచారణ, తత్త్వపంచక లక్షణం, షడ్భావ, షడూర్మి అమనస్కం మొదలైన వాటిని వివరించాడు. ఇవి తృతీయ చతుర్థాశ్వాసాల్లో ఉన్నాయి. భారతంలో మోక్షమార్గాన్ని ఉపదేశింపుమని కుమారుడు అడిగితే వ్యాసుడు అతనిని జనకుని దగ్గరకు పంపినట్లు మాత్రమే ఉంది. కాని ఈ కావ్యంలో ఎక్కువ భాగం తాత్త్విక విషయాలు చోటు చేసుకోవడం గమనార్హం.

**2.4 శుకచరిత్ర మూలకథ :**

తెలుగు సాహిత్యంలోని అనేక కావ్యాలకు సంస్కృత సాహిత్యం మూలమైనట్లు, శుకచరిత్రకు కూడా మూలం సంస్కృత సాహిత్యమే. రామమూర్తి కవికి శ్రీరామచంద్రుడు ప్రత్యక్షమై "వివిధ వేద వేదాంత శాస్త్ర జ్ఞానుండును, సవిజ్ఞాన విమలీకృత నిజహృదయ పద్మాధిష్ఠిత దేవకీసూనుండునైన సత్యవతీ సూనుండు రచియించిన పంచమవేద సంజ్ఞా ప్రభారతంబగు భారతంబున నితాంత శాంత స్వాంతోపశాంతి పర్వంబగు శాంతి పర్వంబునందు తత్త్వబోధంబును, భీష్మబోధితంబును, ధర్మబోధ్యంబునునై, సకల సుకవిజన నికర ప్రకటిత తత్త్వచరితంబగు శుకచరితంబు గలుగునది సంక్షే పరూపంబుగావున నయ్యర్థంబు విస్తరించి, యొక్క బంధురబంధీకృతానుబంధ ప్రబంధంబగు ప్రబంధంబుగా రచియించి మదర్పితంబు సేయుము" (6) అని చెప్పినట్లు రామమూర్తి కవి చెప్పుకొన్నాడు. మరొక పద్యంలో...

**"భారత వంశ వర్ధనుడు భారము బూని రచించినట్టి యా**
**భారతమందు శాంతియను పర్వమునందు నదీకుమారుచే**
**భారతి బోధ్యమై ధరణి భాసిలు శ్రీశుకసచ్చరిత్ర మా**
**శ్రీరఘునాయకాంకితము జేయగ గంటి బురాకృతంబునన్."**

అన్నాడు. దీన్నిబట్టి వేదవ్యాస కృత మహాభారతం శాంతిపర్వంలో శుకచరిత్ర ఉందని, దాన్ని గ్రహించి అనేకులు తమ కావ్యాలలో శుకచరిత్రను చెప్పారని, భూమిలో శుకచరిత్ర ప్రచారంలో ఉందని తెలుస్తూ ఉంది. "సకల సుకవిజన నికర ప్రకటిత తత్త్వచరితంబగు శుకచరితంబు" అని **ధరణి భాసిలు శ్రీశుకసచ్చరిత్ర** అనడం వల్ల ఈ చరిత్రను మరికొందరు వ్రాసి, ప్రకటించారని తెలుస్తూ ఉంది. వ్యాసభారతం శాంతిపర్వ షష్ఠ ఖండంలో ఈ శుకచరిత్ర ఉంది.

మేరు గిరి చరియపై కొండగోగుల వనం ఉంది. అక్కడ పరమేశ్వరుడు పార్వతీదేవి, ప్రమథ గణాలచేత పరివేష్టితుడై యథేచ్ఛగా విహరిస్తూ ఉంటాడు. అక్కడే వ్యాసుడు కొడుకు కోసం ఘోరతపస్సు (నూరేండ్లు) చేశాడు. ఆ తర్వాత భవానీపతి సాక్షాత్కరించి అభీష్టం తెలుపమన్నాడు. "పృథివ్యప్తేజోవాయురాకాశాలతో సమానుడు" అయిన పుత్రుని ప్రసాదించ మన్నాడు. శివుడు అతనికి ఆ వరం ప్రసాదించి అదృశ్యుడయ్యాడు.

ఒకనాడు వ్యాసుడు అగ్నిహోత్ర కార్యార్థం అరణి మథనకు ఉపక్రమించాడు. అంతలో ఘృతాచి అతిలోక మనోహరాకృతితో సాక్షాత్కరించింది. ఆ రమణీయాకృతిని చూసి వ్యాసుడు హృదయం సంచలించింది. అది గమనించిన ఆమె శుకి రూపం ధరించింది. సాత్యవతేయుడు అంతలోనే తన మనస్సు నిగ్రహించుకొని యథాప్రకారంగా అరణి మథనకు ఉపక్రమించాడు. అయితే మన్మథుని ప్రభావం వల్ల ఆ మహర్షి శుక్లం వెలువడి అరణిపై పడింది. అయినా వేదవ్యాస మహర్షి అచంచలుడై యథాపూర్వంగానే అరణిని మథించసాగాడు. మరికొంత సేపటికి ఆ అరణినుండి మహోజ్జ్వలమూర్తి శుకుడు ఆవిర్భవించాడు. ఆ తర్వాత గంగానది సాకారయై అక్కడ సాక్షాత్కరించి ఆ కుమారునికి మంగళస్నానం చేయించింది. అంతలోనే అంతరిక్షం నుండి కృష్ణాజినం, దండం రాలిపడ్డాయి. దేవదుందుభులు మ్రోగాయి. ఆకాశం నుండి పూలవాన కురిసింది. ఇంద్రాది దేవతలు వచ్చి శుకునికి దివ్యాశీస్సులు అందించారు. కొంతకాలం గడిచిన తర్వాత పరమేశ్వరుడు పార్వతీ సహితుడై వచ్చి శుకునికి ఉపనయనం నిర్వర్తించాడు. స్వయంగా ఒక మహోజ్జ్వల కమండలవు అనుగ్రహించాడు.

జన్మించిన తోడనే వేదాలు అతన్ని ఆశ్రయించాయి. కేవలం మర్యాదకోసమే బృహస్పతి అతని గురువయ్యాడు. శుకుడు అతని సన్నిధిని వేదాంగాలు, ధర్మశాస్త్రాలు, రాజనీతి ఆదిగాగల

విద్యలు అభ్యసించాడు. ఆ తర్వాత అతడు నిశ్చల బ్రహ్మచర్యవ్రత నిష్ఠతో అమరవరులకే అభ్యర్చనీయుడయ్యాడు.

కొన్నాళ్ళయ్యాక తన తండ్రి దగ్గరికి తిరిగి వచ్చాడు. ఆశ్రమ పరిసరంలో ఉన్న ముని కుమారులతో కలిసి ఆటపాటలతో కాలం గడుపుతూ పరమాత్మ ధ్యానాన్నే విస్మరించాడు. వ్యాసుడు ఆ ప్రమాదాన్ని గుర్తించి సాంఖ్యయోగ శాస్త్రాలు ఉపదేశించి, దేహసంబంధమైన అహంకార మమకారాల వ్యామోహాన్ని తొలగించాడు. అందువల్ల కలిగిన మహాజ్ఞానోదయంతో బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థాలు మూడింటి మీద శుకునికి అత్యంత విరక్తి కలిగింది. తండ్రి దగ్గరికి వెళ్లి మోక్షధర్మం వివరించమని కోరాడు. వ్యాసుడు కుమారుని తీవ్ర జిజ్ఞాసా ధోరణి గమనించి పాదచారిగా జనక మహారాజు దగ్గరకు వెళ్లమన్నాడు.

శుకుడు అనేక జనపదాలు, పుణ్యక్షేత్రాలు దాటి మిథిలా నగరానికి వెళ్లాడు. అతని రాకను తెలిసికొన్న జనకుడు అర్ఘ్యపాత్రను శిరస్సుమీద పెట్టుకొని వచ్చి సముచిత మర్యాదలతో సత్కరించాడు. తన మనోహర భవనంలోని మాణిక్య సింహాసనం మీద కూర్చోబెట్టి పాద్యం సమర్పించి, పూజ చేశాడు. ఆ తర్వాత శుకుని అనుమతితో సమీపంలోని భూమిపై కూర్చున్నాడు. పురోహితులు, మంత్రులు, వేదవేదాంగ వేత్తలు, ప్రధాన రాజాధికారులు అలాగే కటిక నేలమీద కూర్చున్నారు. ఆ తర్వాత శుకమహర్షి సమక్షంలో అచ్చరలనే ధిక్కరించగల స్త్రీలు మనోహరంగా నృత్యం చేశారు. అది చూసి అక్కడివారంతా పరవశులయ్యారు. కాని శుకుడు మాత్రం నిశ్చలంగా ఉన్నాడు. జనకుడు ఆ రోజు సాయంత్రం శుకునికి రుచికరాలయిన అన్నపానీయాలతో ఆతిథ్యమిచ్చాడు. మరునాటి ఉదయం జనకుడు శుకుణ్ణి వచ్చిన పనిని తెల్పమన్నాడు. జనకుని ముఖతః మోక్షధర్మం గ్రహించాలని వచ్చినట్టు శుకుడు చెప్పాడు. జనకుడు నాలుగు ఆశ్రమధర్మాలను గురించి చెప్పాడు. ఆశ్రమ ధర్మానుసరణం ముక్తునికయినా ప్రయోజనకరమే అన్నాడు.

శుకుడు తండ్రి దగ్గరికి వెళ్లి జనకునికి తనకు మధ్య నడిచిన సంవాదం యావత్తు యథాతథంగా నివేదించాడు. వేదవ్యాసుడా వృత్తాంతం విని మిక్కిలి ఆనందించి, వేవిధాల అభినందించాడు. నారదమహర్షి వ్యాసాశ్రమానికి వచ్చాడు. శుకుడు నారదునిచేత ఉపదేశం పొందాడు. 'మునీశ్వరా! నీ కరుణార్ద్ర కటాక్షవీక్షణం వల్లనే నాకు ఇలాంటి అనన్య సామాన్య సత్పథం గోచరించింది. నిస్సంగుడనై అంతరిక్షానికెగసి పోగలను' అని విన్నవించి గరుత్మంతు నిలా గగన వీథిలో ప్రవేశించాడు. ఆ పరమాద్భుతదృశ్యాన్ని చూసి సిద్ధసాధ్యాదులు అభినందించారు. తనకు అడ్డంగా వచ్చిన రెండు పర్వతాలకు రవంతయినా సంచలించక అప్రతిహత వేగంతో సాగిపోయాడు. పర్వతాలు శకలాలై నేలకూలాయి. ఆ మహాద్భుతం

గమనించి, దేవతలు పూలవాన కురిపించారు. శుకముని ఆకాశగంగ ప్రాంతాన్ని అధిగమిస్తూ వెళ్లసాగాడు. అదే సమయంలో ఆకాశగంగలో జలకేళీపరవశలై, నగ్నలై యథేచ్ఛగా విహరిస్తున్న అచ్చరలు కొందరు ఆ మునిని అవలోకించారు. అయినా వారెవరూ రవంతయినా బిడియ పడకుండా యథాప్రకారంగా తమ జలక్రీడ కొనసాగించారు. శుకవ్యామోహంతో అతనిని వెన్నంటి వెళ్తున్న వ్యాసుణ్ణి చూసి స్నానం చేస్తున్న సుందరీమణులు సిగ్గుపడి తొందరగా తమతమ చీరలు ధరించి శిరస్సులను వంచుకొన్నారు. ఆ తర్వాత శివుడు ప్రత్యక్షమై "శుకుడు బ్రహ్మతేజోమయుడై అమరేశ్వరులకే అలభ్యమయిన పరమపదం స్వాధీనం చేసుకొన్నాడు. దీనికి ఇనుమిక్కిలిగా ఆనందించవలసినది పోయి చింతిస్తున్నావా!' అని వ్యాసుణ్ణి ఓదార్చి అంతర్ధానమయ్యాడు.

**2.5 శుకచరిత్ర – కల్పనలు :**

తన కావ్యంలో పాత్రలకు, రసానికి ఉపయుక్తంగా ఉండటం కోసం రామమూర్తి కవి సందర్భోచితంగా కొన్ని సంఘటనల్ని పాత్రలను కల్పించాడు.

**2.5.1 పంచశిఖుని వృత్తాంతం :**

మూలంలో (శాంతిపర్వంలోని శుకచరిత్ర) పంచశిఖుని వృత్తాంతం లేదు. కవి దీన్ని శాంతిపర్వంలోని చతుర్థఖండం నుండి తీసికొన్నాడు. మహాతత్త్వజ్ఞాని ద్వంద్వాతీతుడు, సంశయవిహీనుడు అయిన పంచశిఖుడనే మౌని తీర్థయాత్రలు చేస్తూ మిథిలాపురం చేరుకొన్నాడు. జనకుని ఆచార్యులను అందరినీ వేదాంత వాగ్వాదంలో అవలీలగా నిర్జించాడు. జనకుడు పంచశిఖుని సన్నిధికి వెళ్లి నమస్కరించి పరతత్త్వ సారాన్ని ప్రసాదించమని అర్థించాడు. జనకుని కోరికను మన్నించి పంచశిఖుడు తత్త్వోపదేశం చేశాడు. పంచశిఖుని బోధ వల్లనే జనకుడు పరమజ్ఞాన స్వరూపుడయ్యాడని చెప్పబడింది. శుకచరిత్రలో –

**"జననాథుని బోధింపుచు**
**నొనర గురూత్తములు గడు నిరుత్తరులై క**
**న్గొనుచుండ పంచశిఖుడి**
**ట్లనునమ్మిథిలాధిపునకు నభిముఖుడగుచున్"** – శుకచరిత్ర 1-101

అని చెప్పి మూడు పద్యాలలో పంచశిఖోపదేశాన్ని వర్ణించాడు.

శుకుని చరిత్రను చెబుతూ అతనికి గురుడును, మామయునైన జనకుని గూర్చి మొదటి ఆశ్వాసంలోనే చెప్పడం ఉచితంగా ఉంది. కావ్యం లోని వస్తువు వేదాంతపరమైనది. పరమ

జ్ఞానస్వరూపుడైన జనకునితో కావ్యం ఆరంభించడం వల్ల కవి సాధించిన ప్రయోజనాలు రెండు.

1. కావ్యంలోని వస్తువు పరమాత్మ తత్త్వప్రతిపాదకమని సూచించడం.

2. కావ్యాన్ని ప్రబంధంగా తీర్చిదిద్దాలి కాబట్టి ప్రబంధంలో 'పురవర్ణన' అవసరం. అందువల్ల మిథిలానగరాన్ని వర్ణించటానికి అవకాశం కలిగింది. వ్యాసునితో కథ ఆరంభించి ఉంటే ఆశ్రమ వాతావరణాన్ని వర్ణించవలసి వచ్చేది. అందువల్ల జనకవృత్తాంతంతో కావ్యాన్ని ఆరంభించడం ఉచితంగా ఉంది.

**2.5.2 ముక్తికన్యా వృత్తాంతం :**

శాంతిపర్వంలో ముక్తికన్యా వృత్తాంతం లేదు. పురాణాలలో శుకుడు పీవరి అనే కన్యను పెళ్లిచేసుకొన్నట్లు ఉంది గాని, 'ముక్తికాంత'ను పెళ్లాడినట్లు లేదు. కానీ కవి జనకునికి ప్రజ్ఞాదేవికి పుట్టిన కన్య ముక్తికన్య అనీ, ఆమెను శుకుడు పెళ్లాడాడని కల్పన చేసి చెప్పాడు. శుకచరిత్రకు పీఠిక వ్రాసిన చల్లా పిచ్చయ్యశాస్త్రి దీన్ని గూర్చి ఇలా అన్నారు. "ఈ కృతిలో ముక్తికాంత స్వయంవర ప్రపంచ కల్పన "వ. 1 అయ్యవసరంబున సుషమ్నాంతఃపురంబున నప్రమేయ తురీయశయ్యా తలంబున హంసయానయు దుర్నిరీక్ష్యకలాభాసమానయు మూలాధార మంజీరయు స్వాధిష్ఠాన కింకిణీ సమన్వితమేఖలయు, మణిపూరక కాంచీకలాపయు, హృదయ కీలితానాహతరత్న భూషితయు, కంఠవిభ్రాజిత, విశుద్ధమంగళసూత్రాలంకృతయు, భ్రూమధ్య ప్రకాశమాన సదమల ద్విదళ లలాటికా శోభితయు, సూర్యచంద్ర తాటంక యుగళ విరాజితయు, సచ్చిదానంద స్వరూపిణియు నైన ముక్తికాంత, సుయోగజ్ఞానకరంబుల గాఢాలింగనంబు చేసి..." అనే సీతారామాంజనేయసంవాదములోని వచనము మదినిడి కల్పించినట్లు తోచెడిది. (7) అన్నారు.

శుకముక్తికాంతాపరిణయ వృత్తాంతం ఏ పురాణంలోనూ కనిపించదు. శుకచరిత్రను పేర్కొన్న పురాణ కర్తలు, కావ్యరచయితలు ఎవ్వరూ ముక్తికాంత ప్రస్తావన చేయలేదు. కానీ శుకుడు 'పీవరి'ని పెళ్లి చేసుకొన్నట్లు మాత్రం చెప్పారు. పరశురామపంతుల రామమూర్తికవి ముక్తికన్యా పరిణయ వృత్తాంతాన్ని చొప్పించడానికి ఈ క్రింది కారణాలు ఆధారంగా చూపవచ్చు.

1. రామమూర్తి కవికి ముందు **ముక్తికాంతాకళ్యాణాన్ని** గూర్చిన అద్వైతప్రతిపాదనకావ్యం యక్షగానాల్లో ఉండడం.

క్రీ.శ. 1590లో చంపకారణ్య ప్రాంతంలో దత్తపరంపరకు చెందిన పరమానందతీర్థయతి ముక్తికాంతాపరిణయము అనే యక్షగానాన్ని రచించాడు. ఈయన తర్వాత కూడా అనేక

కావ్యాలు యక్షగానాలు వచ్చాయని చెబుతూ డా॥ సన్నిధానం రామతారక పరబ్రహ్మశాస్త్రి "ముక్తికాంతాపరిణయము" ను పలువురు కవులు వేరువేరు నామములతో రచించి యున్నారు. వానికన్నిటకిని రచనా పద్ధతిలో కొంత భేదమున్నది. కాని విషయమున విశేష భేదము లేదు. కవి కాలమును బట్టి ఇదియా రచనలన్నిటిలో మొదటిదని తెలియుచున్నది. ఈ గ్రంథ రచయిత పరమానందతీర్థయతి. ఇది యక్షగాన లక్షణములతో కూడిన రచన. ముక్తికాంతాకల్యాణమను గ్రంథ మొకటి తిరుపతి ప్రాచ్యలిఖిత పరిశోధనాగారమున నున్న ప్రాచీనగ్రంథములలో నున్నది. దానిని వేటూరి ప్రభాకరశాస్త్రి సంపాదించారట. గ్రంథ సంఖ్య 7672 – బి. గ్రంథము కడు శిథిలావస్థలో నుండుటచేత నందలి విషయము లేవియు తెలియుట లేదు. కర్త పేరు కూడా తెలియకున్నది. గ్రంథ శైథిల్యమును బట్టి ప్రాచీన గ్రంథమై యుండుననియు పరమానందయతి యొక్క రచన తరువాత నదియే మొదటిదై యుండుననియు తోచుచున్నది. అదే విషయమును కొంచె మించుగా నా పదజాలము తోనే వేగినాటి కొండనార్యుడు ముక్తికాంతాపరిణయమను పేర పద్యకావ్యముగా ప్రబంధశైలిలో రచించెను. ఇందెవరి నెవరనుకరించిరో వారి కాలము నిర్ణయమైన గానీ నిశ్చయముగా చెప్పజాలము. చల్లా సూరయ తన 'వివేక విజయ'మను యక్షగానమున చిట్టచివర ముక్తికాంతాపరిణయమును వర్ణించెను. పదునెనిమిదవ శతాబ్దియందు ఉండిన పరశురామపంతుల శ్రీరామమూర్తి తన శుకచరిత్రము చివర ముక్తికాంతా కల్యాణము వర్ణించెను. అందున్న విషయమున కూడా వీనికంటె విశేష భేదము లేదు కానీ, వర్ణనలు వివిధ మతస్థుల వాదములు మొదలగు నంశములు కొన్ని విపులముగ నున్నవి" (8) అన్నారు.

పరమానందతీర్థుల ముక్తికాంతాపరిణయములో అద్వైతసిద్ధాంతప్రతిపాదనం ఉంది. జైన బౌద్ధ చార్వాకాది తత్త్వబోధకాలైన నిఖిల మతాలను నిరసించడం, అద్వైతసిద్ధాంతమే ముక్తిప్రదమని నిరూపించడం, వివేక జీవేశ్వరుని స్వయంవరంలో వరించడం ఇందలి కథావస్తువు. వెంగమాంబ రచించిన ముక్తికాంతావిలాసమున మనఃకాంత ముక్తికాంత ప్రేరణతో ఓంకారాన్ని పెళ్లిచేసుకోవడం కథ. ఇలా చూసినప్పుడు రామమూర్తికవి తన దత్తపరంపరకు చెందిన పరమానందతీర్థయతిని అనుకరించాలనుకొని ఉండవచ్చు.

అద్వైతకావ్యాలలోని ముక్తికాంతా స్వయంవరాన్ని తన కావ్యంలో చొప్పించడానికి ప్రయత్నించడం వంటి కారణాల వల్ల ముక్తికాంత వృత్తాంతాన్ని తన శుకచరిత్రలో ప్రవేశపెట్టి ఉండవచ్చు.

**2.5.3 శివస్తుతి :**

మూలంలో వ్యాసుడు మేరుపర్వతం మీద శివుని గూర్చి తపస్సు చేయడం, శివుడు ప్రత్యక్షం

కావడం, వ్యాసుడు పంచభూతాత్మక తేజుడైన పుత్రుని కోరడం మాత్రం ఉన్నాయి. శివస్తుతి లేదు. కానీ రామమూర్తి కవి ఒక దండకంతోనూ, రకరకాల ఛందస్సులతోనూ, (పంచచామరం స్రగ్ధర, కందం, భుజంగప్రయాతం, పృథ్వీవృత్తం, సుగంధివృత్తం, ఉర్వీవృత్తం, మాలినీవృత్తం వంటివి) వ్యాసునితో ఈశ్వర స్తుతి చేయించాడు. కావ్యం అద్వైతప్రతిపాదకం కాబట్టి శివస్తుతిని అద్వైతదృష్టితో చేయడం గమనార్హం.

**"ద్వైతా విషయ విశిష్టా**
**ద్వైతవచో గేయ, విష్ణు తత్త్వమయ శివా**
**ద్వైతా రాధ్యాత్మకయ**
**ద్వైతాత్యంతా పరోక్ష తత్త్వాధ్యక్షా!"** – శుకచరిత్ర 2–62

శివస్తుతిలో చోటుచేసుకొన్న దండకం తత్త్వవిషయ పరిపూర్ణమై శివుని పరబ్రహ్మ స్వరూపాన్ని వ్యక్తం చేస్తుంది. ఇందులో జీవబ్రహ్మైక్యం కూడా సూచింపబడింది. తరువాత వ్యాసుడు చేసిన స్తుతి పద్యాలు ఏక, ద్వి, చతుః, పంచ, షడాది సంఖ్యలతో ఆరంభిస్తూ ఆయా సంఖ్యలతో సంబంధం ఉన్న వేదాంత విషయాన్ని వివరిస్తూ ఈశ్వరుని మాహాత్మ్యాన్ని ప్రకటిస్తూ ఉన్నాయి.

### 2.5.4 ఘృతాచి సౌందర్య వర్ణన :

మూలంలో ఘృతాచి సౌందర్య వర్ణన లేదు. కాని కవి ఆమె సౌందర్యాన్ని నఖశిఖపర్యంతం వర్ణించాడు. నాలుగు చిన్న వచనాలు, పదునాల్గు పద్యాలలో ఘృతాచి అంగాంగ వర్ణన చేయబడింది. మొదటి ఒక పద్యంలో ఆమె అంగాలన్నిటిని పేర్కొని, ఆ తర్వాత పద్యాలలో ప్రతి అంగాన్ని వర్ణించాడు.

**"ఆ పువ్వుబోడి కొప్పాస్యంబు కన్నులు,**
**బొమలధరమురదంబులు, గళంబు**
**చెవులు చెక్కులు ముక్కు చేతులు పాలిండ్లు**
**గౌను త్రివళులు నూగారు నాభి**
**పిఱుదులూరువులును పిక్కలు మీగాళ్లు**
**గోరులంఘ్రులు మదిగోరిచూడ**
**మొగులుడు రాజు తమ్ములు చాపములు విద్రు**
**మంబు ముత్తెములు శంఖంబు శ్రీలు**
**ముకురములు చంపకములు తూండ్లుమొగ్గలాక**
**సము తరంగంబులహిరాజు సరిసిసైక**

**తములు కరభంబులును కాహళములు కచ్ఛ**
**పములు చక్కలిగుళ్లార! భళి! తలంప"** – శుకచరిత్ర 2–84

పై పద్యంలో క్రమాలంకారం ఉంది. ఇందులో ప్రతి అంగాన్ని ఒకే పద్యంలో వర్ణించాడు కవి. ఈ కావ్యం క్షీణయుగంలో వ్రాయబడింది. ఈ యుగాన్ని గూర్చి చెబుతూ ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు తమ ఆంధ్ర సాహిత్య చరిత్రలో ఇలా తెలియ జేశారు – "జాతి పునరుద్ధరించి, పూర్వప్రతిష్ఠను నెలకొల్పగల వీరుడు లేనట్లే, నిస్తేజమైన సారస్వతమును పునరుద్ధరించి, క్రొత్త మార్గమున నడపగల మహాకవి, యుగపురుషుడు కాదగినవాడు లేకపోయెను. అందరును అస్వతంత్రులే. అందరును అనుకరణశీలురే. ఏ కవిలోనూ నూతనత్వము లేదు. జీవము లేదు. ఇదియే యీ యుగమునకు క్షీణయుగమని పేరు తెచ్చిన ప్రబల హేతువు (8) " అందువల్లనే ఈ యుగ ధర్మం కేవలం అధ్యాత్మ విషయ ప్రతిపాదనకు పూనుకొన్న రామమూర్తి కవిని కూడ వదల లేదు. అతని చేత అంగాంగ వర్ణన చేయించింది.

**2.5.5 ప్రబంధోచిత వర్ణనలు :**

ఇందులో కవి "సకల సుకవిజన నికర ప్రకటిత తత్త్వచరితంబగు శుకచరితంబు గలుగునది సంక్షేప రూపంబు గావున నాయర్థంబుల విస్తరించి యొక్క బంధుర బంధీకృతానుబంధ ప్రబంధంబగు ప్రబంధంబుగా రచియించి" తనకిమ్మని శ్రీరాముడు అడిగినట్లు చెప్పుకొన్నాడు.

సంస్కృతాలంకారికులు, కవులు, వ్యాఖ్యాతలు, ప్రబంధ శబ్దాన్ని కావ్యసామాన్యవాచిగా ప్రయోగించారు కానీ, ఒక సారస్వతప్రక్రియావిశేషంగా మాత్రం ఉపయోగించలేదు. సాహిత్య దర్పణకారుడయిన విశ్వనాథుడు ఇతిహాసమైన భారతాన్ని, మహాకావ్యమైన రామాయణాన్ని దృశ్యకావ్యాలైన మాలతీ మాధవాదులను ప్రబంధాలుగానే పేర్కొన్నాడు. సాహిత్యదర్పణకారుడే "ఏష ప్రబంధః ప్రకటితోఽస్తు లోకే" అని తన అలంకారశాస్త్రాన్ని కూడా ప్రబంధంగానే పేర్కొన్నాడు. ఇలా అనేకులు సంస్కృతంలో ప్రబంధ శబ్దాన్ని సర్వగ్రంథసామాన్యవాచిగా ప్రయోగించారు.

తెలుగులో కూడా సంస్కృతంలో లాగ ప్రబంధ శబ్దాన్ని కావ్యసామాన్యవాచిగానే ప్రయోగించారు. ప్రబంధశబ్దచర్చ చేస్తూ డా॥ పి. యశోదా రెడ్డి గారు "ప్రబంధమునకు ప్రకృష్టమైన కూర్పు అను విస్తృతమైన అర్థమున్నను పంకజాది శబ్దములు పద్మములందు రూఢమైనట్లే ప్రబంధ శబ్దము రాయలవారి యుగమున వెలసిన మనుచరిత్రాది గ్రంథములకే రూఢముగ ఉపయోగింపబడుచున్నది. ఈ కాలమున వెలసిన కావ్యములు దాదాపు గుణరూప విశేషములందు సమానములై ఒప్పుటచే ఈ కావ్యజాలమునంతటిని ప్రబంధ శబ్దముచే వ్యవహరించినారు" (9) అని తెలియ జేశారు.

ఆచార్య సి. నారాయణ రెడ్డి గారు తమ ఆధునికాంధ్ర కవిత్వములో "రచనా విధానములో కథావస్తువులో అలంకార వర్ణనాదికములో ప్రబంధము క్రొత్త రీతులు సంతరించుకొన్న కావ్య ప్రక్రియ" (10) అని తెలియజేశారు.

ఆచార్య కె.వి.ఆర్. నరసింహం గారు "కథైక్యమును నష్టాదశ వర్ణనలును గలిగి శృంగార రస ప్రధానమై యర్థాతిశాయి యైన శబ్దమును గ్రహించి, యలంకారిక సాంకేతికములకు విధేయమై యనతి విస్తృతి గల యితివృత్తములతో భాషాంతరీకరణముగాక స్వతంత్ర రచనయేయైన తెనుగు కావ్యము ప్రబంధము (11) అన్నారు.

శుకచరిత్ర అద్వైతతత్త్వకావ్యము. రామమూర్తికవి దీన్ని ప్రబంధంగా వ్రాస్తానన్నాడు. రామమూర్తికవి గాక కొందరు అద్వైతప్రతిపాదకకావ్యాలు వ్రాసిన కవులు కూడా తమ కావ్యాలను ప్రబంధాలుగా పేర్కొన్నారు. పరతత్త్వరసాయనము కర్త తన కావ్యాన్ని ప్రబంధరాజమనీ, మహాకావ్యమని పేర్కొన్నాడు. రామమూర్తి తండ్రి లింగమూర్తి తన శ్రీసీతారామాంజనేయ–సంవాదము కావ్యంలో "ముముక్షు జనహితంబును, సంసార సాగరోత్తారకంబును దారక సాంఖ్యామనస్కాత్మకంబును జీవబ్రహ్మైక్య సాక్షాత్కార సాధారణ కారణంబునైన రాజయోగంబంతయు నొక్క ప్రబంధముగా రచియింప నిశ్చయించితి" (12) నన్నాడు.

రామమూర్తికవి తన కావ్యాన్ని తత్త్వప్రధానంగా వ్రాయాలనుకొన్నా, ఈ కావ్యంపై ప్రబంధాల ప్రభావం ఎక్కువగా ఉంది. శాంత ప్రధానమైన శుకచరిత్రలో శృంగార రసప్రాధాన్యం కలిగిన వర్ణనలు చేయడం ప్రబంధ రచనపట్ల అతనికున్న అభిమానాన్ని చాటుతుంది. ప్రబంధాలలాగా పుర, పర్వత, కర్ణికార వన, వసంత ఋతువర్ణన, ఘృతాచి అంగాంగ సౌందర్యవర్ణన, మన్మథ చంద్ర మలయానిలోపాలంబన, గంగానది వర్ణనలు దీనిలో కనిపిస్తాయి. గౌరీశంకరుల వన విహార సందర్భంలో. కవి వాళ్ల నర్మోక్తులను వర్ణించడం కూడా ఈ కోవకే చెందుతుంది. పై వర్ణనలన్నీ కూడా ప్రబంధాలను అనుకరించే ఉద్దేశంతోనే చేయబడినట్లు తోస్తుంది.

తత్త్వప్రధానమైన కావ్యంలో గౌరీశంకరుల నర్మోక్తులను ప్రవేశపెట్టడం, అందులోనూ శృంగార రసభరితాలుగా వాటిని వర్ణించడం ఉచితంగా లేదు. మూలంలో శుకజన్మ సందర్భంలో వ్యాస వీర్యస్ఖలనవృత్తాంతం మిక్కిలి సంగ్రహంగా ఉంది. శుకచరిత్రలో ఘృతాచి చిలుక అయిన పిమ్మట కనిపించకపోవడంతో వ్యాసుడు విరహార్తుడై, మన్మథుని, చంద్రుని, మలయమారుతాన్ని పరుషోక్తులతో దూరడం అసమంజసంగా ఉంది.

శుకచరిత్రలోని ఇతివృత్తం చరిత్ర ప్రాయం కాదు. మిక్కిలి సంగ్రహంగా ఇది కనిపిస్తుంది. పురాణ, కావ్య, యక్షగానాది వివిధ సాహిత్య ప్రక్రియలలోనూ ఇది చోటు చేసుకుంది. వేదాంత

ప్రతిపాదకంగానూ, ముముక్షు జనస్ఫూర్తి దాయకంగానూ అనేక తత్త్వవిషయ విస్తార సంయుక్తంగాను శుకచరిత్ర భాసిస్తుంది. విభిన్న రచనల్లో రచయితల మనస్తత్వానుగుణంగా వైవిధ్యం చోటు చేసుకొంది. కానీ అన్ని రచనల్లోనూ శుకుని ఘనత సమానంగానే ప్రతిబింబిస్తూ ఉంది.

పరశురామపంతుల రామమూర్తికవి చిన్న ఇతివృత్తాన్ని తీసుకొని మిన్నగా కవి, పండితుల మన్ననకు పాత్రమయ్యే విధంగా ప్రౌఢశైలిలో ప్రబంధోచితంగా రచించాడు. ఇందులోని పాత్రలు ప్రతీకాత్మకంగా ప్రజ్ఞాచక్షుర్గోచరంగా ఉన్నాయి. క్షీణయుగధర్మాన్ని ప్రతిబింబించే విధంగా ఈ కావ్యం రూపొందిందనడం అతిశయోక్తి కాదు.



## అధోజ్ఞాపికలు

1. కావ్యాలంకార సంగ్రహము, పుట–238
2. సాహిత్యతత్త్వము – శివభారతదర్శనము, పు–41.
3. The Philosophy of Beautifual, Page No.102.
4. The Literatures of the middle ages, Page No.38.
5. ఆంధ్ర యక్షగాన వాఙ్మయచరిత్ర – ద్వితీయ భాగం, పుట – 440.
6. శుకచరిత్రము. 1 అశ్వా. 7వ వచనము.
7. శుకచరిత్రము. పీఠిక 3,4
8. ఆంధ్ర సారస్వతమునందలి అద్వైత తత్త్వకావ్యములు, 2 సం. పుట – 339
9. తెలుగువాణి, పుట–174, ప్రపంచ తెలుగు మహాసభల ప్రత్యేక సంచిక
10. ఆధునికాంధ్రకవిత్వము, పుట – 129.
11. ఆంధ్ర ప్రబంధములు – అవతరణ–వికాసములు, పుట – 13
12. శుకచరిత్రము. పీఠిక – 1.



# 3. శుకచరిత్ర - రచనా శిల్పం

**3.0** సృష్టిలో ఆలోచనగల ప్రాణి మానవుడు. తనకు కలిగే అనేక భావాల్ని, అనుభూతుల్ని ఇతరులకు తెలియజేయడం ఇతని ప్రత్యేకత. భావ వ్యక్తీకరణ ప్రధానమైన వాహిక భాష. ప్రతివ్యక్తీ తనకంటూ ఒక బాణిని ఏర్పరచుకొంటాడు. ఇది వ్యక్తుల్ని బట్టి భిన్న రూపాలలో ఉంటుంది. దీన్నే శైలీ వైవిధ్యం అని చెప్పుకోవచ్చు.

శిల్పి పాషాణం నుండి తన అభిరుచి కనుగుణంగా శిల్పాన్ని తయారు చేస్తాడు. అదే విధంగా కవి కూడా తన అభిరుచికనుగుణంగానే రచనను తీర్చి దిద్దుతాడు. ఈ రచనా విధానాన్నే పాకమని, శిల్పమని ప్రాజ్ఞులు వ్యవహరిస్తారు.

శైలిని లేదా శిల్పాన్ని ఆంగ్లంలో స్టైల్ అంటారు. దీనిమీద విమర్శకులనేకులు పలు అభిప్రాయాలు వెలిబుచ్చారు. ఎబర్‌క్రాంబే (Aber Crombe) "Style in the broadest sense which includes mood and spirit and the choice of matter as well as technique and language" (1) అన్నారు. అంటే విస్తృతార్థంలో ఆలోచిస్తే కవి గ్రహించిన వస్తువు, శిల్పం, భాష ఆ సమయంలో కవి మనోభావాల్ని బట్టి ఉంటాయని క్రాంబే అభిప్రాయం.

మిడిటన్ ముర్రే (Miditon Murre) అభిప్రాయం ప్రకారం "Style is a quality of a language which communicates precisely emotion or thought or a system of emotions or thoughts peculiar to the author" (2), కవికి కలిగే ఆవేశం, భావపరంపరలు వ్యక్తీకరించడమే శైలి అని అభిప్రాయం.

పాశ్చాత్యులు కవికి కలిగే భావావేశాన్ని పురస్కరించుకొని వెలువడే భావవ్యక్తీకరణే శిల్పం అన్న అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు.

డా॥ టి. కోటేశ్వరరావుగారు తమ **ఆముక్తమాల్యదాసౌందర్యము** అనే గ్రంథంలో "శైలి కవి రచనా విధానమును తెలుపునట్టిదని, విమర్శకాభిప్రాయము. కావ్యత్వసిద్ధి అనగా ఆనందహేతుకమైన సౌందర్యము" అన్నారు. చిత్రకారుడు బొమ్మను గీసేటప్పుడు బాహ్య ప్రయత్నం వల్ల బొమ్మ రేఖాంకితాన్ని గీసుకుంటాడు. ఆ తర్వాత తన అంతర ప్రయత్నం వల్ల బొమ్మకు జీవత్వాన్ని కల్పిస్తాడు. అలాగే కవి తన కవితా నైపుణ్యంతో కావ్యాన్ని అందంగా

తీర్చి దిద్దుతాడు. దీన్నే శైలి లేదా శిల్పం అంటారు. ఈ శిల్పాన్ని నిర్వచిస్తూ డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం గారు "కవిచేత ప్రతిభామయంగా శిల్పీకరింపబడిన కావ్యార్థాలను వివేచించి కావ్య పరమార్థ వ్యంజకాలుగా అవి ఎలా సంవదింపబడినవో నిరూపించే సంయమన సాహిత్య వ్యవసాయమే శిల్పం" (4) అన్నారు. ఆంధ్రసాహిత్యవిమర్శ ఆంగ్ల ప్రభావ పుట – 39.

ముదిగొండ ఈశ్వరచరణ్ గారు శిల్పంలో ఏయే అంశాలుంటాయో తన వ్యాసంలో వివరిస్తూ "కథా సంవిధానము, పాత్ర చిత్రణము, రసపోషణము, అలంకార భూషణము, రీతి, శయ్యా పాకమిత్యాదిగా గల కావ్యగత బహువిషయ సమాహార భూతమైన యొకానొక మహా విషయము శిల్పము" (5) అన్నారు. భారతి జనవరి. 1973.

పై విమర్శకుల అభిప్రాయానుసారం "కవితను, దర్శించిన వస్తువును, సంయమనంతో మననం చేసుకొని, కావ్యార్థాల్ని వివేచించి భాషలో భావంతో తన వ్యక్తిత్వాన్ని ప్రదర్శిస్తూ చేసే సాహిత్య వ్యాపారమే శిల్పం" అని చెప్పవచ్చు.

సర్వసాధారణంగా కవులు తమ కావ్యాలలో తాము అనుసరించిన కవితా శిల్పాన్ని గూర్చి కవిత్వ ఆదర్శాలను గూర్చి చెప్పుకొంటారు. తమ కవితా విధానం ఇది అని చెప్పుకోవడం ఆదికవి నన్నయతోనే ఆరంభమయింది. "సారమతింగవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తిలో నారసి మేలు నానితరులక్షరరమ్యత నాదరింప నానారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు" అని తన కవితా గుణాల్ని భారతావతారికలో చెప్పుకొన్నాడు. అలాగే కొందరి కవిత్వంలో అనేకుల కవితా గుణాలు ఉంటాయి. శ్రీనాథుడు తన కాశీఖండము పీఠికలో

**"వచియింతు వేములవాడ భీమన భంగి నుద్దండలీల నొక్కొక్కమాటు**
**భాషింతు నన్నయ భట్టు మార్గంబున నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాటు**
**వాక్రుత్తు తిక్కయజ్వప్రకారము రసాభ్యుచితబంధముగ నొక్కొక్కమాటు**
**పరిఢవింతు ప్రబంధపరమేశ్వరుని తేవ, సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు"**

అన్నాడు. అంటే తన కవిత్వంలో ఉద్దండలీల, ఉభయవాక్ప్రౌఢి, రసాభ్యుచితబంధం, సూక్తివైచిత్రి అనే లక్షణాలు ఉన్నాయని చెప్పుకొన్నాడు. అలాగే రామమూర్తి కవి కూడా తన కవితా విధానాన్ని గూర్చి చెప్పుకొన్నాడు.

**"మత్తేభ గామిని మత్తకోకిల వాణి – ఘన చంపకాఘ్రాణి కందవేణి**
**కలిత శార్దూల నఖాంచితోజ్జ్వల హార – లిప్తసుగంధమాలిన్య దూర**
**వితరళ మాలినీ వృత్తాను రూప వి–భవలయగ్రాహ్యాను భవకలాప**
**ఉత్పల నయన దివ్యోన్నత 'స్రగ్ధర' – శీలనాభ్యను సరసీస గీత**

**రమణసత్కవిరాజ విరాజితా ధ్య**
**యైన మత్కావ్యసారస్వతావలోక**
**న[శవణ కీర్తనార్థమై యా[శయింప**
**కుందుదురె పండితులు ధాత్రిమండలమున". - శుకచరిత్ర 1-42.**

**"ఎడనెడ లౌకికంబులు ననేక వివేకమయైక వాక్యముల్**
**సడలని రూపకార్థములు సాతిరయాతి నయాద్వయార్థమే**
**ర్పడని విరక్తియున్పరమ భక్తియు ముక్తియుతోక్తులెల్లెడన్**
**తడబడకుండునాదు కవితావనితాజనితాశయంబులన్." - శుకచరిత్ర 1-43**

కవి కాంతాసమ్మితంగా వ్రాసిన తన కావ్యం అనేకులకు ఆదర్శమన్నాడు. తన కావ్యంలో లౌకికాలు, వివేకమయవాక్యాలు, సడలని రూపకార్థాలు, అతి నయమైన ద్వయార్థం ఏర్పడే మాటలు, విరక్తి, పరమభక్తి, ముక్తి లభించే ఉక్తులు, తడబడకుండా చొప్పించినట్లు చెప్పుకొన్నాడు.

తన కావ్యాన్ని ప్రబంధంగా, కాంతా సమ్మితంగా శ్లేషకావ్యంగా వేదాంత ప్రతిపాదకంగా వ్రాస్తున్నానని చెప్పుకోవడం వల్ల కవి ఉద్దేశం మనకు స్పష్టమౌతుంది.

శుకచరిత్రలోని రామమూర్తికవి రచనా శిల్పాన్ని ఈ క్రింది విధంగా వింగడించుకొని పరిశీలించవచ్చు :

**1. కథా కథన శిల్పం** **2. వర్ణనా శిల్పం**
**3. ఆలంకారిక శిల్పం** **4. ఛందః శిల్పం**
**5. రస శిల్పం** **6. భాషా వైవిధ్యం**

**3.1 కథాకథనశిల్పం :**

కవి ఒక కావ్యాన్ని సృష్టించేటప్పుడు తన జీవితానుభవాన్ని గానీ, ఒక సందేశాన్ని కానీ ప్రధానంగా మనస్సులో ఉంచుకొని ఇతివృత్తాన్ని ఎన్నుకొంటాడు. కవి ప్రతిభ "**వస్తువును ఎన్నుకోవడంలోనే ఉంది**" అని అభినవగుప్తుడు తన లోచనంలో తెలియ జేశాడు. ప్రతిభా అపూర్వ వస్తు నిర్మాణ క్షమాప్రజ్ఞా నూతన వస్తువును నిర్మించటం అని అర్థం కాదు. వస్తు నిర్మాణంలో అపూర్వమైన ప్రజ్ఞను ప్రదర్శించడం అని అభినవగుప్తుని భావం.

పరశురామపంతుల రామమూర్తి కవి ఇతివృత్తాన్ని ప్రఖ్యాతగ్రంథమైన భారతంనుండి గ్రహించాడు. సామాన్యమానవులను సత్త్వ భావ సంపన్నమైన ఆధ్యాత్మికతవైపు తీసుకొని

వెళ్ళడం భారతీయ సాహిత్య ప్రధాన లక్షణం. దీనికనుగుణంగానే రామమూర్తి రచన కూడా సాగింది. మానవుని సదాచార సంపన్నునిగా తీర్చి దిద్దటానికి ఈ కవి ప్రయత్నించాడు. తన కవిత్వాన్ని భౌతిక, ఆధ్యాత్మికతత్త్వాల సమ్మేళనంగా సాహితీ లోకానికి అందించాడు.

"శుకచరిత్రలో శుకుని జననం నుండి నిర్యాణం వరకున్న కథ ఉంది. కవి ప్రధాన ధ్యేయం **అద్వైతతత్త్వప్రతిపాదన**. ఈ కావ్యనాయకుడు శుకుడు. ఈ కావ్యంలో ఒక దివ్య సందేశం ఉంది. ఆధ్యాత్మిక ప్రవృత్తి యొక్క వైకృత స్వరూపమే ఈ లోకం. ఈ లౌకిక జగత్తులో జ్ఞానం సంపాదించాలంటే జనులు ప్రబోధితులు కావాలి. లోక ప్రవృత్తియందు మగ్నమైన చిత్తము ఆత్మజ్ఞానము పొందునటుల చేయుట నిజమైన ప్రబోధము. ఇట్టి ప్రబోధము కవి కావ్యమున కల్పింపవలెను" అని ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారి అభిప్రాయం. ప్రథమాంధ్ర మహాపురాణము. పుట – 256.

ఈ దృష్టితో ఆలోచించినపుడు శుకచరిత్ర ఒక ప్రబోధ కావ్యమౌతుంది. ఈ ప్రబోధం ఒక కథ ద్వారా జరిగింది. కావ్యం కాంతాసమ్మితం కాబట్టి వర్ణనాలంకారాది శిల్పాత్మకంగా ఉంది. ఈ వర్ణనాలంకారాదులు కథాగతిని పోషించి ప్రయోజనోన్ముఖంగా సాగేందుకు తోడ్పడతాయి. కావ్య ప్రారంభం నుంచి చివరి దాకా ప్రతి అంశము, కావ్యోద్దేశాన్ని, కావ్య వస్తువును ఆవిష్కరించేవిగా ఉండాలి. దీన్ని వస్త్వైక్యత అంటారు. కావ్యంలో వస్త్వైక్యం చాలా అవసరం. స్థూలంగా పరిశీలిస్తే శుకచరిత్రలో కథాదృష్టి తక్కువ. ఈ కావ్యంలో రెండు ఆశ్వాసాలలో వేదాంత వర్ణనలున్నాయి. శుకచరిత్ర అద్వైత ప్రతిపాదనే ప్రధానలక్ష్యంగా వ్రాయబడిన కావ్యం. కావ్యంలో తెలుపబడిన ఏ అంశమైన కావ్య ఫలోన్ముఖంగా సాగాలి. శుకచరిత్రలోని ప్రతి అంశం వస్త్వైక్యానికి తోడ్పడింది.

శుకుడు సకల వేదాంత రహస్యాలను ఒంట బట్టించుకొని, **సాధనచతుష్టయసంపత్తి**తో ముక్తికాంతను పెళ్లాడాడు. గృహస్థధర్మాలు ఆచరించి, యజ్ఞయాగాదులు చేశాడు. చివరకు నిర్వాణం పొందాడు. ఇవన్నీ శుకచరిత్రలోని కథాంశాలు. నాయకుడైన ఈ శుకునికి తన లక్ష్య సాధనలో పరోక్షంగాను, ప్రత్యక్షంగాను తోడ్పడినవారు పంచశిఖుడు, వ్యాసుడు, జనకుడు.

పంచశిఖుని వృత్తాంతానికి ప్రధాన కథతో సంబంధం లేదు. ఇది ప్రాసంగిక ఇతివృత్తం. జనకుడు ముక్తికన్యను కనడానికి తగిన సాధనం కోసం అన్వేషించే సమయంలో పంచశిఖుడు అక్కడికి వచ్చాడు. 'సమాధి' అనే యజ్ఞాన్ని చేస్తే ముక్తికన్య జనిస్తుందని సూచించాడు. ఆ బ్రహ్మవిత్సఖుని సలహా మేరకు జనకుడు సమాధి అనే సవనం చేశాడు. ఆ తర్వాత ప్రజ్ఞాసతి గర్భవతియై ముక్తికన్యను ప్రసవించింది. జనకుడు ఈ ముక్తికన్యకకు తగిన వరుడెవడని

తలపోసి సాధనచతుష్టయసంపత్సంయోగి **శుకయోగి** యరుగుదెంచిన నతనికిం గళ్యాణ పూర్వకంబుగా నొసంగెదనని" అనుకొంటాడు. శుకుడు ముక్తికన్యకకు తగిన వరుడని నిరూపింపబడాలి. అందుకే శుకుని జననాదికాలను వర్ణించాడు.

వ్యాసుడు వంద ఏండ్లు తపస్సు చేస్తే శివుడు ప్రత్యక్షమయ్యాడు. శివుడు వ్యాసుని కోరిక ప్రకారం పంచభూతాల శక్తిగల పుత్రుని ప్రసాదిస్తాడు. శుకుడు పవిత్రమైన అరణి నుండి జన్మించాడు. దేవగురువు బృహస్పతి నుండి విద్యలకు గ్రహించాడు. తండ్రి వ్యాసుని వలన సాంఖ్య-తారక-అమనస్కయోగాల సారాన్ని తెలుసుకొంటాడు. వైరాగ్యం కలిగి, ముముక్షువు అవుతాడు. ఆయన వైరాగ్యంతో కూడిన తలంపులు ఆయన జీవిత లక్ష్యాన్ని తెలుపుతాయి. సాధనచతుష్టయసంపత్సంయోగి శుకయోగి అని జనకుడు భావించడంతోనే కథకు మూలమైన అద్వైతతత్త్వానికి బీజం పడినట్లు అయింది.

శుకుడు నిత్యానిత్యపదార్థవిభాగి, ఇహాముత్రార్థఫలభోగవిరాగి, శమాది-షట్క సంపత్సంభోగి, ముముక్షుతా సంయోగి అయ్యాడు. ఆ తర్వాత వ్యాసుని దగ్గరకు వచ్చి ముక్తి మార్గాన్ని గూర్చి ప్రశ్నించాడు. మనసే ముక్తికి మార్గమని, వ్యాసుడు అమనస్కరీతిని వివరించాడు.

"**కావున బంధముక్తులకు గారణమా మనమంచు బెద్ద లెం**
**తో వచియింతు రాగమతతుల్వివరించును మాకు జూడ ద**
**ద్భావము బంధకంబుతద భావము ముక్తిగ దోచుగానని**
**ట్లై విలసిల్లుమానసల యంబమనస్కము నిశ్చయింపగన్.** " – శుకచరిత్ర 4-280

ఈ బోధతో శుకుని మనస్సు నిశ్చలయయింది. నారదుని ద్వారా ముక్తికన్యా స్వరూపాన్ని విని జనకుని సభలో మతవాదులతో వాదించి వారిని ఓడించి శుకుడు ముక్తికన్యను పెళ్లాడాడు. ముక్తికన్యకను పరిగ్రహించి తన ఆశ్రమానికి వచ్చి తండ్రి దగ్గరే ఉన్నాడు. అక్కడే గృహస్థ ధర్మాలు నిర్వర్తించి యజ్ఞయాగాదులు నిర్వర్తించి నిర్వాణం పొందాడు. నాయకుడైన శుకుడు అద్వైతమతావలంబియై ముక్తి పొందాడని చెప్పి కవి కావ్యంలో వస్త్వైక్యాన్ని సాధించాడు.

### 3.2 వర్ణనా శిల్పం :

వర్ణన అంటే వర్ణించడం. వర్ణిస్తూ తా కొనియాడబడేది. కొనియాడేది అని గురుబాల ప్రబోధిక "ఏ వస్తువు నయినను సరే దాని బాహ్యాకారమును దానిని పురస్కరించుకొని ఉత్పన్నము లగు భావాలను, అంతరాకారమును, దానిని పురస్కరించుకొని ఉత్పన్నములగు భావాలను, వర్ణించుట వర్ణన అగుతున్నది" అని డా॥ అంతటి నరసింహం గారు తన 'ప్రబంధాలలో ప్రకృతి వర్ణనలు' అనే గ్రంథంలో అన్నారు. డా॥ కె.వి.ఆర్. నరసింహం గారు తన '**ఆంధ్ర**

**ప్రబంధములు అవతరణ వికాసములు**' అన్న గ్రంథంలో, 'వర్ణనలు, కవులు తమ పాండిత్య ప్రకర్షకునై చేయరాదు. దృశ్యము కన్నులకు కట్టినట్లు చేయుట, కథాకథనము పేలవము గాకుండ నూత్న చైతన్యము కలిగించుటకును వర్ణనము లావశ్యకములై యున్నవి" అన్నారు.

రామమూర్తికవి తన కావ్యాన్ని ప్రబంధంగా వ్రాయాలనుకొన్నాడు. ప్రబంధాన్ని నిర్వచిస్తూ డా॥ కె.వి.ఆర్ నరసింహం గారు ఇలా తెలియజేశారు. "కథైక్యమును, నష్టాదశవర్ణనలును గలిగి శృంగార రస ప్రధానమై, యర్థాతిశాయియైన శబ్దమును గ్రహించి యాలంకారిక సాంకేతికములకు విధేయమై యనతి విస్తృతిగల యితివృత్తములతో భాషాంతరీకరణముగాక, స్వతంత్రరచనయేయైన తెనుగు కావ్యము ప్రబంధము".

ప్రబంధాలలో అష్టాదశ వర్ణనలు ఉండాలని ఆలంకారికులు కూడా చెప్పారు. శుకచరిత్రను కవి ప్రబంధంగా పేర్కొన్నా అందులో అష్టాదశ వర్ణనలన్నీ లేవు. ప్రబంధాలలో 18 వర్ణనలు ఉండాలని పేర్కొన్నా, వస్తుతత్త్వాన్ని బట్టి అందులో కొన్ని తక్కువ అయినా మహాకావ్యత్వానికి లోటు వాటిల్లదని ప్రతాపరుద్రయశోభూషణంలో విద్యానాథుడు పేర్కొన్నాడు.

**"నగరార్ణవశైలర్తుచంద్రార్కోదయవర్ణనం**
**ఉద్యానసలిలక్రీడామధుపానరతోత్సవం**
**విప్రలంభో వివాహశ్చ కుమారోదయవర్ణనం**
**మంత్రద్యూతప్రయాణాజినాయకాభ్యుదయాఽపి**
**ఏతాని యత్ర వర్ణ్యంతే తన్మహాకావ్యముచ్యతే**
**ఏషామష్టాదశానాం యై కైశ్చిదూనమపీష్యతే**".

శుకచరిత్రలోని వర్ణనలు చాలా వరకు యోగప్రతిపాదకంగానూ, ఆధ్యాత్మికతత్త్వప్రతిపాదకం గానూ ఉన్నాయి. ఈ వర్ణనల్ని ప్రధానంగా నాలుగు రకాలుగా వర్గీకరించవచ్చు :

1. కథాపరాలైన వర్ణనలు
2. కాలసూచక వర్ణనలు
3. పాత్రానుగుణ వర్ణనలు
4. రసానుగుణ వర్ణనలు

### 3.2.1 కథాపరాలైన వర్ణనలు :

కథాపరాలైన వర్ణనలు సన్నివేశాల చిత్రణకు, పాత్ర ప్రవేశ సూచనకు, కథ నడవటానికి అనువైన వాతావరణాన్ని కల్పిస్తాయి. శుకచరిత్రలోని పురవర్ణన కథాసూచనకు; సన్నివేశ కల్పనలకు; పర్వత, వన, వర్ణనలు, పాత్ర ప్రవేశానికి; గర్భవర్ణన, బాల్యవర్ణనలు, కథ నడవటానికి, కథాతత్త్వాన్ని చెప్పడానికి ఉద్దేశింపబడినాయి.

**3.2.1.1 పుర వర్ణన :**

పుర వర్ణనలో వస్తువు ఒకటే అయినా ఒక్కొక్క కవి ఒక్కొక్క విధంగా ఈ పురవర్ణన చేయడం జరుగుతుంది. కవి ప్రతిభకు ఇదొక ప్రబల నిదర్శనం. సర్గబంధ మహాకావ్యాలలో పుర వర్ణన ఉండాలని దండి తన **కావ్యాదర్శం**లో పేర్కొన్నాడు. (కావ్యాదర్శం - 1-16) విన్నకోట పెద్దన తన **కావ్యాలంకారచూడామణి**లో అష్టాదశ వర్ణనల్ని గూర్చి చెబుతూ పుర వర్ణనలో ఈ క్రింది అంశాలుండాలని పేర్కొన్నాడు.

"**దుర్గము పరిఖావరణ విసర్గ బలానీక చతురచాతుర్వర్ణ్యా**
**నర్గళ సంపద్వన జలవర్గస్తుతి వలయు నగర వర్ణనమునకున్** "

- కావ్యాలంకారచూడామణి 3-93

ఆలంకారికుల నిబంధనను రామమూర్తికవి పాటించడానికి పురవర్ణనలో తనదైన శైలిని ప్రదర్శించాడు. పురవర్ణనలో కూడా ఆధ్యాత్మిక భావాలను చొప్పించిన బ్రహ్మవిద్యాభిమాని రామమూర్తికవి.

ధూర్జటి తన కాళహస్తీశ్వరమాహాత్మ్యములో కాళహస్తి పురాన్ని వర్ణిస్తూ అది సౌఖ్యసంపత్తి సాధక జననివాసమని వర్ణించాడు. సౌఖ్యసంపత్తి ఎలాంటిదో పరికించిన ధూర్జటి రాజయోగ దృష్టి, ఆధ్యాత్మికతలు వ్యక్తమయ్యే రీతిలో పురవర్ణన చేశాడు.

శుకచరిత్రలో రామమూర్తికవి కూడా పురవర్ణనలో యోగదృష్టి ఆధ్యాత్మికతను చొప్పించాడు. మిథిలాపుర వర్ణనను నలభై ఒక్క గద్యపద్యాలలో వర్ణించాడు. ఇందులో చాతుర్వర్ణ్యం, దుర్గం, పరిఖ, బలానీకం, సంపద, ప్రాసాదాలు, వేశ్యలు వర్ణ్య వస్తువులు.

మిథిలాపురం పురుషార్థ చతుష్టయాలను కలిగించడంలో బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాదుల పురాలకు అమరపురికి మిన్నగా ఉందని వర్ణించాడు. ఒక సీస పద్యంలో మిథిలానగరం ఎలా పురశిరోమణిగా ఉందో వివరించాడు.

"**ధర్మంబు మాత్రమొందంజేయ గైకొంటి - నని బ్రహ్మపురమున కలక దనర**
**అర్థంబు మాత్రమే యనుసరింపగ గంటి - నని యలకకు నెపమారడింప**
**కామంబు మాత్రమే గావింపగా గంటి - నని యమరావతి కదురుగదుర**
**ముక్తి మాత్రమొసంగు యుక్తి దా జేకొంటి - నని విష్ణు పురికి భయంబు దోప**
**కలిత ధర్మార్థ కామ మోక్షములు దన్ను**
**సంశ్రయించిన వారికి సంతతంబు**
**గలుగజేయుదు నను తెంపు కలిమి నొప్పు**
**పుర శిరోమణియైన యప్పురవరంబు.**" - శుకచరిత్ర 1-58

ఒక్కొక్కదైవపురం ఒక్కొక్క పురుషార్థ ప్రదాయినిగా ఉండ **మిథిలా నగరం** మాత్రం ఆ పురాలను తలదన్నేలా పురుషార్థచతుష్టయాలను అనుగ్రహిస్తూ ఉందని వర్ణించాడు. పుర సంపదను వర్ణిస్తూ ఆ సంపద మీద అందరూ విరక్తి చూపుతున్నారని ప్రబంధాలలో వర్ణించిన వారు అరుదు. బ్రహ్మ, క్షత్రి, వైశ్య, శూద్రులకు సంపద మీద ఎలాంటి అభిప్రాయముందో కవి వెల్లడించాడు.

**"క్షితిపతి పరసతి యన ద్విజ**
**పతి సోదరియనగ, నార్యపరజనని యనా**
**యతి ముదమున వర్ణితవిధి**
**సుతయన నప్పురిని సిరియు సొంపుదలిర్పన్.**" – శుక 1–59

ధనం మీద ఎవ్వరికీ వ్యామోహం లేదని చెప్పాడు. ధనం రాజుకు పరసతిగా, ద్విజులకు సోదరిగా, వైశ్యులకు పరజననిగా, శూద్రులకు కుమార్తెగా వర్ణింపబడింది. అందువల్ల ఆ సిరిని పొందడానికి ఎవ్వరికి ఇష్టం లేదని వర్ణించి వైరాగ్యాన్ని సూచించాడు.

ఆ మిథిలా నగరంలోని బ్రాహ్మణులు లోక భోగాలు, శరీరాలు అస్థిరాలని ఎంచి, ఆ భోగాలకు అతీతుడైన భగవంతుని తత్త్వాన్ని తెలిపే శ్రుతులను ఎప్పుడూ పఠిస్తూ ఉంటారు. నిర్మల మతితో నిత్యోచిత ధర్మంబు లొనర్చి కర్మేశునకు కూర్మి సమర్పించేవారు ఆ పురంలో ఉన్నారు. ఆ నగరంలో "స్వవశేంద్రియ ప్రాణసన్మనంబుల సృక్స్రువాది సాధనములుగా దలంచి దశవిధ మండలాంతర పరంజ్యోతి రూపక మహాజ్ఞానాగ్ని ప్రబల జూపి ప్రణవ మంత్రోక్తముగను, లోభాదిపశుమయాహుతులు వాసనా విషయాజ్య సేంధసమితితో వ్రేల్చి" (శుక 1–63) దివ్య సౌఖ్యాన్ని పొందే సోమయాజులున్నారు. ఆ పురంలో గల వ్యాకరణ పండితుల్ని, కవుల్ని గురించి రామమూర్తి వర్ణించాడు. ఇంకా ఆ పురంలో వైష్ణవులు, శైవులు కూడా ఉన్నారని వర్ణిస్తూ, అనేక తాత్త్వికాంశాల్ని వర్ణించాడు. జ్యోతిష్కులను, ఆయుర్వేదవైద్యుల్ని, వేటగాళ్లను వర్ణించి నూతన ఒరవడిని ఏర్పరచాడు. ఆ పురంలోని రాజులు యశస్సు, జయం సంపా–దించడంలోనూ, స్థిరమైన బలం సంపాదించడంలోనూ నగరాజులను, మృగరాజులను లెక్క పెట్టరు. మరొక సీసపద్యంలో అప్పటి రాజుల ఆధ్యాత్మిక శక్తిని వర్ణిస్తూ ఇలా అంటాడు :

**"స్థిరతరంబగు తుర్య సింహాసనంబొప్ప – బ్రజ్ఞాదిమంత్రులు పరిభజింప**
**శమముఖగుణవృద్ధ సభ్యులింపుదయింప – కరణాది దేవ లేఖరులు మెలగ**
**ప్రాణాది చతురంగ బలములు గదియంగ – జ్ఞానేంద్ర యోద్భట సమితి గొలువ**
**వాగాదికరణ సేవకులు సేవింపంగ – దనుతలోదరులు నృత్తములు సలుప**

**సంతతము సాక్షిమయత బాహ్యాంతరస్థ**
**నిఖిల విషయ ప్రపంచంబు నేర్పు మెఱసి**
**తీర్చుచుండుదురవ్వీట దిట్టలైన**
**రాచకొమరుల గుమి ధర్మరాజ తనయ.**" – శుకచరిత్ర 1–72

పై పద్యంలో తుర్య సింహాసనం, ప్రజ్ఞ శమముఖం, కరణాదులు, ప్రాణాది చతురంగబలాలు, జ్ఞానేంద్రియ భటులు, వాగాది కరణసేవకులు, విషయ ప్రపంచం మొదలైనవి తత్త్వార్థబోధకంగా ఉన్నాయి.

ఆ పురంలోని రాజులు సుషుప్తి, స్వప్నావస్థ, జాగ్రదవస్థలను దాటి తుర్యావస్థ అనే సింహాసనాన్ని అధిష్ఠించారు. ప్రజ్ఞాత్రయం శ్రుతమయి చింతామయి, భావనామయి – కల్గిన మంత్రులు వారిని కొలుస్తూండేవారు. శమాది గుణ భాసిత వృద్ధజనులు, ప్రాణాది చతురంగ బలాలు, జ్ఞానేంద్రియాది భటులు, వాగాది కరణ సేవకులు కొలుస్తుండగా, నిఖిల విషయ ప్రపంచాన్ని దాటిన దిట్టలైన రాజకుమారులు ఆ నగరంలో ఉండేవారు.

ఆ పట్టణంలోని వైశ్యులను గూర్చి వర్ణిస్తూ అర్థ తరుణిపతి అయిన మహా విష్ణువు శివుని పేదతనాన్ని పోగొట్టలేక పోయాడని, కానీ అక్కడ వైశ్యులు ఆ పని చేయగలరని కవి వారి ఘనతను కొనియాడాడు. హరిని చులకనతో చూస్తారు. ఇంకా షడ్భావవికారాలను తూచి దానికి తగిన విక్రయ ధనమిచ్చి కొంటారు. షడ్భావ వికారాదులను కొనడం అంటే వాటికి అతీతమైన మోక్ష స్థితిని పొందడం అని అభిప్రాయం.

ఆ పురంలోని శూద్రులను వర్ణిస్తూ నాగలిని మోసుకొంటూ వెళ్లే హలి ఎప్పుడైన పొలాన్ని దున్ని పంట పండించాడా అంటూ బలరాముని గేలిచేసేవారు.

**"పరిశుద్ధమైనట్టి ఫాలంబు, నలిలేని – యవనీతలంబుగా నమవు పఱచి**
**వీక్షణ పవమాన వృషభ నిబద్ధ హ్మా–న్మథన శీరమున ముమ్మారు దున్ని**
**జీవ బీజములల్కి శీతాంశు కిరణోత్థ – రసముచే గెసనంకురముల బెంచి**
**సాక్షిస్వరూపాను సంధాను ధాన్యము – ల్ఫలియింప రాశు లేర్పాటు జేసి**

**యనుభవింపంగ యోగ్యంబులంటనడుగు**
**వారలకు బంచి పెట్టుచు వారుఁదారు**
**ననుభవింపుచు మనుచుందురప్పురంపు**
**గాపు కాంద్రను లెక్కింప గలమే మనము.**" – శుకచరిత్ర 1–77

ఈ పద్యం పూర్తిగా తత్త్వబోధకంగా ఉంది. కాపువాళ్లు పరిశుద్ధమైన తమ ఫాలభాగాన్ని

అవనీతలంగా చేశారు. చూపులు అనే వృషభాలను పూన్చి, హృదయ మథనం అనే నాగలితో ముమ్మారు దున్నారు. జీవ బీజాలు వేసి, అమృత బిందువలతో మొలకెత్తించారు. సాక్షి స్వరూపాను సంధానం అనే ధాన్యాన్ని పండించారు. వాటిని అనుభవించడానికి యోగ్యమైన వారికి పెడుతూ తామూ తింటూ ఉండేవారు. ఇలా రామమూర్తి కవి హాలికుల్ని గూర్చి రమణీయంగా వర్ణించాడు.

బ్రహ్మ ముఖం, భుజం, ఊరువులు పాదాలలో పుట్టిన చాతుర్వర్ణ్య పురుషుల సతులు కావడం వల్ల ఆ పట్టణంలో స్త్రీలు పతివ్రతలుగా ఉన్నారు.

**"భార్గవు దాగ్రహప్రబలు దందురు గాని – దశరథాత్మజు జివ్వదనిపి నాడె**
**దశరథాత్మజుదాజి దక్షుదందురు గాని – యింద్రజు నెదుట పోరిచ్చి నాడె**
**ఇంద్రజు డతి శౌర్య సాంద్రుడందురు గాని – హరి బాసి గొల్లల నడపినాడె**
**హరి పరాక్రమవంతుడని చెప్పుదురు గాని – విధిదప్ప రిపుమొనల్విరిచినాడె**

**యని పరాచకమాడుచు నరులు వీటి**
**బట్టి పారంగబుత్తుమో పట్టి తెత్తు**
**మో యనుచు బంతమాడుచు మొగులుముట్ట**
**నార్చునవ్వీట భటులందరరసి చూడ."** – శుకచరిత్ర 1–79

ఈ పద్యం పురాణ కథల్ని జ్ఞప్తికి తెస్తూ ఉంది. భార్గవుని కంటె రాముడు, రాముని కంటె ఇంద్రజుడు, ఇంద్రజుని కంటె హరి, హరికంటె విధి బలమైందని తెలియజేశాడు. విధిని కూడా ఎదుర్కోవడానికి ఆ పురంలోని భటులు సంసిద్ధులయి అరుస్తున్నారు. పురంలోని వేటగాళ్లను వర్ణించిన తీరు నిత్యనూతనంగా, తత్త్వప్రతిపాదకంగా ఉంది.

**"కాయవనంబు నద్దనువుగా భ్రుకుటిన్ గుతి జెసి నారి గా**
**వాయువు గూర్చి చూపులను వాడి శరంబులఁ బూని షణ్ముఖిం**
**బాయని దృష్టి మాటుగొని మానస ముఖ్య మృగంబులన్నుభో**
**పాయముగా వధించు మృగయారతులుండుదు రప్పురంబునన్."** – శుకచరిత్ర 1–81

వేటగాళ్లు శరీరమనే అడవిలో భ్రుకుటిని ధనుస్సుగా చేసి, వాయువును వింటి నారిగా చేసి, చూపులను వాడి శరములుగా బూని, మనస్సులోని మృగాలను ఉపాయంతో వధిస్తున్నారు.

కవి ఆ పురంలోని విటులను, సరసులను కూడా తాత్త్విక దృక్పథంతో వర్ణించడం ప్రత్యేకత. ఆ పురంలో వారకామినులు, యతులను, విరక్తిపరులను మునులను, యోగయుతులను పలు మనోహర రూపంబు ప్రకటించి పదముగొన జేయుదురు.

అక్కడి అలరు బోదులను వర్ణిస్తూ వారి తలలోని పుష్పాలను రాజయోగం లోని షట్కమలాలతో పోల్చి వర్ణించడం ఒక నూతన సృష్టి.

**"తరళాక్షిరో సహస్ర దళ సుమంబిది సుమీ – ఇది మనోగురునకు హితము గాదె**
**సుదతిరో ద్విదళ ప్రసూన మియ్యదిసుమీ – ఇది పర పురుషున కింపుగాదె**
**తరుణిరో షోడశ దళ పుష్పమిది సుమీ – ఇది ప్రాణనాథునకెచ్చుగాదె**
**పొలతి ద్వాదశ దళపుష్పమియ్యది సుమీ – ఇది మారవైరిపై నిడగరాదె**

**ఇది దశదళంబు మరు తండ్రి కియ్య దగును**
**ఇదియు షడ్దళ మజునకు నిష్ట మగును**
**ఇది చతుర్దళ మిదయు విఘ్నేశ్వరునకు**
**ననుచు ధరింతు రలరులు నలరు బోండ్లు."** – శుకచరిత్ర 1–85

పై పద్యంలో **షట్చక్రాలు** లేదా షట్కమలాలు వర్ణింపబడ్డాయి. మొదటి పాదంలో సహస్ర దళ సుమాన్ని వర్ణించాడు. దీన్నే యోగపరిభాషలో సహస్రారచక్రం అని కూడా అంటారు. ఇది శిరోమధ్య భాగంలో ఉంటుంది. దీన్నే బ్రహ్మరంధ్రం అనికూడా అంటారు. దీన్ని ఛేదించుకొని ప్రాణవాయువును వదిలితే పునర్జన్మ లేదంటారు. దీనికి సగుణ, నిర్గుణ స్వరూపుడైన సచ్చిదానంద మూర్తి గురుమూర్తి అధినేత.

రెండో పాదంలో ద్విదళ ప్రసూనం వర్ణింపబడింది. దీనికి అధినేత పరమాత్మ. దీన్నే ఆజ్ఞాచక్రమంటారు. భ్రూమధ్యభాగంలో **ఆజ్ఞాచక్రము**ంటుంది. ఇది పరబ్రహ్మం ఐక్యానికి ప్రముఖ దోహదకారి.

మూడోపాదంలో షోడశదళ వర్ణన ఉంది. దీన్ని **విశుద్ధిచక్రం** అంటారు. దీనికి అధినేత జీవుడు. జీవులందరు కంఠగత ప్రాణాలు గలవారు కావడం చేత గొంతులో ఉండే గాలిలో ఏమాత్రం నలక పడినా, కఫాదులడ్డుపడినా నిలువనీక ఈ చక్రం తన స్వచ్ఛతను చాటుకొంటుంది.

నాల్గవదిగా ద్వాదశ దళం వర్ణింపబడింది. దీనినే అనాహతం లేదా **అనాహతచక్ర** మంటారు. దీని కధినేత శివుడు. హృదయమందిరంలో ప్రాణవాయువున్న చోట ఇది ఉంటుంది.

ఐదోది దశదళంబు. అంటే **మణిపూరక చక్రం**. దీనికధిదేవత విష్ణువు. స్వాధిష్ఠాన చక్రానికి ఎనిమిది అంగుళాల మీద నాభిదగ్గర మణిపూరక చక్ర ముంటుంది.

ఆరోది షడ్దళం. అంటే **స్వాధిష్ఠానచక్ర**మన్నమాట. బ్రహ్మ దీనికి అధిష్ఠాన దేవత. ఆధార చక్రానికి రెండంగుళాలపై ఉపస్థ దగ్గర ఈ చక్రముంటుంది.

ఏడోది చతుర్దళం. దీన్నే **మూలాధారచక్ర**మంటారు. దీని అధిదేవత గణపతి. ఇది గుదస్థానంలో నాడులకంతా ఆధారమైన చక్రం. మలద్వారానికి రెండంగుళాలపైన ఇది ఉంటుంది.

ఇలా స్త్రీలు ధరించే పుష్పాలలో రాజయోగాన్ని చొప్పించి వర్ణించడం ఈ కవికే చెల్లింది. ఆ పురంలోని రత్నాలమేడలో దంతాలతో నిర్మించిన భవనాలలో తిరిగే భృత్యుల పత్నులను చూసి రాజపత్నులేమోనన్న శంక జనించింది. మేడలు మేరుపర్వతాలు లాగా ఉన్నాయి. గోపురాలు హేమకుంభాలతోను, కోటగోడలు కెంపులతోనూ పొదగబడి ఉన్నాయి. సౌధ వీథులలోని పతాకాలు ఆకాశాన్ని తాకుతూ ఉన్నాయి అని వర్ణింపబడింది.

పురవర్ణనలో గజాశ్వాదులను వర్ణించడం పరిపాటి. కానీ ఈ కావ్యంలో గజ అశ్వాదులతో పాటు వృషభాలను కూడా వర్ణించడం విశేషం.

> **"ఆపురి వృషభంబులు తమ**
> **మూపురముల మీద నెక్కు యోధుల తతలం**
> **జూపట్టెదు శశిగతి నా**
> **ర్యాపతులని తెల్పెననగనలరుచునుండున్.** " - శుకచరిత్ర 1-89

ఏనుగులు అపారంగా ఉన్నాయి. ఆ పురంలోని తురంగాలు వేగంగా వెళ్లగలవు అని చెప్పడానికి సూర్యుని గుర్రాలు ఉదయాద్రినుండి, అస్తాద్రిని చేరడానికి ఒక దినం పడుతుందని. కాని, ఈ మిథిలానగరంలోని గుర్రాలు వాటిని వెక్కిరిస్తూ వాటికంటె వేగంగా వెళుతున్నాయని వర్ణించాడు.

పురవర్ణనలో రామమూర్తికవి తనదైన శైలిలో ఆధ్యాత్మిక భావాలను, తాత్త్విక దృక్పథాన్ని కనబరచాడు. యోగశాస్త్రవిశేషాలను కూడా పురవర్ణనలో చొప్పించి వాటి గొప్పదనాన్ని చాటాడు.

### 3.2.1.2 పర్వతవర్ణన :

ప్రబంధాలలోని అష్టాదశవర్ణనల్లో **పర్వతవర్ణణ** కూడా ఒకటిగా పరిగణింప బడింది. విన్నకోట పెద్దన తన కావ్యాలంకారచూడామణిలో

> **"అచలతయును నున్నతియును**
> **ఖచరవినోదౌచితియును గనకాద్రి ఖనీ**
> **రుచితయును మొదలుగా గల**
> **ప్రచురతలు నుతింపవలయు బర్వతమునకున్.** " - కావ్యాలంకారచూడామణి. 3-97

అని అన్నాడు. అచలిత, ఉన్నతత, ఖచరవినోదిత కనకాది ధాతు యుక్తత మొదలైనవి ఉండాలి.

కేశవమిశ్రుడు తన అలంకారశేఖరంలో ఓషధులు, ధాతువులు, వంశములు, కిన్నరులు, ఝరులు, శృంగములు, తటములు, గుహలు, రత్నములు, ఉపత్యకలు, వన జంతువులు మొదలైనవి ఉండాలన్నాడు.

శుకచరిత్రలో మేరుపర్వత వర్ణన ఉంది. ఇందులో మనకు సహజసిద్ధమైన ప్రకృతి వర్ణన ఎక్కువగా కన్పించదు. ఈ పర్వతం దేవభూమిగా దర్శనమిస్తుంది. మేరుపర్వతవర్ణన మొట్టమొదట ఋగ్వేదంలోనే కన్పిస్తుంది.

శుకచరిత్రలో మేరుపర్వతం తొమ్మిది పద్యాలు, ఒక వచనంలో వర్ణింపబడింది. రామమూర్తి కవి వర్ణనలలో ఒక ప్రత్యేకత కనబరుస్తాడు. మొదట ఒక పద్యంలో తాను వర్ణించదలచిన విషయాలను నిబంధిస్తాడు. ఆ తర్వాత ఒక్కొక్క విషయాన్ని విపులంగానో, సంక్షిప్తంగానో వర్ణిస్తాడు.

> "**నయమై వసుమయమై యతి**
> **శయమై శ్రీహరి హరాంబుజాసన భవ నా**
> **శ్రయమై సంభృత ధాత్రి వ**
> **లయమై నగమ మరకుల నిలయమై యలరున్.** " – శుకచరిత్ర 2-4

ఆ పర్వతం అనేకాంశాల మయమయి గోచరించింది. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు ఆశ్రయమైంది. సమస్త భారాన్ని భరించే ధాత్రికి వలయంగా ఉంది. దేవతలకు నిలయంగా ఉంది.

పర్వతంలోని ఒక్కొక్క ప్రదేశాన్ని కవి చక్కగా వర్ణించాడు. పర్వత శృంగాలలో త్రిమూర్తులు కొలువై యున్నారు. కనక కందరాలలో సురులు, సిద్ధులు, చారణులు, అసురులు ఉన్నారట. గండశిలలు గరుడ, గంధర్వ, ఉరగాదులకు విలాస స్థలంగా ఉన్నాయి. మహాగహ్వరాలు ఉగ్రతాపసులకు ఆశ్రయాలుగా ఉన్నాయి. దేవకాంతలు విహరించడానికి అనువైన ఉద్యాన వనాలు ఉన్నాయి.

ఆ మేరుపర్వత గుహల్లో కిన్నెర స్త్రీలు శివుని మధుర గీతికలు ఆలపిస్తూ ఉండగా నాగకన్యలు నాట్యమాడుతూ ఉంటారు. అక్కడ సరోవరంలో అప్సర స్త్రీలు స్నానం చేస్తుంటారు. సరోవరంలో చక్రవాక పక్షులు, చేపలు, తుమ్మెదలు కదులుతూ ఉంటాయి.

ఆ పర్వతంలో సంచరించే వారిని గూర్చి వివరిస్తూ కేవలం కైవల్యాన్ని ఆశించే వారినే పేర్కోవడం వల్ల ఈ కవికి గల కైవల్యాసక్తి ద్యోతకమౌతూ ఉంది.

**"అంబర యానావలంబనంబున కౌష – ధంబు లర్థించు దిగంబరులును**
**అనలాంబు పర్ణంబులనుభవింపుచు నుగ్ర – తపము గావించెడి తాపసులను**
**వరుస బ్రాణాపానవాయు సంగతుల హం–సజపంబు లొందెడి జాపకులును**
**అణిమాది సిద్ధుల కలమంత్రలయ హఠ–యోగముల్పోధించు యోగివరులు**
**నమృత పదవియందు నాత్మాను సంధాన**
**దశల నొడలు మరచు తత్త్వవేత్త**
**లాధరాధరంబు నాధారముగనుంట**
**లేమిజెప్పుదున్ మహీతలేంద్ర."** – శుకచరిత్ర 2–10

పర్వతవర్ణనలో కావ్యరచనోద్దేశాన్ని స్పష్టంచేసిన వైనం గొప్పది. ఈ కావ్యంలో అంబర–యానం కోసం తపించే శుకుని అంతరంగాన్ని, సాత్త్విక ఆహారాన్ని భుజించే వారిని, ప్రాణాయామం చేసే విధానాన్ని, అష్టసిద్ధుల కోసం చేసే హఠయోగాన్ని, అమృతపదవికోసం ఉవ్రూతలూగిన శుకుని ఆరాటాన్ని అమృతకన్య పొందుకోసం ఒడలు మరచిన వ్యాసుని స్థితిని, పరోక్షంగా ఈ పద్యంలో ప్రస్తావించాడు. అదీగాక ఈ మేరుపర్వతం దేవతలకు నిలయం కాబట్టి ఈ పర్వతంలో దిగంబరులు, తాపసులు, జాపకులు, యోగివరులు ఉంటూ దేవతలకు వలసిన పనుల్ని చేస్తూ ఉన్నారు. అంటే అందరూ కైవల్యసాధనానికి మార్గాల్ని అన్వేషిస్తూ ఉన్నారని అభిప్రాయం. ఎక్కడ తన భక్తులు తనను గూర్చి గానం చేస్తారో అక్కడే దేవుడుంటాడు. కాబట్టి అవాఙ్మానసగోచరుడయిన ఈశ్వరునికి ఆ పర్వతం వాసస్థానంగా ఉందని చెప్పబడింది. పర్వతపవిత్రత ఇక్కడ వ్యక్తం చేయబడింది. కవి పర్వతానికి ఈశ్వరునికి అభేదాన్ని కల్పించాడు. ఈశ్వరునిలో అనిర్వచనీయజ్ఞానరూపాలయిన ప్రకృతితత్త్వం, సమస్త–చరణాలు లీనమై ఉన్నాయని చెప్పాడు.

**"అమ్మేరు శైలసుస్థితి**
**కమ్మేరు శరీరములు మహాత్ములు భవముల్**
**జిమ్మేరు మంత్ర సిద్ధులు**
**నమ్మేరు ఫలించునని యనారతమరయన్."** – శుకచరిత్ర – 2–9

ఆ మేరుపర్వతసుస్థితికి తమ శరీరాలను భవాలను అమ్మారని చెప్పడం వల్ల భగవంతునికి తమ సర్వస్వాన్ని అర్పించుకొన్నారని చెప్పినట్లు అయింది. పరమేశ్వరుడు అనంతకోటి బ్రహ్మాండాలలో నవబ్రహ్మలతో, ఏకాదశరుద్రులతో, ద్వాదశాదిత్యులతో, చతుర్దశమనువులతో, అష్టవసువులతో, పురందరాది బృందారక సందోహాలతో, సూర్యచంద్రగ్రహతారకా నివహంబు–

లతో సముద్రం కులాచలం నదీనద హ్రదంబులతో వనంబులు, నానాచరా–చరంబులతో కూడి "వసియించి యుండు నందొక్క ప్రదేశంబున" అనడం వల్ల ఆ పర్వతం ఈశ్వరుని విశ్వరూపానికి ప్రతీకగా ఉందని గ్రహించవచ్చు.

కవి మేరుపర్వతాన్ని ప్రకృతివర్ణనగా కాకుండా మహత్తరదేవభూమిగా భావించి వర్ణించడం అమోఘం.

రామమూర్తి కవి పర్వతవర్ణన మూడు ఉద్దేశాలతో సాగిందని చెప్పవచ్చు.

1. ప్రబంధాలలోని అష్టాదశవర్ణనల్లో భాగంగా పర్వతాన్ని వర్ణించాలని అనుకోవడం.
2. వేదపురాణాదుల్ని ఔపోసనం పట్టిన రామమూర్తికవి, వాటిలోని అంశాల్ని తన కావ్యంలో పొందుపరచాలని అనుకోవడం.
3. కావ్యం తత్త్వప్రతిపాదకం కాబట్టి వర్ణనల్నికూడా తత్త్వప్రతిపాదికంగా నడపాలను అనుకోవడం.

ఈ మూడు ఉద్దేశాల్ని కవి చక్కగా సాధించాడని ఈ పర్వతవర్ణన తేటతెల్లం చేస్తుంది.

**3.2.1.3 వనవర్ణన :**

ప్రబంధకర్తలు చాలమంది ఈ వనవర్ణనను, ఉద్యానవనవర్ణన దృష్టితో చేశారు. వనవర్ణన చైత్ర సంపద, నారీజనసహిత ఆరామ విహారాదులు వర్ణింపబడాలని విన్నకోట పెద్దన తన కావ్యాలంకారచూడామణిలో చెప్పాడు.

కేశవమిశ్రుడు తన అలంకారశేఖరంలో మార్గం, ఫలాలు, పుష్పాలు, లతలు, శుకపిక కేళీహంసలు, వనకేళి, పాంథులు మొదలైన వాటిని వన వర్ణనలో చేర్చాలన్నాడు.

సాధారణంగా కవి వనవర్ణన చేయడంలో నాలుగు ఉద్దేశాలు కన్పిస్తున్నాయి.

1. సప్తసంతానాలలో వనం ఒకటి. కాబట్టి వనప్రతిష్ఠ సాంఘిక, ధార్మిక, వైయక్తిక కీర్తికి దోహదం కాబట్టి వనవర్ణన చేస్తారు.
2. కథ నడవడానికి, సన్నివేశ కల్పనకు, ఈ వర్ణన దోహదం చేస్తుంది.
3. కవి భావుకతకు దేశీయతాచిత్రణకు పోషకంగా ఉంటుంది.
4. ఆలంకారిక సంప్రదాయాన్ని పాటించాలనుకోవడం కూడా వనవర్ణనకు హేతువు.

పరశురామపంతుల రామమూర్తి కవి కర్ణికార వనవర్ణనను ఎనిమిది పద్యాల్లోనూ, ఒక

దీర్ఘ వచనంలోనూ చేశాడు. కర్ణికార వనంలో రకరకాల పుష్పాలు, ఫలాలు వర్ణించబడ్డాయి. ఇంకా శారికలు, కీరాలు, మయూరాలు, లతలమీద, సురనారీమణులు ఉయ్యాలలూగే దృశ్యాలు వర్ణింపబడ్డాయి.

ప్రకృతి సమస్తం ఈశ్వరమయం కాబట్టి వనవర్ణనలో కూడా తత్త్వప్రతిపాదనం చోటు చేసుకుంది.

**"ఒకచోట నిశ్శ్రేయ సోపాయకథనంబు - లొక సీమ హరినామయుత జపంబు**
**లొక చెంత నిగమాంత సుకృతాంతర విచార - మొకదారి వరసూరి యోగమహిమ**
**లొక యోర ఘనతారకోద్ధార పరివార - మొక వంక శివకింకరోక్రచ్ఛయంబు**
**లొకదండ మునిమండలోద్దండ చరితంబు - లోక క్రేవ వనదేవతోత్సవంబు**
**లమర విషమిత విషసమ విముఖ విషయ**
**విసర సుముఖ ప్రముఖ లేఖ వినుతనిత్య**
**నిరుపమామృత సౌభాగ్య నిలయ సరణి**
**గాన నొప్పారు నప్పుణ్య కాననంబు**." - శుకచరిత్ర - 2-19

ఆ పుణ్య కాననాన్ని నిరుపము, అమృతసౌభాగ్యనిలయంగా వర్ణించారు. వనంలోని ప్రతి అణువు పుణ్యప్రదాయినిగా ఉంది. అక్కడ నిశ్శ్రేయసోపాయమైన హరినామస్మరణం, నిగమాగమాలవిచారం, యోగమహిమ, ఘనతారకోద్ధారపరివారం, శివకింకరుల శబ్దాలు, మునిమండలం యొక్క చరిత గానం, వనదేవతా ఉత్సవాలు ఉన్నాయని వర్ణించడం వల్ల అది పుణ్యకాననమయింది.

మరో పద్యంలో అక్కడి ప్రకృతి యావత్తూ తత్త్వప్రతిపాదకంగా ఉందని వర్ణింపబడింది.

"చిదహం చిదహమని చిలుకలు వచియించు బ్రహ్మోహమని పల్కు బావురములు
సర్వమాత్మయటంచు శారిక క్రొదసేయు నఖిలమద్వయమని యళులు మ్రోయు
యదయమాత్మా బ్రహ్మమని కోయిలలు గూయు నోమితి యని కేకులుచ్చరించు
హరిరేవ జగమని హరిణము ల్విహరించు హంసోహమని హంస లాలకించు
**వృక్షములు తాత్త్విక స్థైర్యవృత్తి నలరు**
**శాశ్వత రసప్రవృద్ధి నోషధులు వెలయు**
**నేమి చెప్పుదు నవ్వన భూమిలోన**
**సంకులములైన మునిజనాశ్రమములందు**" - శుకచరిత్ర 2-21

ఈ పద్యంలో వనవర్ణన అనన్యసామాన్యంగా ఉంది. కవి చిలుకల చేత చిదహం, చిదహం అని; పావురాల చేత బ్రహ్మోహం అని; శారికల చేత సర్వం ఆత్మ అని; అళులచేత అఖిలం

అద్వయం అని; కోయిలలచేత ఆత్మాబ్రహ్మ అని; నెమళ్లచేత ఓం ఇతి అని; హరిణాలచేత హరిరేవ జగం అని; హంసలచేత హంసోహం అని; పలికించి, వృక్షాలకు తాత్త్వికస్థైర్యాన్ని గలిగించాడు. ఇలా శుక, పిక, శారికలు ఎందుకు అలా పలుకుతున్నాయో తరువాతి పద్యంలో తెలియ జేశాడు.

**"మునిజనుల యాశ్రమంబుల**
**వినబడు తత్త్వంపు వాక్యవిసరమ్ములు దా**
**విని శుక శారికలీగతి**
**వినుపింపగ నేర్చె నేర్పువిధినిట్లగుటన్.** " – శుకచరిత్ర 2–22

వనంలోని ఆశ్రమాలలో మునిజనులు నివసిస్తూ ఉండడం వల్ల నిరంతరం తాత్త్విక వాక్కులు కలిగి దైవధ్యానంలో మునిగి ఉండడం వల్ల వారిని అనుకరిస్తూ అవి అలా తత్త్వవాక్యాలు పలికాయని చెప్పడం సమంజసంగా ఉంది. కోయిలలు, నెమళ్లు శారికలే ఇలా చిత్సుఖాన్ని నింపే తత్త్వమయోక్తుల్ని పలుకుతున్నప్పుడు, "అవ్వన భూమి జేరిన యొయారులు శూరులు గాక యుందురే" అన్నాడు. ఒయారులు శూరులు అయ్యారనడంలో కథా సూచన ఉంది. ఘృతాచి అనే అప్సర స్త్రీ తన ఒయ్యారంతో వ్యాసునిలాంటి వ్యక్తిని జయించి మన్మథతాపంతో పరితపించేలా చేసింది. శుకుని లాంటి తత్త్వశూరుని జన్మకు కారణమయింది.

అవసరంలో రకరకాల ఫలాల్ని, శుకశారికల్ని, నికుంజపుంజాల్ని, కుసుమాలను, భృంగాలను, హరిణాలను, కోకిలల ఆటోపాలను, విటపివిటప్పాలను, గడ్డితినే మృగాలను, రాజహంసలను వర్ణించాడు. మన్మథ బాణాలతో మైమరచి విహరించే మానినీ మణులకు శుక శారికారవాలు ఉద్దీపకాలుకాకపోగా అవి వారి చెవులకు ములుకులయ్యాయి. ఈశ్వరుడు అంబికతో ఆ ఉద్యానవనానికి రావడానికి తగిన వాతావరణాన్ని కవి కల్పించాడు. తన నామస్మరణ జరిగే చోటికి ఈశ్వరుడు అంబికతో రావడం, భక్తుల కోరికల్ని తీర్చడం పరిపాటి.

**"ఆ కర్ణికారవనరవ**
**మాకర్ణన మొంది శంభు దంబికతో గ్రీ**
**డా కీర్ణ మతిం జనునెడ**
**నాకీర్ణంబై వసంతమందు వసించెన్.**" – శుకచరిత్ర 2–25

వనరవము ఆకర్ణించాడు అనడం వల్ల తనను గూర్చి ప్రకృతి ఆలపంచే స్తుతిగీతాల్ని విన్నాడని అభిప్రాయం. అందువల్ల ఆనందం కలిగింది. ఆనందం కలిగి నప్పుడు అంబికతో చేరి క్రీడించడం పరిపాటి. ఆనందపారవశ్యంలో శివుడు భక్తుల కోరికల్ని ఈడేరుస్తాడు. ఈశ్వరుని వనవిహారం తర్వాత వ్యాసుని రాక, తపస్సు వర్ణింపబడ్డాయి. అంటే నాటకంలో

పాత్ర ప్రవేశానికి ముందు పాత్ర ప్రవేశోచిత రంగస్థలాన్ని ఏర్పాటు చేసినట్లు కవి చక్కని అటవిక వాతావరణాన్ని ఏర్పరచాడు. ఇది కథాకథననైపుణికి చక్కని నిదర్శనం.

రామమూర్తికవి చేసిన వనవర్ణనలో ఋష్యాశ్రమ వర్ణన కన్పిస్తుంది. ఈ వర్ణన నన్నయ మొదలు అనేకులు చేశారు. కర్ణికావనంలో **నిగమాంతసుకృతాంతరవిచారం** సాగుతోందని రామమూర్తికవి వర్ణించాడు.

అలాగే ఈ కవి ఆశ్రమ వాసాన్ని వర్ణించేటప్పుడు అయ్యలరాజు రామభద్ర కవిని చరిగొండ ధర్మన్నను అనుసరించాడా అన్నట్లు ఈ వనవర్ణన సాగింది. అయ్యలరాజు రామభద్రకవి రామాభ్యుదయంలో అగస్త్యాశ్రమాన్ని వర్ణిస్తూ ఆ వనంలో మయూరాలు ఉపనిషద్వాక్యాల్ని ఉచ్చరిస్తూ ఉన్నాయని, శారికలు తర్కశాస్త్రాల్ని వక్కాణిస్తున్నాయని, కలకంఠాలు షడంగాల్ని తెలుపుతున్నాయని, హంసలు ఉభయమీమాంసలను పరిశీలిస్తూ ఉన్నాయని వర్ణించాడు. ఇంకా చిలుకలు శ్రౌతమార్గాల్ని, కురంగాలు పురాణార్థాల్ని చెబుతున్నాయన్నాడు. సామజాలు సామగానాన్ని వింటున్నాయని వర్ణించాడు.

చరిగొండ ధర్మన్న **చిత్రభారతం**లో ఋష్యాశ్రమాన్ని వర్ణించిన తీరు రామమూర్తి కవి రచనలో స్పష్టంగా కనిపిస్తుంది. చిలుకలు "**హరేర్న కించిద్వ్యతిరిక్తమస్తి**" అని, శారికలు "**వాసుదేవస్సర్వమితి**" అని ఇందిందిరాలు "**నారాయణాత్పరం నాస్తి**" అని, పికాళి "**నమో వేదాంతవేది**" అని పలుకుతున్నాయని వర్ణించినట్లే రామమూర్తి కవి కూడా అద్వైతభావ స్ఫోరకాలైన మాటల్ని పక్షి, మృగాదులచేత పలికించాడు.

**3.2.1.4 వనవిహారం :**

కావ్యాలలో వనవర్ణనతో బాటు ఋతువర్ణన చేయడం కూడా కవులకు పరిపాటి. వసంత ఋతువులో వనాల్లో విహరించడం రివాజు కాబట్టి వనవర్ణనసందర్భంలో ఋతువర్ణను కూడా పేర్కొనడం సమంజసం. శుకచరిత్రలో శివుడు పార్వతితో కలిసి నందివాహనారూఢుడై కర్ణికార వనానికి వచ్చి సంతోషంగా గిరులలో, తరులలో ఝురులలో విహరించాడు. ఈశ్వరుడు ఎలా విహరించాడో ఈ క్రింది పద్యంలో కళ్లకు కట్టినట్లు కవి వర్ణించాడు.

**"ఒక్కెడ వృక్షముల్ గనుచు నొక్కెడ పక్షుల లక్ష్య పెట్టుచున్**
**ఒక్కెడ మంజరుల్ గొనుచు, నొక్కెడ కుంజములందు దూరుచున్**
**ఒక్కెడ నీడలెన్నుచును నొక్కెడ నాడుచు బాడుచున్ గడున్**
**సొక్కుచు నార్యతో సరస సూక్తులు దెల్పుచు శంభుడిట్లనున్.**" – శుకచరిత్ర 2–30

వృక్షాల్ని చూడడం, పక్షుల్ని లక్ష్య పెట్టడం, మంజరుల్ని కొనడం వంటి మాటలకు మరొక అర్థాన్ని ఊహించడానికి అవకాశం ఉంది. వృక్షాలు తాత్త్విక సంపద కలిగి ఉన్నాయని వనవర్ణనలో తెలిపాడు. అందుకే వాటిని దగ్గరకు వెళ్లి చూస్తూ ఉన్నాడు. పక్షులు నిరంతరం ధ్యాన నిమగ్నలై ఉన్నాయి కనుక వాటిని అలక్ష్యం చేయలేదు. "మంజరుల్ గొనుచు" అనడంలో రెండు విధాలైన అర్థాలు స్ఫురిస్తాయి. వనవిహార సమయంలో పుష్పాపచయం చేయడం పరిపాటి. దాన్ని స్ఫురింప జేయడానికి ఆ మాటలు ప్రయోగించి ఉండవచ్చు. ఇక రెండోది పుష్పాలు తమంత తాము తమను సమర్పించుకొన్నప్పుడు ఈశ్వరుడు వాటిని సంతోషంగా అంగీకరించాడు.

వనవిహారసమయంలో ప్రేయసీప్రియుల శృంగారచేష్టలు వర్ణింపబడ్డాయి. ఆదిదంపతులైన శివపార్వతుల వనవిహారంలో కూడా వారి నర్మోక్తులు చోటు చేసుకొన్నట్లు రామమూర్తి కవి వర్ణించాడు.

**"వనిత! నిశ్చల తపోవని తలంపలర నీ–వని దపోవ్రతులుండువసతు లివియు**
**కొమ్మయోకొమ్మగైకొమ్మమాపువులివి – గొమ్మని వ్రాలు పూగొమ్మలివియు**
**గలికినిత్యంబు నాకటికి భక్షింపుట – కలికి నింపుదయింపు కళికలివియు**
**వెలదియల్లచట దీవెలదరికూయుకో – వెలదిరంబుగ జేరు విదుదులివియు**

**నెలతవలపుదెలుపు నెలతళుక్కులకుల్కి**
**నెలతలతమ మారునెలవులివియు –**
**మగువ మరుడు దగుల మగలతో బొగలుచు**
**మగువ లరసి నిలుచు మఱుగు లివియు."** – శుకచరిత్ర 2–31

నిశ్చలమైన తపోవనంలో తపోవ్రతులు నివసిస్తారు. తమ పూలను తీసుకొమ్మని కొమ్మల్ని వాల్చే పూలచెట్లుంటాయి. కోయిలలు తియ్యగా పాడుతుంటాయి. వెన్నెల తళుకులకు ఉలిక్కి పడే స్త్రీల శరీరభాగాలపై ఉండే మారుని నెలవులుంటాయి. మన్మథుడు తనను పట్టుకోబోగా మగలతో పొగులుచు తిరిగే మరుగు ప్రదేశాలు అవ్వన భూమిలో ఉన్నాయని ఈశ్వరుడు చెప్పినట్లు వర్ణింపబడింది. ఇంకా కోయిల కూతలకు, ఉలికేవారు, గజయానాలలో తమ నడకలను కలిపే వారు, ఊయలలో ఊగేవారున్నారని తెలిపాడు. అంటే మన్మథావస్థలో మునిగే స్త్రీలు అక్కడున్నారని శివుడన్నాడు. శివుని మనస్సును గ్రహించిన పార్వతి వారు మీ పాదాల చెంత ఎల్లప్పుడూ ఉండడం వల్ల మన్మథుడు వారిని ఏమీ చేయడని అంది.

**"అమ్మగువలు మీశత్రుని**
**యమ్ముల పోటులకు వెఱచి యనిశము మీ పా**

**దమ్ముల మరుగును జేరగ**
**నమ్ముకయున్నారలిచట నానాగతులన్.** " - శుకచరిత్ర 2-33

ఇలా ఈ ఆశ్వాసంలో 31వ పద్యం నుండి 48 పద్యం వరకు సాగిన గౌరీశంకరుల నర్మోక్తుల్లో శంకరుడు మన్మథావస్థను కలిగించే మాటలు చెబితే దానికి తిరుగుడుగా గౌరి మాటలుండడం ప్రతి పద్యంలోనూ శంకరుని ఆశ్రయించిన వారిని మన్మథతాపం ఏమీ చేయదని చెప్పడం కనిపిస్తుంది.

శివుడు మోదుగుపూలను, చిలుకలను, పద్మాలను తేటులను, తెల్లనిదీవులలాంటి పిరుదులను, కలువపూలను, చక్రముల మించు పార్వతి కుచాల్ని వర్ణించి మలయ వాయువులు తమను కూడడానికి వచ్చాయని తెలియజేశాడు.

ఇంత వరకు పరిశీలించిన వనవర్ణన, వసంత ఋతువర్ణన, వనవిహారం మొదలైనవి ప్రబంధోచితవర్ణనలు. పరశురామపంతుల రామమూర్తి కవి ఈ వర్ణనల్ని లక్ష్యలక్షణదృష్టితో చేసినా, శృంగారరసోద్దీపనం కలుగని రీతిలో వర్ణనలు సాగాయి.

**3.2.1.5 కాలసూచక వర్ణనలు :**

ప్రకృతి వర్ణనలో కాలసూచక వర్ణనలు ప్రథమ స్థానం వహిస్తాయి. రామమూర్తికవి సూర్యచంద్రాదుల వర్ణనలనుగాక ఋతువర్ణనలు కూడా చేశాడు. సృష్టికర్త మనోజ్ఞంగా రచించిన మహాకావ్యం ప్రకృతి. సూర్యచంద్రాదులు, ఋతువులు ఇవన్నీ దైవసృష్టియే. ప్రకృతి వర్ణనలో ఋతు వర్ణన చాలా ముఖ్యమైనది. వేదాలలోనే ఈ ఋతువర్ణనలు ఉన్నాయి.

"**యత్పురుషేణ హవిషా దేవా యజ్ఞమతన్వత ।**
**వసంతో అస్యాసీదాజ్యం గ్రీష్మ ఇధ్మశ్శరద్ధవిః ॥**"

- ఋగ్వేదం 10వ మండలం 90 వ సూక్తం.

అంటే పురుషుడనే హవిస్సుతో దేవతలు యజ్ఞం చేసినపుడు దానికి వసంతం నేయి కాగా గ్రీష్మం సమిధ, శరత్ హవిస్సు అయింది. ఋతుప్రశంస వేదవాఙ్మయంలో ఎలా ఉందో మల్లాది సూర్యనారాయణ శాస్త్రి వివరించారు "ముప్పది ముహూర్తములొక యహోరాత్రము, అట్టి వఱువదియొక ఋతువు. ఒక ఋతువు మరియొక ఋతువును వెను వెంటనే ప్రేరేపించును. ఋతువులకు ప్రభువు సంవత్సరము. సంవత్సర స్వరూపుడైన కాలపురుషుని యాజ్ఞను ఋతువులు నిర్వర్తించు చుండును. వైదిక సంపుటం - (1982 డిసెంబర్ ఎడిషన్).

**3.2.1.5.1 వసంత ఋతువర్ణన :**

**ఋతు రాజో వసంతః** అన్నారు పెద్దలు. ఈ వసంత ఋతువును అన్ని కావ్యాల్లో నాయికా

నాయకుల వనవిహారఘట్టంలోనే వర్ణించడం విశేషం. ఈ ఋతువులో ఎండ తీవ్రత గాని వర్షాలుగాని లేకుండా సర్వప్రకృతి చిగిర్చి పుష్పించి ఉంటుంది.

విన్నకోట పెద్దన రచించిన కావ్యాలంకారచూడామణి తృతీయాశ్వాసంలో అష్టాదశవర్ణనల్ని పేర్కొంటూ ఋతువర్ణన సందర్భంలో ఈ వసంత ఋతువు వర్ణన చేశాడు. – 3–99

**"అంకుర పల్లవ పత్ర స మాంకిత ముకుళ ప్రసూన హారి ఫలములన్**
**బొంకములగు వనములు నిశ్శంకముగ నుతింపబడు వసంతమునందున్."**

ఈ ఋతువర్ణన చేసేటప్పుడు అవసరాన్ని బట్టి ఋతు స్వభావాన్ని వర్ణించాలి. రామమూర్తి కవి ఈ వసంత వర్ణన చేస్తూ హృద్యమయిన పద్యం రచించాడు.

**"సహకార ఫల సార వహ కారణ విహార – బహుకీర వచనారవహిత శుభము**
**మందార సుమనోమరందాను పాన సా – నందానధీనమిళిందరవము**
**సురసాల నవపల్లవ రసాను భోగ ప్రి–యరసాలయవన ప్రియాలు వనము**
**మదనాతికేళి క్రమదనాథ నాళీక – వదనాప్తవల్మీక సదనయుతము**
**సహరహోదీప్త హితదావదహన దహిత**
**చందనాగరు కర్పూర జనిత ధూప**
**వాసనా భాసమాన ప్రవాస దేశ**
**మగుచు దనరారు మదు మాసికావసరము."** – శుకచరిత్ర 2–26

మామిడి పళ్లను తిని విహరిస్తూ చిలుకల్ని, మందారసుమాలలోని మరందాన్ని గ్రోలి ఆనందంతో తిరిగే తుమ్మెదల్ని, మామిడి చివుళ్లను తిని వనానికి ప్రియాన్ని చేకూర్చే కోయలల గానాన్ని, మదనుని విజృంభణలనుండి రక్షించే వల్మీక సదనాల్ని, ఎల్లప్పుడూ చందన, అగరు, కర్పూరాదుల్ని వెలిగించడంవల్ల వ్యాపించిన ధూప వాసనలతో ప్రకాశించే నివాస స్థలాన్ని పై పద్యంలో వర్ణించాడు.

వసంత ఋతువు మదనోద్దీపకంగా ఉంటుంది. కాని ఇక్కడ వసంత ఋతు వర్ణనల్లో మన్మథుని విజృంభణను అదుపులో పెట్టే వల్మీక సదనాలు ఉన్నాయనడంలో చక్కని ఔచిత్యం పాటింపబడింది. వల్మీకాలను సదనాలుగా చేసుకొని తపస్సు చేసుకొనే వారికి అలవాలమైన స్థలం కాబట్టి అక్కడ మన్మథుడు విజృంభించడానికి అవకాశం లేదు. అదీగాక అక్కడ శివుడు సంచరించే స్థలం కాబట్టి మన్మథునికి విచ్చలవిడిగా చరించే అవకాశం లేదు.

**3.2.1.6 పుత్రోదయ వర్ణన :**

శుకచరిత్ర కావ్యంలో ముక్తికన్య జననం, శుకజననం వర్ణింపబడి ఉన్నాయి. ముక్తికన్యా

జననం విస్తృతంగా, శుకజననం మిక్కిలి పరిమితంగా వర్ణింపబడ్డాయి. విన్నకోట పెద్దన తన కావ్యాలంకారచూడామణిలో ఇలా అన్నాడు.

**"మిత్రానందోదయమున మిత్రత్రసనంబు శుభనిమిత్తంబును స**
**త్పాత్రకృతవితరణంబును బుత్రోదయమందుఁదగ పొగడగవలయున్** " – 3-129

పుత్రోదయానికి పూర్వం గర్భవర్ణన చేయడం పరిపాటి. రామమూర్తికవి కూడా తన శుకచరిత్ర కావ్యంలో ప్రజ్ఞావతి గర్భవర్ణన చేశాడు. కాని గర్భవర్ణనలో ఏ కవి చేయని విధంగా తాత్త్వికాంశాల్ని జోడించి వర్ణించడం ఈ కవి ప్రత్యేకత.

**"సత్కర్మ చరణాంబు జాతంబు లేపార – ఘనతరోపాస్తి జంఘములు దనర**
**కలుష ప్రజాక్షయ కరభోరువులు మీర – భావశుద్ధి నితంబభరములమర**
**కర్మపరిత్యాగ గగన మధ్యంబొప్ప – దాత్త్విక వాసనోదరము మెఱయ**
**గురు వివేకస్తనకుంభముల్ రంజిల్ల – వైరాగ్యకరపల్లవములు మెఱయ**

**శమదమోపరతిక్షమాశ్రద్ధలును గ**
**ళాస్యదృక్కర్ణనాసలై యలరనిట ల**
**మురుసమాధానము ముముక్షుతోత్తమాంగ**
**మైదొరయగర్భిణీ చిహ్నలతివ కొదవె.** " – శుకచరిత్ర 1-108

గర్భం ధరించినపుడు స్త్రీ ప్రతి అంగంలోనూ మార్పు వస్తుంది. ఈ పద్యంలో ప్రతి అంగాన్ని వేదాంతపరంగా వర్ణించడం గమనించవచ్చు. సత్కర్మలనే పాదాలు, ఉపాసన అనే పిక్కలు, పాపాల్ని పోగొట్టే చేతులు, భావశుద్ధి అనే తొడలు, కర్మ పరిత్యాగమనే నడుము, తాత్త్విక వాసన అనే ఉదరం, వివేకమనే స్తనకుంభాలు, వైరాగ్యమనే కరపల్లవాలు, శమమనే గళం, దమము అనే ముఖం, ఉపరతి అనే కళ్లు, క్షమ అనే చెవులు, శ్రద్ధ అనే ముక్కు, ముముక్షుత అనే ఉత్తమాంగములతో ప్రజ్ఞాసతికి గర్భసూచనలు పొడగట్టాయి అన్నాడు. పై వర్ణనలో నిగూఢమైన భావం ఇమిడి ఉంది. ఈ పద్యంలో సాధనచతుష్టయంలో ఒకటైన **శమాది షట్కసంపత్తి** ప్రస్తావన ఉంది. శమం, దమం, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధానం అనేవి శమాది షట్కాలు. సత్కర్మల చేత పాపాల్ని పోగొట్టుకొని, అవివేకాన్ని పోగొట్టుకొని వివేకాన్ని పొంది, సాధనచతుష్టయాన్ని ఆచరించి బ్రహ్మానందస్వరూపమైన సచ్చిదానంద సద్రూపాన్ని చూడడం ఈ పద్యంలో కవి వర్ణించాడు. మనోనిగ్రహంతో సమస్త ఇంద్రియాల్ని అయుక్త వ్యాపారం నుండి తొలగించి, నిషిద్ధ కామ్యకర్మలను వదిలి, సుఖదుఃఖాలు అనే సమస్త ద్వంద్వాలను సహించుకొని, గురువాక్య వేదవాక్యాలలో శ్రద్ధ కనబరచి, ఆలస్యాది

విక్షేపాలులేని చిత్తాన్ని, పరతత్వానికి అభిముఖంగా చేసుకొని బ్రహ్మానంద స్వరూపాన్ని సందర్శించడం అనే వేదాంత విషయాలను ఈ పద్యంలో చక్కగా పొందుపరచాడు. ముక్తికన్యా జననం సర్వపాప పరిహారమని, మోక్షసాధనకు మార్గమని కవి సూచించాడు. స్త్రీ అంగాంగ వర్ణనను చేసి, శృంగార భావాన్ని రేకెత్తించిన కవులకు, అంగాంగ వర్ణనలో యోగాన్ని ప్రతిపాదించిన రామమూర్తి కవికి ఎంతో తేడా ఉంది. ఈ కవి ప్రధానధ్యేయం వేదాంత–ప్రతిపాదనం కాబట్టి ఇలాంటి వర్ణనలు చేయవలసి వచ్చింది.

మరొక సీసపద్యంలోని ప్రతిపాదం మొదటి భాగంలో వేదాంత భావం, రెండో భాగంలో గర్భచిహ్నాలు వర్ణింపబడి ఉన్నాయి.

**"దేహాత్మమత ముఖ తేజంబు వెలిగాగ – వెలది మోమున తెల్వి వెల్లనయ్యె**
**ప్రాణాత్మచిత్తుల భావంబు నలుపొంద – నాతిచూచుకములు నలుపునొందె**
**కరణాత్మకుల పట్టు గాలి ధూమము దోప – కలికియూరుల ధూమ కళలు దోచె**
**మానసాత్ముల యభిమానవృద్ధియుగంద – విమలాంగి యుదరంబు వృద్ధి బొందె**

**మతిమయాత్ముల తప్పులు మంటగలయ**
**సతికి గడుమంటి రుచులును సంభవించె**
**నేమి చెప్పుదు ప్రజ్ఞాంగనామణికిని**
**యుదరమున ముక్తి సతివృద్ధి నొందుచుండ."** – శుకచరిత్ర 1–110

గర్భంతో ఉన్న స్త్రీ ముఖం పాలిపోయి తెల్లనవడం, చూచుకాలు నలుపొందడం, ఊరువులు ధూమకళలు తోచడం, ఉదరం రోజు రోజుకు వృద్ధి పొందడం, మట్టిపై ఆశలు కలగడం సహజం. వాటికి తాత్త్విక భావాల్ని జోడించి వ్రాయడం ఈ కవికే చెల్లింది.

వ్యాసుని శుక్లం అరణిలో పడిందనీ, దాన్ని మథించగా అందులో నుండి శుకుడు పుట్టాడనీ కవి తెలియజేశాడు. శుకుని జననం అసహజంగా వర్ణింపబడింది. ఈయన జన్మించినపుడు పొడమిన శుభనిమిత్తాలను రెండు పద్యాల్లో కవి వర్ణించాడు.

**"హరి ముదమందె సాంబశివుదారసె నబ్జజు దుత్సహించె ని**
**ర్జరపతి మెచ్చె దేవతతి సంభ్రమమొందె మునీంద్ర సంఘముల్**
**మొఱసె ధరిత్రి రంజిలె సముద్రుడు బొంగె నరోరగాది భూ**
**చరములు మోదిలెన్ శుకులు సాత్యవతేయున కుద్భవింపగన్. "** – శుకచరిత్ర 2–115

**"కురిసెన్ బువ్వుల వానలు**
**మొఱసెన్సురభేరులమరముగ్ధల నటన**

**ల్మెరసెన్సిద్ధుల కూటమి**
**మొరసెం గిన్నరుల గానములు రంజిల్లెన్.**" – శుకచరిత్ర 2–116

ముక్తికన్య పుట్టినపుడు కలిగిన శుభనిమిత్తాలకు శుకుడు పుట్టినపుడు కలిగిన శుభసూచకాలకు వ్యత్యాసం ఉంది. ముక్తికన్య జననం తత్త్వప్రతిపాదకంగా నర్మగర్భంగా ఉంటే, శుకుని జననం వాచ్యంగా, సర్వజనామోదంగా, ప్రకృతి సహజంగా ఉంది.

**3.3 పాత్రపోషణ :**

కావ్యంలో పాత్రపోషణకు ఎంతో ప్రాధాన్యత ఉంది. భిన్న వ్యక్తుల మనస్తత్వ ప్రవర్తనా వైవిధ్యం పాత్ర పోషణకు జీవనాడి. ప్రబంధ కవులు ప్రబంధోద్దిష్ట ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకొని పాత్ర పోషణ చేశారు. మానవ స్వరూప స్వభావాల్లో దాగిన రహస్యాల్ని కూడ అనుసంధించి కవి తన పాత్రల ద్వారా బహిర్గతం చేస్తాడు. కవికి బ్రహ్మత్వాన్ని ప్రసాదించే శక్తి పాత్ర చిత్రణకే ఉంది. పాత్ర నిర్మాణ కౌశలం మహాకవుల ప్రతిభకు గీటురాయి. కవి పాత్రలను కథాభిముఖంగా చిత్రిస్తాడు కాబట్టి కథార్థం వికసిస్తుంది. కథార్థం అంటే కావ్యంలోని ధర్మ ధ్వని. కావ్యంలో పాత్ర చిత్రణ అత్యంత కీలకమయింది. ఇతివృత్తం కావ్యానికొక అస్థిపంజరమైతే పాత్రలు జీవం లాంటివి. పాత్ర చిత్రణలోని ప్రాముఖ్యాన్ని గూర్చి చెబుతూ అర్నాల్డ్ బెన్నట్ Arnald bennett అనే ఆంగ్ల విమర్శకుడు "The foundation of good fiction is character creating and nothing else" (Dictionary & World literary Terms, P-51)" అన్నాడు. దీన్నిబట్టి పాత్ర చిత్రణ కావ్యానికి పునాదిలాంటిదని చెప్పవచ్చు.

పాత్ర చిత్రణలో స్వరూప చిత్రణ, స్వభావ చిత్రణ ఉంటాయని డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం గారు తెల్పారు. వీరు వీటిని వివరిస్తూ "ఒకటి తను ప్రధానమైనది. మరియొకటి గుణ ప్రధానమైనది. ఒకటి పాంచభౌతిక పరిణామ వర్ణనాత్మక మైనది. మరియొకటి ప్రాణుల యాంతర పరివర్తన నిరూపణాత్మకమైనది" ప్రథమాంధ్ర మహాపురాణము – ప్రబంధకథా మూలము, పుట – 489 అన్నారు.

ఇలా స్వరూప, స్వభావ చిత్రణను కవి రెండు పద్ధతులతో చేస్తుంటాడు. 1. ప్రత్యక్ష పద్ధతి, 2. పరోక్ష పద్ధతి. ప్రత్యక్ష పద్ధతిలో పాత్రల స్వరూప స్వభావాదుల్ని కవే స్వయంగా వర్ణిస్తాడు. పరోక్ష పద్ధతిలో కవి పాత్రల స్వరూప స్వభావాలను ఆ పాత్ర చేతనో లేదా ఇంకొక పాత్ర చేతనో వ్యక్తం చేస్తాడు.

ఈ దృష్టితో చూసినపుడు రామమూర్తి కవి ప్రత్యక్ష, పరోక్ష పద్ధతులను శుక చరిత్రలో ప్రయోగించాడని చెప్పవచ్చు. కావ్యంలోని పురుష పాత్రలలో వ్యాసుడు, శుకుడు, జనకుడు, పంచశిఖుడు, నారదుడు, శంకరుడు, మాయామతవాదులు, స్వయంవరాధికారి పేర్కొన

దగినవారు. స్త్రీ పాత్రలలో ఘృతాచి, ముక్తికన్య, ప్రజ్ఞాసతి, గౌరి, ఆకాశగంగలు పేర్కొనదగినవారు.

**3.3.1 వ్యాసుడు :**

ఇతడు సత్యవతి కొడుకు. ఈయనకు పారాశర్యుడు, బాదరాయణుడు, ద్వైపాయనుడు, వేదవ్యాసుడు అనే పేర్లున్నాయి. బాదరాయణుడు, కృష్ణవ్యాసుడు భిన్నులని ఒక సిద్ధాంతం ఉంది.

కృష్ణవ్యాసుడు మేరుపర్వతంపై గల కర్ణికార వనంలో తపస్సు చేయడానికి వచ్చినపుడు కవి అతని రూపాన్ని, గుణాల్ని వర్ణించాడు.

**"నీల జీమూత సన్నిభ దివ్యవర్ణుండు - విమల భస్మాంచిత విగ్రహుండు**
**మహనీయ రుద్రాక్ష మాలికా భరణుండు - ప్రకట కృష్ణాజినాంబరధరుండు**
**నవతామ్రరుచి సమాన జటాకలాపుండు - నిగమాగమ విభాగ నిర్ణయుండు**
**లలిత కాంచన కమండలుదండధారుండు - ఘనపురాణ గ్రంథ కల్పకుండు**
**సకల దివిజ వినుత చరణుండు మునిజన**
**వరుడు భరత వంశ వర్ధనుండు**
**సద్గుణాశ్రయుండు సాత్యవతేయుడ**
**త్యంత హర్షయుక్తి నరుగు దెంచె."** - శుకచరిత్ర 2-50

నీలవర్ణం గల దేహం, శరీరమంతా తెల్లని భస్మం పూసుకొన్నవాడు, రుద్రాక్షమాలిక భరణుండు, కృష్ణాజినాన్ని బట్టగా కట్టుకొన్నవాడు. తామ్రవర్ణం గల జడలు గలవాడు, కాంచన కమండలాన్ని చేతిలో ధరించిన వాడు అని రామమూర్తి వ్యాసుని బాహ్యరూపాన్ని వర్ణించాడు. నిగమాగమ విభాగ నిర్ణయుడని, ఘనపురాణ గ్రంథ కల్పకుడని, మునిజన శ్రేష్ఠుడని, భరతవంశ వర్ధనుడని, సద్గుణాశ్రయుడని, వ్యాసుని ఘనతను వర్ణించాడు.

పద్యంలో 'భరత వంశ వర్ధనుడు' సాత్యవతేయుడు అనే సమాసాలు వ్యాసుని మహాభారత యుగం నాటి వ్యాసుడిగా నిర్ధారిస్తాయి. రామమూర్తి కవి చేసిన వ్యాసుని వర్ణన నన్నయ భారతంలోని వ్యాసుని తలపిస్తూ ఉంది. నన్నయ వ్యాసుని గూర్చి చెబుతూ అఖిల ధర్మమూర్తి అని, నిత్య సత్యవచనుడని, ఆదిమ బ్రహ్మకు గల సామర్థ్యంబు గలవాడని, పింగళ విశాల జటాచయం గలవాడని, హరినీల వినీల విగ్రహమరాళరుచుల్ గలవాడని చెప్పాడు.

వ్యాసుడు కర్ణికార వనంలో శివుని గూర్చి ఘోరతపస్సు చేశాడు.

**"పద్మాసనస్థుడై పాణి పంకజముల - నూరుమూలములపై నుండ జేర్చి**
**కాయ మధ్యమమును గళము శిరంబవ-క్రములుగా నిల్పి నేత్రములు మూసి**

**యంతర్బహిర్విషయంబుల వలన, బ్రా-ణములతో సకలేంద్రియముల మఱపి**
**మదిగూర్చి మదిని నెమ్మది జేర్చి నెమ్మది - నమహమునం దొదిగించి యహమునాత్మ**
**యందు లయము జేసి యాత్మ నప్పర శివు**
**నందు గలిపి పరశివైక్య సౌఖ్య**
**రతుల దగిలి యప్పరాశరతనయుండు**
**తనయు గోరి యుగ్రతపమొనర్చె.**" - శుకచరిత్ర 2-52

పద్మాసనం వేసుకొని, అహాన్ని ఆత్మయందు లయం చేసుకొని, ఆత్మను పరమశివుని యందు లయం చేసి తపస్సు చేశాడు. ఐక్య సౌఖ్యాన్ని అనుభవించాడు. ఆత్మజ్ఞానియై నిర్గుణతత్త్వజ్ఞాన యుక్తుడై తపం చేశాడు. ఇలా శీతల పవనాతపములకోర్చి చేసే వ్యాసుని తపస్సు మహా తాపసులకు ఆశ్చర్యాన్ని కలిగించింది. అతని తపస్సుకు మెచ్చి శివుడు ప్రత్యక్షమయ్యాడు. వ్యాసుడు సాష్టాంగనమస్కారం చేసి శివుని గొప్పగా స్తుతించాడు.

శుకచరిత్ర కావ్యంలో వ్యాసుని ప్రవేశంతోనే అతడు పుత్రుని కోరి ఘోర తపస్సు చేశాడని ఉంది. **అపుత్రస్య గతిర్నాస్తి** అని శ్రుతులలో చెప్పడం వల్ల తనకు పుత్రుడు కలిగితే పున్నామ నరకం నుండి తప్పిస్తాడని వ్యాసుడు భావించి పుత్రుని కోరుకొని ఉండవచ్చు. దేవీ భాగవతంలో వ్యాసునికి పుత్రులు కావాలన్న కోరిక ఎందుకు కలిగిందో వివరింపబడి ఉంది. వనంలోని పశుపక్ష్యాదులు తమ సంతానంపై కనపరచే ప్రేమానురాగాల్ని చూసి తనకు కూడా పుత్రులు కలిగితే బాగుండుననుకోవడం తత్పర్యవసానంగా తపస్సు చేసి పుత్రుని పొందడం వివరింప బడింది.

శివుడు ప్రత్యక్షమై వరం కోరుకోమంటే

"**అనల నయనా! వియన్మరు**
**దనల జలేలాభవీర్యుడామ్నాయ తపో**
**ధనుడమలతరుండగునా**
**తనయుండు గలుంగ వరము దయసేయగదే.**" - శుకచరిత్ర 2-79

అని తనయుని కోరుకొన్నాడు. అంటే పంచభూతాత్మకమయిన సుతుని కోరుకొన్నాడు. శివుడలాంటి సుతుడు జన్మిస్తాడని వరమిచ్చి వెళ్లాడు. ఆటపాటల మరగి మునిసూనులతో తిరగడాన్ని చూసి వ్యాసుడు.

"**ఓ కుమార యిట్లు వోకుమా రాపులు**
**దేకుమా రహస్య దేశికులకు**

**నీకు మారమణుని నెయ్యంబె తగునుగా**
**నీకుమారమణుల నెయ్యమేల.**" – శుకచరిత్ర 2–134

"**వచియించుమి వేదంబులు**
**ప్రచురించుమి సకల శాస్త్ర ఫణితులు భక్తిన్**
**రచియించుమి సత్క్రియలెద–**
**రుచియించుమి సద్వివేకరూఢి యొనర్పన్.**" – శుకచరిత్ర 2–135

అని శుకునికి బుద్ధులు చెప్పాడు. యోగం, సాంఖ్యం మొదలైన సత్‌శాస్త్ర జ్ఞానాన్ని, వైరాగ్యాన్ని ముక్తిమార్గాన్ని ఉపదేశించాడు. పుత్రేషణ వల్ల దుఃఖం కలుగుతుందని కవి చెప్పాడు.

"**తనయు డాకలి గొన్న దగు పెంపుగొనకున్న**
**తనకండ్ల బడకున్న దప్పికొన్న**
**నడుపులు రాకున్న నుడువులు లేకున్న**
**విడిబడి చనుచున్న గుడువకున్న**
**నోజ కల్గకయున్న నొకమాట వినకున్న**
**జదువులు శాస్త్రముల్ జదువకున్న**
**వడుగుగాకున్న వివాహమొందక యున్న**
**జారచోర క్రియల్ సలుపుచున్న**

**నబలుడైయున్న ననపత్యుడైన నప్ర**
**యోజకుండైన దారిద్ర్య యుక్తుడైన**
**దల్లిదండ్రుల ఖేదంబు దలప వశమె**
**గాన పుత్రేషణంబు దుఃఖంబె తలప.** " – శుకచరిత్ర 3–54

ఈ పద్యంలో సుతల వల్ల కలిగే 19 రకాలైన బాధల్ని కవి తెలియజేశాడు.

వ్యాసుడు తన కుమారునికి ఎంత జ్ఞానం నేర్పినా, బృహస్పతి దగ్గరికి పంపి సర్వశాస్త్ర పారంగతుని చేసినా తృప్తి లేకపోయింది. అందుకే తన కొడుకును జనకుని దగ్గరికి చేర్చి సంపూర్ణజ్ఞానసంపన్నుని చేయాలన్న సంకల్పంతో మిథిలానగరానికి పంపాడు. అక్కడ పెళ్లి చేసుకొని తిరిగి వచ్చిన కొడుకుని గాంచి సంభ్రమంతో తడబడ్డాడు. శుకుడు కొంతకాలం ముక్తికాంతతో గడిపి తండ్రి వద్దకు వచ్చి సాష్టాంగ ప్రణామం చేసి, ప్రారబ్ధం తీరిపోయిందని చెప్పాడు. వ్యాసుడు తనను వదలి పోవద్దని చెప్పినా వాయువేగంతో శుకుడు వెళ్లి పోయాడు.

వ్యాసుడికి శుకుని వియోగం భరింపరానిదయింది. సామాన్యునిలాగా ఏడ్చాడు.

ధర్మార్థకామమోక్షాలనే చతుర్విధపురుషార్థాలలో 'కామం' మూడోది. 'కామి' గానివాడు మోక్షగామి గాడు' అనే వాక్యం కూడా కామ ప్రాముఖ్యాన్ని తెలియ జేస్తుంది. కామం సృష్టి హేతువు. కామం ధర్మానికి కట్టుబడితే లోకకళ్యాణహేతువై వ్యక్తి జీవితాన్ని పండిస్తుంది.

దేవకాంత అయిన ఘృతాచి అందం వ్యాసుని ఉక్కిరిబిక్కిరి చేసింది. ఆమె పొందుకోసం, పిలుపుకోసం, కౌగిలింతకోసం పరితపించాడు. ఇలా పరితపించడాన్ని కవి సమర్థిస్తూ ఉన్నాడు.

**"ధారుణి విప్రపుంగవులు ధార్మికులైన మోక్షమార్గ ని-**
**ష్కారతినధ్వరక్రియలు సల్పుట దివ్య సుఖప్రదంబె యో**
**దారక మంచుగైకొని పదంపడి నాకముకేగి యిట్టి బృం**
**దారక వారకామినుల తాలిమి నొందుచు నుందురే గదా."** – శుకచరిత్ర 2–98

అనడంలో కవి హృదయం స్పష్టమౌతుంది. కాని నిగమాగమాల్ని క్షుణ్ణంగా ఒంట బట్టించుకొన్నవాడు, ఘనపురాణగ్రంథకల్పకుడు, సకలదివిజనుతచరణుడు అయిన వ్యాసుడు స్త్రీ కోసం పరితపించడం ఇక్కడ గమనార్హం.

చిలుకను కౌగిలించి, మోవి నొక్కి ఆమెతో కూడినాడని చెప్పడం వల్ల వ్యాసుని వ్యక్తిత్వానికి న్యూనత కలుగుతుంది. అగ్నిచికీర్ష అంటే అగ్నిని పుట్టించాలన్న కోరిక. అగ్ని యజ్ఞం చేయడానికి ఉపయోగపడుతుంది. సత్పురుషుడు అగ్ని వంటి వాడు. గార్హపత్యాగ్ని నుండి ఆహవనీయాగ్ని దక్షిణాగ్ని పుడతాయి. ఒక అగ్ని నుండి వేరొక అగ్ని పుట్టినట్లు తండ్రి వలన కొడుకు పుడతాడు. బ్రహ్మచారి అగ్నికార్యం చేయనక్కర లేదు. గురువుగారి అగ్నిలోనే మూడు సమిధలను వేస్తాడు. సంన్యాసికి అగ్నికార్యంతో పనిలేదు. వ్యాసుడు అగ్నిచికీర్షతో అరణిని మథించాడంటే ఆయన గృహస్థుడో వానప్రస్తుడో అయి ఉండాలి. గృహస్థులు, వానప్రస్థులు అగ్నిని కలిగి, అగ్నికార్యం అంటే యజ్ఞం చేస్తారు.

వ్యాసుడు జీవన్ముక్తుడు, యోగసిద్ధుడు, కర్మయోగి, స్థితప్రజ్ఞుడు, జ్ఞానయోగి, తత్త్వజ్ఞుడు, ఉత్తమదేశికుడు సర్వమానవహితం కోరేవాడు, వేదపండితుడుగా శుకచరిత్రలో దర్శనమిస్తాడు. వ్యాసుడు శుకునకు ముక్తి మార్గాన్ని ఉపదేశించాడు. సద్గురుమహిమను తెలియజేశాడు. ఆయన మహాయోగిగా సద్గురుడుగా ఈ క్రింది అంశాలను తెలియ జేశాడు. గురుమహిమ, గురుధ్యానం, శిష్యలక్షణం, ఉపాసనా క్రమం, బాహ్యాభ్యంతరపూజాక్రమం, స్మరణలక్షణం, యోగలక్షణం, యమ, నియమాసన ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణా సమాధులు, అణిమాద్యష్టసిద్ధులను బోధించాడు. సాంఖ్య, తారక, అమనస్కయోగాలను, జీవపరమహంస, లక్షణాదుల్ని చెప్పి ఐక్యభావాన్ని బోధించాడు.

**3.3.2 శుకుడు :**

శుకచరిత్రలో కథానాయకుడు శుకుడు. కావ్యం ఏకనాయకాశ్రయంగా సాగింది. వ్యాసుని వృత్తాంతం, జనకుని వృత్తాంతం, పంచశిఖుని వృత్తాంతం ఉన్నా అవన్నీ కథానాయకుడయిన శుకుని ఆశ్రయించి, చెట్టుకు అల్లుకొన్న లతలలాగా ఉన్నాయి. నాయకునికి మహాకులీనతను ఆపాదించడానికి, శుకుని గొప్పదనాన్ని చాటడానికి మహాధర్మవేత్త, యోగి అయిన వ్యాసుని వృత్తాంతం చెప్పవలసి వచ్చింది. అలాగే అనపత్యతవల్ల బాధపడుతున్న జనకుడికి కర్తవ్య బోధ చేసి, అతని ద్వారా ముక్తికన్యను పొందడానికి తగిన బీజం పంచశిఖ వృత్తాంతంలో కన్పిస్తుంది. జనకుడు యోగి. సమస్తతత్త్వజ్ఞానసంపన్నుడు. అతని కుమార్తె ముక్తికన్యను భార్యగా పొందడానికి అర్హుడు శుకుడే. ఇలా కావ్యంలోని కథలన్నీ శుకుని చుట్టూ అల్లుకొని ఆయన్నే నాయకునిగా నిరూపిస్తున్నాయి.

కావ్యంలోని నాయకులు వారి వారి లక్షణాల్ని బట్టి ధీరోదాత్తుడు, ధీరోద్ధతుడు, ధీరలలితుడు, ధీరశాంతుడని నాలుగు రకాలు. ప్రతాపరుద్రీయంలో

**"ఉదాత్త ఉద్ధతశ్చైవ లలితశ్శాన్త ఇత్యపి ।**
**ధీర పూర్వా ఇమే పూర్వేశ్చత్వారో నాయకాః స్మృతాః ॥"** – అని చెప్పబడింది.

శుకచరిత్రలోని నాయకుడు శుకుడు ధీరశాంతుడు. "సామాన్య గుణ భూయిష్ఠులై యుండు వణిక్ ద్విజాదులు ధీరశాంతులు, "ధీరుడై శాంతుడై యుండువాడు ధీరశాంతుడని వ్యుత్పత్తి " (సారగంధర చరిత్ర సమగ్ర సమీక్ష. పుట–245). కావ్యంలో లోకోత్తరమైనట్టి సద్గుణోపేతుడైనట్టి నాయకుని తప్పకుండా వర్ణించాలని అలంకారికులు చెప్పారు. ఆ నాయకునికి ఉండవలసిన లక్షణాలను కూడా తెలియ జేశారు.

**"మహాకులీనతౌజ్జ్వల్యం మహాభాగ్యముదారతా ।**
**తేజస్వితా విదగ్ధత్వం ధార్మికత్వాదయో గుణాః ॥ "** – ప్రతాపరుద్రీయం. పుట 23.

అంటే మహాకులీనత, ఔజ్జ్వల్యం, మహాభాగ్యం, ఉదారత, తేజస్విత, విదగ్ధత్వం, ధార్మికత్వం మొదలైన గుణాలు ఉండాలని ప్రతాపరుద్రీయకారుని అభిప్రాయం.

"ధీరశ్శాన్తః ప్రసన్నాత్మా ధీరశాంతో ద్విజాదికః" – ప్రతాపరుద్రీయం, పుట–41

ధీరుడు, శాంతుడు, ప్రసన్నమనస్కుడు అయినవాడు ధీరశాంతుడు. ఈ ధీరశాంతుడు బ్రాహ్మణుడుగా గానీ, వైశ్యుడుగా గానీ ఉండాలి. కావ్యంలో ప్రధానరసం శాంతం, దీనికి స్థాయీ భావం శమం. శమాది షట్కసంపన్నుడయిన శుకుడు ధీరశాంతుడవడం సమంజసమే.

"మహాకులీనతానామకులే మహితసంభవః" – ప్రతాపరుద్రీయం – పుట–23

వంశగౌరవం గల గొప్ప కులంలో పుట్టడమే మహాకులీనత. శుకుడు బ్రహ్మవంశసంభవుడు.

బ్రహ్మ
వశిష్టుడు+అరుంధతి
శక్తి
పరాశరుడు
వ్యాసుడు
శుకుడు

వీరంతా తపోధనులు, శక్తిసంపన్నులు.

"**రూపసంపన్నదేహత్వమౌజ్జ్వల్యం పరికీర్త్యతే**" రూపసంపద కల దేహముండటమే ఔజ్జ్వల్యం.

ఈ కావ్యంలో శుకుని బాహ్య రూప వర్ణనను కవి చేయలేదు. శుకుడు ఎలా ఉండేవాడో ఒకటి రెండు సమాసాల ఆధారంగా గ్రహించడానికి అవకాశం ఉంది.

"జనకాభశుభాకృతి, హుతాశనాకృతిస్థిరతరదివ్యతేజుడు, తేజోవిపులతతనకతనికీడు జోడని", అనే సమాసాలు మాత్రమే శుకునికి సంబంధించి కావ్యంలో కన్పిస్తున్నాయి.

"జనకాభ శుభాకృతి" తో ఉన్నాడని చెప్పడం వల్ల తండ్రిలాగా ఉన్నాడని అర్థం. ముక్తికన్య స్వయంవరఘట్టంలో శుకుడు తనకు ఈడుజోడు అయిన వాడని చెప్పింది. ముక్తికన్య రూపాన్ని నారదుడు చక్కగా వర్ణించాడు. శుకుడు రూపంలోనేగాక, గుణంలోనూ శ్రేష్ఠుడిగా పరిగణింపబడ్డాడు.

"**విశ్వం ధరాధిపత్యం యత్ తన్మహాభాగ్యముచ్యతే**" అంటే సార్వభౌమత్వముండటం యోగ సామ్రాజ్యానికి శుకుడు సార్వభౌముడని చెప్పవచ్చు. అందుకే శుకునికి ఆకాశం నుండి నవరత్నమయ కనకదండం పడిందని కవి వర్ణించాడు.

"**తను దానె యమ్మునీంద్రుని**
**తనయుని ముందటను దివ్యతరమగు కృష్ణా**
**జినము నవరత్నయుతమగు**
**కనకపుదండంబు బడియె గగనమువలనన్.** " – శుకచరిత్ర 2–122

కమలభవుడు అతనికి కనకపు కమండలాన్ని ఇచ్చాడు. ఇదే అతని సార్వభౌమత్వాన్ని చాటుతుంది. ముక్తికన్యను పెళ్లి చేసుకోవడానికి శుకుడు మిథిలానగరానికి వెళ్లాడు. శుకుని రాకను తన పురోహితుని ద్వారా తెలిసికొని

**"అతడు నెఱింగి నెమ్మది భయంబొనరించెడి భక్తినప్పురో
హిత బుధ మంత్రి భృత్యభటులెంతయు వెంబడి నేగనీర పూ
ర్ణతగల పాత్ర మస్తకమునం గొనిపోయి గురించి యమ్మహా
మతి గని పాద్యమిచ్చి ప్రణమస్కృతి గైకొని సంభ్రమంబునన్."** – శుకచరిత్ర 5-48

శుకుడు యోగి సామ్రాట్టు కాబట్టి మిథిలానగరాధిపు డయిన జనకమహారాజు మంత్రి పురోహిత భట సమేతంగా పూర్ణకుంభంతో ఎదురు వెళ్లి శుకుని సత్కరించాడు.

**"జగత్ప్రకాశకత్వం యత్ తేజస్వితం తదుచ్యతే"** – ప్రతాపరుద్రీయం పుట-26

జగాన్నంతా ప్రకాశింప జేయడం తేజస్విత మౌతుంది. శుకుడు వ్యాసుడు యజ్ఞం చేసే సమయంలో హుతాశనాకృతితో స్థిరతర దివ్యతేజుడుగా పుట్టాడని కవి వర్ణించాడు. అతడు పుట్టడం వల్ల హరి, సాంబశివుడు, అబ్జభవుడు, నిర్జరపతి, దేవతతి, మునీంద్ర సంఘం, ధరిత్రి, సముద్రుడు, ఉరగాది భూచరాలు అన్నీ సంతోషించినట్లు చెప్పడం వల్ల తేజస్వి అయిన శుకుడు జగాన్నంతా ప్రకాశింపజేసినట్టు తెలుస్తుంది.

**"ధర్మైకాయత్తచిత్తత్వం ధార్మికత్వముదీర్యతే"** – ప్రతాపరుద్రీయం. పుట-29

ధర్మంలోనే అయత్తమయిన చిత్తం కలిగి ఉండడం ధార్మికత్వం, ధర్మాన్ని ఆచరించేవాడు ధార్మికుడు.

శుకుడు వేదవ్యాసుని కొడుకు అంటే ధర్మాధర్మవివేకం గలవాడు. నిత్యానిత్యపదార్థ విభాగి. ఇహామూత్రార్థఫలభోగి విరాగి. శమాదిషట్కసంపత్సంభోగి, ముముక్షుతా సంయోగి తండ్రినుండి సంక్రమించిన ధర్మాన్ని ఆచరించడానికి బద్ధకంకణుడయ్యాడు. దేవగురువు దగ్గర, తండ్రి వ్యాసుడి దగ్గర వేదాంతాన్ని, యోగశాస్త్రరహస్యాల్ని గ్రహించాడు. జనకుడంతటి యోగి తనకుమార్తె ముక్తికన్యకకు సాధనచతుష్టయసంపత్సంయోగి అయిన శుకుడే తగిన వాడని నిర్ణయించాడు.

తండ్రి కోరికను తీర్చడం తనయుని బాధ్యత. శుకుడు బాల్యంలో విద్యాభ్యాసం చేశాడు. తర్వాత తన తండ్రి కోరికననుసరించి గృహస్థాశ్రమ స్వీకరణకు మిథిలానగరానికి వెళ్లాడు. అక్కడ ముక్తికన్యను పెళ్లి చేసుకోవడమే తన జీవితపరమార్థమని తలచాడు. స్వయంవరంలో వివిధ మతవాదుల్ని తన వాదపటిమతో ఓడించాడు. ముక్తికన్యను గెలుచుకొన్నాడు. ఆమెతో కలిసి గృహస్థాశ్రమ ధర్మాన్ని చక్కగా నిర్వర్తించాడు. తాను ఆకాశమార్గంలో వెళుతున్నప్పుడు తనకోసం పరితపించే తండ్రి ఆర్తనాదం విని ప్రకృతిని తనకు మారుగా తన తండ్రిని ఆదరించుమని వేడుకొన్నాడు. ఇలా శుకుడు తన ధర్మాన్ని చక్కగా నిర్వర్తించాడు. ఈయన జీవితం అనేకులకు ఆదర్శంగా నిలుస్తుంది.

**"తన్మహోమహిమత్వం స్యాద్యా పునర్దేవతాత్మతామ్"** దేవతాత్మత లేక దేవతాస్వరూపం కలిగి ఉండడాన్ని మాహాత్మ్యాన్ని ప్రదర్శించడాన్ని మహోమహిమత్వంగా పరిగణించవచ్చు.

శుకచరిత్రలో శుకుడు పరమేశ్వరవరప్రసాదం వల్ల జన్మించాడు. వైష్ణవాంశసంభూతుడైన వ్యాసునికి, (దేవకాంత అయిన ఘృతాచికి) యజ్ఞం చేసే సమయంలో అగ్ని ఆకృతితో దివ్యతేజస్సుతో జన్మించాడు. పంచభూతాత్మకుడైన శుకుడు జన్మించగానే త్రిమూర్తులు సంతోషించారు. దేవతతి, మునీంద్రసంఘం ఆనందించాయి. సముద్రుడు ఉప్పొంగాడు.

> **"కురిసెం బువ్వుల వానలు**
> **మొఱసెన్సురభేరు లమరముగ్ధల నటన-**
> **ల్మెరసెన్సిద్ధుల కూటమి**
> **మొరసెన్ గిన్నరుల గానములు రంజిల్లెన్.**" - శుకచరిత్ర 2-116

వ్యాసునికి కుమారుడు జన్మించడం వల్ల ఆకాశగంగ నిజాకృతితో వచ్చి మంగళస్నానం చేయించి బాల్యోపచారాలు చేసింది. ఆకాశంనుండి నవరత్నఖచితకనకపు దండం, కమలభవుని కనకపు కమండలం, ఇంద్రునితోపాటు దేవతలు వచ్చి ఇచ్చిన మాయని వస్త్రాలు శుకుని మహత్వాన్ని చాటుతున్నాయి. జననానికి హేతుభూతుడయిన శివుడే స్వయంగా వచ్చి శుకుణ్ణి ఉపవీతుని చేశాడు.

> **"అతిశయమంది శూలి ప్రమథాధిపులందఱు గొల్చిరాగ బా**
> **ర్వతి సహితంబుగా వృషభవాహనుడై చనుదెంచి బ్రహ్మ సం**
> **యుతులయి దేవతల్పొగడు చుండగ దత్తనయు న్మహోత్సవా**
> **న్వితముగ వేదరీతి నుపవీతునిగా నొనరించె వేడుకన్.**" - శుకచరిత్ర 2-124

చిన్నతనంలోనే అతనికి వేదాలు తమంత తామే రావడం కూడా అతని మహిమ తెలియజేస్తుంది. శుకుడు ప్రారబ్ధం తీరిపోగానే ఖగేంద్రుడు ఎగసేటట్టు వాయువేగంతో మోక్షపథం కేసి ఎగరడం అతని చేత నియుక్తాలయి భూతకోటి వ్యాసుని పిలుపుకు ప్రత్యుత్తరమివ్వడం శుక ఘనతా సూచకాలు.

**"సర్వవిద్యాధికత్వం, యత్ పాండిత్యం తదుదాహృతమ్"** - ప్రతాపరుద్రీయం పుట-30

దీన్ని వివరిస్తూ డా॥ జె.లూకానందం గారు ఇలా అంటారు - "సర్వవిద్యలలో ఆధిక్యము కలిగి యుండుట, పాండిత్యమని అనబడుచున్నది. వేదశాస్త్రాది దివ్యజ్ఞానమునకు "పండా" అని పేరు. పండాకలవాడు పండితుడు. పండితుని ధర్మము పాండిత్యము. ఆత్మసాక్షాత్కారము కలవాడు పండితుడని వేదాంత మర్యాద... వేదాంతపండితుడు ప్రపంచవిముఖుడు" - సారగంధరచరిత్ర సమగ్రసమీక్ష, పుటలు 240-44

శుకుడు పుట్టిన వెంటనే నిగమాలు ఒంట బట్టాయి. జనన ప్రాపిత వేదయుక్తుడయినా ఆచారం ప్రకారం గురువు దగ్గర విద్య నేర్చుకోవడానికి బృహస్పతి దగ్గరకు వెళ్లాడు.

**"ఆ దేవేంద్ర గురుండు జెప్పిన క్రమాభ్యసనంబున న్వేదము**
**న్వేదాంగంబులు వేద సంస్కృతులు తద్వేదోక్త ధర్మంబులు**
**న్వేదాంతంబులు మున్నుగాగల మహా విద్యా విశేషంబుల**
**న్వేదవ్యాస సుతుండు దా జదివె వేవేగన్నసూత్రంబుగన్."** – శుకచరిత్ర 2–127

ఇలా శుకుడు వేదవేదాంగాల్ని, సకలశాస్త్రాల్ని, యోగవిద్యల్ని అభ్యసించాడు. సాధన–చతుష్టయ సంపత్సంయోగి అయ్యాడు. ముక్తికన్యను పెళ్లి చేసుకోవడానికి వెళ్లి స్వయంవరంలో "లోకాయత, చార్వక, బౌద్ధమాధ్యమి కాంతరాళ దిగంబర ప్రాభాకర భాట్ట సాంఖ్య యోగమత ప్రముఖ జీవాది దురంధరులు, ఈశ్వర హిరణ్య గర్భ విరాడ్బ్రహ్మ విష్ణు రుద్ర శక్ర శుక్రాధీశ్వర ధ్యాన నిష్ఠులును, శాక్తగాణాపత్య సౌరభైరవ మైలార మాలికాది మతస్థులును, విప్ర, క్షత్రియ వైశ్య, శూద్ర, గోగజ, తురంగ, మృగ, విహంగ, అశ్వత్థ, వట, తులసీ, బిల్వముఖ దేవతా నైష్ఠికులును, జల, పాషాణ మృద్దారుకాంస్య కుద్దాల కాది భక్తియుక్తులను, తన వాదపటిమతో ఓడించి ముక్తికన్యను వరించాడు.

**శుకచరిత్రలో శుకుడు సాధనచతుష్టయసంపన్నుడుగా, సాంఖ్యయోగ, జ్ఞానయోగ సంపన్నుడిగా, నిత్యానిత్యపదార్థవిభాగిగా, శమాదిషట్కసంపత్సంభోగిగా, ముముక్షుతా సంయోగిగా కొనియాడబడ్డాడు.**

### 3.3.3 జనకుడు :

మిథిలా నగర రాజసింహాసనాన్ని అధిష్ఠించే వ్యక్తిని జనకుడు అని వ్యవహరిస్తారు. ఇలా చాలామంది జనకులు మిథిలానగరాన్ని పాలించినట్లు తెలుస్తూ ఉంది. వీరు సూర్యవంశ క్షత్రియులు. వీరిలో నిమి మొదటివాడు. అతని పుత్రుడు మిథి అనే జనకుడు. మొత్తం 54 మంది జనకులు మిథిలా నగరాన్ని పరిపాలించినట్లు తెలుస్తూ ఉంది. భారత కాలంలో ఏ జనకుడు మిథిలా నగరాన్ని పరిపాలించాడో తెలియడం లేదు. కానీ జనమేజయుని సభకు పంచశిఖుడు వచ్చినట్లు సంస్కృతభారతం శాంతిపర్వం 218,219 అధ్యాయాలలో ఉంది. ఈ పంచశిఖుడు జనదేవుడికి గురువు. పంచశిఖుడు చిరంజీవి కనుక ఎందరికో గురువు కావచ్చును. సంస్కృత భారతం శాంతిపర్వంలో

**"జనకో జనదేవస్తు జ్ఞాపితః పరమర్షిణా ।**
**పునరేవాను పప్రచ్ఛ సాంపరాయే భవాభవౌ ॥**

**జనకో జనదేవస్తు కర్మాణ్యాదాయ చాత్మని ।**
**సర్వభావమనుప్రాప్య భావేన విచచార సః ॥"** - సంస్కృతభారతం శాంతిపర్వం 219 పుట. 4987

శుకచరిత్రలో జనకుడు, భారతకాలం నాటి జనదేవజనకుడు కావచ్చు. ఈ జనకుడు ఆత్మజ్ఞాని, "సర్వభావాన్ని" పొందినవాడు. నిశ్చలుడు.

**"సతికుమారాది సంసారియై భువిన సం-సారియై మీఱు సంసారి యితడు**
**పురుషార్థ చతుష్క భోగియై పుడమిన - భోగియై తులదూగు భోగి యితడు**
**ప్రకట సామ్రాజ్య ప్రపంచుడై ధరన ప్ర-ప్రపంచుడైమించు ప్రపంచు డితడు**
**కడు ప్రజాపాలనకర్తయై ధరణిన - కర్తయై వర్తిలు కర్త యితడు**

**విదిత చిత్స్వరూప విజ్ఞానియై యట్ల**
**దనరుజానియీతడనుచు బొగడ**
**నవని నొప్పె నాతడఖిలాగమాంతార్థ**
**వర్తి జనకచక్రవర్తి యనఘ."** - శుకచరిత్ర 1-94

జనకుని రజోగుణంలో బ్రహ్మగా, సాత్త్విక గుణంలో విష్ణువుగా, తమో గుణంలో శివుడిగా కవి వర్ణించాడు. వేద వేదాంత విద్యలలో మేటి కాబట్టి అతడు భక్తులకు జనకుడయ్యాడు. తనకు సంతానం లేకపోగా పంచశిఖుని సలహాతో '**సమాధి**' అనే సవనాన్ని చేశాడు. జనకుడు మహాయోగి కాబట్టి శతగురుగోష్ఠితో కాలం గడిపాడు. **హంస మంత్రాన్ని** జపించాడు. యజ్ఞఫలంగా లభించిన అమృతాన్ని తన భార్య ప్రజ్ఞాంగనకు ఇచ్చాడు. ఆమె గర్భవతియై ముక్తికన్యను ప్రసవించింది. ముక్తికన్య పుట్టిన వెంటనే జనకుడు సంతోషించి స్నానం చేసి సత్పురుషులకు అర్థపటాలాలు ఇచ్చాడు. ఇతడు నిష్కామకర్మయోగిగా దానశీలిగా కన్పిస్తాడు. ముక్తికన్యకను పెంచి పెద్ద చేయడమేగాక ఆమెకు తగిన వరుని అన్వేషించాడు. సాధన చతుష్టయ సంపత్సంయోగి యైన శుకుడే అర్హుడని గుర్తించడంలో అతని ప్రజ్ఞ మనకు తెలుస్తూ ఉంది. అయినా స్వయంవరాన్ని ఏర్పాటు చేయించి మాయా యంత్రాన్ని ఏర్పాటు చేసి సభకు వచ్చిన వివిధ మతవాదుల్ని ఉచిత రీతిని సన్మానించాడు. వాదంలో జయించిన శుకుడికి తన కుమార్తె ముక్తికన్యను ప్రదానం చేసి పెళ్లి జరిపించాడు. గో, భూ, హిరణ్యాదుల్ని అరణంగా ఇచ్చాడు. జనకుడు గృహస్థుడేగాక గృహస్థులకు మార్గదర్శకుడు.

**3.3.4 పంచశిఖుడు :**

ఇతడు బ్రహ్మవిత్ సఖుడు. జనకుని కొలువునకు వచ్చి సంతానం పొందడానికి మార్గాన్ని ఉపదేశించాడు. ఇతనిని కవి ఇలా వర్ణించాడు.

**"స్వ హృదయాబ్జ దృష్ట సర్వతోముఖుడును**
**సంతతాత్మసుఖహసన్ముఖుండు**
**బ్రహ్మ విత్సఖుండు పంచశిఖుండన**
**జనక సమ్ముఖమున సంశ్రయించి."**

'సమాధి' అనే యజ్ఞం చేస్తే సంతానం కలుగుతుందని ఈయన జనకునికి సలహా ఇచ్చాడు. పంచశిఖుడు తత్త్వజ్ఞానసంపన్నుడు, నిర్ద్వంద్వుడు, సంశయరహితుడిగా కొనియాడబడిన వాడు. ఇతడు ఉపదేశించిన 'సమాధి యజ్ఞం' చేసి జనకుడు ముక్తికన్యను పొందాడు. రాముని జననానికి వశిష్ఠుడు కారణమయినట్లు ముక్తికన్య జననానికి పంచశిఖుడు కారకుడు. శుకచరిత్రలో పంచశిఖుని వృత్తాంతం ఇంత వరకే వివరించబడింది.

కవులు స్త్రీ పాత్రల్ని వర్ణించేటప్పుడు ఎక్కువ అంగాంగ వర్ణనకు ప్రాధాన్యమిచ్చారు. అంటే గుణవర్ణణ కంటే రూపవర్ణనే ఎక్కువగా చేశారు. రామమూర్తికవి అలాకాక రెండింటికి ప్రాధాన్యమివ్వడం విశేషం. శుకచరిత్రలో 1. ప్రజ్ఞాసతి, 2. ఘృతాచి, 3. ముక్తికన్య స్త్రీ పాత్రలు.

**3.3.5 ప్రజ్ఞాసతి :**

మూలంలోలేని పాత్రలలో ఈ ప్రజ్ఞాసతి పాత్ర ఒకటి. జనకుడు వివాహ సుఖయోజకుడై యోగప్రజ్ఞా రాజీవాక్షిని గ్రహించి రాజర్షి అయ్యాడు. ప్రజ్ఞాసతి సద్వాసనోదరాంతరంలో ముక్తికన్యక వృద్ధి పొందింది. ఆ తర్వాత కవి గర్భవర్ణన చేశాడు. పదినెలలు నిండిన తర్వాత ముక్తికన్యను ప్రసవించింది. పిమ్మట కావ్యంలో ఈమెను గూర్చిన ప్రస్తావన లేదు.

**3.3.6 ఘృతాచి :**

ఘృతాచి ఒక వేల్పు వెలయాలు. ఆమె రూపాన్ని రమణీయంగా కవి వర్ణించాడు. వ్యాసుడు తపస్సు చేసి తనకు పంచ భూతాలతో సమానమైన ఒక సుతుని ఇవ్వమని ఈశ్వరుని కోరాడు. ఆ వరాన్ని పొంది అగ్నికార్యపరుడై అరణిని మథిస్తూ ఉంటే దైవ సంఘటన వల్ల ఘృతాచి అక్కడికి వచ్చింది. ఘృతాచిని చూసి మరుడు రేపిన వలపు వల్ల వ్యాసుడు సమ్మోహితుడయ్యాడు.

**"ఆ పువ్వుబోడి కొప్పాస్యంబు కన్నులు – బొమలధరమురదంబులు గళంబు**
**చెవులు చెక్కులు ముక్కు చేతులు పాలిండ్లు – గౌనుత్రివళులు నూగారు నాభి**
**పిఱుదు లూరువులును పిక్కలు మీగాళ్లు – గోరులంఘ్రులు మది గోరిచూడ**
**మొగులుదురాజు తమ్ములు చాపములు విద్రు – మంబు ముత్తెములు శంఖంబు శ్రీలు**

**ముకురములు చంపకములు తూండ్లు మొగ్గలాక**
**సము తరంగంబులహిరాజు సరసి సైక**
**తములు కరభంబులును కాహళములు కచ్ఛ**
**పములు చుక్కలిగుల్లౌర! భళి! తలంప.**" - శుకచరిత్ర 2-84

ఘృతాచి అంగాలు తమకు సరిగా ఉన్నాయని ప్రకృతిలోని ఆ యా వస్తువులు తమ సహజ గుణాన్ని మార్చుకొంటూ ఉన్నాయని ఒక సీస పద్యంలో చెప్పబడింది.

"**సకియ ముంగురులకు సరిగా వచ్చు గాబోలు - విసిగి మేఘంబులు విరియకున్న**
**గలికి కన్నులకీడుగా వచ్చు గాబోలు - గమలంబు లెపుడొక్క కరణినున్న**
**నతివ బొమ్మల సామ్య మనవచ్చు గాబోలు - సింగిణీ విల్లెక్కు జెదరకున్న**
**కాంత చెక్కుల చక్కి గనవచ్చు గాబోలు - ముకురంబు మూలల ముణుగకున్న**

**నబల చెవుల సాటియగును గాబోలు శ**
**ష్కుళలఖండ యుక్తి గోరుచున్న**
**వనిత వళుల బోల్పవచ్చు గాబోలు వీ**
**చిక లభంగ గతుల జెలగుచున్న.**" - శుకచరిత్ర 2-88

ఘృతాచి ముంగురుల్ని చూసి మేఘాలు విరియక పోవడం, కళ్లను చూసి కమలాలు తమ రూపును మార్చుకోవడం, కనుబొమల్ని చూసి సింగిణీ విల్లెక్కు జెదరక పోవడం, చెక్కుల చెక్కికకనబడుతుందేమోనని ముకురం మూలల్లో దాగడం, వనిత వళులతో బోల్పవచ్చునని వీచికలు అభంగ గతులతో చెలగడం వంటి వర్ణనల వల్ల ప్రకృతికే కన్నుకుట్టె అందం ఆమె సొంతమని తెలుస్తూ ఉంది.

ఇంకా

"**లత లెయ్యెడ సుడియకయచ**
**లత నుండిన సతి భుజంబులకు సరిపడులో**
**లత లేక నిలువ విద్యు**
**ల్లత మేనుకు సాటివచ్చు లలనా మణికిన్.** " - శుకచరిత్ర 2-90

లతలోను, విద్యుల్లతలోను లోపముంది. కానీ ఘృతాచి రూపంలో లోపం లేదని పద్య భావం.

ఘృతాచి దేవకాంత. అందువల్ల ఆమెలో తరిగిపోని అందమున్నట్లు వర్ణింపబడింది.

అందాలరాశి అయిన ఘృతాచిని చూసి వ్యాసుడు నిలుప వశంగాని వలపుతో వేగిపోయాడు. ఘృతాచి ఆయన్ను వంచించాలని రాచిలక అయింది. కొంతకాలం ఇలా చిలుక రూపంలో అదృశ్యంగా ఉంది. ఆ తర్వాత యథారూపం పొంది ఉండవచ్చు. ఎందుకంటే మన్మథాది దూషణం తర్వాత నయ్యమరభోగిన్యను రాగమగ్నుండై యాయంగడనతో సరస సల్లాపంబు లాడుచు సంతోషముతో నాలింగన మొనర్చి మొవినొక్కియాపెతో గూడినంతనె" అనే మాటల వల్ల ఘృతాచి తన అసలు రూపంతోనే వ్యాసుని కూడిందని తెలుస్తూ ఉంది.

**3.3.7 ముక్తికన్య :**

ముక్తికన్య కావ్యనాయిక. జనకుడు మోక్షలక్ష్మి అనే సంతానాన్ని పొందాలనుకొన్నాడు. సద్గురు ప్రవరుల్ని రప్పించి వారి ద్వారా తత్త్వసంగతుల్ని తెలిసికొన్నాడు. తనకున్న సంశయాల్ని పోగొట్టుకొని ముక్తికన్యకను సంతానంగా పొందడం కోసం అన్వేషింప సాగాడు. ఆ సమయంలో పంచశిఖుడు వచ్చి 'సమాధి' అనే యజ్ఞం చేస్తే ముక్తికన్యకను పుత్రికగా పొందుతావని చెప్పాడు.

ముక్తికన్య కడుపులో ఉన్నప్పుడు ప్రజ్ఞాసతికి నిఖిల విభ్రమాది శక్తులెల్ల అణగిపోయాయి. ఆమె పుట్టిన వెంటనే 'యోగ బోధ వధూతిలకం వచ్చింది. చిద్రసమనే తైలంతో అభ్యంగన స్నానం చేయించింది. ఆనందసముద్రోదకస్నానం గావించింది. తురీయాంతఃపురంలో హంసతూలికాతల్పం మీద యోగనిద్ర పుచ్చింది. ఆ సమయంలో ఆమెను విస్మయ రూపిణీ, జీవేశ్వరైక్య సుఖ భాగ్యహరీ; ముముక్షుజననిధి, నిర్వాణ తరుణి, అని కొనియాడారు. ఆ యువతిని సాధనచతుష్టయసంపన్నుడయిన శుకుడికి ఇవ్వాలని జనకుడనుకొన్నాడు.

మిథిలానగరానికి వెళ్లిన శుకుడు, నారదునితో పరసతిని గూర్చి తనకు తెల్పుమన్నాడు. ఆ సమయంలో నారదుడు ముక్తికన్య రూపురేఖా విలాసాదుల్ని, గుణగణాల్ని వర్ణించాడు. రామమూర్తి కవి ముక్తికన్య పాత్ర పోషణను పరోక్ష పద్ధతి ద్వారా చేశాడు.

శుకుడు మిథిలా నగరానికి వెళ్లి జనకుని చూచినట్లు చెప్పి, జనకుని కుమారికను ముక్తి వధూటిని జెందనట్టి చెనటి వివేక మేటికి, అని అనుకొంటాడు. ఇక్కడ ముక్తికన్యక అనుపమ వ్యక్తిత్వం, ఘనత ఆవిష్కరింపబడ్డాయి. రామమూర్తి కవి ముక్తికన్య రూపవర్ణన కంటె గుణవర్ణనకే ఎక్కువ ప్రాధాన్యమిచ్చాడు. ముక్తికన్య వర్ణన ఆధ్యాత్మిక భావాలతో సాగింది. రామమూర్తి కవి ఆమె అంగాల్ని శృంగారాత్మకంగా వర్ణించక ఆమె తొడిగిన సొమ్ముల్ని మాత్రం ఆధ్యాత్మికంగా వర్ణించడం విశేషం.

**"బంగారు పువ్వుల రంగారు గజ్జెలు – సింగారముగనంఘ్రి సీమనమర**
**గట్టి కెంపుల కట్టుపట్టున పచ్చని – పట్టు పుట్టపుగాంతులుట్టిపడగ**

**సారంబు ధవళ విస్తారంబుగహ్లార – హారంబు లురమున జేరి వ్రేల**
**సరసంపు నీలంపు సరులింపు బుట్టింప – సవరింపు గంఠభూషణము మెరయ**
**మణి లలాటిక భ్రూమధ్యమమున దనర**
**మణి సహస్ర ద్యుతుల శిరోమణి వెలుంగ**
**దఱచుగాజెప్ప జూపంగ దలపరాని**
**యందమున నొప్పు నిర్వాణ సుందరాంగి.**" – శుకచరిత్ర 5–15

ముక్తికన్యను పోలినవారు అవనిలో లేరని చెప్పబడింది. ఇలాంటి కన్యను పొందాలంటే అవిద్య అనే యంత్రాన్ని ఛేదించాలని జనకుడు వచ్చిన వారికి చెప్పాడు. స్వయంవరానికి లోకాయతులు, చార్వాకులు, బౌద్ధులు, మాధ్యమికులు, దిగంబరులు, సాంఖ్య యోగ మత ప్రముఖులు వచ్చారు. శుకుడు వీరినంతా తన జ్ఞానంతో, వాదంతో గెలిచాడు. అతని ముక్తిపరత్వానికి బోధకు, ఉపరతికి ముక్తికన్య మెచ్చి వరించింది. జనకుడు శాస్త్రోక్తంగా వారికి పెళ్లి చేశాడు.

దివ్య పాత్రలలో ఈశ్వరుడు, గంగ, గౌరి పేర్కొనదగిన వారు.

**3.3.8 ఈశ్వరుడు :**

భక్తకల్పద్రుమం అయిన ఈశ్వరుడు ఈ కావ్యనాయకుని ఆరాధ్యదైవం. కవి ఈశ్వరుని రూప ప్రభావాదుల్ని చక్కగా వర్ణించాడు. వసంత ఋతువులో ఈశ్వరుడు గౌరితో విహరించ డానికి కర్ణికార వనం చేరుకున్నాడు. అక్కడి పశుపక్ష్యాదులకు కూడా తాత్త్విక వాసన ఉంది. కర్ణికార వనానికి వచ్చిన ఈశ్వరుణ్ణి రామమూర్తికవి ఇలా వర్ణించాడు.

"**అమ్మధు మాస వాసరమునందు సదాశివుడుత్సహించి ఫా**
**లమ్మున పావకాక్షము గళమ్మున తీక్ష్ణ హలాహలమ్ము దే**
**హమ్మున భస్మమున్ శిరమునందు సుధాకరుడున్జటాకలా**
**పమ్మున గంగ పాణిని కపాలము శూలము వెల్గుచుండగన్.**" – శుకచరిత్ర 2–27

సదాశివుడి రూపవర్ణనను పరిశీలించినపుడు ఆయన ఫాలంలో ధరించిన అగ్ని, గళంలోని హాలాహలం, దేహంలోని భస్మం, శిరస్సులో సుధాకరుడు, జడలో గంగ, చేతిలో కపాలం, శూలం ఉండడం వెనుక లోకకల్యాణం దాగి ఉంది. లోకాన్ని భస్మీపటలం చేసే అగ్నిని లోకకల్యాణం కోసం ఫాలభాగంలో ధరించాడు. పాలసంద్రంలో పుట్టిన హాలాహలం వల్ల ప్రాణహాని కలగకుండా దాన్ని పోగొట్టడం కోసం చంద్రుని తన శిరస్సులో ధరించాడు. భగీరథుని తపస్సు ఫలించి సగర సంతతి సజీవులు కావడానికి చాలా ఉద్ధృతంగా వచ్చిన

గంగను తన శిరస్సుమీద నిలిపాడు. ఇలా ఈశ్వరుని ప్రతి అంగం కేవలం పరోపకారార్థం. లోకకల్యాణం కోసం ఉద్దిష్టం కావటం వల్ల ఈశ్వరుని ఔదార్యం సువ్యక్తమౌతుంది.

ఈశ్వరుని అనుచర గణాన్ని కూడా కవి క్రింది పద్యంలో రమ్యంగా వర్ణించాడు.

**"చనువు మీఱగ హిమచల రాజ తనయవా - మార్ధ దేహమునందు నలరుచుండ,**
**సహ భక్తియు గల్గి షణ్ముఖ గజముఖా-ది మహా ప్రమథ గణాధిపులు గొలువ,**
**సంతత సంతోష సహితలై బ్రాహ్మ్యాది - సప్తమాతృకలు, సంసక్తి నడువ,**
**సాలోక్యసారూప్య సామీప్య యుక్తులై - వెలయు సద్భక్తులు వెంబడింప,**

**సఖిల ఋషిగణంబులందంద వినుతింప**
**ఇంద్ర శేఖరుండు చంద్ర కోటి**
**వర్ణుడగుచు నందివాహనారూఢుడై**
**వచ్చె గర్ణికార వనమునకును.**" - శుకచరిత్ర 2-28

మొదటి పద్యంలో జటాకలాపంలో దాగిన గంగను వర్ణిస్తే, ఈ పద్యంలో చనువు కొద్దీ ఈశ్వరుని వామార్ధ దేహంలో నిలిచిన పార్వతి వర్ణన చేయబడింది. ప్రమథ గణాదిపులు సహజ భక్తితో కొలుస్తున్నారనడం సమంజసంగా ఉంది. సప్తమాతృకలు, సద్భక్తులు, నిరంతరం సంతోష సహితలుగా సాలోక్య, సారూప్య, సామీప్య యుక్తులుగా ఉన్నారనడం ఈశ్వరుని భక్తపరాయణతకు నిదర్శనం.

గౌరీశంకరుల నర్మోక్తులలో ఈశ్వరుని సరసత మనోహరంగా వర్ణింపబడింది. కొమ్మలు, మొగ్గలు, కోయిలలు, మధుమాస వాసరాన్ని తెలియజేస్తూ మారుని ఆగడాల్ని వారికి చెప్పడంలో ఈశ్వరుని రాసికృత వ్యక్తమయింది.

వేదవ్యాసుడు తపస్సు చేసే సందర్భంలోనూ, ఈశ్వరసాక్షాత్కారం అయిన పిమ్మట చేసిన ఈశ్వరస్తుతిలోనూ ఈశ్వరుని రూప గుణ వర్ణనాదులు చోటు చేసుకున్నాయి. ఇందులో ఈశ్వరునికున్న పేర్లు, ఈశ్వరుడు చేసిన రకరకాల కార్యాలు, భక్త పరాయణత వర్ణింపబడ్డాయి. ఇక్కడ యోగదృష్టితో ఈశ్వరస్తుతి గావించబడింది.

**3.3.9 గౌరి :**

శివుడు గౌరితో కలిసి వనవిహారానికి రావడాన్ని కవి చక్కగా వర్ణించాడు. శివుడు కర్ణికార వనాన్ని చూడడానికి తన భార్య అంబిక గౌరితో వచ్చాడు. అది మధుమాసవాసరం. శివుని వామార్ధదేహంలో నిలిచిన హైమవతి సహజంగా ఎప్పుడూ శివుని వెన్నంటి ఉంటుంది.

శివపార్వతుల వనవిహారాన్ని వర్ణిస్తూ వారి నర్మోక్తుల్ని కూడా కవి చక్కగా వర్ణించాడు. శివుడు మాట్లాడే శృంగారవాక్యాలకు గౌరి వారిస్తూ పలికిన మాటలు ఆమె వాక్చాతుర్యానికి ప్రబల నిదర్శనం. శివుడు పార్వతితో స్త్రీల మన్మథ వికారాదుల్ని వర్ణించగా, పార్వతి వాటిని తన మాట నేర్పరితనంతో తిప్పి కొట్టింది.

"**అమ్మగువలు మీ శత్రుని**
**యమ్ముల పోటులకు వెఱచి యనిశము మీపా**
**దమ్ముల మఱుగును జేర గ**
**నమ్మిక యున్నార లిచట నానాగతులన్.** " - శుకచరిత్ర 2-33

మన్మథుని ఆగడాల్ని అరికట్టడానికి మన్మథవైరి అయిన శివుణ్ణి శరణు వేడారని చెప్పడం సమంజసం. శివుడు పార్వతిని శుకవాణిగా, అలివేణిగా, హరిమధ్యగా, వెలదిగా వర్ణించాడు. కవి శివుని ద్వారా పార్వతి రూపవర్ణన చేయడం చాల ఉచితంగా ఉంది.

**3.4 రస శిల్పం :**

ఒక రమణీయ దృశ్యాన్ని చూసినప్పుడు గానీ, ఒక కమనీయ కావ్యాన్ని చదివినప్పుడు గానీ సహృదయుని మనస్సులో కలిగే అలౌకిక ఆనందమే **రసం**. కావ్యాన్ని చదివినప్పుడు పఠిత హృదయంలోని రత్యాది వాసనల్ని కవి మాటలు, వర్ణనలు, భావనలు ఉద్దీపింపజేసి రసోన్ముఖుణ్ణి చేస్తాయి. కవులు కావ్యంలో ఒక రసాన్ని అంగిరసంగాను, మిగిలిన వాటిని అంగ రసాలుగాను పోషిస్తూ ఉంటారు.

శుకచరిత్రలోని ఇతివృత్తం అద్వైత ప్రతిపాదకం. ఇందులోని అంగిరసం శాంతం. శారదా తనయుడు ప్రబంధ ప్రారంభంలో ఏ రసం ప్రతిపాదితమై కన్పిస్తుందో అదే ప్రధాన రసమని ఇలా అంటారు.

"**ప్రథమం దృశ్యతే యత్తు శ్రూయతే సూచ్యతేఽపి వా ।**
**తత్ప్రధానమితి ప్రాహుః రసప్రాధాన్యవేదినః ॥**" - భావప్రకాశం 6-30

కావ్య నాయకుడు శుకుడు. ఇతడు ధీరశాంతుడు. చతుర్విధపురుషార్థాలను బట్టి చతుర్విధ నాయక విభాగం ఏర్పడింది. ధీరోదాత్తుడు ధర్మసాధకుడు; ధీరోద్ధతుడు అర్థసాధకుడు; ధీరలలితుడు కామసాధకుడు; ధీరశాంతుడు మోక్షసాధకుడు; అభినవగుప్తుడు వీరికి కావ్యరస నిర్దేశం కూడా చేశాడు.

"**ధర్మయుద్ధవీరప్రధానః ధీరోదాత్తః వీరరౌద్రప్రధానః ధీరోద్ధతః వీరశృంగారప్రధానః ధీరలలితః దానధర్మవీర ప్రధానః ధీరశాంతః**" - ధ్వన్యాలోకం ఉద్యోతః - పుట-170.

శాంతరసాన్ని తొమ్మిదోరసంగా కొందరు పేర్కొన్నారు. మరికొందరు దీన్ని ప్రకృతి రసంగా ప్రతిపాదించారు. శాంతానికి స్థాయి భావం నిర్వేదమని, తత్త్వజ్ఞానజనిర్వేదమని, ఆత్మజ్ఞానమని భిన్నాభిప్రాయాలున్నాయి. కాని అభినవగుప్తుడు శాంతం ప్రకృతిరసమని దానికి స్థాయి భావం తత్త్వజ్ఞానమని ప్రతిపాదించాడు.

"**ఇహ తత్త్వజ్ఞానమేవ తావన్మోక్షసాధనమితి తస్యైవ మోక్షస్థాయితాయుక్తా, తత్త్వజ్ఞానం చ నామ ఆత్మజ్ఞానమేవ**" – నాట్యశాస్త్రం, అభినవ భారతి పుట–337

అన్నాడు. తత్త్వజ్ఞానమే మోక్షసాధనం కాబట్టి స్థాయిభావంగా ఉండటానికి తత్త్వజ్ఞానమే తగింది. తత్త్వజ్ఞానమంటే ఆత్మజ్ఞానమేనని అభినవగుప్తుడు తత్త్వజ్ఞానస్వరూపస్వభావాదుల్ని తెలియజేశాడు. దీనికి వివరణ ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారు ఇచ్చారు. రసోల్లాసము పుట–20.

"**తేన ఆత్మైవ జ్ఞానానందాదివిశుద్ధధర్మయోగీ పరికల్పితవిషయోపభోగరహితోఽత్రస్థాయి న చాస్య స్థాయితయా స్థాయిత్వం వచనీయమ్**" – అభినవ భారతి. పరిష్కృత శాంతరస ప్రకరణం (Number of Rasas Prof. Raghavan 1975 ఎడిషన్. పి.99)

జ్ఞానానందాది విశుద్ధ ధర్మ యుక్తమైనదీ పరికల్పితవిషయోపభోగరహితమైనదీ అయిన ఆత్మయే శాంతానికి స్థాయి. దీన్ని స్థాయి అని వేరుగా చెప్పవలసిన పనిలేదు.

2. తత్త్వజ్ఞానం తు సకల భావాన్తరభిత్తిస్తానీయం సర్వస్థాయిభ్యః స్థాయితమం. సర్వరత్యాదికాః చిత్తవృత్తీః వ్యభిచారీభావయన్ నిసర్గత ఏవ సిద్ధస్థాయిభావమితి తన్న వచనీయమ్" పరిష్కృత శాంత రస ప్రకరణం (Number of Rasas P-99) – అంటే తత్త్వజ్ఞానం సకలభావాంతరభిత్తి స్థానీయం. సర్వస్థాయిభావాలకంటె అది స్థాయితమం. రత్యాది చిత్తవృత్తులన్నీ దానికి సంవాదులు, అందువల్ల అది నిసర్గమైన సిద్ధస్థాయి భావం.

"న హి రత్యాదయ ఇవేతరా సంపృక్తేన వపుషా తథా విధమాత్మ రూపం లౌకికప్రతీతిగోచరః । స్వగతమపి అవికల్పరూపం వ్యుత్థానావసరేఽనుసంధీయమానం చిత్తవృత్త్యంతరకలుషమేవావభాతి. భాసతాం వా లోకే తథా। తథాపి న సంభవన్మాత్రస్థాయినాం గణనమ్. రసేషూక్తేషు అనుపయోగాత్ అపి తు వ్యభిచారిత్వేన లక్షణీయత్వం విజ్ఞాయతే, నేతరథా' ।

పరిష్కృత శాంతరస ప్రకరణమ్. 1975 ఎడిషన్ The Number of Rasas పుట–111.

రత్యాదులకూ తత్త్వజ్ఞానానికి భేదం ఉంది. రత్యాదులు చిత్తవృత్త్యంతరసంపృక్తాలై కలుషితాలౌతాయి. వానికి లౌకిక ప్రతీతి ఉంది. తత్త్వజ్ఞానం చిత్తవృత్త్యంతరానుసంధానం కలిగినా అవికల్పరూపంగా ఉంటుంది. దానికి లౌకికప్రతీతి ఉండదు. లోకంలో ఇది కొంత

భాసించినా, రత్యాది స్థాయి భావాల్లాగా దీన్ని పరిగణించటానికి వీల్లేదు. సాధ్యరసాలైన శృంగారాదులలో సిద్ధరసమైన శాంతానికి ఉపయోగం లేదు. తత్త్వజ్ఞానమెప్పుడూ సంచారీ భావంలాగా లక్షణీయం కాదు. అభినవభారతిలోనే అభినవగుప్తుడు శాంతరసాస్వదవిధానాన్ని కూడా తెలియ జేశాడు.

1. "**హృదయసంవాదోపి తథావిధతత్త్వజ్ఞానబీజసంస్కారభావితానాం భవత్యేవ**" పరిష్కృత శాంతరస ప్రకరణమ్

– The Number of Rasas పుట–115. తత్త్వజ్ఞాన బీజసంస్కార భావితులే ఇందు హృదయసంవాదాన్ని పొందగలుగుతారు.

2. **తదిదమాత్మస్వరూపమేవ తత్త్వజ్ఞానం శమః తథా చ యత్కాలుష్యో పరాగవిశేషా ఏవాత్మనో రత్యాదయః తదనుగమేపి శుద్ధమస్య రూపం అవ్యవధానసమాధిబలాదధిగమ్యవ్యుత్థానేఽపి ప్రశాంతతా భవతి ।** – పరిష్కృత శాంతరస ప్రకరణమ్. The Number of Rasas పుట–111.

తత్త్వజ్ఞానం శమం సర్వం ఆత్మరూపమే. రత్యాదులు ఆత్మలోని కాలుష్యోపరాగవిశేషాలు తత్త్వజ్ఞానసిద్ధుడైన సహృదయుడు రత్యాదులను అనుగమించినా సమాధినుండి వ్యథిత చిత్తుడైనా అవ్యవధానంగా సమాధిబలంచేత దాన్ని అధిగమించి ప్రశాంతచిత్తుడౌతాడు.

3. "**తత్ర సర్వరసానాం శాంతప్రాయ ఏవాస్వాదః విషయేభ్యో విపరివృత్యా తన్ముఖత్వతా–లాభః కేవలం వాసనాన్తరోపహిత ఇతి అత్ర సర్వ ప్రకృతిత్వాభిధానాయ పూర్వమభిదానమ్.**"

– పరిష్కృత శాంతరస ప్రకరణమ్ – The Number of Rasas పుట–116.

శాంతం సర్వరసప్రకృతి. ఇతర రసాలు సంస్కారాంతరాలతో ఉంటాయి. శాంతం సర్వ సంస్కారముల ప్రకృతివిషయవిపరివృత్తివలన సర్వరసాలు పర్యంతాన శాంతంగానే ఆస్వాదనీయాలవుతున్నాయి.

4. "తత్త్వాస్వాదోఽస్య కీదృశః, ఉచ్యతే ఉపరాగదాయిభిః, ఉత్సాహరత్యాదిభిరుపరక్తం యదాత్మస్వరూపం తదేవ విరళోంభితరత్నాంతరాళనిర్భాసమానసితతరసూత్రవత్ యదాహిత–తత్స్వరూపం సకలేషు రత్యాదిషు ఉపరంజకేషు తథా భావేనాపి సకృద్విభాతోఽయమాత్మేతి న్యాయేన భాసమానం పరాఙ్ముఖతాత్మకసకలదుఃఖజాలహీనం పరమానందలాభసం విదేకత్వేన కావ్యప్రయోగప్రబంధాభ్యాం సాధారణతయా నిర్భాసమానం అంతర్ముఖావస్థాభేదేన లోకోత్తరానందానయనం తథా విధ హృదయం విధత్త ఇతి.

– పరిష్కృత శాంతరస ప్రకరణమ్ – The Number of Rasas పుట–118.

తత్త్వాస్వాదస్వరూపం రత్యుత్యాహాదులన్ని ఉపరాగాన్ని కలిగిస్తాయి. దానివలన ఆత్మ–స్వరూపం ఉపరంజితమై వాటిలో అనుభూతమౌతుంది. విరళంగా కూర్చబడిన రత్నాలలో సితతరంగా నిర్భాసించే సూత్రంలాగా ఉపరంజకాలైన రత్యాదులలో ఆత్మస్వరూపం గోచరిస్తుంది. రత్యాదులేవి ఉపరంజకాలుగా లేకపోయినా ఆత్మవలె తత్త్వజ్ఞానం భాసిస్తుంది. అలా భాసమానమైన తత్త్వజ్ఞానం విషయపరాఙ్ముఖత్వంవల్ల సకలదుఃఖరహితమై పరమానంద లాభంతో సంవిదేకరూపమై ప్రకాశిస్తుంది. కావ్యప్రయోగబంధాలవల్ల, సాధారణరూపంతో, నిర్భాసించి అంతర్ముఖావస్థాభేదంతో లోకోత్తరానందాన్నిచ్చి సంవిస్మయమైన, హృదయ సంవాదాన్ని కలిగిస్తుంది.

శుకచరిత్ర కావ్యంలో తత్త్వజ్ఞానమే మొదటి నుండి కడపటి వరకు వివరింపబడి సకల దుఃఖరహితమై పరమానందలాభంతో ప్రకాశిస్తుంది. శారదాతనయుని అభిప్రాయానుసారం చూస్తే ఇందులో ప్రధానరసం శాంతం అని చెప్పవచ్చు. ప్రబంధప్రారంభంలో ఏ రసం ప్రతిపాదితమౌతుందో అదే కావ్య – ప్రధాన రసమన్నాడు. ఏ విధంగా చూసినా, కావ్యంలో ప్రధానరసం శాంతమని చెప్పవచ్చు.

కావ్యప్రారంభంలో ఇష్టదేవతా స్తుతిలో "**సాత్మావ్యక్తరూపోత్థచిద్భూమానందుదు**" అనే సమాసం, కథాప్రారంభంలో "**శ్రీయోగజ్ఞాన పరిజ్ఞేయుని**" అనే సమాసం శ్రీరామచంద్రుడు కన్పించి కావ్యం వ్రాయమని చెప్పే సందర్భంలో "**తత్త్వబోధయును, భీష్మబోధితంబును, ధర్మబోధ్యంబునునై, సకల సుకవిజన నికర ప్రకటిత తత్త్వచరితంబగు శుకచరితంబు**" అనే మాటలు, కావ్యం తత్త్వజ్ఞానప్రతిపాదకంగా ఉందని చెబుతున్నాయి. శమం స్థాయిగా గల శాంతరసమే ఇందులో ప్రధానరసమని చెప్పవచ్చు.

శుకచరిత్రలో శాంతరసం ఎలా పోషింపబడిందో గమనించడం సమంజసం. భరతుడు తన నాట్యశాస్త్రంలో "**విభావానుభావవ్యభిచారీ సంయోగాద్రసనివృత్తిః**" అన్నాడు. విభావాను భావవ్యభిచారి భావాల సంయోగం వల్ల రసం ఉత్పన్నమౌతుందని భరతుని అభిప్రాయం.

నాయికా నాయకుల రూప యౌవనాదులు, హావభావాదులు, అలంకారాలు వంటి ఉద్దీపనాదులను విభావాలు అంటారు. శాంతరసానికి విభావాలు తత్త్వజ్ఞానం, వైరాగ్యం, ఆశయసిద్ధి అనేవి. విభావాలచే పుట్టిన స్థాయిభావాలను పైకి తెలపడం అనుభవం. శాంతరసానికి అనుభవాలు యమ, నియమ, ఆసన, ధ్యాన, ధారణలు, ఉపాసనలు, సర్వభూత దయ అనేవి. వ్యభిచారి భావాలు స్థాయి భావంలో పుడుతూ, గిడుతూ స్థాయికి పుష్టిని కలిగిస్తూ ఉంటాయి. శాంతరసానికి వ్యభిచారీభావాలుగా నిర్వేదం స్మృతి, ధృతి, సర్వాశ్రమ శౌచం, స్తంభం, రోమాంచం మొదలైనవి.

శుకచరిత్ర కావ్యంలో విభావ, అనుభావ, వ్యభిచారీ భావాల సంయోగం వల్ల ఎలా ఉత్పన్నమయిందో పరికించడం సమంజసం.

శుకచరిత్ర కావ్యంలో నాయకుడు శుకుడు. ఇతని రూపయౌవనాదులు, తత్త్వజ్ఞానం, వైరాగ్యం, శాంతరసానికి విభావాలుగ పేర్కొనవచ్చు. శుకుడు యజ్ఞవాటికలో అరణులను మథింపగా "హుతాశనాకృతి"తో పుట్టాడు. పుట్టిన వెంటనే తాపసికి తగిన కృష్ణాజిన కనక దండములు ఆకాశం నుండి శుకుని ముందు పడ్డాయి. కమలభవుడు స్వయంగా కనకపు కమండలాన్ని ఇచ్చాడు. చిన్నతనంలోనే వేదవేదాంగాల్ని చదువుకున్నాడు. సరిగా పిల్లలతో కలిసి ఆటపాటలతో కాలం గడుపసాగాడు. వెంటనే వ్యాసుడు అతనికి బుద్ధిగరపుతూ ఇలా ఉపదేశించాడు.

> **"వచియించుమి వేదంబులు**
> **ప్రచురించుమి సకల శాస్త్ర ఫణితులు భక్తిన్**
> **రచియించుమి సత్క్రియలెద**
> **రుచయించుమి సద్వివేకరూఢి యొనర్పన్.** " – శుకచరిత్ర 2–133

ఇంకా శుకుని సాధనచతుష్టయసంపన్నుడిగా, యోగసాంఖ్యజ్ఞానసంపన్నుడిగా వ్యాసుడు తీర్చిదిద్దాడు. ఈ మాటలు శాంతరసానికి కావలసిన విభావాదులలో తత్త్వజ్ఞానాన్ని తెలియ జేస్తాయి. ఆ తర్వాత కవి తృతీయాశ్వాసంలో శుకుని వైరాగ్యాన్ని తెలియజేయటానికి

> "తండ్రిజెప్పిన సద్బుద్ధి దలచి శుకుడు
> బుద్ధిలో నిట్టులని దలపోయదొడగె" అంటూ

> **"నిత్యమె దేహగేహములు నిత్యమె పత్ని సుతాదు లర్థముల్**
> **నిత్యమె వస్తు యానములు నిత్యమె పల్లెలు పట్టణంబులున్**
> **నిత్యమె దేశకాలములు నిత్యమె రాజ్యవిభుత్వలోకముల్**
> **నిత్యమె భూతముల్ ప్రకృతి నిత్యమె నెమ్మది నెంచి చూచినన్.**" – శుకచరిత్ర 3–4

అంటూ ఒక్కొక్క దాన్ని గూర్చి వివరంగా చెబుతూ, నిత్యానిత్యవివేకాన్ని ప్రదర్శించాడు. ఈ లోకంలోనూ, పరలోకంలోనూ ఉన్న సమస్తభోగాలను పరిత్యజించగల వైరాగ్యాన్ని పొందాడు. ఆ తర్వాత ఐహిక–ఆముష్మికభోగాలలో అనురాగాన్ని వదలి శమ–దమ–ఉపరతి–తితిక్షా–శ్రద్ధా–సమాధానములు కలిగినవాడు సుఖి అని తలచాడు శుకుడు. "నిత్యానిత్యపదార్థవిభాగియు, నిహాముత్రార్థ ఫలభోగ విరాగియు, శమాది షట్కసంపత్సంభోగియు, ముముక్షుతాసంయోగియు నగు శుకుడు" అని కవి వర్ణించడం వల్ల శాంతరసానికి కావలసిన తపస్సు, తాపస దర్శన, దేవతాక్షేత్రాదులు ఉద్దీపనలుగా నిలిచాయి.

శుకుని ఆశయసిద్ధి కూడా ఈ కావ్యంలో నెరవేరింది. శుకుడు ముక్తి కన్యకను వివాహం చేసుకోవడం అనేది ఆశయ సిద్ధి. ముక్తికన్యక అనేది కవి కల్పించిన పాత్ర. నిజానికి ముక్తికన్యక అంటే మోక్షమనే భావం కావ్యంలో మనకు స్పష్టంగా కన్పిస్తుంది.

కావ్య ప్రారంభంలో కవి ముక్తికన్య జననాన్ని వర్ణించాడు. జనకునికి, ప్రజ్ఞాసతికి పుట్టిన పట్టి ముక్తికన్య. ఆమె పుట్టుకను తెల్పుతూ ముముక్షుజనాశ్రయమోదసఖిగా, విమల తత్త్వజ్ఞాన వేత్రిగా అసమవైరాగ్యబోధాబ్జపాణిగా వర్ణింపబడింది.

పంచమాశ్వాసంలో నారదుడు ముక్తికన్యక రూపాన్ని వర్ణిస్తూ ఇలా అన్నాడు.

**"సత్తుగా పరిశుద్ధ సత్తమాకృతిగాగ – స్థిరతర ప్రణవంబు శిరముగాగ,**
**విమల బోధిత బుద్ధివృత్తి వక్త్రము గాగ – శ్రుతి వచశ్శ్రవణంబు శ్రుతులు గాగ,**
**మొగిబోధ విజ్ఞానములు నేత్రములు గాగ – దగు మనంబు కంధరము గాగ,**
**సచ్చిదా కృతులురోజద్వయంబును గాగ – యోగ సాంఖ్యములు బాహువులు గాగ,**

**శమదమములూరువులు తితిక్షా క్రియోప**
**రతులు పిఱుదులు భక్త్యతిశ్రద్ధ లంఘ్రి**
**యుగళమున్నాగముక్తుల తగులు బోడి**
**ముక్తి శుకవాణి యొప్పారు మునివరేణ్య."** – శుకచరిత్ర 5–14

ముక్తికి ఎన్ని పర్యాయపదాలు ఉన్నాయో అన్నిటిని కవి ప్రయోగించాడు. పరసతి అమృతాంగన, ముక్తిసతి, పరకాంత, మోక్షకమలాక్షి, మోక్షరమణి, అమృతకామిని, ముక్తితన్వంగి, ముక్తివధూటి, ముక్తివనిత, మోక్షరమావరానన, నిర్వాణసుందరాంగి, ముక్తికామిని, మోక్షకామిని వంటి అనేక పర్యాయపదాలను ప్రయోగించాడు. లోకంలో అనేక పేర్లతో వ్యవహరింపబడే వారున్నారు. అర్జునునకు, కృష్ణునికి అనేకమైన పేర్లున్నాయి. కాని వాటి వ్యుత్పత్తి అర్థాలు వేరే అర్థాన్ని స్ఫురింపజేస్తాయి. కాని ముక్తికన్యక కున్న అనేకమైన పేర్లు 'మోక్షం'అనే అర్థాన్ని మాత్రం ఇస్తాయి.

శుకుడు మోక్షకామినిని పొందడానికి అనేక రకాలుగా సాధన చేశాడు. సాధన రహస్యాన్ని తెలుసుకొన్నాడు. తండ్రి వ్యాసుని ద్వారా యోగరహస్యాలను గ్రహించాడు. మోక్షాన్ని పొందడానికి ఉవ్విళ్లూరాడు. తన తండ్రి ఆదేశంతో ముక్తికన్యను పొందడానికి జనకుని దగ్గరకు వెళ్లాడు.

**"ఆ జనకుడిహపరసుఖ**
**యోజకుడై యుండి యాత్మయోగ ప్రజ్ఞా**

**రాజీవాక్షిం జేకొని**
**రాజర్షి యనంగ బుడిమి రాజిల్లె నృపా?"** - శుకచరిత్ర 1-96

జనకుడు 'సమాధి' అనే యజ్ఞం చేసి ముక్తికన్యను పొందాడు. ఆమెను పొందడానికి శుకుడు మిథిలా నగరానికి బయలుదేరి వెళ్లాడు. దారిలో నారదుడు కన్పించి ముక్తికన్య గుణాధిక్యాన్ని వేనోళ్ల పొగడాడు. దాన్ని విన్న శుకుడు 'దత్స్వరూప బోధంబునకు విరోధంబులగు మోహ మనః ప్రాణ బుద్ధి కర్మేంద్రియ రాగాది విషయంబులనియెడి కుసుమశర హిమకర పవన శుక పిక శారికామధుకరంబులం" దూరాడు. ఇంద్రియాలను గుఱ్ఱాలుగా, మనోవృత్తుల్ని పగ్గాలుగా, షడ్గుణాల్ని సారథిగా చేసుకొని "ముముక్షుత్వాధికారయోగ్యస్థితి దనరు శరీర రథంబు నెక్కి " -

**"యోగ సాంఖ్య ముఖా యుధ యుక్తి మెఱయు**
**ప్రకట కరణాధి దేవతా భటులు వెంట**
**నడువ శుకయోగి సంతతానంద భోగి**
**జనియె మోక్షరమావధూ సక్తుడగుచు."** - శుకచరిత్ర 5-40

అనడం వల్ల శుకుడు తన ఆశయసిద్ధికి కావలసిన సర్వసంభారాల్ని చేకూర్చుకొన్నాడని తెలుస్తోంది.

విభావాదులచే పుట్టిన స్థాయి భావాల్ని పైకి తెల్పడం అనుభావం. శాంతరసానికి అనుభావాలైన యమ, నియమ, ఆసన, ధ్యాన, ధారణలు ఉపాసనలు కూడా కావ్యంలో ఎక్కువగా ఉన్నాయి. కావ్యంలో 3/4 వంతు శాంతరస అనుభావాలే ఉన్నాయనడం స్పష్టం. వీటిని వ్యాసుడు శుకుడికి ఉపదేశించాడు. శుకుడు అవిద్యా యంత్రాన్ని పడగొట్టే సమయంలో ఎన్నో ఆధ్యాత్మిక విషయాలు చెప్పాడు. శాంతరసానికి వ్యభిచారీ భావాలైన నిర్వేదం, స్మృతి, ధృతి, సర్వాశ్రమశౌచం మొదలైనవి కూడా కావ్యంలో పుష్కలంగా ఉన్నాయి.

యోగుల స్థితి, ప్రవృత్తి విచిత్రంగా ఉంటాయి. వారి దృష్టిలో మనస్సు అన్ని బంధాలకు మూలమైంది. మనస్సును చంపుకొనే మార్గంకోసం యోగి ఎప్పుడూ అన్వేషిస్తూ ఉంటాడు. రసానందం మనస్సు ఆత్మతో రమించే స్థితిలో కలుగుతుంది. యోగి మనస్సుని తొలగించి బుద్ధిని ఆ స్థానంలో నిలపాలని యత్నిస్తుంటాడు. అందువల్ల యోగికి నిర్వేదం, తత్త్వజిజ్ఞాస కల్గాలి. ఈ నిర్వేదం తత్త్వజిజ్ఞాస కావ్యనాయకుడు శుకునిలోనూ, అతని తండ్రి వ్యాసునిలోనూ ఎక్కువగా ఉన్నాయి. ఈ తత్త్వజిజ్ఞాస ఉండటం వల్ల శుకుడు వ్యాసుని దగ్గర, దేవగురువు బృహస్పతి దగ్గర, జనకుని దగ్గర, తత్త్వోపదేశం పొందాడు.

ఇలా శుకచరిత్రలో విభావాదులైన తత్త్వజ్ఞానం, వైరాగ్యం, అనుభావాలైన యమ, నియమ, ఆసన, ధ్యాన, ధారణ, ఉపాసనాదులు, వ్యభిచారీ భావాలైన నిర్వేదాదుల సంయోగంవల్ల శాంతరసం పోషింపబడింది.

ఘృతాచి, వ్యాసుల కలయికలో శృంగారం నామమాత్రంగానే చోటు చేసుకొంది. శుకచరిత్ర కేవలం తత్త్వప్రతిపాదకం కాబట్టి తదితర రసాలకు ఈ కృతిలో స్థానం లభించలేదు.

**3.5 ఛందః శిల్పం :**

కావ్యనిర్మాణంలో ఛందస్సుకు ఎంతో ప్రాధాన్యం ఉంది. ఒక భావాన్ని వ్యక్తపరచేటప్పుడు దాన్ని వ్యక్తపరచవలసిన తీరు కూడా పరిగణనలోకి తీసుకోవాలి. భావవ్యక్తీకరణోచితశబ్దాలను తగిన విధంగా ఒక చట్రంలో ఇమిడ్చే పని ఛందం చేస్తుంది. కావ్యంలో సందర్భోచితంగా భావోచితంగా భిన్నఛందస్సులు వాడబడుతూ ఉంటాయి. ఏ ఛందస్సు వాడాలో నిపుణుడయిన కవి బాగా తెలిసికొని ఉంటాడు. కాబట్టి ఛందో ప్రయోగం కవి నైపుణ్యానికి, అతని మేధోస్థాయికి అద్దం పడుతుంది అంటే అతిశయోక్తి కాదు. ఛందో ప్రాముఖ్యాన్ని, దాని ఆవశ్యకతా విశిష్టతలను డా॥ పాటిబండ మాధవశర్మగారు విశేషించి, విశ్లేషించారు. ఛందశ్శాస్త్రం అనేక వృత్తాలను గురించి వివరిస్తుంది.

శృంగారరసపోషణలో నాయికారూపవర్ణనంలో ఉపజాతి వృత్తాల్ని, వీరరౌద్రాది రస పోషణంలో వసంతతిలకం, చంద్రోదయాది వర్ణనలో రథోద్ధతం, సర్గాంతాలలో మాలిని వృత్తం, ప్రావృట్ప్రవాస వ్యసన చిత్రణలో మందాక్రాంతం; రీవి, ఓజం, శౌర్యం వర్ణించేటప్పుడు శార్దూలం ప్రయోగించాలని క్షేమేంద్రుడు చెప్పాడు.

శుకచరిత్రలో మొత్తం దాదాపు 1120 పద్యగద్యలున్నాయి. తెలుగులోని వృత్తాలు, జాతులనేవి ఇందులో ప్రయోగింపబడ్డాయి. వృత్తాలలో చంపకమాలలు 11, ఉత్పలమాలలు 59, మత్తేభం 24, శార్దూలం 10, స్రగ్ధర 3, తరళ 2, భుజంగ ప్రయాతం 2, పంచచామరాలు 6, మాలికా వృత్తాల్లోలయగ్రాహి 2, లయ విభాతి 1, దండకం 1 మిగిలినవి పృథ్వీ వృత్తం 2, సుగంధి వృత్తం 1, ఉర్వీవృత్తం 1, మానినీ వృత్తం 1 ఉండగా జాతులలో కందాలు 411, తేటగీతులు 164, సీసాలు 121, ఆటవెలదులు 37 ఉన్నాయి. మొత్తం 221 వచనాలు, 5 గద్యలు. ఈ శుకచరిత్రలో ఉన్నాయి. వచన రచనల్లో కొన్ని దీర్ఘంగా ఉంటే, కొన్ని ఏకపద మాత్రంగానే ఉన్నాయి. మొత్తం 221 వచనాలలో సగం 104 వచనాలు ఒక పదంతోనూ, రెండు మూడు పదాలతోనూ సాగాయి.

రామమూర్తికవికి **మార్గ**ఛందస్సుకంటే **దేశి**ఛందస్సుపై ఎక్కువ ఇష్టం ఉన్నట్లు తెలుస్తూ

ఉంది. మొత్తం 899 పద్యాల్లో కేవలం 161 పద్యాలు మార్గఛందస్సులో ఉంటే, 738 పద్యాలు దేశిఛందస్సులో ఉన్నాయి. మార్గదేశి అంటే వివరిస్తూ "ఛందస్సుకు సంబంధించినంత వరకు మార్గ ఛందస్సులనగా సంస్కృతముకు సంబంధించినవి, దేశి ఛందస్సులనగా దేశియ (ప్రాంతీయ)మైన భాష తెలుగు ఛందస్సులని చెప్పుకొనవచ్చు' నని డా॥ సంపత్కుమారాచార్య గారు తెలిపారు. ఆంధ్ర మహాభారతము, ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రచురణ, పీఠిక పు- 129.

రామమూర్తికవి ఈ పద్యాల్ని నడిపించిన తీరు, అనుసరించి ఔచిత్యం పరిశీలింపదగి ఉన్నాయి.

కావ్యంలో మొత్తం 411 కంద పద్యాలు ఉన్నాయి. అంటే దాదాపు సగం కావ్యం కంద పద్యాలలోనే ఉంది. ఆంధ్ర కవులు ఎక్కువగా కంద పద్యాల్ని ప్రయోగించడానికి కారణం లేకపోలేదు. కంద పద్య ప్రత్యేకతను గూర్చి తెలియ జేస్తూ డా॥ మాదేకుర్తి వేంకట సత్యనారాయణ "కందము నందుపయోగింపబడు గణములన్నియు చతుర్మాత్రాకములే. కావున దక్కిన పద్యము లందు గానరాని యొక లయ, ఒక క్రమము కందమునందు గన్పట్టును. మరియు బేసి పాదములందు మూడే గణములుండుట వలన నాల్గవ గణము వచ్చు సరికందలి ప్రాసము శ్రవః పేయమై యనుప్రాస ప్రాయముగ వినిపించును. కందము, త్వరితగతి కథా కథనమున కెంతయునుపకరించును. పురాణేతిహాసములు వివిధకథోపేతములగు బృహద్గ్రంథములు. అందు కథాకథనము మాంద్యము, విసువు గల్గించును. కావున నుచితజ్ఞులగు నన్నయ తిక్కనలు తమతమ భారతభాగములందు గందమునే దఱచుగా వాడియున్నారు" అన్నారు. ఆంధ్ర ఛందో వికాసము, పు- 265.

శుకచరిత్ర కావ్యంలో మొదటి ఆశ్వాసంలో 44. రెండో ఆశ్వాసంలో 55 పద్యాలు, ఐదో ఆశ్వాసంలో 86 పద్యాలు ఉండగా, మూడు, నాలుగు అధ్యాయాలు పూర్తిగా ఉపదేశాత్మకంగా యోగం, బ్రహ్మజ్ఞానం, ఆత్మజ్ఞానం వంటివి ఎక్కువగా ఉండడం వల్ల ఆ ఆశ్వాసాలలో కంద పద్యాలను ఎక్కువగా వాడడం ఉచితంగా ఉంది. చెప్పదలచిన ఉపదేశాల్ని ప్రత్యక్షంగా హృదయానికి హత్తుకునేలా చెప్పడం కంద పద్య ప్రత్యేకత.

**"దూషింపరాదు యితరులు**
**దూషింపగ వినగ రాదు దోషంబులన**
**న్వేషింపగరాదు విడబడి**
**భాషింపగరాదు గురుని భక్తుడు పెలుచన్.**" - శుకచరిత్ర 3-132

తేటగీతి, ఆటవెలది, సీస పద్యాల్ని శృంగారరసపోషణలోను, నాయికారూపవర్ణనలోనూ ప్రయోగించాలని క్షేమేంద్రుడు నిర్దేశించి ఉన్నాడు.

రామమూర్తికవి సీస పద్యాల్ని రూప, గుణ వర్ణనలకు, పురవర్ణన వంటి వర్ణనలకు, యోగ విషయాలను చెప్పడానికి ప్రయోగించాడు. ముఖ్యంగా రూప గుణ వర్ణనలో సీస పద్యాలను ఎక్కువగా ప్రయోగించాడు. అలాగే ఆటవెలది, తేటగీతి పద్యాలను గూడ అనేక సందర్భాలలో ఉపయోగించాడు. వృత్త ఔచిత్యాన్ని పాటించక పోయినా, రస నిష్పన్నాలైన కావ్యాల్ని వెలార్చిన అనేక కవులలో రామమూర్తి కవి కూడా పేర్కొనదగినవాడు.

వ్యాసునికి ఈశ్వరుడు సాక్షాత్కరించినపుడు రామమూర్తికవి విశేష వృత్తాల్ని ప్రయోగించాడు. 20 పద్యాలలో సాగిన ఈశ్వర స్తుతిలో దండకం, రెండు పంచచామరాలు, రెండు స్రగ్ధరలు, ఒక పృథ్వీ వృత్తం, ఒక సుగంధవృత్తం, ఒక ఉర్వీ వృత్తం, ఒక మానినీ వృత్తం ప్రయోగింప బడ్డాయి. స్రగ్ధర వృత్తాన్ని ఔద్ధత్యం ప్రదర్శించే సందర్భంలో ప్రయోగిస్తారు. ఈశ్వరస్తుతిలో వృత్తౌచిత్యం పాటింపబడింది.

> "**దాక్షాయణ్యాశ్రితాంఘ్రి ద్వయ ప్రమథ గణాధ్యక్ష దక్షధ్వరోద్య**
> **ద్దీక్షాసంక్షేప కృద్బుద్ధిజనిత మహదుద్రేక యుక్తానలాక్షా**
> **నక్షత్రాధీశ వర్ణార్ణసదృశ చిదానంద సందోహ పూర్ణా**
> **సాక్షాల్లక్ష్యాపరోక్షా క్షయసుఖద సహస్రారకంజాంతరస్థా.**" – శుకచరిత్ర 2–60

తరల వృత్తాన్ని లోక వృత్తాంతాన్ని చెప్పి నీతులు గరపడానికి ఉపయోగించాడు. లయగ్రాహి, లయవిభాతి, భుజంగప్రయాతం, పృథ్వీవృత్తం, పంచచామరం వృత్తాల్ని షష్ఠ్యంతాలలో ప్రయోగించాడు. ప్రతి ఆశ్వాసం చివర, ఆశ్వాసాంతగద్యకు ముందు మాలినివృత్తాన్ని ప్రయోగించాడు.

ఈ విధంగా రామమూర్తికవి కొన్నిచోట్ల వృత్తౌచిత్యాన్ని పాటించి, దేశీయమయిన వృత్తాలను గ్రహించి తిక్కనాదుల మార్గంలో పయనించి శుకచరిత్రవంటి వేదాంత ప్రతిపాదక గ్రంథాన్ని రసరంజితం చేయడానికి ప్రయత్నించాడు.

### 3..6 శుకచరిత్ర – ఆలంకారిక శిల్పం :

అలంకారాలు అంటే సొమ్ములు అని అర్థం. "**సౌందర్యమలంకారః**" అని ఆలంకారిక నిర్వచనం. ఈ అలంకారాలు వర్ణ్యవస్తుస్వరూపస్వభావాలను సముద్దీపింప జేసి రస భావాలను పోషించడానికి ఉపయోగపడతాయి. దీన్ని "కావ్యములందలంకారములు కవి యొక్క ప్రౌఢోక్తిచేత సిద్ధించును. మరియు కవి నిబద్ధత పాత్ర వాచికము వలన సిద్ధించును. ఎట్లు సిద్ధించినను

వర్ణ్యవస్తువుయొక్క తత్కాలమందలి స్వరూపస్వభావములను సహృదయుని బుద్ధియందు సముద్దీపింప జేయునదిగను మరియు ప్రధానకథాసంబంధి అనగా నంగి విషయ సంబంధి పరమార్థమును స్ఫురింపజేయునదిగాను, అలంకారముండ వలెను" – (తిక్కన కావ్య శిల్పము – పుట–487) అని డా॥ కేతవరపు వేంకట రామకోటి శాస్త్రిగారు అన్నారు. కవులు వారి ప్రతిభానుసారంగా తమ కావ్యాలలో అలంకారిక వైచిత్రిని ప్రదర్శిస్తూ ఉంటారు. ఎలాగైనా స్త్రీకి అలంకారాలు తగు రీతిలో ఉంటే శోభ చేకూరుతుందో అలాగే కావ్యంలో అలంకారాలు తగు రీతిలో ఉంటే కావ్యశోభ ఇనుమడిస్తుంది. అవాఙ్మానస గోచరమయిన దాన్ని కూడా తన కవితాప్రతిభతో అలంకారపరిజ్ఞానంతో పాఠకునికి గోచరింప జేస్తాడు. అందుచేత అలంకారాలు శబ్దార్థశక్తుల్ని పెంపొందించే గొప్పసాధనాలని చెప్పవచ్చు.

అలంకారాలు శబ్దాలంకారాలు అని, అర్థాలాంకారాలు అని రెండు రకాలు. భోజుడు సరస్వతీకంఠాభరణంలో శబ్దాలంకారాలు బాహ్యాలని, అర్థాలంకారాలు ఆభ్యంతరాలని చెప్పాడు. శబ్దాలంకారాలలో శబ్దాడంబరం ఉండడం వల్ల రసవ్యంజనం, భావస్ఫురణ లేకపోవచ్చు. అయినా అవి శ్రవణసుభగమై పామరులకు సహితం ఆనందాన్ని కలిగిస్తూ ఉంటాయి. అర్థాలాంకారాలు వర్ణ్యవస్తువులోని అంతరధర్మాన్ని నిరూపించే రసవ్యంజకాలవటంచేత కావ్యాలలో ఉపాదేయాలు :

శుకచరిత్ర కావ్యంలో కవి వివిధాలంకారాల్ని ఆయా సందర్భాలలో ప్రయోగించినా, రూపకాలంకారానికే ప్రాధాన్యమిచ్చాడు.

పరశురామపంతుల రామమూర్తి కవి తన కవిత్వాన్ని గూర్చి చెబుతూ "సదలని రూపకార్థములు" అని వ్రాయడం వల్ల కావ్యంలో ఎక్కువగా రూపకాలంకారాలనే ప్రయోగించినట్లు చెప్పవచ్చు.

రామమూర్తి కవి వృత్త్యనుప్రాస, లాటానుప్రాస, యమకం, ముక్త, పదగ్రస్తం వంటి శబ్దాలంకారాలు ప్రయోగించాడు. ఉపమ, రూపకం, అతిశయోక్తి, ఉత్ప్రేక్ష, శ్లేష, పరికరం, ఉల్లేఖం, విషమం, స్వభావోక్తి వంటి అర్థాలంకారాల్ని ప్రయోగించాడు. శబ్దాలంకారాలను ప్రయోగించినప్పటికి రామమూర్తి కవికి అలంకారాలపట్ల అంతగా ఆదర భావమున్నట్లు కనిపించదు. కావ్యంలో వాడిన అలంకారాల్ని ప్రధానంగా నాలుగు రకాలుగా వర్ణించవచ్చు. అవి – 1. వర్ణనాత్మకాలు, 2. మనోభావప్రదీపకాలు, 3. లోకజ్ఞతా ప్రదర్శకాలు, 4. తత్త్వార్థ–బోధకాలు.

శుక వైరాగ్య ప్రపంచోపదేశాన్ని వర్ణిస్తూ రామమూర్తి కవి ఇలా అన్నాడు.

**"మధుకరంబు లనేకమైన సుమంబులంగల తేనియల్**
**యధికతం గొని తెట్టెబెట్టిన యట్ల పెక్కు విధంబులన్**

**యధమ కృత్యములాచరించి దురాశ నెమ్మది ద్రిప్పగా**
**యధను డొక్కొక కాసు గూర్చి మహాపదార్థము గైకొనున్.**" - శుకచరిత్ర 3-28

తేనెటీగలు అనేకరకాలైన పుష్పాల నుండి తేనె గ్రహించి తేనె తెర పెట్టినట్లు, అధమ కృత్యాలు ఆచరించి దురాశ ద్రిప్పగా ధనం లేనివాడు ఒక్కొక్క కాసు కూర్చి మహాపదార్థం గైకొన్నాడు అని పద్యంలో చెప్పబడింది.

ఇందులో ఉపమేయం అధనుడు. ఉపమానం తేనెటీగలు. ఉపమా వాచకం అట్లు సమాన ధర్మం అస్పష్టం. కాబట్టి దీన్ని లుప్తోపమగా పేర్కొనవచ్చు. పద్యంలో సమానధర్మం లోపించడం వల్ల **ధర్మలుప్తోపమాలంకారం**గా దీన్ని పేర్కొనవచ్చు.

ఘృతాచి చిలుక అయిన వెంటనే వ్యాసునికి మన్మథతాపం ఎక్కువయింది. వెంటనే మన్మథ, చంద్ర, మలయమారుత పిక కీర షట్పందీసంతతుల్ని దూషించడాన్ని కవి ఒక్కొక్క పద్యంలో వర్ణించాడు. పికాల్ని తనపై కరుణ చూడమని వ్యాసుడు వేడుకొన్నట్లు చెప్పబడింది. ఈ సందర్భంలోనే అనేక అలంకారాలు వాడబడ్డాయి.

"**కుముద బాణుబోలి కుముదబాంధవు బోలి**
**మలయ పవను బోలి మార్కొనంగ**
**వలదు కరుణ జూడవలయు మీరైన నో**
**పికరవంబులార! పికములార!.** " - శుకచరిత్ర 2-109

పద్యంలో పూర్ణోపమాలంకారం చక్కగా గోచరిస్తుంది. ఉపమేయం ఒక్కటే. పికాలు. ఉపమానాలు మూడు కలువపూలు, చంద్రుడు, మలయపవనుడు.

ఘృతాచి వర్ణన సందర్భంలో చెప్పబడిన క్రింది పద్యం గమనార్హం.

"**చూపులు కుసుమ శరాసను**
**తూపులు బొమలతను విండ్లు తోరపు బలుకుల్**
**తీపులగు చిలుక పలుకులు**
**తీపులు గావించు నా సతీమణికరయన్.**" - శుకచరిత్ర 2-96

కవి ఘృతాచి నాభిని అతిశయోక్తులతో వర్ణించాడు.

"**తరమాధరమానిని సుం**
**దరమారయ మరునకైన దలపంగాకో**
**దరమా సతియారు, సరో**
**వరమా యెలనాగనాభివరుస గణింపన్.**" - శుకచరిత్ర 2-91

కవి సంబంధిత అతిశయోక్తి అలంకారాన్ని పై పద్యంలో హృద్యంగా ప్రయోగించాడు. రామమూర్తి ముక్తికన్య రూపాన్ని వర్ణిస్తూ ఉత్ప్రేక్షాలంకారాన్ని ప్రయోగించాడు.

**"ఆ సుందరి సౌందర్యము**
**నాసించి భవారితాననుంగుదయ్యేన్**
**నాసతి సన్ముఖమును బొద**
**జూచి ద్విజాధీశుదమృత సూతియునయ్యేన్.**" - శుకచరిత్ర 5-17

హేతువు కానిదాన్ని హేతువుగా ఊహించడం వల్ల హేతూత్ప్రేక్షాలంకారాన్ని పై పద్యంలో చూడవచ్చు.

ఘృతాచి వర్ణనలో ఆమె అందాల్ని ఒకదాని తరువాత ఒకటి చెప్పడం వల్ల క్రమాలంకారం ప్రయోగింపబడింది.

**"ఆ పువ్వుబోడి కోప్పాస్యంబు కన్నులు - బొమలధరమురదంబులు గళంబు**
**చెవులు చెక్కులు ముక్కు చేతులు పాలిండ్లు - గౌను త్రివళులు నూగారు నాభి**
**పిఱుదు లూరువులును పిక్కలు మీగాళ్లు - గోరులంఘ్రులు మదిగోరి చూడ**
**మొగులుదురాజు తమ్ములు చాపములు విద్రు - మంబు ముత్తెములు శంఖంబుశ్రీలు**
**ముకురములు చంపకములు తూండ్లు మొగ్గలాక**
**సముతరంగంబులహిరాజు సరసిసైక**
**తములు కరభంబులును కాహళములు కచ్ఛ**
**పములు చుక్కలిగుళ్లౌర! భళి తలంప.**" - శుకచరిత్ర 2-84

శుకచరిత్ర కావ్యం ప్రధానంగా తత్త్వప్రతిపాదకం కాబట్టి మానవస్వభావచిత్రణకు అంత ప్రాధాన్యం ఇవ్వలేదు. కాని అక్కడక్కడా కవి మనోభావప్రతీపకమైన అలంకారికరచన చేశాడు. వేదవ్యాసుడు తన కుమారుడు శుకునికి బుద్ధులు చెబుతూ-

**"ఓ కుమార! యిట్లు వోకుమారాపులు**
**దేకుమా! రహస్య దేశికులకు**
**నీకు మారమణుని నెయ్యంబె తగును గా**
**నీకుమారమణుల నెయ్యమేల.**" అన్నాడు. పద్యం శ్లేష ప్రయుక్తంగా ఉంది.

ముక్తికన్యను చూడాలనే కోరికతో నిండిన శుకుని మనస్సును రామమూర్తికవి రమణీయంగా ఆవిష్కరించాడు.

**"శ్రుతుల నేముచ్చటల్ శ్రుతమైన నవి విని - వినక యుండెడి వాని విధము దోప**
**తనువున నేస్పర్శ దగిలిన నది సోకి - సోక కుండెడివాని సూటి దెలుప**
**గనుల నేద్రవ్యముల్ గనుపడ్డ నవి కని - కనక యుండెడి వాని కరణి నెరప**
**జిహ్వ నేరుచులు భక్షితమైన నవి మెసం - గియు మెసంగనివాని క్రియదలిర్ప**

**నాసకే సురభి గొనంబడు నదిగొని**
**కొనక యుండు వాని యనువు దనర**
**వచ్చుచుండె నిట్లు వచ్చి హెచ్చి శుకుండు**
**దగ విదేహజనపదంబు సొచ్చె.**" - శుకచరిత్ర 5-43

పై పద్యం శుకుని పారవశ్యాన్ని చాటుతూ ఉంది. ఇక్కడ అతద్గుణాలంకారాన్ని ప్రయోగించి రామమూర్తికవి శుకుని సమాధ్యవస్థను తెలియ జేశాడు.

రామమూర్తికవి రచించింది తాత్త్వికకావ్యం. తత్త్వాన్ని బోధించడానికి కొన్ని లౌకిక విషయాల్ని చెప్పక తప్పదు. అలా కొన్నిచోట్ల ఆయన లోకజ్ఞతను ప్రదర్శించే అలంకారాన్ని ప్రయోగించాడు.

శుకునికి వ్యాసుడు గురువులేని విద్య ఎలాంటిదో చెబుతూ తన లోకజ్ఞతను ప్రదర్శించాడు. ఇక్కడే రామమూర్తికవి లోకజ్ఞత కూడా వెల్లడవుతూ ఉంది.

**"రాజముఖ్యుడు లేని రాజ్యంబు చాడ్పున - ప్రభువరేణ్యుడు లేని పల్లె మాడ్కి**
**అభిమాని లేని గృహంబు చందంబున - పురుషుండు లేని పూబోడి కరణి**
**తల్లిదండ్రులు లేని తనయుని పోలిక - శిక్షాక్రమము లేని శిశువు రీతి**
**బలువు కావలి లేని పైరు పంటల భాతి - పరిపాలకుడు లేని పశువు పగిది**

**నంబుగతియు లేని యంకురంబుల భంగి**
**దేహి లేని రిత్త దేహమట్లె**
**గురువులేని విద్య కూడదెవ్వరికైన**
**విధికినైన దైవ విభునకైన.**" - శుకచరిత్ర 3-95

ఈ పద్యంలో పూర్ణోపమాలంకారం గోచరిస్తుంది.

కావ్యం తత్త్వబోధంబును, ధర్మబోధంబును అయి ఉందని కవి చెప్పుకొన్నాడు. అందువల్ల కావ్యంలో చాలా భాగం తత్త్వబోధకంగా ఉంది. తత్త్వప్రబోధనార్థం ప్రయోగించిన అలంకారాల్లో ఎక్కువ సంఖ్య రూపకాలే.

కవి ప్రజ్ఞాసతి గర్భాన్ని వర్ణిస్తూ ఆమె అంగాంగాన్ని తాత్త్విక దృష్టితో పరిశీలించాడు.

ఇక్కడ కవి రచించిన సీసపద్యంలో రూపకాలంకారం, గీత పద్యంలో యథా సంఖ్యాలంకారం గోచరిస్తున్నాయి.

**"సత్కర్మ చరణాంబుజాతంబులేపార - ఘనతరోపాస్తిజంఘములు దనర**
**కలుష ప్రజాక్షయ కరభోరువులు మీర - భావ శుద్ధి నితంబభరములమర**
**కర్మ పరిత్యాగ గగన మధ్యంబొప్ప - దాత్విక వాసనోదరము మెఱయ**
**గురు వివేక స్తన కుంభముల్ రంజిల్ల - వైరాగ్య కరపల్లవములు మెఱయ**

**శమదమోపరతి క్షమా శ్రద్ధలును గ**
**ళాస్య దృక్కర్ణనాసలై యలర నిటల**
**మురుసమాధానము ముముక్షు తోత్తమాంగ**
**మై దొరయ గర్భిణీ చిహ్నలతివ కొదవె."** - శుకచరిత్ర 1-108

నారదుని చేత ముక్తికన్య రూపురేఖాదుల్ని విన్న శుకుడు మోహమనఃప్రవృత్తితో మన్మథుని, వెన్నెలను, మలయమారుతాన్ని, శుక, పిక, శారిక, భృంగాదుల్ని దూషించాడు. ఇక్కడ కూడా రూపకాలంకారమే రూపొందింది.

**"దేహ భూరుహములనెక్కి తివిరి విషయ**
**ఫలరసంబులు గొని మెక్కి బలము దక్కి**
**విహరణంబుల నన్నేల వెతల బెట్ట**
**జూచెదరు పొండి ధీంద్రియ శుకములార!."** - శుకచరిత్ర 3-35

శుకుడు జనకుడు ఏర్పాటు చేసిన స్వయంవరంలో మాయా యంత్రాన్ని ఛేదించాడు. శుకుడు చేసిన మాయాయంత్రభేదనాన్ని సాంగరూపకంగా రామమూర్తికవి వివరించాడు.

**"గురుకృపా లబ్ధి గైకొను నిశ్చల సమాధి - కలిమి కోదండంబుగా ధరించి**
**సురుచిరాంతర్ముఖ శుద్ధ సాత్వికవృత్తి - గడు దృఢంబుగ నారిగా నొనర్చి**
**"బ్రహ్మోహమస్మ్యహంబ్రహ్మాస్మి" యనెడు వా-క్యంబు గుణ ధ్వనిగా నమర్చి**
**ప్రత్యగభిన్నమౌ పరమాత్మ విజ్ఞాన - మనుమహా దివ్య సాయకము బూని**

**మది గురించి ప్రణవ మంత్రంబు మంత్రించి**
**యఖిల మంత్ర తంత్ర యంత్రములకు**
**మూలమంత్రమనగ జాలు మాయా యంత్ర**
**మరసి కూలనెసె నరణి సుతుడు."** - శుకచరిత్ర 5-247

అలాగే శుకునికి ముక్తికన్యకు జరిగిన శోభనాన్ని వర్ణించే సందర్భంలో కూడా రూపకం ప్రయోగింపబడింది.

**"తనువను తల్పము డిగి హె**
**చ్చున వైరాగ్యోదకముల జిత్తముఖక్షా**
**ళన మొందించి వివేకాం**
**బు నిధి స్నానాదికృత్యములు గొని పిదపన్."** – శుకచరిత్ర 5–273

పరశురామపంతుల రామమూర్తి తత్త్వబోధకంగాను, వేదాంతప్రతిపాదకంగాను శుకచరిత్ర కావ్యరచన చేశాడు. అతని దృష్టి కేవలం ఆధ్యాత్మికమే అయినప్పటికీ సమకాలీనకవితాధోరణిని దృష్టిలో పెట్టుకొని తన కావ్యాన్ని తీర్చి దిద్దాడు. వర్ణనలు, పాత్రపోషణ, రసపోషణ, ఛందో ప్రయోగం, ఆలంకారికశైలి మొదలయిన వాటిలో ప్రబంధపుపోకడలనే అనుసరించాడు. ఇక్కడ రామమూర్తి తన ఉద్దేశానికి, స్వేచ్ఛకు ప్రాధాన్యమివ్వక సమకాలీనకవితాధోరణికే ఎక్కువ ప్రాధాన్యమిచ్చినట్లు గోచరిస్తుంది.





## సరస్వతీస్తుతి

శ్లో॥ మాతః! త్వదీయపదపంకజభక్తియుక్తాః
యే త్వాం భజన్తి నిఖిలానపరాన్ విహాయ ।
తే నిర్జరత్వమిహ యాన్తి కళేబరేణ
భూవహ్నివాయుగగనాంబు వినిర్మితేన ॥

శ్లో॥ మోహాంధకారభరితే హృదయే మదీయే
మాతః సదైవ కురు వా సముదారభావే! ।
స్వీయాఖిలావయవనిర్మలసుప్రభాభిః
శీఘ్రం వినాశయ మనోగతమంధకారమ్ ॥



# 4. శుకచరిత్ర - యోగశాస్త్రవిషయాలు

**4.0 యోగ నిర్వచనం :**

యోగ శబ్దం '**యుజ్**' అనే సంస్కృతధాతువునుండి పుట్టింది. దీనికి కలిసికొనడం, ఏకమవటం, సమన్వయించడం అనే అర్థాలున్నాయి. జీవాత్మ పరమాత్మతో సంయోగం చెందటమే యోగ పరమార్థం.

"Encyclopedia of Religion and Ethics" లో దీన్ని గూర్చి ఇలా చెప్పబడింది. "In Indian Religion the term Yoga serves in general to designate any ascetic technique and any method of meditation " అంటే ఏ రకమైన ధ్యానాన్ని అయినా యోగం అన్నారు.

యోగం పరమేశ్వరదర్శనానికి అత్యుత్తమచక్షువని విష్ణుపురాణం చెబుతుంది.

**"ఆత్మ ప్రయత్నసాపేక్షా విశిష్టాయా మనోగతిః ।**
**తస్యా బ్రహ్మణి సంయోగో యోగ ఇత్యభిధీయతే ॥**

**ఏవమత్యంతవైశిష్ట్యయుక్తధర్మోపలక్షణః ।**
**యస్య యోగః స వై యోగీ ముముక్షురభిధీయతే ॥**

**యోగయుక్ ప్రథమం యోగీ యుంజానో హ్యభిధీయతే ।**
**వినిష్పన్నసమాధిస్తు పరంబ్రహ్మోపలబ్ధిమాన్ ॥**

**యద్యంతరాయదోషేణ దూష్యతే చాస్య మానసమ్ ।**
**జన్మాంతరైరభ్యసతో ముక్తిః పూర్వస్య జాయతే ॥** " - విష్ణుపురాణం VI- 7,31-34

ఆత్మజ్ఞానానికి సాధన భూతాలైన యమ నియమాదులతో మనోగతిని పరబ్రహ్మంలో నిమగ్నం చేయడమే **యోగం**.

ఈ యోగ విజ్ఞానాన్ని తెలిసికోవడానికి తోడ్పడేవి ఉపనిషత్తులు. వాటిలో యోగ తత్త్వోపనిషత్తు, మండల బ్రహ్మణోపనిషత్తు, యోగ కుండల్యుపనిషత్తు ప్రధానంగా పేర్కొన దగినవి. ఇవేగాక పతంజలి యోగసూత్రాలు, భగవద్గీత, యోగవాసిష్టం యోగ జ్ఞానానికుపరించే ప్రధాన గ్రంథాలు.

యోగోపనిషత్తుల్లో యోగం నాలుగు విధాలుగా చెప్పబడింది. అవి హఠయోగం, లయయోగం, మంత్రయోగం, రాజయోగం. అయితే ఇప్పుడు యోగమంటే హఠయోగ రాజయోగాల సమ్మేళనంగా భావింపబడుతూ ఉంది. ఇదే **అష్టాంగయోగ**మని ప్రసిద్ధి వహించింది. రామమూర్తి కవి దీనిని అభ్యాసయోగంగా పేర్కొన్నాడు. ఈ యోగం ఎనిమిది అంగాలతో కూడి ఉంటుంది. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులు.

రామమూర్తి కవి సాంఖ్యం, పతంజలియోగసూత్రాలను అనుసరించినట్లు తెలుస్తూ ఉంది. భారతీయసంప్రదాయానుసారం పతంజలి **పాణినివ్యాకరణా**నికి వ్యాఖ్యానం రచించాడని ఆయనే యోగసూత్రకర్త అని అంటారు. కాని ఇద్దరు పతంజలులు ఉన్నట్లు ఫెర్నాండోటోల కార్మన్ డ్రగోనెట్టి (Fernando Tola Carmen Dragonetti) తమ "The Yoga Sutras of Patanjali" గ్రంథానికి ఉపోద్ఘాతం వ్రాస్తూ పేర్కొన్నారు. "But the more widely held view now-a-days is that there are two patanjalis ` one the Grammarian and the other the yogin author of the Yogasutras and that Patanjali the Yogin lived between 300 and 500 A.D."

దీన్నిబట్టి యోగసూత్రకర్త క్రీ.శ. 300 నుండి 500 మధ్య నివసించినట్లు తెలుస్తూంది.

ప్రాచ్యపాశ్చాత్యపండితుల అభిప్రాయం ప్రకారం పతంజలి యోగసృష్టికర్త కాదు. ఆయనకు పూర్వం అస్తవ్యస్తంగా ఉన్న యోగసూత్రాలను క్రమబద్ధీకరించాడు. ఈ యోగసూత్రాలకు అనేక వ్యాఖ్యానాలు వచ్చాయి.

క్రీ.శ. 650–850 మధ్య యోగభాష్యం అనే వ్యాఖ్యానం వచ్చింది. 11వ శతాబ్దంలో భోజుని రాజమార్తాండం, 17వ శతాబ్దికి చెందిన రామానందసరస్వతి వ్రాసిన మణిప్రభ, 18వ శతాబ్దికి చెందిన నాగోజి భట్ట 'వృత్తి', నారాయణతీర్థుని చంద్రికలు తరువాత వచ్చిన వాటిలో పేర్కొనదగ్గవి. ఆ తర్వాత యోగశాస్త్ర సంబంధమైన అనేక గ్రంథాలు వెలువడ్డాయి. వీటికి సంబంధించి అనేక పద్యకావ్యాలు కూడా వచ్చాయి. వాటిలో యోగవాసిష్ఠం, శ్రీసీతారామాంజనేయసంవాదం, శుకచరిత్రలు పేర్కోదగ్గవి.

సీతారామాంజనేయసంవాదం కర్త లింగమూర్తి, శుకచరిత్ర కర్త రామమూర్తికవికి స్వయానా తండ్రి. విద్యాగురువు. అందువల్ల లింగమూర్తి, రామమూర్తి కవులు ఇద్దరూ సాంఖ్యయోగ, పాతంజలి యోగాల్ని అనుసరించినట్లు తెలుస్తూ ఉంది.

### 4.1 అష్టాంగయోగం :

రామమూర్తికవి యోగంలో రకాల్ని పేర్కొంటూ 'యోగం బభ్యాస యోగంబు జ్ఞానయోగంబు

నన ద్వివిధంబై యొప్పునందభ్యాసయోగంబు యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహారధ్యాన ధారణా సమాధులను నష్టాంగంబుల విలసిల్లు' అన్నాడు.

యోగశబ్దం '**యుజ్ సమాధౌ**' అనే అర్థంలో ఉండడం వల్ల యోగమంటే సమాధి అనే అర్థం వస్తుంది. సమాధి అంటే సంప్రజ్ఞాత సమాధి అని అర్థం. ఇది అత్యంతశ్రేష్టమైన అవస్థ. యోగసాధనకు లక్ష్యం. శ్రద్ధ, వీర్య, స్మరణ, సమాధి, ప్రజ్ఞల వల్ల మాత్రమే సమాధి స్థితి వస్తుంది. ఈ లక్ష్యసాధనకు అభ్యాసయోగం అవసరం. అభ్యాసయోగసాధన అష్టాంగ యోగసాధనగా పరిగణింపబడుతూ ఉంది. చిత్తమాలిన్యాలన్నీ నశించగా పరిశుద్ధచిత్తం భాసిస్తుంది. అప్పుడు పురుషునిలోని ఆత్మజ్ఞానం ప్రకాశిస్తుంది. దానిని సాధించడం కోసమే అష్టాంగయోగాన్ని అనుసరించాలి అని యోగసూత్రాలు పేర్కొంటూ ఉన్నాయి.

"**యోగాంగానుష్టానాదశుద్ధిక్షయే జ్ఞానదీప్తిరావివేకఖ్యాతేః**" – యోగసూత్రాలు 1–28

ఈ యోగాంగాలు ఎనిమిది అవి – 1. యమ, 2. నియమ, 3. ఆసన, 4. ప్రాణాయామ, 5. ప్రత్యాహార, 6. ధారణ, 7. ధ్యాన, 8. సమాధి.

రామమూర్తికవి యోగాన్ని అభ్యాసయోగం, జ్ఞానయోగమని విభజించి అభ్యాసయోగంలో ఎనిమిది యోగాంగాలను పేర్కొన్నాడు. జ్ఞానయోగంలో రాజయోగాన్ని పేర్కొని, అందులో తారక సాంఖ్య, అమనస్క యోగాలను పేర్కొన్నాడు.

**4.1.1. యమం :**

అష్టాంగ యోగ లక్షణాలైన యమ లక్షణాన్ని పతంజలి "**అహింసాసత్య,మస్తేయబ్రహ్మచర్య–అపరిగ్రహా యమాః**" అన్నాడు. (యోగసూత్రాలు – 1–30)

దీన్ని రామమూర్తి కవి –

"**యమ, మహింస, యనంగ సత్యంబనంగ**
**సలలితాస్తేయ మనబ్రహ్మ చర్యమనగ**
**దనర నపరిగ్రహంబన ధరణి నైదు**
**దెఱ గులైయుండు చెప్పెద దెలియువాని.**" – శుకచరిత్ర 3–207

1. ఇతరులను హింసింపకుండటం, 2. నిజం చెప్పటం, 3. దొంగలింపకుండటం, 4. పరస్త్రీలను తలచకుండా స్వభార్యతో ఋతుకాలంలో కూడటం, బ్రహ్మమనగా వేదము – పరబ్రహ్మము – వేదాధ్యయనం – పరబ్రహ్మ ధ్యానం ఇవి బ్రహ్మచర్యం, 5. ఎలాంటి స్థితిలోనైనా పరుల దగ్గర చేయి చాపి గ్రహింపకుండటం అనేవి యమ లక్షణాలుగా పేర్కోబడ్డాయి. కానీ

కొందరు యమానికి పది లక్షణాలున్నాయి అన్నారు. 1. అహింస, 2. సత్యం, 3. ఆస్తేయం, 4. బ్రహ్మచర్యం, 5. క్షమ, 6. ధృతి, 7. దయ, 8. ఆర్జవం, 9. మితాహారం, 10. శౌచం అనేవి (యోగము – తంత్రము, పుట–31).

రామమూర్తికవి యమ లక్షణాల్ని ఒక్కొక్కదాన్ని తిరిగి వివరించాడు. అహింసను రెండు పద్యాల్లో, సత్యాన్ని రెండు పద్యాల్లో, అస్తేయాన్ని రెండు పద్యాల్లో వివరిస్తూ ఒక సీసపద్యంలో అష్టమైథునాలను వివరించాడు. అపరిగ్రహాన్ని రెండు పద్యాల్లో వివరించాడు.

**4.1.2 నియమ లక్షణం :**

పతంజలి **నియమ** లక్షణాల్ని తెలుపుతూ

"**శౌచసంతోషతపఃస్వాధ్యాయేశ్వరప్రణిధానాని నియమాః**" అన్నాడు.

– యోగసూత్రాలు – 2–32

**"అనఘ శౌచంబు తపము స్వాధ్యాయమాత్మ**
**తోషణం బీశ్వరార్చన తోడ నియమ**
**మైదు తెఱ గుల విలసిల్లు నందు శౌచ**
**మరయ బాహ్యాంతరద్వయమయ్యె వినుము.**" – శుకచరిత్ర 3–219

**1. మృజ్జలాదులతో బాహ్యశౌచాన్ని, సర్వభూతప్రీతితో మైత్రితో అంతశ్శౌచాన్ని కలిగించడం శౌచం :** 2. ఇంద్రియాలను స్వేచ్ఛగా సంచరింపనీయక తనవశంలో ఉంచుకోవటం తపం, 3. జ్ఞానదాయకాలైన వేదవేదాంతాలను నిరంతరం చదవటం స్వాధ్యాయం, 4. నిత్యం సంతోషిగా ఉండటం – సంతోషం, 5. భగవంతుణ్ణి ధ్యానించడం, అర్చించడం ఈశ్వరార్చన కిందికి వస్తాయి.

జె.సి. కామేశ్వరరావు గారు నియమానికి కూడా పది లక్షణాల్ని పేర్కొన్నారు. తపస్సు, సంతోషం, ఆస్తిక్యం, దానం, ఈశ్వరపూజనం, సిద్ధాంతశ్రవణం, లజ్జ, మడి, జపం, వ్రతం అనేవి.

యమ నియమాలు పదిచేరి యోగదర్శనం యొక్క దశాజ్ఞలు అవుతాయి. శీలం పునాదిగా ఉంటే ఆధ్యాత్మికశిక్షణ స్థిరంగా నిలుస్తుంది.

**4.1.3 ఆసనం :**

"**స్థిరసుఖమాసనమ్**" (యోగసూత్రాలు 2–46) దేహానికి ఎలాంటి కదలిక, ఉద్వేగం లేకుండా

కూర్చోవటం ఆసనం. అనంతుని ధ్యానం వల్ల ఆసన స్థిరత్వం సిద్ధిస్తుంది. ఈ ఆసనాన్ని గూర్చి మిర్సియ ఇలియేడ్ (Mircea Eliade) తన వ్యాసం Yoga లో (Encyclopeadia of Religion and Ethics, P-521) ఇలా అంటాడు. .... Yogic technique begin with asana, the well known bodily posture of Indian Ascetics Asana gives a rigid stability to the body while at the same time reducing physical effort to a minimum and finally eliminating it altogether. Asana is the first concrete step taken with a view to abolishing the modalities peculiar to the human condition".

రామమూర్తికవి స్వస్తికాసనం, గోముఖాసనం, పద్మాసనం, వీరాసనం, సింహాసనం, మయూరాసనం, కుక్కుటాసనం, భద్రాసనం, కూర్మాసనం, సిద్ధాసనం అనే పది ఆసనాల్ని పేర్కొన్నాడు. ప్రపంచంలో ఎన్ని జీవజాలాలు ఉన్నాయో అన్ని ఆసనాలు ఉన్నాయట. వాటిని ఈశ్వరుడే ఎరుగునని గోరక్షనాథుని మతం, పరశురామపంతుల లింగమూర్తికవి తన సీతారామాంజనేయసంవాదము కావ్యములో 22 ఆసనాలను పేర్కొన్నాడు. రామమూర్తికవి పేర్కొనని మతాంతర సిద్ధాసనం, యోగాసనం, ఉత్తాన కూర్మాసనం, మతాంతర సిద్ధాసనం, ధనురాసనం, కపాలాసనం, ముక్తాసనం, టిట్టిభాసనం, పశ్చిమోత్తానాసనం, పూర్వోత్తానాసనం, అర్ధకాసనం, కామదహనాసనం వంటి ఆసనాల్ని పేర్కొన్నాడు. పంచీకరణభాష్యములో పది ఆసనాలు పేర్కోబడ్డాయి.

"సిద్ధాంబుజం స్వస్తికముక్త వీర భద్రాహిభుక్ సింహగవాముఖాని
సుఖాసనశ్చైవ సమంచితాని తతో దశైతాని వరాసనాని" - యోగసూత్ర భాష్యం, పుట-39

సిద్ధం, పద్మం, స్వస్తికం, ముక్తం, వీరం, భద్రం, మయూరం, సింహం, గోముఖం, సుఖాసనం అనే పది ఆసనాల్ని పేర్కొని ఎవరెవరికి ఏ ఏ ఆసనాలు యుక్తాలో తెలియ జేయబడి ఉంది.

"గృహిణామంబుజం, సిద్ధం గృహస్థాత్మకవర్మనాం
సుఖాసనం చ సర్వేషామిత్యేతా త్రివిధం వరమ్ " - యోగసూత్ర భాష్యం, పుట-39

గృహస్థులకు పద్మాసనం, సంన్యాసులకు సిద్ధాసనం, అందరికీ సుఖాసనం తగినదన్నాడు. రామమూర్తికవి దశవిధాసనంబులలో సిద్ధ పద్మ భద్ర సింహాసనంబు లుత్తమంబులు. వీనిలో సిద్ధ పద్మాసనంబులత్యుత్తమంబు లందు సిద్ధాసనంబు గృహస్థాతీతులకును, పద్మాసనంబు గృహస్థాశ్రమానుసారులకును యోగ్యంబని చెప్పుదురు" (శుకచరిత్ర 3-238) అన్నాడు. కవి ఒక్కొక్క పద్యంలో ఒక్కొక్క ఆసనాన్ని గూర్చి చెప్పాడు.

**4.1.4 ప్రాణాయామ లక్షణం :**

పతంజలి దీన్నిగూర్చి చెబుతూ "**తస్మిన్సతి శ్వాసప్రశ్వాసయోర్గతివిచ్ఛేదః ప్రాణా-యామః**" (యోగసూత్రాలు 2-48) అన్నాడు. అంటే లోపలి నుండి వెలుపలికి వచ్చే గాలి శ్వాసను వెలుపలి నుండి లోపలికి పీల్చు గాలి ప్రశ్వాసను పోనీయకుండా రోధించడమే ప్రాణాయామం. రామమూర్తి కవి ప్రాణాయామం అంటే పేర్కొనలేదు కానీ ప్రాణాయామం ఎన్ని రకాలో తెలియజేశాడు. ప్రాణాయామం ప్రాకృతం, వైకృతం, కుంభకం అని మూడు విధాలని పేర్కొన్నాడు. ప్రాకృతమే మంత్రయోగమని, వైకృతమే లయయోగమని, కుంభకమే హఠయోగమనీ పేర్కొన్నాడు.

శ్రీసీతారామాంజనేయసంవాద కావ్యానికి తాత్పర్యం వ్రాసిన వెన్నెలకంటి సుందరరావు శర్మ వీటిని గూర్చి ఇలా వివరించారు. "సూర్యోదయము మొదలు రేపటి సూర్యోదయము వరకు మూలాధారకమలంబున గణపతికి ఆఱు నూఱును, స్వాధిష్ఠానకమలమున బ్రహ్మకు ఆఱు వేలును, అనాహతకమలంబున రుద్రునకు ఆఱు వేలును, విశుద్ధ కమలంబున నీశ్వరునకు సహస్రంబును, ఆగ్నేయ (ఆజ్ఞా) కమలంబున సదాశివునకు సహస్రంబును, సహస్రారంబున గురువునకు సహస్రంబును, అజపాగాయత్రీ మంత్రజపమును సమర్పించుటే ప్రాకృత ప్రాణాయామము, రేచక పూరక కుంభక క్రమములచేత తొలుత అధస్సంచారముగల ప్రాణవాయువునందు ఊర్ధ్వసంచారముగల యపానమును, వెనుక అపానమందు ప్రాణమును చేర్చుట వైకృత ప్రాణాయామము. మూలబంధ - ఉద్యాణబంధ - జాలంధర బంధముల గావించి రేచక పూరకములను నిలిపి ప్రాణాపానములను రెంటిని రేయింబవలొక్క ఫక్కిగ నిలుపుట కుంభక ప్రాణాయామము." శ్రీసీతారామాంజనేయ సంవాదము, పుట 98-99.

మంత్రయోగాన్ని గూర్చి రామమూర్తి కవి

"**అనిశము స్వభావనియతమైనట్టి రేచ**
**కంబు పూరక కుంభక క్రమముచేత**
**హంస లిరువది యొక్క వేయారు నూరు**
**గా జపించుట మంత్ర యోగంబు వత్స**." - శుకచరిత్ర 3-240

రేచకం, పూరకం, కుంభక క్రమంతో హంసలు ఇరవై ఒక్క వేయారు నూర్లు జపించడం మంత్రయోగమని రామమూర్తి అభిప్రాయం. హృదయంలోని ప్రాణవాయువు నాసిక నుండి పన్నెండు అంగుళాలు వెలికి రావడం రేచకం అంటారు. ఇలా వెలికి వచ్చినప్పుడు అర్ధభాగం వెలుపల ఉండటాన్ని బాహ్య కుంభకం అంటారు. గాలిలోపలికి వెళ్లటాన్ని పూరకమని అంటారు. వీటితో పాటు హంసలను ఇరువది యొక్క వేయారు నూరుగా జపించటం మంత్రయోగం.

పరశురామపంతుల రామమూర్తి లయ యోగ, హఠయోగాల్ని ఒక సీసపద్యంలో వివరించాడు.

**"సంతతాభ్యస్త రేచక ముఖ్య మారుత – త్రయ నిరోధ ప్రకారంబు చేత**
**ప్రాణంబు నందు నపానం బపానంబు – నందు ప్రాణంబు నహర్నిశంబు**
**లయముగా నుంచుట లయ యోగమన నొప్పు – మఱియు నాచార్య సమ్మతిగ బూని**
**మూలంబు భేదించి మూలబంధో ద్యాన – బంధ జాలంధర బంధ పూర్వ**

**కముగ రేచక పూరక గతుల నుడిగి**
**ప్రాణము నపానమును రేయి బగలు నొక్క**
**పగిది గుంభించి సుస్థిర భావు డగుచు**
**నల రుచుండుట హఠయోగ మలఘు చరిత."** – శుకచరిత్ర 3-241

రేచక, పూరక, కుంభక మనే వాయు త్రయాన్ని బంధించి ప్రాణంలో అపానంబు, అపానంబులో ప్రాణాన్ని అహర్నిశలు నిలపడాన్ని లయయోగమని, ఆచార్య సమ్మతిగ మూలోడ్యాణ జాలంధర బంధాలతో రేచక, పూరక గతులను వదిలి ప్రాణాన్ని గుంభించడం **హఠయోగ**మని రామమూర్తి కవి తెలిపాడు.

అష్టాంగంలోని యమ నియమాదులు, మంత్రయోగం హఠయోగ మందలివే. ఇవి రాజయోగానికి ఆధార భూమికల వంటివి. **రాజయోగం** సర్వవృత్తినిరోధలక్షణమైన **అసంప్రజ్ఞాత యోగం**, లేక **అమనస్కయోగం**. ఈ అమనస్కాన్ని అధిరోహించాలనుకొనేవారికి హఠయోగం నిచ్చెన వంటిది.

ప్రాణాయామం అంటే ప్రాణాన్ని గ్రహించడం అని అర్థం. ఈ ప్రాణాయామం ప్రాకృతం, వైకృతం, కుంభకం అని మూడు రకాలు. వీటి లక్షణాల్ని డా॥ రత్నాకర బాలరాజు ఇలా తెలియజేశారు. "స్వభావ నియత రేచక పూరక కుంభక క్రమముల చేత 21600 సంఖ్యతోడి, అజపా (హంస) మంత్రానుష్ఠానము మంత్రయోగము ప్రాకృతము. ప్రాణము నందపానమును, అపానమునందు ప్రాణమును లయింప జేయుట **లయయోగ**మని రామమూర్తి కవి వివరించును. ఇది ప్రయత్న పూర్వకమగుటచే వైకృతప్రాణాయామమనబడును. ప్రాణాయామ శబ్దమందున్న ప్రాణ శబ్దమునకు శ్వాసము, ఉచ్ఛ్వాసమునను క్రియలని యర్థము. కానీ ప్రాణమనియు, అపానమనియు భేదము చెప్పినప్పుడు ప్రాణమనగా పైకి బయటకు బోవు ఉచ్ఛ్వాస వాయువనియు, అపానమనగా లోపలికి బోవు శ్వాసమనియు అర్థమెఱుగ వలయును. ఈ యర్థమున అపానమందు (లోపలికి తీసికొను శ్వాసమునందు) ప్రాణమును (ఉచ్ఛ్వాసము)

హోమము చేసిన పూరకమను పేరుగల ప్రాణాయామమగును. ప్రాణమందు అపానమును హోమమొనర్చిన రేచక ప్రాణాయామమనబడును. ప్రాణాపానములు రెండును నిరోధింపబడినచో కుంభక ప్రాణాయామమనబడును".

**4.1.5 ప్రత్యాహార లక్షణం :**

సర్వేంద్రియాలు తమ తమ వృత్తులనుండి మరలింపబడి అంతఃకరణ మందే లీనమొనర్చటం ప్రత్యాహారం. '**స్వవిషయాసంప్రయోగే చిత్తస్య స్వరూపానుకార ఇవేంద్రియాణాం ప్రత్యాహారః**' – యోగసూత్రాలు – 2–54.

రామమూర్తి కవి –

> "**కూర్మమవయవముల గుదియించు గతి విష**
> **యముల వలన నింద్రియముల మలచి**
> **యాత్మనుపరమింపనగుట ప్రత్యాహార**
> **మని వచింతు రార్యులమల హృదయ.**" – శుకచరిత్ర 3–243

ఇది సిద్ధిస్తే ఇంద్రియాలన్నీ మనవశంలో ఉంటాయి. మనస్సు ఒక ధ్యేయవస్తువు నందు నిలకడ చెందినప్పుడు ఇంద్రియాలు బాహ్యవిషయాలచేత ప్రభావితం కావు. అప్పుడు చిత్తం విక్షేపాలకు లోనుగాదు. గాలిలేని దీపంలా నిలకడను పొందిన మనస్సుకు ఏకాగ్రతా శక్తి ఇనుమడిస్తుంది.

**4.1.6 ధ్యాన లక్షణం :**

పతంజలి యోగసూత్రాల్లో ధారణ తర్వాత ధ్యానం చెప్పబడింది. కానీ లింగమూర్తికవి రామమూర్తికవి ఇద్దరూ ధ్యానం తర్వాత ధారణను పేర్కొన్నారు. శుకచరిత్రలో ఉన్నవాటినే సీతారామాంజనేయసంవాదం 1–87 వ్యాఖ్యలో శ్రీసంగ శేషాచలశాస్త్రి విరచితం – 278 పుటలో) ఉదాహరించారు. శ్రీ వెన్నెలకంటి సుందరరామశర్మ తన 1–87 వ్యాఖ్యలో – 102 పుట – ఈ రెండు పద్యాలను (ధ్యానలక్షణం) ఉదాహరించారు.

> "**మానస కమలమునందును**
> **శ్రీనారాయణుని మూర్తి జింతింపుచు లో**
> **ధ్యానము సేయుట సగుణ**
> **ధ్యానంబని యంద్రు సుజనులమలవివేకా.**" – శుకచరిత్ర 3–247

> "**కమలాసనస్థుడై కాయంబు నిక్కించి – కరములూరులు జేర్చి కనులు మూసి**
> **దేహేంద్రియ ప్రాణ ధీమ నాదిక మెల్ల – దృశ్యమేగాను దద్రుక్కు నేను**

**దృశ్యమేగాను దద్దృక్కు నేననువృత్తి - దృశ్యంబు గాన దద్దృక్కు నేన**
**యని విజాతి ప్రత్యయ నివృత్తిగా సజా - తి ప్రత్యయ ప్రవృత్తి క్రమమున**

**నాత్మదానైన యందాక నయ్యశేష**
**దృశ్య దృగ్వృత్తులను నిషేధించు కొనుచు**
**ననిశమాత్మావలో కనమందుచుంట**
**నిర్గుణధ్యానమన జెల్లు నిర్మలాత్మ.**" - శుకచరిత్ర 3-248

ధ్యానం సగుణధ్యానం, నిర్గుణధ్యానం అని రెండు విధాలు. హృదయంలో తటస్థ లక్షణ స్వరూపుడైన విరాట్పురుషుణ్ణి నిలిపి మనస్సుచేత సమస్త వస్తువుల్ని కల్పించి షోడశోపచారాల్ని చేసి ధ్యానించడమే **సగుణధ్యానం**. పద్మాసనంనుండి శరీరాన్ని నిక్కించి చేతుల్ని తొడలపై నుంచి నేత్రాలు మూసి స్థూల సూక్ష్మ కారణ శరీరాల్ని పద్నాల్గు ఇంద్రియాలు దశ విధ ప్రాణాలు దృశ్యాలు. ఆ దేహేంద్రియ ప్రాణాలు నేనుగాను, దీనిని వీక్షించే సాక్షిని నేననే వృత్తియును దృశ్యమే గనుక ఆ వృత్తిని చూచే సాక్షిని అనే మాయా కల్పితాలై విజాతీయాలగు యుష్మత్ప్రతీతి ప్రత్యయ గోచరాదులనే అంతర్దృశ్యాలును, ఆ దృశ్యాలకు సాక్షి అనే వృత్తిని నిర్దేశిస్తూ సత్య జ్ఞానానంద నిర్మలాఖండ స్వరూపమై సర్వదృక్కగు పరబ్రహ్మం తానే నన్న ధార్ఢ్యం కలుగగా, ఎల్లప్పుడూ నిర్వికల్పబ్రహ్మనిష్ఠ కలిగి ఉండడమే **నిర్గుణధ్యానం**.

ధ్యానాన్ని గూర్చి యోగసూత్రాల్లో ఇలా ఉంది.

"**తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్**" - యోగసూత్రాలు 3-2

ఇష్టవస్తువుపై అవిచ్ఛిన్నంగా మనస్సుని నిలిపి దాన్ని మననం చేయటం ధ్యానం(Prolonged Concentration) అనబడుతుంది. ఈ అవస్థలో ఇష్టవస్తువు మినహా ఇతర వస్తువులపై జ్ఞానం చిత్తానికి ఉండదు.

**4.1.7 ధారణ క్రమం :**

హృదయంలోనో, నాసికాగ్రభాగంలోనో, భ్రూమధ్యంలోగాని, జిహ్వాగ్రంలోగాని, లేదా బాహ్యవస్తువులో గానీ, లేక ఇష్టదేవతపై గానీ, గురువుపై గానీ చిత్తాన్ని లగ్నం చేయడం ధారణ అనబడుతుంది.

"**దేశబంధశ్చిత్తస్య ధారణా**" (యోగసూత్రాలు 3-1) దీన్ని రామమూర్తికవి ఇలా పేర్కొన్నాడు.

"**ఆధారమణి పూరకాబ్జాత ముఖ్యచ - క్రాంతస్థలంబు లయందె కాని,**
**జీవ ప్రవర్తనస్థిత్యుపేతాష్ట ద-ళాంభోజ మధ్యంబు నందె కాని**

**భ్రూమధ్య దృష్టి శోభిత హృన్నభో దీప్తి - బిందు నాద కళలయందె కాని**
**యశ్రాంత రేచకాద్య నిలత్రయోపయు-క్తా త్మ మంత్రార్థంబు నందె కాని**
**భాను కోటి ప్రభాసమభాసమాన**
**మగు సహస్రారకమలంబు నందె కాని**
**ప్రబల మగు చిత్తమరి కట్టబడచు నుంట**
**ధారణా యోగ మనబడు ధర్మ నిరత.**" - శుకచరిత్ర 3-250

అష్టాంగయోగంలో ధారణ తర్వాత, ధ్యానం పేర్కొనబడి ఉంది. కానీ రామమూర్తి కవి ధ్యానం తర్వాత ధారణను పేర్కొన్నాడు. కానీ పరిశీలించి చూస్తే ధారణ తర్వాత ధ్యానం పేర్కోవడం సమంజసంగా ఉంది. ధారణలో ఏదో ఒక ప్రదేశంలో చిత్తాన్ని లగ్నం చేస్తే ధ్యానంలో ఒకే వస్తువుపై ధ్యానం ఉంచడం కన్పిస్తుంది.

యమనియమాల్ని శ్రద్ధతో పాటిస్తూ ఆసన ప్రాణాయామాలను క్రమం తప్పకుండా అభ్యాసం చేయడంవల్ల యోగసాధకునికి చిత్తనైర్మల్యం ఏర్పడి ఏకాగ్రతాశక్తి పెరుగుతుంది. దానివల్ల ప్రత్యాహారం సులభమవుతుంది. ప్రత్యాహారం సిద్ధించినప్పుడు అతనికి ఇంద్రియాలన్నీ వశంలో ఉంటాయి. అప్పుడు అతడు ఏ విషయంలోనైనా మనస్సును కొంతకాలం లగ్నం చేయ గలుగుతాడు. ఈ స్థితి తర్వాత ఇష్టవస్తువు లేదా విషయంపై తప్ప ఇతర వస్తువులపై మనసు లేకపోవడం ధ్యానస్థితిలో ఉంటుంది. అందువల్ల ధారణ తర్వాతే ధ్యానం ఉండడం సమంజసం.

### 4.1.8 సమాధి :

యోగసాధనలో ఇది చివరి మెట్టు. విక్షేపాలు తొలిగిపోయి చిత్తం ధ్యేయ వస్తువులో ఏకాగ్రం కావడం సమాధి అవుతుంది.

"నిరుధ్యంతే యస్మిన్ ప్రమాణాది వృత్తయోవస్థా విశేషేసో చిత్తస్య అవస్థావిశేషో యోగః" - యో.భా.వ్యా. 1.2

ఏ చిత్త స్థితిలో ప్రమాణాది చిత్తవృత్తులన్నీ నిరోధింపబడి ఉంటాయో ఆ స్థితికి యోగమని పేరు.

యోగసూత్రాల్లో సమాధికి ఈ క్రింది నిర్వచనమివ్వబడింది.

"**తదేవార్థమాత్రనిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః**" యోగసూత్రాలు 3-3

ధ్యానంలో తాను ధ్యాత, ఈశ్వరుడు ధ్యేయుడు. ఈ ఏకాకార స్థితిలో ధ్యానం ధ్యేయ ఆకారాన్ని పొంది స్వరూప శూన్యం అవుతుంది. ధ్యానస్థితిలో త్రిపుటి (ధ్యాత, ధ్యానం,

ధ్యేయం) జ్ఞానం ఉంటుంది. సమాధిలో అవేవి ఉండక ధ్యేయాకారాన్ని ధరిస్తాయి. ఇది ధ్యేయాకార వృత్తి ధ్యాతకు తనను గూర్చిన ధ్యాస ఉండదు. తాను చేస్తున్న ధ్యానక్రియను గురించిన స్పృహ కూడా ఉండదు. కేవలం ధ్యేయ వస్తువు మాత్రం మిగిలి పోతుంది. అది కూడా అర్థమాత్రంగా ఉండీ ఉండనట్లుగా ఉంటుంది.

**"యదా సంక్షయతే ప్రాణో మానసం చ ప్రతీయతే ।**
**తదా సమరసత్వం చ సమాధిరభిధీయతే ॥ "**

ప్రాణం లీనమైనపుడు మనసు కూడా లీనమవుతుంది. అపుడు సమరస భావం కలుగుతుంది. దీన్ని **సమాధి** అంటారు. ఈ సమాధి భేదాల్ని తెల్పుతూ భాష్యకారుడు చెప్పిన శ్లోకం.

**"సవికల్పానిర్వికల్పసమాధిర్ద్వివిధా భవేత్ ।**
**దృశ్యశబ్దానువిద్ధోఽయం సవికల్పః పునః ద్విధా ॥"**

సమాధి సవికల్పకం, నిర్వికల్పకం అని రెండు విధాలు. అందులో సవికల్పకం దృశ్యానువిద్ధ సవికల్పకం, శబ్దానువిద్ధ సవికల్పకం అని రెండు విధాలు. ఈ మూడు బాహ్యాభ్యంతర బేధాల వల్ల ఆరు విధాలు.

సమాధి

సవికల్పకం — నిర్వికల్పకం

(నిర్వికల్పకం): బాహ్యానిర్వికల్పకం — అంతర నిర్వికల్పకం

(సవికల్పకం): దృశ్యానువిద్ధ సవికల్పకం — శబ్దానువిద్ధ సవికల్పకం

(దృశ్యానువిద్ధ సవికల్పకం): బాహ్యదృశ్యానువిద్ధ సవికల్పకం — అంతరదృశ్యానువిద్ధ సవికల్పకం

(శబ్దానువిద్ధ సవికల్పకం): బాహ్యాశబ్దానువిద్ధ సవికల్పకం — అంతరశబ్దానువిద్ధ సవికల్పకం

**4.1.87.1 బాహ్యా దృశ్యానువిద్ధ సవికల్పకం :**

**"ఎదుట గానుపించు నెల్ల చిదాభాస**
**కళలు తనకు వేఱు గావటంచు**

**దెలియు తెలివి నెపుడు దెలియుట బాహ్య దృ**
**శ్యాను విద్ధ యనగ నలరు వత్స."** - శుకచరిత్ర 3-252

ఎదుట కన్పించే అన్ని చిదాభాస కళలు తనకు అన్యం కాదని తెలుసుకోవటం **బాహ్య దృశ్యానువిద్ధం** అంటే బ్రహ్మాది సకల దేవతలు, చేతనా చేతనాలు బాహ్య దృశ్యాలు తన తెలివి యందే పుట్టి గిట్టుతున్నాయని, సమస్త దృశ్యాలకూ తాను విలక్షణుడైన పరమాత్మ స్వరూపుడనని భావించడం.

**4.1.8.2 అంతర దృశ్యానువిద్ధ సవికల్పకం :**

**"అంతర మగు ద్విదళంబున**
**వింతలు జూపడెడు కళల వీక్షింపుచు దా**
**సంతసమందుచు నుండుట**
**లంతర్దృశ్యానువిద్ధ యనబడు సుమతీ!** " - శుకచరిత్ర 3-253

సమాధి అవస్థలో భ్రూమధ్య భాగంలో కన్పించే అంతర దృశ్యాలనే వృత్తులకు తానే విలక్షణుడైన పరమాత్మ స్వరూపుడనని అనుకోవడం అంతరదృశ్యానువిద్ధ సవికల్పకం.

రామమూర్తి కవి అంతర ద్విదళంలో (భ్రూమధ్య భాగం) వింతలు కన్పించే కళల్ని చూసి సంతోషించడం అంతర్దృశ్యానువిద్ధం అన్నాడు. విలక్షణుడైన పరమాత్మ స్వరూపుడు తానేనని అనుకోవటాన్ని వివరించలేదు.

**4.1.8.3 బాహ్య శబ్దానువిద్ధ సవికల్పకం :**

**"బాహ్యమున బెక్కు గావిన బడెడి శబ్ద**
**తతుల దెలిసెడి తెలివియే తానటంచు**
**దెలిసి యానంద రసమున దేలుచుంట**
**బాహ్య శబ్దానువిద్ధనబడు మహాత్మ!** " - శుకచరిత్ర 3-254

బయట విన్పించే శబ్దాన్ని తెలిసికొనే శక్తి తనదేనని తెలిసి ఆనందరసంలో తేలడం బాహ్య శబ్దానువిద్ధ సవికల్పకం అని రామమూర్తి కవి అభిప్రాయం. కానీ బాహ్య శబ్దములగు సకల నామములకును తాను విలక్షణుడననియు, నామరూపక్రియా రహితుడగు పరమాత్మయే తాననియు తలచుట బాహ్యశబ్దానువిద్ధ సవికల్పకమని చెప్పబడింది.

**4.1.8.4 అంతర శబ్దానువిద్ధ సవికల్పకం :**

**"అంతర హృదయ నభంబున**
**సంతస పడ మ్రోయు ప్రణవ శబ్దంబుల నా**

**ద్యంతము విను తను దెలియుట**
**లాంతర శబ్దానువిద్ధ యనబడు బుత్రా!** " - శుకచరిత్ర 3-255

ప్రణవనాదాలను ఆద్యంతం విని, తనను తాను దెలిసికోవటం అంతరశబ్దానువిద్ధ సవికల్పకం.

అంతర శబ్దాలనే కామాది షడ్వర్గాలకును, ప్రణవనాదమందలి చిణీనాదం, చిణిచిణీనాదం, ఘంటానాదం, శంఖనాదం, వీణానాదం, తాళనాదం, వేణునాదం, భేరీనాదం, మృదంగనాదం, మేఘనాదం అనే దశవిధ నాదాలకు తాను విలక్షణుడనని తలచడం.

రామమూర్తి కవి అభిప్రాయానికి భాష్యకారుని అభిప్రాయానికి కించిత్తు భేదమున్నట్లు తోస్తుంది. హృదయగతంగా మ్రోగే ప్రణవశబ్దాల్ని విన్నా తనను తాను తెలిసికోవడం అంతర శబ్దానువిద్ధ సవికల్పకం అని రామమూర్తికవి చెప్పాడు. కానీ భాష్యంలో అంతర శబ్దాలుగా కామాది షడ్వర్గాల్ని, దశవిధ నాదాల్ని పేర్కొని, వాటికి విలక్షణుడు తానని తలచడం అంతర శబ్దానువిద్ధ సవికల్పకం అని చెప్పబడింది.

**4.1.8.5 బాహ్య అంతర నిర్వికల్పం :**

"**బాహ్య దృశ్య శబ్ద పటలంబుగను నాత్మ**
**గనుట బాహ్య నిర్వికల్పమాంత**
**రస్థ దృశ్య శబ్దరాశి గన్గొను నాత్మ**
**గనుట లోని నిర్వికల్ప మనఘ.** " - శుకచరిత్ర 3-256

బాహ్య దృశ్య శబ్దాల్ని తెలిసికొనే ఆత్మ కలిగి ఉండటం బాహ్య నిర్వికల్ప సమాధి అయితే అంతర దృశ్య శబ్దాల్ని తెలిసికొనే ఆత్మను కలిగి ఉండడం అంతర నిర్వికల్ప సమాధి అవుతుంది.

దృశ్య శబ్ద బాహ్యాంతర సవికల్ప సమాధుల్లో తనకంటే భిన్నమైన దేది కనిపించక పరమాత్మ స్వరూపం తానేనని తలంచడం బాహ్య నిర్వికల్పం అయితే, పై నాలుగింటికి విలక్షణుడననే వృత్తి లేక కేవలం పరమాత్మ స్వరూపం తానేనని అనుకోవడం అంతర నిర్వికల్పక సమాధి అవుతుంది.

అష్టాంగ యోగంలో మొదటి ఐదు అంగాలు అంటే యమం, నియమం, ఆసనం, ప్రాణాయామం, ప్రత్యాహారం అనేవి బాహ్యాంగాలు. వీటిని బహిరంగ సాధనలని అంటారు. ఇక చివరి మూడు ధారణ, ధ్యానం, సమాధి అనేవి అంతరంగ సాధనాలు. ఈ మూడింటిని కలిపి యోగ పరిభాషలో '**సంయమం**' అంటారు. సంయమం సిద్ధిస్తే యోగికి ప్రజ్ఞాలోకం కలుగుతుంది. ఆత్మజ్ఞానం కలిగిందంటే యోగికి అంతరంగ సాధనలు సిద్ధించి నట్లే అయినా

నిర్బీజసమాధిసిద్ధించేవరకు యోగం లక్ష్యం సాధించనట్లే. సంయమం దశలో యోగికి అనేక సిద్ధులు ప్రాప్తిస్తాయి. వాటిలో అణిమాద్యష్టసిద్ధులు ముఖ్యమైనవి. వీటిని రామమూర్తి కవి పేర్కొన్నాడు.

"**వినుమణిమయనంగ మహిమ**
**యన గరిమ యనాగలఘిమయన బ్రాప్తియనం**
**గను బ్రాకామ్యేశత్వము**
**లనగ వశిత్వమన సిద్ధులష్టవిధంబుల్.**" – శుకచరిత్ర 3-259

అణిమ, లఘిమ, గరిమ, మహిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, వశిత్వం, ఈశత్వం ఈ అష్టసిద్ధులను గూర్చి ఒక సీసపద్యంలో రామమూర్తికవి వివరించాడు.

"**అణు జంతువులయందు నణువై చరించుట – యణి మాహ్వ యైశ్వర్య మలఘు చరిత**
**యబ్జజాండాది మహన్మయుండై యుంట – మహిమాఖ్య భూతి నిర్మల విచార**
**బ్రహ్మాండమున కంటె భారమై యుండుట – గరిమాఖ్య సంపత్తి కలుషదూర**
**యమరాద్రి సదృశాంగుడై సూక్ష్మగతి నుంట – లఘిమ విభూతి సల్లలిత హృదయ**

**వాంచితార్థావలంబనవాప్తి ప్రాప్తి**
**గగన గమనాది సిద్ధ ప్రాకామ్యమర్క**
**శశిముఖనియామకత్వమీశత్వమఖిల**
**జీవ వశ్య ప్రవృత్తి వశిత్వమనఘ.**" – శుకచరిత్ర 3-261

తన ఇష్ట ప్రకారం ఎక్కడైన అణు జంతువులలో అణువంత మారిపోవడం **అణిమ** అని శుకచరిత్ర.

కొండంత పెద్ద ఆకారాన్ని పొందడం **మహిమ**
బ్రహ్మండం కంటె బరువు కావడం **గరిమ**

దీనినే యత్రకామావసాయిత్వం అంటారు. అంటే యోగి తన సంకల్పానుసారం పంచభూతాల స్వభావాన్ని నియంత్రించడం.

"దూదిపింజవలె తేలికై పోవడం **లఘిమ**
కోరిన వస్తువును పొందగల్గడం **ప్రాప్తి**
ఏ ఆటంకం లేకుండా కోర్కెలు పూర్తి కావడం **ప్రాకామ్యం**
అన్ని పదార్థాలపై అధికారం పొందడం **ఈశత్వం**
సర్వ ప్రాణుల్ని వశీకరించుకోవడం **వశిత్వం**"

ఇలా అష్టసిద్ధుల్ని పొందిన యోగి పంచభూతాలను జయించినవాడవుతాడు. పతంజలి తన గ్రంథంలో యోగసాధనలో యోగి సంయమశక్తియందు పురోభివృద్ధి చెందుతున్న కొద్దీ అనేక విభూతుల్ని పొందుతాడని చెప్పాడు. వ్యాసుడు, వాచస్పతిమిశ్రుడు, విజ్ఞానభిక్షువు మొదలైన వారు కూడా దీన్ని వివరించారు. అందరూ యోగసంపదలు పరమార్థసాధనకు అవరోధాలని చెప్పారు. కాబట్టి పరమార్థసాధనకు జ్ఞానయోగం ఉపయోగపడుతుంది.

యోగతత్త్వోపనిషత్తు చతుర్విధ యోగాలను చెప్పింది. మంత్రయోగం, లయయోగం, హఠయోగం, రాజయోగం. పతంజలిది రాజయోగం. ఎందుకంటే అది చిత్తవృత్తినిరోధం వల్ల సమాధిని పొందే సాధనాల్ని విపులంగా వివరిస్తుంది. దైహిక ప్రవృత్తుల్ని నిగ్రహింపవచ్చునని హఠయోగం చెబుతుంది. దేహనిగ్రహం పతంజలియోగంలో ఒకభాగం. మంత్రయోగం విశ్వాసంచేత రోగనివారణ చేస్తుంది.

రాజయోగం మూడు విధాలని రామమూర్తి కవి చెప్పాడు.

"**వినుము రహస్యంబుత్తమ**
**మనుభవమై యొప్పు మఱియు నయ్యోగంబు**
**న్విను తారకమన, సాంఖ్యం**
**బన నమనస్కమన త్రివిధమయ్యె ధరిత్రిన్.**" - శుకచరిత్ర 4-8

**రాజయోగం** తారకయోగం, సాంఖ్యయోగం, అమనస్కయోగం అని మూడు విధాలు.

**4.2 తారక యోగం :**

తారకయోగం యోగోపనిషత్తుల్లో ముఖ్యంగా అద్వయ తారక, మండల బ్రాహ్మణోపనిషత్తుల్లో రాజయోగానికి పూర్వార్ధంగా వర్ణింపబడింది. ఈ **తారకయోగం** ముఖ్యంగా హఠయోగ సంబంధమయినది. పారమార్థికంగా యోగం ఒకటే అయినా అది మంత్రయోగం. లయయోగం, హఠయోగం, రాజయోగ భేదాల్ని సాధన వైచిత్ర్యాన్ని పురస్కరించుకొని వెలువరిస్తూ ఉంది. యోగశిఖోపనిషత్తులో దీన్ని గూర్చి ఇలా ఉంది.

"మంత్రో, లయో, హఠో, రాజయోగాంతా భూమికా క్రమాత్ ।
ఏక ఏవ చతుర్థోయం మహాయోగోఽభిదీయతే॥ " శ్రీ సీతారామాంజనేయసంవాద సమాలోచనాత్మక పరిశీలనము, పుట - 247.

హ, ఠ అనే రెండక్షరాలకు సూర్య, చంద్రులని అర్థం. దీన్ని పింగళ, ఇడా అనే సూర్య చంద్ర నాడులకు అన్వయించవచ్చు. యోగులు ఎడమ నాడిని ఇడానాడి, చంద్రనాడి అని,

కుడినాడిని పింగళనాడి, సూర్యనాడి అని అంటారు. కుడి, ఎడమ నాడులందలి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు సమతను పొందితే చిత్తం సమతను పొందుతుంది. సూర్య చంద్ర నాడులలోని ప్రాణాపాన ఐక్య లక్షణమయిన ప్రాణాయామమే హఠయోగమని హఠయోగ ప్రదీపికలో చెప్పబడి ఉంది.

"**హఠశబ్దవాచ్యయో సూర్యచంద్రాఖ్యయోః ।**
**ప్రాణాపానయోరైక్యలక్షణః ప్రాణాయామో ।**
**హఠయోగ ఇతి హఠయోగస్య లక్షణం సిద్ధమ్ ॥** " – హఠయోగ ప్రదీపిక, జ్యోత్స్న 1-1

ఈ హఠయోగం శరీరావయవాలపైన, చిత్తవృత్తులపైన సంపూర్ణ నిగ్రహాన్ని సాధించి, శరీరాన్ని ఆరోగ్యవంతం చేసి, కైవల్యప్రాప్తికి దోహదం చేస్తుంది.

కొందరు జ్ఞానంచేత, కొందరు జ్ఞానం, యోగంచేత, ఇంకొందరు అష్టాంగయోగంచేత, మరికొందరు కర్మయోగంచేత ఆత్మను చూస్తున్నారు. స్వయంగా జ్ఞానం కలుగనివారును, ఇతరుల ఉపదేశాన్ని విని శ్రద్ధతో పరమేశ్వరుని భజిస్తూ ఉన్నారు. విన్న విషయాన్ని ప్రమాణంగా గ్రహించి ఆచరించేవారు మృత్యువును అతిక్రమిస్తూ ఉన్నారని గీత చెబుతుంది.

"**ధ్యానేనాత్మని పశ్యంతి కేచిదాత్మానమాత్మనా ।**
**అన్యే సాంఖ్యేన యోగేన, కర్మయోగేన చాపరే ॥**

**అన్యే త్వేవమజానంతః శ్రుత్వాన్యేభ్య ఉపాసతేః ।**
**తేఽపి చాతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః ॥** " – భగవద్గీత 13-24,25శ్లో

**4.2.1 ముద్రలు :**

తారకయోగసాధనకు ఖేచరాది ముద్రలు ముఖ్యసాధనలు. వీటిని గూర్చి రామమూర్తికవి ఇలా వివరించాడు.

"**వినుమా తారకయోగం**
**బునకును ఖేచరి యనంగ, భూచరి యనగా**
**ఘన మధ్యమయన షణ్ముఖి**
**యనశాంభవి యనగ ముద్రలైదు గలుంగున్**" – శుకచరిత్ర 4-13

అవి యెట్లంటేని 4-14

"చక్షువుల్విచ్చి విచ్చర యైన ఫాల దే-శము గనుంగొనుట **ఖేచరి** మహాత్మ
కన్నులు గదలింపకనునాసికాగ్రద-ర్శనము గైకొనుట **భూచరి** మహాత్మ

యరగంటి చూపుల నా ఘ్రాణ మధ్యంబు - లక్ష్యపెట్టుట **మధ్య** లక్ష్యమనఘ
కర్ణ చక్షుర్నాసి కలు మూసి భ్రూ మధ్య-మున జూపు లిడుట **షణ్ముఖి**బుధేంద్ర
లోన లక్ష్యంబు వెలిన విలో దృష్టి
గత మనోనిల కరణ వికార యుక్తి
నాదబిందు కళాను భవాది భూత
యగునదియె **శాంభవి** దృష్టి యరణి తనయ." - శుకచరిత్ర 4-15

**4.2.1.1 ఖేచరి :**

కళ్లు మూసుకొని అయినా, తెరచుకొని అయినా భ్రూమధ్య భాగంలో దృష్టిని నిలిపి ధ్యానించటం ఖేచరి ముద్ర భ్రూమధ్య భాగంలోని ఆకాశభాగం శివస్థానం. అచట మనస్సును నిలిపి ధ్యానిస్తే మనోలయం సిద్ధిస్తుందని యోగశాస్త్రం చెబుతుంది. కళ్లు మూసి భ్రూమధ్య భాగాన్ని చూడడం అంటే చూస్తున్నట్లు సంకల్పించి భావించడమే.

**4.2.1.2 భూచరి :**

నాసికాగ్రంపై దృష్టి ఉంచడం భూచరీ ముద్ర.

**4.2.1.3 మధ్యమ :**

నాసికా మధ్య భాగంలో అరమోడ్పు కళ్లతో దృష్టిని నిశ్చలంగా నిలిపి, మీద ఉండే నుదురును చూడటం.

**4.2.1.4 షణ్ముఖి :**

రెండు బొటన వ్రేళ్లతో రెండు చెవుల్ని తర్జనీ మధ్యమాలతో రెండు కళ్లను రెండు అనామికలతో రెండు ముక్కు రంధ్రాలను మూసి భ్రూమధ్యంలో నిశ్చల దృష్టిని కల్గి నాదబిందు కళల్ని చూడటం షణ్ముఖీ ముద్ర.

**4.2.1.5 శాంభవి :**

అంతర్లక్ష్యం కల్గి పైకి కొద్దిగా కూడా చలింపని దృష్టి కలిగి వాయు చలన మనో వికారాలు లేకుండా ఉండటం శాంభవి ముద్ర. కళ్లు బాహ్య ప్రపంచాన్ని చూస్తున్నా రెప్పపాటు లేకుండా చూడనివిగా ఉండాలి. శాంభవికి, ఖేచరికి అవస్థాభేదం, ధామ భేదాలు ఉన్నాయి. దీన్ని హఠయోగ ప్రదీపిక ఇలా తెలియజేస్తుంది.

**"శాంభవ్యాశ్చ ఖేచర్యా అవస్థాధామభేదతః ।**
**భవేచ్చిత్తలయానందః శూన్యే చిత్సుఖరూపిణి ॥** " - హఠయోగప్రదీపికా - 38

ఇక్కడ శూన్యే పదానికి పరమాత్మ అనే అర్థం తీసుకోవాలి. శాంభవి యందు బాహ్యదృష్ట్యవస్థ, ఖేచరి యందు భ్రూమధ్య దృష్ట్యవస్థ, శాంభవియందు హృదయం భావనాదేశం, ఖేచరియందు భ్రూమధ్యాకాశమే భావనాదేశం.

ఈ ముద్రలలో ఖేచరీ శాంభవీ ముద్రలు ముఖ్యాలు. ఈ రెంటిలో ఒకదానిని సాధిస్తే చాలు. ముద్రలు కేవల కుంభక ప్రాణాయామ సిద్ధి వలన ప్రణవనాదాలు (దశవిధ నాదాలు) బిందువు లేక అంతఃకరణం లేదా బుద్ధి కళ అంటే అంతఃకరణంలో, బుద్ధిలో ఆత్మ చైతన్య సాక్షాత్కారం కలుగుతూ ఉంది. సద్గురు ప్రోక్తమయిన ముద్రచే రెండు చెవులు మూసికొని వింటే ప్రణవనాదం పదిరకాలుగా వినిపిస్తుంది.

**"ఆరు పువ్వుల నాత్మ నర్చించి దేహినే - మించి మున్ముట వాయించె ననగ**
**కామాద్యసుర జయకాంక్షియై యాత్మ చ - క్రిమనోదరంబు పూరించె ననగ**
**పూమెట్లక సుతంత్రి బూనిచిత్సతి బ్రహ్మ - దండి వల్లకిమీటు చుండె ననగ**
**తతమనః పవనమూల్తాళంబుగా నాత్మ - బాడుచు పరసతి యాడె ననగ**

**కరణ వత్సములను గాయుచు హృద్వాయు**
**హస్తములు సుషుమ్న యనెడి మురళి**
**బూని చిన్మురారి పూరించె నన మనో**
**వీథి బ్రణవరవము వెలయుచుండ."** - శుకచరిత్ర 4-19

పై పద్యంలో కామాది అరిషడ్వర్గాల్ని జయించడానికి శ్రీహరి శంఖం పూరించెనా అన్నట్లు, బ్రహ్మ దండిని (వెన్నెముక) వీణాదండ మొనరించుకొని ముక్తికామిని పంచప్రాణాలనే తంత్రుల్ని మ్రోగించెనా అన్నట్లు, ముక్తికాంత మనఃపవనాలే తాళాలుగా ఆడి, పాడెననగా, మురారి కరణాలు (ఇంద్రియాలు) అనే దూడల్ని కాస్తూ, సుషుమ్న నాడి అనే మురళిని పూరించాడా అన్నట్లు ప్రణవరవం వినిపిస్తుంది.

రామమూర్తి కవి ప్రణవనాదాన్ని రూపకాలంకారంతో వర్ణించాడు. ఈ నాదానుసంధానం వల్ల యోగికి కలిగే ఆనందస్ఫూర్తిని పఠితల మనస్సుకు అందజేస్తూ ఉంది.

పరశురామపంతుల లింగమూర్తి తన శ్రీసీతారామాంజనేయసంవాదము లో కూడా ఇదే భావాల్ని వ్యక్తం చేశాడు.

"కామక్రోధాద్యసద్రాక్షసగణవిజయాకాంక్షియై ప్రత్యగాత్మ
శ్రీమన్నారాయణుండంచిత విమల మనోచిత్త శంఖంబు నిండన్" -సీ.సం. 1-121

అని,

**"నలు వొప్పందగు బ్రహ్మదండి నొక వీణాదండముం జేసి ష**
**డ్జల జాతంబుల మెట్లుగా నిలిపి పంచప్రాణముల్ తంత్రులై**
**యలరంగా గొని ముక్తికామిని సహస్రారంబునందుండి ని**
**చ్చలు వాయించె ననంగ ... ... ...** " సీతారామాంజనేయ సంవాదము 1-122

"అమృతాంగన బోధమయాత్ముని శు
ద్ధమనఃపవనంబులు తాళముగా
నమరంగొని పాడుచునాడిన యట్ల" - సీతారామాంజనేయ సంవాదము 1-123

"... ... గోపాల మూర్తి
విమల మానస పవన హస్తముల చేత
గానమొనరించె ననగ" - సీతారామాంజనేయ సంవాదము 1-124

లింగమూర్తి కవి ఇంద్రియాలను గోపికలతో పోలిస్తే, రామమూర్తికవి దూడలతో పోల్చాడు. మిగిలిన భావాల్ని రామమూర్తికవి తన తండ్రి లింగమూర్తి నుండి గ్రహించాడని చెప్పవచ్చు. ప్రణవస్వరూపాన్ని వర్ణిస్తూ రామమూర్తి కవి -

**"అరి వర్గంబుల నడపెడు**
**మురిపెంబున నాత్మనృపతి మొనజూపిన సం**
**గరమునకై రణదుందుభి**
**మొరయించి రనంగ బ్రణవము నినాదించున్.**" - శుకచరిత్ర 4-20

అరిషడ్వర్గాల్ని అణచి వేయడానికి ఆత్మరాముడు రణదుందుభి మ్రోగించినట్లు ప్రణవనాదం నినదించిందన్నాడు. ఇంకా భగవంతుడు మాయాకాంతను ఆడించడానికి మ్రోగించిన మృదంగ నాదంలాగా ప్రణవనాదం వినిపించిందట. నిటలాకాశంలో దృక్కులనే మేఘాలు విహరించి, చిత్తం అనే మెరుపులు మెరయ, ఆనందవర్షం కురిసిందా అన్నట్లు ప్రణవాది దశవిధ నాదాలు మ్రోగాయట.

**4.2.2 చిత్కళా స్వరూపం :**

ప్రణవనాద స్వరూపాన్ని వివరించిన తర్వాత **చిత్కళా** స్వరూపాన్ని వివరించాడు.

**"ఆచార్యోక్తిని లాలిత**
**లోచనుడై ద్విదళమును విలోకించిన దృ**
**గ్గోచర మగు బహువిధ చి**
**ద్రోచిపరంపరలు చిత్స్వరూపంబగుచున్.** " - శుకచరిత్ర 4-26

యోగి గురూపదేశంతో భ్రూమధ్యమందలి ఆజ్ఞాచక్రంపై దృష్టి నిలిపి ధ్యానిస్తే చిత్కళా–సాక్షాత్కారం కలుగుతుంది. అంటే చిత్తాకాశరూపమయిన ఆకాశపంచకం (వియన్మండలం) యోగికి కన్పడుతుంది. ఈ ఆకాశపంచకస్వరూపాన్ని రామమూర్తికవి ఒక సీసపద్యంలో వివరించాడు.

**"వలము నిర్మలము కేవలమ నాకారమై – కడు గుణ విరహితాకాశమలరు**
**నిబిడ నిష్ఠుర తర నీరంధ్ర గాఢాంధ – కారమై తగు పరాకాశమమరు**
**ప్రజ్వలికాజ్వలత్ప్రళయ దావానలా – కారంబునగు మహాకాశమొప్పు**
**వివిధ చిత్రామిత వితత విద్యుతిసంవృ–తంబునై తత్త్వనభంబు దనరు**

**జండ మార్తాండమండల శత సహస్ర**
**కాంతి శోభితమై సూర్య గగన మొప్పు**
**ననఘ యిట్లు హృదభ్రంబునందు దోచు**
**గగన పంచకమున గళాల్గానుపించు.**" – శుకచరిత్ర 4–30

ఆకాశపంచకం ఈ పద్యంలో వివరింపబడి ఉంది. 1. **శబ్దగుణరహితమైన ఆకాశం**, 2. **పరాకాశం**, 3. **మహాకాశం**, 4. **తత్త్వాకాశం**, 5. **సూర్యాకాశం**. కేవలం నిర్మలం, అనాకారం అయిన ఆకాశంలోని గుణం లేకపోవటం ఒకటే తప్ప ఇతరాలైన రూపభేదాలు ఏవీ లేవు. పరాకాశం దట్టమైన భయంకరమైన అంధకారంతో నిండి ఉంటుంది. ప్రళయకాలమందలి అగ్ని లాగాను, మహాకాశం మహాభయంకరంగా ఉంటుంది. తత్త్వాకాశంలో లెక్కకు మిక్కిలి బహువిధాలైన కాంతులు తేజరిల్లుతూ ఉంటాయి. అనేక కోట్ల సంఖ్య గల సూర్యులు ఒక్కసారే ఉదయించినట్లు సూర్యాకాశం వెలుగుతూ ఉంటుంది.

ఆకాశపంచకాన్ని వర్ణించిన తర్వాత కవి తారామండలాన్ని చక్కని రెండు సీసపద్యాల్లో వివరించాడు. పంచాకాశ మధ్యలోని దశవిధ మండలాల్ని వర్ణించాడు. అవి 1. వియన్మండలం, 2. తమోమండలం, 3. మేఘమండలం, 4. విద్యున్మండలం, 5. తారామండలం, 6. జ్యోతిర్మండలం, 7. సూర్యమండలం, 8. చంద్రమండలం, 9. వహ్నిమండలం, 10. హిరణ్మయమండలం అనేవి. ఇలా పరమ స్వచ్ఛ స్వరూపాలైన తారామండల రూపంలో చిత్కళలు కన్పిస్తాయి. ఆ తరువాత విద్యున్మండల, మేఘమండల, జ్యోతిర్మండల రూపంలో కన్పిస్తాయి.

### 4.2.3 బిందు స్వరూపం :

రామమూర్తి కవి **బిందు** స్వరూపాన్ని చక్కగా తెలియజేశాడు. అన్నమయ, ప్రాణమయ,

మనోమయ, కోశాలకు అగ్రభాగంలో ఉండే విజ్ఞానమయ కోశం లేదా బుద్ధితత్త్వమే బిందువని చెప్పబడుతుంది.

**"పితృమాతృభుక్తాన్న బీజోత్థరేతో రు-ధిర జన్యమై స్థూల దేహమలరు**
**నా దేహమున సుషుమ్నాది ద్విసప్తతి - సహస్ర నాడులు సదలకుండు**
**నానాడి కా సుషిరాంతరంబులలోన - ప్రాణాది వాయువుల్బలసి యుండు**
**నావాయువుల గూడి యఖిలేంద్రియంబుల - గలసి నెమ్మెనములో వెలినిదిరుగు**

**నమ్మనోగ్రస్తమై బుద్ధి యతిశయిల్లు**
**నదియె బిందువనంబడు నందుదోచు**
**కళయె జీవుండు దానితో గలసి యతడు**
**మెలగుదను వాయు హృదయ సమేతుడగుచు.**" - శుకచరిత్ర 4-38

మాంస రుధిర జన్యమైన స్థూలదేహంలో సుషుమ్నాది సహస్రనాడులు ఉంటాయి. ఆ నాడుల్లో ప్రాణాది వాయువులు ఉంటాయి. ఆ వాయువులతో కూడి బుద్ధి ఉంటుందని అదే బిందువని రామమూర్తికవి చెప్పాడు. పద్యం మొదటి పాదంలో ఈ శరీరం తల్లిదండ్రులు తిన్న అన్నవికారమైన శుక్లశోణితాలవల్ల కలిగిందని చెప్పబడింది. అంటే అన్నమయకోశాన్ని గూర్చి చెప్పబడిందని భావం. మూడో పాదంలో ప్రాణమయకోశం వివరింపబడింది.

**"ప్రాణాదిదశవాయవః అన్నమయకోశే యదా వర్తంతే తదా ప్రాణమయకోశః "**

ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన, నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయాలనే దశవిధ ప్రాణవాయువులు స్థూల దేహంలో ఉండేటప్పటి స్థితే ప్రాణమయ కోశం. నాల్గోపాదంలో మనోమయ కోశం వివరింపబడి ఉంది. అన్నమయ, ప్రాణమయ కోశాలు రెంటితో కూడి మనస్సు మొదలయిన పద్నాల్గు ఇంద్రియాలచేత శబ్దస్పర్శాది విషయ సంకల్పం మొదలయిన ధర్మాల్ని చేయటమే మనోమయకోశం.

**"మనోమనోమయః కోశో భవేత్ జ్ఞానేంద్రియైస్సహ**
**ప్రాచుర్యం మనసో యత్ర దృశ్యతేఽసౌ మనోమయః"**

జ్ఞానేంద్రియాలు ఐదూ, మనస్సు కలిసి మనోమయకోశమవుతుంది.

ఆ తర్వాత పాదంలో బుద్ధిమయకోశం వివరింపబడింది. దీన్నే విజ్ఞానమయకోశం అంటారు.

**"విజ్ఞానమయకోశస్స్యాద్బుద్ధిర్ జ్ఞానేంద్రియైస్సహ**
**విజ్ఞానప్రచురత్వేనాప్యాచ్ఛాదకతయాత్మనః**
**విజ్ఞానమయకోశోయమితి విద్వద్భిరుచ్యతే"**

జ్ఞానేంద్రియాలు ఐదు, బుద్ధి కలిస్తే విజ్ఞానమయకోశం అవుతుంది. ఇది జ్ఞాన ప్రాచుర్యం కలది. కాబట్టి ఆత్మకు ఆచ్ఛాదనం అనటం వల్ల దీన్ని విజ్ఞానమయ కోశమని పండితులు చెబుతారు.

ఇలా రామమూర్తికవి బిందు స్వరూపాన్ని తెలియ జేసి ప్రపంచ ఉత్పత్తి ప్రకారాన్ని తెలిపాడు. మొదటి పరంజ్యోతి ప్రకాశిస్తూ ఉండేది. ఆ పరంజ్యోతిలో ఆకాశం, ఆకాశంలో పరాశక్తి ఉదయించింది. ఆ పరాశక్తిలో మహా భూతాలు, ఆ మహాభూతాలనుండి ఒక అండం, ఆ అండంనుండి బ్రహ్మాండం, పిండాండం అనే శరీరద్వయం ఏర్పడ్డాయి. బ్రహ్మాండం అనే శరీరంలో భూమ్యాకాశాలు మహదాది భూత చక్రాలు, ఇడాపింగళ నాడి ద్వయాదులు ఉన్నాయి. పిండాండ శరీరంలో అన్న రస పరిణామ రూపమయిన చర్మం, మాంసం, రక్తం, మెదడు, కొవ్వు, శుక్లం, ఎముకలు అనే సప్త ధాతు మయమై ఉండడం వల్ల పంచభూతాత్మకమైన ఆజ్ఞ విశుద్ధానాహత స్వాధిష్ఠాన మణిపూరాధార చక్రాలు, ఆ చక్రాలకు ఆధారమై గుదం మొదలుకాని నాసికాగ్రం తుదగా పృష్ఠభాగంలో కుండలినీ పేరుతో ఇడా, పింగళా నాడుల మధ్య సూక్ష్మ రూపంలో సుషుమ్న నాడి ఉంటుంది. ఈ సుషుమ్నా నాడికి అంతర్గతంగా కుండలినీ శక్తి ఉంటుంది.

### 4.2.4 షట్కమలాలు :

రామమూర్తికవి **షట్చక్రాలు** లేదా షట్కమలాల్ని గూర్చి ఇలా రాశాడు :-

**"అవని సంభవమైన యధార నాద్యగ్ర - కలితమై ఘ్రాణపంకజముదనరు**
**మహితాంబుభవమైన మణిపూర నాద్యగ్ర - రుచిరమై రసనాంబురుహము మెఱయు**
**తేజోద్ధమైన స్వాధిష్ఠాన నాద్యగ్ర - లలిత విలోచన జలజమలరు**
**నయవాయుజంబౌ యనాహత నాద్యగ్ర - సక్తమై త్వక్సార సంబు వెలయు**

**సురపదోద్భూతమైన విశుద్ధ నాడి**
**కాగ్రశోభితమై శ్రవణాబ్జమమరు**
**నలమహత్తత్వసముదయమైన ద్విదళ**
**నాడికాగ్ర స్థితిని మనోనలినమొప్పు."** - శుకచరిత్ర 4-40

పృథ్వీ భూతానికి ఆధారమైనది ఘ్రాణేంద్రియానికి కారణమైనది **మూలాధారచక్రం**. జలభూతానికి ఆధారమైనది, జిహ్వేంద్రియానికి కారణమైనది **స్వాధిష్ఠానచక్రం**. అగ్నిభూతానికి ఆధారం, నేత్రేంద్రియానికి కారణమైనది **మణిపూరకచక్రం**. వాయుభూతానికి నివాసం, త్వగింద్రియానికి కారణమైనది **అనాహతచక్రం**. ఆకాశానికి నివాసం, కంఠానికి కారణమైంది

**విశుద్ధచక్రం**. పద్యంలో మణిపూరక చక్రాన్ని గూర్చి చెబుతూ జలభూతానికి ఆధారమైనది జిహ్వేంద్రియానికి కారణమైనదిగా రామమూర్తి కవి పేర్కొన్నాడు.

కానీ పరశురామపంతుల లింగమూర్తి కవి తమ సీతారామాంజనేయసంవాద కావ్యములో "దశదళోపేతంబై, తేజోనివాసంబై, పీతవర్ణంబై, నేత్ర కారణంబై మణిపూరచక్రంబు ప్రకాశించు" అన్నాడు. ప్ర.ఆ. 180. అలాగే పంచీకరణ భాష్యములో నేత్రేంద్రియం కారణంగా చెప్పబడింది. పుట – 91.

అట్లే స్వాధిష్ఠాన చక్రాన్ని గూర్చి చెబుతూ "తేజోద్ధమైన స్వాధిష్ఠాన నాద్యగ్రలలిత విలోచన జలజమలరు" అంటే అగ్ని భూతానికి ఆధారమైనది నేత్రేంద్రియానికి కారణమైనదిగా స్వాధిష్ఠాన చక్రమని రామమూర్తికవి చెప్పాడు. కానీ ఈయన తండ్రి లింగమూర్తి "షడ్దళసమన్వితంబై రక్తవర్ణంబై, జలాలయంబై, రసనాకారణంబై స్వాధిష్ఠాన చక్రంబు రంజిల్లు" అన్నాడు. జలముద్ర, జిహ్వేంద్రియము కారణము అయినది స్వాధిష్ఠానమని పంచీకరణ భాష్యంలో ఉంది. పుట– 90.

రామమూర్తికవి కొంతవరకు ఒక దానికి మరొకటి మార్చివ్రాసినట్లు కనిపిస్తుంది. ఈ మార్పునకు శంకరాచార్య కృత సౌందర్యలహరి ఆధారం అవుతుంది – సౌందర్యలహరి – 9 శ్లోకం సీతారామాంజనేయసంవాదం – 2–47.

**ఆధారంబిలయై జలంబుమణి పూరాంభోజమై వహ్నియై**
**స్వాధిష్ఠానమనాహతంబనిలయై చంచద్విశుద్ధంబుఖం**
**బై ధీమానసరూపక ప్రకృతి యాజ్ఞాబ్జాతమై యొప్పు స**
**ర్వాధారోన్నత విశ్వమూర్తి నగునా కాదిత్య సంపూజకా!**

**4.2.5 హంస స్వరూపం :**

**హంస** శబ్దార్థాన్ని తెలియజేస్తూ డా॥ రత్నాకర బాలరాజు ఇలా అన్నాడు. "హంస మంత్రమందు హకారము, సకారము, అనుస్వారము నున్నవి. ఇందు నాద బిందు కళలకు ఉత్పత్తి స్థానమై సర్వమునకును, సాక్షియు ప్రకాశమునై, జ్ఞానస్వరూపమైన పరబ్రహ్మమే, పురుషుడే **హకారమున కర్థము**. ఇంద్రియాదులగు దృశ్యములే స్వరూపములుగా గలదియు, జడమును త్రిగుణాత్మకమునైన ప్రకృతియే, **సకారమునకర్థము**. ప్రకృతిపురుషులకు గల ఈ తాదాత్మ్యమే హకార, సకారములకు మధ్య గల బిందువు" సీతారామాంజనేయసంవాద సమాలోచనాత్మక పరిశీలనము, పుట–276.

శ్రీసీతారామాంజనేయసంవాదములో లింగమూర్తికవి హంస శబ్దార్థాన్ని మూడు పద్యాల్లో వివరించాడు.

**“నాద బిందు కళల కాదియై ద్రష్టయై**
**సర్వ దృశ్యములకు సాక్షియగుచు**
**జిత్స్వరూపమైన శ్రీరామ తత్త్వమౌ**
**నమలమగు హకారమాంజనేయ.**” – శ్రీసీతారామాంజనేయసంవాదము 1-170

నాద బిందు కళలకు ఉత్పత్తి స్థానమైనట్టిది. సకల ప్రపంచాన్ని తన జ్ఞానశక్తిచేత ప్రకాశింప జేసే ఆ శ్రీరాముడే (బ్రహ్మమే) హకారం.

**“మహిత దేహేంద్రియ ప్రాణమానసాది**
**దృశ్య రూపిణియును జడాత్మికయు ద్రిగుణ**
**కలితయు ననాదియు మహావికారియైన**
**ప్రకృతియగును సకారంబు పరమపురుష.**” –సీతారామాంజనేయసంవాదము 1-171

దేహం, ఇంద్రియాలు మొదలైన దృశ్య పదార్థాలే స్వరూపంగా ఉండి అచేతనమైన సత్త్వరజస్తమో గుణ మయమైనట్టిది, నానా విధాలైన వికారాలకు ఆశ్రయమైనట్టిది అయిన మూల ప్రకృతే సకారం.

**“వినుమా పురుష ప్రకృతుల**
**ఘన తాదాత్మ్యంబు మధ్యగత బిందువుగా**
**వున హంస యనగ జీవుం**
**డనిల మనోయుక్తుడగుచు నతడు వెలుంగున్.**” – సీతారామాంజనేయసంవాదము 1-172

ఆ జీవబ్రహ్మల కనాదిగా గల యభేద సంబంధమే అనుస్వారం.

కాబట్టి హంస అనే శబ్దానికి జీవుడని అర్థం. ఆ జీవుడే ప్రాణవాయువులచేతను, మనసు చేతను కూడి విహరిస్తూ ఉంటాడు. **మాయచే ఆవరింపబడి ఉన్న బ్రహ్మాన్నే జీవుడు** అంటున్నాం.

రామమూర్తి కవి హంస స్వరూపాన్ని రెండు రకాలుగా వర్గీకరించి వివరించాడు. 1. ఈశ్వర హంస స్వరూపం. 2. జీవహంస స్వరూపం.

**ఆ పరమాత్మ తత్త్వాభాస కళలతో – నన్యోన్యతాదాత్మ్యమందిమమత**
**బెనగొని ధీమయ బిందువు మున్ను దా – నైన పిండాండ విధ్యండ రూప**
**భేదంబుచే కళాభేదంబు దోప – జీవేశ్వర హంసల నేర్పరించె**
**గాన వారిర్వురు కల్పితులై సేవ్య – సేవక వృత్తులు జెలగు చుందు**

**రందునీశహంసు దఖిల భూతముల బు**
**ట్టింప బెంప ద్రుంప, బెంపు మెఱసి**
**యగుణుడయ్యు సగుణుడై యజహరి హరా**
**కృతుల బూనిత ద్విక్వతుల జెందు.**" – శుకచరిత్ర 4–44

జ్ఞానబిందువు పిండాండం, విధ్యండం అనే రూపభేదంతో జీవ, ఈశ్వర హంసల్ని ఏర్పరచింది. అందులో ఈశ్వరహంస అఖిలప్రాణుల్ని పుట్టించడానికి, పెంచడానికి, చంపడానికి కారకులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాకృతులను పొంది ఉందని చెప్పాడు.

జీవునికి త్వగాదులు కోటలు కాగా, ఆ నవద్వారపురంలో రాజు జీవుడు నివసిస్తున్నాడు. అహంకారం మంత్రిగా, మమకారం మిత్రునిగా, గాడ్పులు భటులుగా గొలువై ఉన్నాడు.

ఈశ్వరహంసకు, జీవహంసకు బిందుచాంచల్యం వల్ల భేదం కలిగింది. ఈ బిందు చాంచల్యాన్ని పోగొట్టుకొంటే పరమహంసార్థతత్త్వాన్ని పొందవచ్చు. పరమహంసతత్త్వపథం గైకొంటే జీవేశ్వరైక్యపదవిని పొందుతాడు. **బిందుచలనం ఉడుగుతుంది**. బిందుచలనం పోతే మనో ఇంద్రియాలు అడగి పోతాయి. ఈ పరమహంసార్థాన్ని వివరిస్తూ రామమూర్తి కవి ఒక కంద పద్యాన్ని చెప్పాడు.

"**హంసంబనువుల మెలగును**
**హంసస్సోహమను పరమ హంసము భవవి**
**ధ్వంసము షట్సరసీరుహ**
**హంసము మిళితేశ జీవ హంసంబగుచున్.**" – శుకచరిత్ర 4–51

హృదయంలోని ప్రాణవాయువు నాసికనుండి పన్నెండు అంగుళాలు లోపలికి వెళ్లడం పూరకమని, వెలుపలికి వెళ్లడం రేచకం అని అంటారు. ఈ విధంగా సంచరిస్తూ ఉన్న గాలిని ఆశ్రయించి మనసు సంచరిస్తూ ఉంటుంది. దానితో కూడా కలిసి హంస విహరిస్తూ ఉంటుంది. కుంభకాన్ని గురించి తెలియజేస్తూ రామమూర్తికవి –

"**ఇట్లు వాయువు లోపలికెంతలోన**
**నరుగు దెంచును నంతలో నర్ధకాల**
**మచలమయమగు నదియె బాహ్యాంతరముల**
**నైన కుంభకమనబడు నట్లుగాన.**" – శుకచరిత్ర 4–54

హృదయంలోని ప్రాణవాయువు వెలుపలికి వచ్చే సమయంలో అర్ధభాగం వెలుపల

నిలువబడింది. దానినే బహిఃకుంభకమని వ్యవహరిస్తారు. ఇట్లే ప్రాణవాయువు లోపలికి వెళ్లే సమయంలో అర్ధభాగం అణచి ఉంచబడుతుంది. దానికి అంతరకుంభకం అని పేరు.

హంసః అనే పదానికి ఈ క్రింది విధంగా కూడా అర్థం చెప్పుకోవచ్చు. 'హ' అంటే పూరకం. 'ం' అంటే కుంభకం. 'స' అంటే రేచకం. దీనిని గూర్చి తెలియజేస్తూ –

**అబ్జాసనాసీనుడై మేను నిక్కించి – సద్గురు ముద్ర నిశ్చలత బూని**
**స్వసుకరాంగుష్ఠ తర్జన్యనామికలచే – గర్ణచక్షుర్నాసి కలను మూసి**
**భ్రూమధ్యమమున చూపులు నిల్పి యంత హృ–ద్గగనంబులో నాదకళల గాంచి**
**నాసా బిలముల ననారతంబు మెలంగు – ప్రాణ వృత్తులను నేర్పాటు జేసి**

**పూరకము నహంకారంబు భోరు కొలిపి**
**కుంభకంబున బిందువు గూడ బరచి**
**రేచకమున సకారంబు జూచి హంస**
**యనెడు నక్షత్రముల రెండు నరయ వలయు**" – శుకచరిత్ర 4–55

ఏ

1. జ్ఞానేంద్రియములు – 5. 1. శ్రోత్రములు, 2. త్వక్కు, 3. నయనములు, 4. ముక్కులు, 5. జిహ్వ.

2. కర్మేంద్రియములు–5. వాక్కు–చేతులు–పాదములు–పాయూపస్థలు–మలవిమోచన– స్త్రీ పురుషమర్మాంగములు.

3. పంచప్రాణములు. ప్రాణము–అపానము–వ్యానము–ఉదానము–సమానము. ఈ అయిదు ప్రాణవృత్తులు.

4. భూతసూక్ష్మములు–5. శబ్దస్పర్శరూపరసగంధములు

5. అవిద్య – కామకర్మలు

6. మనస్సు – బుద్ధి – అహంకారము – చిత్తము ఈ నాలుగు అంతఃకరణచతుష్టయము.

మనస్సు సంకల్పరూపము. నిశ్చయరూపిణి బుద్ధి. అభిమానాత్మకము అహంకారము. అనుసంధానరూపము చిత్తము.

వీనిని మొత్తము కలిపి అష్టపురములు అంటారు. సూక్ష్మశరీరమే లింగశరీరము. ఈ విషయము బృహదారణ్యకోపనిషత్తులో వివరంగా కలదు.

**జ్ఞానకర్మేంద్రియైః జ్ఞానవిషయైః ప్రాణాదిపంచవాయుమనో బుద్ధిభిశ్చ సూక్ష్మస్థోఽపి-లింగమేవేత్యుచ్యతే ।** (యోగచూడామణ్యుపనిషత్తు)

జ్ఞానకర్మేంద్రియాలు పది, పంచవాయువులు, బుద్ధి, మనస్సు అనే ఈ పదిహేడు చేరితే సూక్ష్మశరీరం, లింగశరీరం అని చెప్పబడుతుంది. పంచీకరణ భాష్యంలో –

"బుద్ధికర్మేంద్రియప్రాణపంచకైః మనసా ధియా
శరీరగ్ సప్తదశభిస్సూక్ష్మం తల్లింగముచ్యతే" – పుట–36. శరీరకోపనిషత్తు–1

అని చెప్పబడింది – పంచీకరణ వార్తికం – 30–31 పుట అద్వైతాశ్రమప్రచురణ. (సురేశ్వరాచార్యకృతం)

**శ్లో॥ జ్ఞానేంద్రియాణి పంచైవ పంచ కర్మేంద్రియాణి చ ।**
**శ్రోత్రత్వక్‌నయనఘ్రాణజిహ్వాధీంద్రియపంచకమ్ ॥ 31**

**శ్లో॥ వాక్‌పాణిపాదపాయూపస్థాః కర్మేంద్రియపంచకమ్ ॥ 32**

**శ్లో॥ మనోబుద్ధిరహంకారశ్చిత్తం చేతి చతుష్టయమ్ ।**
**సంకల్పాఖ్యం మనోరూపం బుద్ధిర్నిశ్చయరూపిణీ ॥ 33**

**శ్లో॥ అభిమానాత్మకః తద్వదహంకారః ప్రకీర్తితః ।**
**అనుసంధానరూపం చ చిత్తమిత్యభిధీయతే ॥ 34**

**శ్లో॥ ప్రాణోఽపానస్తథా వ్యాన ఉదానాఖ్యస్తథైవ చ ।**
**సమానశ్చేతి పంచైతాః కీర్తితా ప్రాణవృత్తయః ॥ 35**

**శ్లో॥ ఖం వాయ్వగ్న్యంబుక్షితయో భూతసూక్ష్మాణి పంచ చ ।**
**అవిద్యాకామకర్మాణి లింగం పుర్యష్టకం విదుః ॥ 36**

**శ్లో॥ ఏతత్ సూక్ష్మశరీరం స్యాన్మాయికం ప్రత్యగాత్మనః ॥ 37**

ఈ శరీరంలో షట్చక్రాలతో కూడి, మూలాధారంనుండి సహస్రారపర్యంతం హంస అంటే ఉచ్ఛ్వాస–నిశ్వాసాలు ఇరవై ఒక్క వేల ఆరువందల సార్లు తిరుగుతూ ఉంటుంది. (కారణ శరీరం అంటే అవిద్యయే.) ఇది జీవుని ఆవరించి ఉంటుంది.

**4.2.6 బిందు స్వరూపం :**

పింగళానాడి–హకారం–శివబీజం; ఇడానాడి–సకారం–శక్తిబీజం; ఈ శివశక్తుల సంయోగ సంబంధమే బిందువు.

ఈ బిందువును గూర్చి రామమూర్తికవి తెలియజేస్తూ ఇలా అన్నాడు.

"తనువు తదీయ చక్రములు తచ్ఛ్రితనాడులు తద్గత ప్రభం
జనములు తచ్చలత్కరణ జాలము తత్సముపేతమానసం
బును దుదుదగ్ర సన్నిహిత బుద్ధియు నిన్నియు గూడి బిందువౌ
ననది పిండసారసభవాండములై విలసిల్లు చుండున్." – శుకచరిత్ర 4–57

శరీరం అందులోని షట్చక్రాలు ఆధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా, సహస్రారం. అందులోని నాడీత్రయం ఇడ, పింగళ, సుషుమ్నా; వాయుపంచకం, ప్రాణ, అపాన, వ్యాన, సమాన, ఉదానములు. వాటి చలనాలతో కూడుకున్నదే బిందువు అన్నాడు.

ఈ బిందువును గూర్చి పరశురామపంతుల లింగమూర్తికవి తన శ్రీసీతారామాంజనేయ సంవాదము కావ్యం ప్రథమాశ్వాసం 163వ వచనంలో ఇలా అన్నాడు.

"దశ వాయువులతో గూడి దశేంద్రియాన్వితంబై కామ రాగ ద్వేషాది వికార సహితంబై విషయ సుఖగ్రహణంబు కొరకు నధోముఖంబై శ్రవణేంద్రియంబు వలన ద్వివిధ శబ్దంబుల ద్వగింద్రియంబు వలన బంచ విధ స్పర్శంబుల నేత్రేంద్రియంబు వలన షడ్వర్ణంబుల జిహ్వేంద్రియంబు వలన, షడ్విధరసంబుల ఘ్రాణేంద్రియంబు వలన ద్రివిధ గంధంబుల ననుభవించుచు వెండియు, వాక్పాణిపాదపాయూపస్థల తోడం గూడి వచనాదానగమన విసర్గానంత కర్మంబుల నొనర్చుచు మనంబు ప్రవర్తించు చుండు నమ్మనంబు గరణంబుగా గైకొని తత్పవన మనోగ్ర స్థితయు గర్తృత్వ భోక్తృత్వాది ధర్మ సమేతయు నైన బుద్ధి విలసిల్లు నదియె బిందువనంబరగు"

అంటే మనస్సు దశవిధ వాయువులతో, పది యింద్రియాలతో కూడి శ్రోత్రేంద్రియంవల్ల శబ్దాన్ని గ్రహిస్తూ, చక్షురింద్రియం వల్ల సకల విధాలైన రూపాన్ని చూస్తూ, త్వగింద్రియం వల్ల స్పర్శలను గ్రహిస్తూ, ఘ్రాణేంద్రియం వల్ల వాసన చూస్తూ, జిహ్వేంద్రియం వల్ల రుచుల్ని ఆస్వాదిస్తూ ఉంటుంది. దాన్నే **హృదయకమలం** అంటారు. విషయసుఖాల్ని గ్రహించడానికై అది అధోముఖంగా ఉంటుంది. కర్మేంద్రియాల సహాయంతో మాట్లాడటం, యివ్వటం, నడవటం, విసర్జించటం, ఆనందించటం వంటి పనుల్ని కూడా అదే చేస్తుంది. హృదయకమలం స్థానంగా బుద్ధి సంచరిస్తూ ఉంటుంది. అది ప్రాణవాయువునకు మనసుకు అగ్రభాగంలో ఉంటుంది. దానికే బిందువు అని పేరు అని లింగమూర్తి వివరంగా వర్ణించాడు.

కళ పరమాత్మ ప్రతిబింబమని చెప్పబడింది. బిందువు సర్వకాలాల్లో భ్రూమధ్యానికి చక్కగా

క్రింద వక్షస్థలంలో అధోముఖంగా ఉన్న హృదయకమలం భాగాన నిలిచి ఉంటుంది. ఆ సమయంలో మనఃప్రాణాలకు స్థిరత్వం సిద్ధించదు. కాబట్టి హంస తత్త్వస్వరూపాన్ని తెలిసికొని బిందువును స్థిరంగా నిలిచేట్టు చేయాలి. మొట్టమొదట ఇంద్రియాలను వాటి నుండి మరలించి వాటితో ప్రాణాల్ని చేర్చి అందులో మనసును సంధించి ఆ ప్రాణమనస్సులతో కూడా హం, స అనే రెండు అక్షరాల్ని చేర్చి, సర్వకాలాల్లో సేవించాలి. ఇలా చేయడం వల్ల బిందువు చలించకుండా ఉంటుంది.

ఆ తర్వాత పరశురామపంతుల రామమూర్తి కవి **అకార, ఉకార, మకారాదుల్ని** గూర్చి ఇలా తెలియ జేశాడు.

> "**అమలంబగు నాద మకా**
> **రము బిందువుకార మాపరము కళయె మకా**
> **రము మూ డెనసిన నోంకా**
> **రమటంచు వచింతురాత్మరసికులు వత్సా!** " – శుకచరిత్ర 4–65

ఇలా అకారతత్త్వం ద్వారా ఉకారతత్త్వాన్ని, ఉకారతత్త్వం ద్వారా మకారతత్త్వాన్ని, మకార తత్త్వం ద్వారా ప్రణవతత్త్వాన్ని తెలిసికొని, జీవుడు మోక్షం పొందుతాడని కవి వర్ణించాడు.

### 4.3 సాంఖ్య యోగం :

భారతీయదర్శనాలలో న్యాయవైశేషికాలు, సాంఖ్యయోగాలు పూర్వోత్తరమీమాంసలు అనేవి ఆస్తికదర్శనాలుగా వ్యవహరింపబడుతూ ఉన్నాయి. సాంఖ్యయోగాన్ని కొందరు నిరీశ్వర యుక్తమన్నారు. దీనిని గూర్చి జాస్తి వేంకట నరసింహారావుగారు సాంఖ్యదర్శనం అనే గ్రంథానికి సంపాదకీయం వ్రాస్తూ ఇలా అన్నారు. "సాంఖ్యదర్శనమును కొందరు నిరీశ్వరమందురు. దానికి '**ఈశ్వరాసిద్ధేః**' అను సాంఖ్య సూత్రమును కూడ నుదాహరింతురు. కానీ వైదికులు దాని నంగీకరింపరు. సాంఖ్యము శ్రుతి ప్రామాణ్యము నంగీకరించును. కనుక నిరీశ్వరవాదము నంగీకరింపదు. అయితే 'ఈశ్వరాసిద్ధేః' అను సూత్రమునకు 'ప్రత్యక్ష ప్రమాణము చే ఆ ఈశ్వరుడు సిద్ధింపడ' ని యర్థము, కానీ ఈశ్వరుడు లేడని యర్థము కాదు". (సాంఖ్యదర్శనము – పుట–6)

సాంఖ్యయోగం ప్రాచీనతను గూర్చి తెలియ జేస్తూ పరశురామపంతుల రామమూర్తి కవి ఇలా తెలియజేశాడు.

> "**ఈ జగములు బొడమకము**
> **న్నా జగములు బోవు తుదిన నాధారంబై**

**తేజోమయమై శ్రేయో**
**రాజంబై యొక్క తత్త్వరాజము వెలుగున్.**" – శుకచరిత్ర 4-71

రామమూర్తి కవి అభిప్రాయంలో ఈ సాంఖ్యయోగం అత్యంతప్రాచీనతమమని తెలుస్తూ ఉంది.

పండిత గోపదేవ్ వ్రాసిన 'సాంఖ్యదర్శనము' గ్రంథానికి పరిచయం వ్రాస్తూ జాస్తి వేంకట నరసింహారావు గారు "సాంఖ్యదర్శనము భారతీయదర్శనములలో నొకటి. ముఖ్యముగా షడ్ దర్శనములని పిలవబడు ఆస్తికదర్శనములలో నన్యతమము, భారతీయజనశ్రుతి ననుసరించి యీ దర్శనము ఇతర దర్శనములకంటే ప్రాచీనముగా నెంచబడుచున్నది. ఈ గ్రంథమును రచించిన మహనీయుడు పరమర్షి కపిల భగవానుడు."

కపిలమహర్షి కణాదాదులకంటె నతిప్రాచీనుడు. కావున నీ మహర్షి యెప్పటివాడో మరియు నెక్కడి వాడో నిర్ణయించి చెప్పుట దుస్తరమగుచున్నది అన్నారు. సాంఖ్యదర్శనము పుట-15.

భారతభూమిలో కపిల పేరుతో ఉన్నవాళ్లు నలుగురు. వారిలో ఒకరు కలియుగంలో గౌతమవంశంలో జన్మించిన వారు. వారి పేరుతోనే కపిలవస్తునగరం నిర్మింపబడిందని బౌద్ధవాఙ్మయంలో చెప్పబడి ఉంది. విదేశీవిద్వాంసుల్లో చాలామంది బౌద్ధవాఙ్మయంలోని కపిలుడే సాంఖ్యదర్శనకర్త అని చెప్పారు. కానీ సాంఖ్యదర్శనం ఇంకా ప్రాచీనమయింది. రెండో కపిలుడు బ్రహ్మమానసపుత్రుడు. మూడో కపిలుడు అగ్ని అవతారం. నాల్గో కపిలమహర్షి కర్దమప్రజాపతికి దేవహూతియందు పుట్టిన వాడు. ఈయన సాంఖ్యదర్శనకర్త అని పరిశోధకుల నిర్ణయం.

కపిలమహర్షి కాలాన్ని గూర్చి తెలియజేస్తూ పండిత గోపదేవ్ ఇలా వ్రాశాడు. "కపిల మహర్షి కాలమును నిర్ణయించుటకును తగిన సాధన సామగ్రి లభించుట దుష్కరమే యగుచున్నది. ప్రస్తుతమున యుగముల కాలనిర్ణయము చేయుటకు నను వు లేకున్నది. కాగా అది విద్వాంసుడైన కపిలమహర్షి సత్యయుగమునకు చివరనో, త్రేతాయుగమునకు ప్రారంభముననో యున్నట్లు పాంచరాత్రసాంప్రదాయమునకు సంబంధించిన **అహిర్బుధ్న్య సంహిత**లో వర్ణింపబడియున్నను కాల నిర్ణయము చేయజాలము. మహాభారతము నందు శాంతిపర్వములో వర్ణింపబడి యున్న కపిల ఆసురి సంవాదమును బట్టి చూచినను కపిలుడు మిక్కిలి ప్రాచీనుడనియే చెప్పనగును. మరియు నుపనిషత్తులలో నొకటియగు శ్వేతాశ్వతరో పనిషత్తు నందును కపిలుని నామము స్పష్టముగా నుల్లేఖింపబడినది. కపిల నామమేకాక సాంఖ్య సిద్ధాంతములు నీ యుపనిషత్తునందే కాక యితర ఛాందోగ్యాద్యుపనిషత్తులందును

ప్రతిపాదింపబడియుండుట చూచుచున్నాము. కఠోపనిషత్తునందు 1.3.10.11 ఇంద్రియములు, తన్మాత్రలు, మనస్సు అహంకారము, మహత్తు, అవ్యక్తము, పురుషుడు నను నీ సాంఖ్య దర్శనప్రతిపాద్యవిషయములు చక్కగా వివరింపబడియున్నవి. వేదమునందును సాంఖ్య మూల సిద్ధాంతములు నిరూపింపబడియున్నవి. కాని వేద నిరూపిత సాంఖ్య పదార్థములకు దార్శనిక స్వరూపము నొసంగినవాడు పరమర్షి కపిలుడు. అట్టి దార్శనికస్వరూపప్రతిబింబములే యుపనిషత్తులందు మనకు గోచరించుచున్నవి. కాబట్టి కపిలుడు ఉపనిషత్తుల కాలమునకు పూర్వుడనియు చెప్పుట సాహసము కానేరదు". వీరి మాటలకు రామమూర్తి కవి వ్రాసిన మాటలకు చాలా దగ్గరి సంబంధం ఉందని చెప్పడంలో ఎలాంటి విప్రతిపత్తి లేదు.

సాంఖ్యదర్శనం మీద వచ్చినవాటిలో సాంఖ్యసూత్రములు, తత్త్వ సమాసము సాంఖ్యకారిక అనేవి ప్రామాణిక గ్రంథాలు సాంఖ్యదర్శనసిద్ధాంతాలు ప్రతి పురాణం, మహాభారతాదులు, మనుస్మృతి, శ్వేతాశ్వతరాద్యు పనిషత్తులు, భగవద్గీతలలో కొద్ది మార్పులతో స్వీకరింపబడ్డాయి.

ప్రకృతి పురుషుల వివేచనం ఈ దర్శనంలో ఉంది. ప్రకృతి, పురుషులు స్వతంత్ర ప్రతిపత్తి గలవారు. పురుషుడు చేతనుడు. అందుకే ఆయన చైతన్యస్వరూపుడు. అయితే ప్రకృతి జడత్వం గలది. సత్త్వరజస్తమస్సుల సంయుక్తావస్థయే **ప్రకృతి** అనబడుతుంది.

ప్రకృతిపురుషులతత్త్వాన్ని గూర్చి జాస్తి వేంకట నరసింహారావుగారు ఇలా అన్నారు. "పురుష-సాన్నిధ్యము వల్ల ప్రకృతి వికృతి కాదొడగును. దానియందు స్థౌల్యము సత్త్వరజస్తమస్సులలో వైషమ్యము ఏర్పడును. ఇదియే సృష్టికి ఆరంభము. ప్రకృతినుండి యేర్పడు మొదటిసృష్టి మహత్తత్త్వము. దీనిని బుద్ధి యందురు. దీనినుండి అహంకారము. దాని నుండి పంచతన్మాత్రలు. ఏకాదశేంద్రియములు జనించును. అంతట పంచతన్మాత్రల నుండి పంచస్థూలభూతములు, పృథివ్యాదులు జనించును. ఇట్లు ప్రకృతి ఇరువది నాలుగు తత్త్వములుగా గణింపబడును. పురుషుడొక తత్త్వము, కలిసి మొత్తం ఇరువది యైదు తత్వములు సాంఖ్యశాస్త్రములో ప్రసిద్ధములయినవి. తత్వసంఖ్యను బట్టి దీనికి సాంఖ్యదర్శనమను వ్యవహారము వచ్చినది." సాంఖ్యదర్శనము సంపాదకీయము. పుట-5

పురుషుని సాన్నిధ్యం వల్ల బుద్ధిచేతనమై సమస్తకార్యాలు చేస్తుంది. జీవుడు తాను వేరు, బుద్ధివేరు అన్న వివేకం కల్గి బంధవిముక్తుడై కైవల్యం పొందుతాడు. ప్రకృతిపురుషుల వివేకమే ముక్తికి సాధనం.

సాంఖ్యం పరబ్రహ్మ స్వరూపాన్ని తెలియజేస్తూంది. ఈ పరబ్రహ్మం వాఙ్మనోతీతం కావడం వల్ల వేదశాస్త్రాల ద్వారా తెలిసికోవచ్చు. గీత, బ్రహ్మసూత్రాలు, శ్రుతులు పరబ్రహ్మ స్వరూపాన్ని

తెలియజేస్తాయి. యోగశాస్త్రప్రవీణులేగాక, పవిత్రం, విశాలం అయిన మనస్సుగల మహర్షులు తమ చిత్తాన్ని అంతర్ముఖం చేసి పరిశుద్ధం, శాంతం అయిన తమ బుద్ధిచేత వేదప్రతిపాదితమైన పరమతత్త్వాన్ని దర్శించారు.

మాయను ఏకతత్త్వంగా రామమూర్తికవి పేర్కొన్నాడు.

"**ఆయేకతత్త్వమనమా**
**యా యను తత్త్వంబు దోచెనది యేకమనా**
**నాయేకాది దశాంత వి**
**ధాయక తత్త్వములలో బ్రధానంబదియున్.**" – శుకచరిత్ర 4–83

సృష్టికి పూర్వం నిర్వికల్పకం వాఙ్మనోగోచరమైన పరబ్రహ్మం మాయావిలాసరూపంతో ద్వివిధ భావాన్ని పొందింది. అందులో ఒకటి ప్రకృతి, రెండోది కేవల జ్ఞానరూపమైన పురుషుడు. ప్రకృతిపురుషతత్త్వాలు రెండూ పరమేశ్వరరూపాలే. రామమూర్తికవి తండ్రి లింగమూర్తి గణపతిని ప్రకృతిపురుషాతీతపరబ్రహ్మస్వరూపునిగా, ప్రకృతిపురుషాదిసర్వస్వరూపునిగా స్తుతించి, ప్రకృతి పురుషులు పరబ్రహ్మం రూపభేదాలే అని నిరూపించాడు.

"**పర విశ్వోద్గతి హేతువు**
**పరముదు పురుషుండు ప్రకృతి బ్రహ్మము పరమే**
**శ్వరుదంచు, దత్‌జ్ఞు లెవ్వని**
**బరికింపుదు రగ్గణాధిపతి నర్చింతున్.**" – సీతారామాంజనేయసంవాదము 1–5

విశ్వానికి కారణరహితమయిన కారణం ప్రకృతి, మనస్సు, జడపదార్థం. ఈ ప్రకృతికి ప్రధానం, గుణ క్షోభిణి, బహుధానకం, ప్రసవధర్మిణి అనే నామాంతరాలు ఉన్నాయి. ప్రకృతి సృష్టిలోని సమస్తపదార్థాలకు మూలం కావడం చేత **ప్రధానమ**ని, గుణత్రయ సామ్యావస్థను స్వయంగా మార్చేది కాబట్టి **గుణక్షోభిణి** అని, గుణత్రయ రూపమైన పదార్థవైచిత్రి యొక్క బీజాలు ఇందులో ఉండడం వల్ల **బహుధానకమ**ని, సకల పదార్థాలు ఇందులో పుడతాయి. కాబట్టి **ప్రసవధర్మిణి** అని ప్రకృతిని పేర్కొన్నా రు. ఈ ప్రకృతి వేదాంతంలో మాయ అని, అవిద్య అని రెండు విధాలు. అందులో రజస్తమోగుణాల సంబంధం లేని పరిశుద్ధసత్వగుణమే 'మాయ' రజస్తమో గుణాల సంబంధం కల్గి అపరిశుద్ధ సత్త్వగుణం ప్రధాన స్వరూపంగా ఉండేది అవిద్య అవుతుంది" అని సీతారామాంజనేయ సంవాదకర్త తెలియ జేశారు.

"**కవి యన్మూల ప్రకృతి యు**
**ద్వివిధ యగును మాయయన నవిద్యయనగ నా**

**ద్యవిమల సత్త్వాత్మిక యగు**
**నవిమల సత్త్వ ప్రధాన యగు నన్యతగన్.**" – సీతారామాంజనేయసంవాదము 2-28

దీన్నే రామమూర్తికవి ఇలా తెలియజేశాడు.

"**ఆ ప్రకృతి తత్త్వమతి స**
**త్త్వ ప్రకృతిని మాయ యనగ, దామస గుణ రూ**
**ప ప్రకృతి నవిద్యయనం**
**గా ప్రకటము నొందె ద్వంద్వ గతి చేకూరన్.**" – శుకచరిత్ర 4-86

ఈశ్వరుడు మాయకు అధిపతి. సత్త్వ ప్రధానమైన మాయ ఈశ్వరుని స్వాధీనంలో ఉంటుంది. అమల సత్త్వ ప్రధానమైన మాయలో బ్రహ్మం, మేఘసంగత జలాలలో ఆకాశం ప్రతిఫలించినట్లు ప్రతిఫలిస్తుంది. ఆ మాయా ప్రతిబింబం, మాయాధిష్ఠానాన్ని మాయను కలిపి మాయావియైన ఈశ్వరుడు సిద్ధిస్తూ ఉన్నాడు.

ఈశ్వరుడు విశ్వ ఉత్పత్తి, స్థితి, లయాలకు కారణభూతుడౌతున్నాడు. రజోగుణంవల్ల విశ్వాన్ని సృష్టిస్తున్నాడు. సత్త్వగుణంవల్ల పాలిస్తూ ఉన్నాడు. తమోగుణంవల్ల లయింప జేస్తున్నాడు. మానవుల్లో శాంతి నైర్మల్య ప్రసన్నతల రూపంలో సత్వగుణం; రాగతృష్ణల రూపంలో అశాంతి, హింసా ప్రవృత్తుల రూపంలో రజోగుణం; మూఢత్వం, ప్రమాదం, మోహం రూపంలో తమోగుణం అభివ్యక్తమౌతాయి.

మానవ శరీరంలో మూడు అవస్థా భోగాలు ఉంటాయి. జాగ్రదవస్థ, స్వప్నావస్థ, సుషుప్త్యవస్థ అనేవి. వీటిని గూర్చి చెబుతూ రామమూర్తి కవి ఇలా అన్నాడు.

"**సకల బాహ్యార్థ భోగంబు జాగరంబు**
**నాంతరార్థ ప్రపంచ భోగానుభవము**
**స్వప్న మయ్యుభయ ప్రపంచ ప్రక్షప్తి**
**సుప్తి జీవాత్ముడందనుస్యూతుడరయ.**" – శుకచరిత్ర 4-101

ఈ అవస్థాత్రయాన్ని గూర్చి విమర్శకులు ఇలా వ్యాఖ్యానించారు. కర్మేంద్రియాలు ఐదు. జ్ఞానేంద్రియాలు ఐదు. అంతఃకరణచతుష్టయం అనే పద్నాలుగూ ఆయా అధిష్ఠానాలతో కూడి స్థూలమైన శబ్దాది బాహ్యవిషయాల్ని ఎపుడు గ్రహిస్తూ ఉండే ఆ అవస్థను **జాగ్రదవస్థ** అంటారు.

శబ్దాది విషయాలు లేకున్నా ఆ కాలంలో ప్రతిభాసించే జాగ్రద్వాసనామయాలైన శబ్దాదుల్ని జాగ్రద్వాసనాసహితలైన పై పద్నాలుగు ఇంద్రియాలతో, అంతఃకరణంలో ఎప్పుడూ గ్రహిస్తుందో ఆ అవస్థ **స్వప్నావస్థ**.

చతుర్దశేంద్రియాలు, తమ కారణంవల్ల లయమందుచున్నందువల్ల శబ్దాది విషయాల్ని బాహ్యమందుగానీ, అంతఃకరణమందుగానీ గ్రహించటానికి ప్రవృత్తి లేకుండడం వల్ల ఆయా శబ్దాది విశేషజ్ఞానం కలుగదు. ఆ అవస్థను **సుషుప్తి అవస్థ** అంటారు.

ఇవిగాక తురీయావస్థ అనే మరొక అవస్థ కూడా ఉంది. అవస్థాత్రయానికి సాక్షిమాత్రంగాను, స్వయంగా తనకెలాంటి భావాభావాలు లేనట్టి చైతన్యం మాత్రమే **తురీయావస్థ** అవుతుంది. ఈ అవస్థలను ఆశ్రయించి జీవులు జీవిస్తూ ఉంటారు.

వ్యష్టి తనువులన్నీ సమష్టి స్థూలకాయమయింది. వ్యష్టి సూక్ష్మగాత్రాలు సమష్టి సూక్ష్మాంగమయింది. వ్యష్టి కారణవిగ్రహాలన్నీ సమష్టి దేహమయింది. వ్యష్టి జాగరణాద్యవస్థలు సమష్టి జాగరణాదికం అయింది. ఈ సమష్టి శరీరత్రయంలో ఆ సమష్టి అవస్థాత్రయం ఒక భాగమయింది. విరాట్టు, హిరణ్యగర్భుడు, ఈశ్వరుడు అనే ముగ్గురిగా ఈశ్వరుడు విరాజిల్లాడు.

పైన పేర్కొన్న సమష్టి శరీరత్రయానికి సమష్టి అవస్థా త్రయానికి ఈశ్వర త్రయానికి ఆవల పరమాత్ముడుంటాడు. ఇలా పరమార్థతత్త్వాన్ని వివరించిన తర్వాత **తత్త్వమసి** మహావాక్యార్థ నిర్ణయాన్ని గూర్చి చెప్పాడు.

"**తత్త్వమసి**" అనే సామవేద మహావాక్యం ఈ జీవబ్రహ్మైక్యస్వరూపాన్ని తెలుపుతుంది. ఇందులోని "తత్" "త్వమ్" పదాలకు క్రమంగా పరమాత్ముడు, జీవుడు అనే అర్థాలున్నాయి. 'అసి' పదం జీవపరమాత్మల ఏకత్వాన్ని తెలుపుతుంది. 'త్వమ్' పదానికి వాచ్యార్థం, లక్ష్యార్థమనే అర్థాలున్నాయి. 'త్వమ్' పదాన్ని వెన్నెలకంటి సుందరరామశర్మ శ్రీ సీతారామాంజనేయ సంవాదమునకు తాత్పర్యం వ్రాస్తూ ఇలా వివరించారు. "మహావాక్యమునందలి త్వం నీవు అను పదము చే సామాన్యముగా వ్యష్టి స్థూల సూక్ష్మ కారణ శరీరములును వ్యష్టి జాగ్రత్స్వప్న సుషుప్తి అవస్థలును, విశ్వతైజసప్రాజ్ఞులును భ్రాంతి వలననున్నట్లు తలంపబడుచున్న కించిద్జ్ఞత్వాది గుణంబులును అనగా వ్యష్టి దేహములే తానుగా తలంచుచు జాగ్రదాదులు ననుభవించుచు కించిదజ్ఞుడనునుకొనుచు నుండు విశ్వతైజసప్రాజ్ఞభేదములుగా జీవుడు చెప్పబడుచున్నాడు. ఈ యర్థము అనగా 'త్వం' జీవుడు, అనునర్థము భ్రాంతులయనుభవమును బట్టి చెప్పబడునదియే కాని విచార దృష్టిచే జూచిన సిద్ధాంతమగునది కాదు. అట్టి యర్థమునకే వాచ్యార్థమని పేరు. బాగుగా విచారించినచో నీ దేహములుకాని, యవస్థలుకాని కించిద్జ్ఞత్వాది గుణములు కాని యథార్థములు కాక కేవమలు భ్రాంతి సిద్ధములే. కావున నీ దేహముల కంటె వేరై యవస్థలకు సాక్షియై పంచకోశములకు నతీతుడై సత్యజ్ఞానానందస్వరూపుడై యున్న కూటస్థుడే యా త్వం పదమునకర్థము. ఇట్లు నిర్ణయింపబడిన యర్థమునకు లక్ష్యార్థమని పేరు." – సీతారామాంజనేయసంవాదము 2 అ – పుట–335.

దీనిని గూర్చి రామమూర్తి తన శుకచరిత్ర కావ్యంలో ఇలా చెప్పాడు.

తే.గీ. వ్యష్ట్యవస్థా శరీర జీవత్రయంబు
లగును త్వం పదమునకు వాచ్యార్థమరయ
వ్యష్ట్యవస్థా శరీరజీవాతిరిక్తు
డగును త్వం పదమునకు లక్ష్యార్థమనఘ! " - శుకచరిత్ర 4-114

'త్వమ్' పదానికి వాచ్యార్థమయితే, వీనికి విలక్షణమై, సాక్షియై యున్న సచ్చిదానంద స్వరూపమయిన కూటస్థచైతన్యం 'త్వమ్' పదం లక్ష్యార్థ మవుతూ ఉంది. ఈ లక్ష్యార్థమే తానై వెలిగే ప్రత్యగాత్ముని ధ్యానించేవాడు చిత్స్వభావుడవుతాడు. ఈతని గుణగణాదుల్ని ఎనిమిది సీసపద్యాలు, మూడు గీత పద్యాల్లో కవి చక్కగా వివరించాడు. ఇతడు దుష్కృత, సుకృత, మిశ్రమంబు లనే కర్మత్రయానికి అతీతుడు.

**"ఆమ్నాయ వాక్యయుక్త్యనుభవంబులను ప్ర-మాణ త్రయగ్రాహ్యమాను డితడు**
**సారవైరాగ్య విజ్ఞాన భక్తుల నేటి - సాధనత్రయ సిద్ధి సాధ్యుడితడు**
**సహజకర్మభ్రాంతి జన్యంబులనెడి తా-దాత్మ్యత్రయాసంభృతాత్ముడితడు**
**అల సంశయ విపర్యయా సంభవములను - భావత్రయావిదూర భావ్యుడితడు**

**ఘనతరారబ్ధ సంచితాగాములనెడు**
**భూరికర్మత్రయంబున బొందడితడు**
**నెపుడు నిచ్ఛాపరేచ్ఛానిజేచ్ఛలనగ**
**జెల్లు ప్రారబ్ధముల మూట జెందడితడు.**" - శుకచరిత్ర 4-118

త్రిపుటులకతీతుడై త్రివిధకర్మలు, త్రివిధ బోధలు, త్రితృప్తులు, త్రివిధశ్రద్ధా, త్రివిధ విరక్తి, త్రిదీక్ష, త్రివిధ సుఖాలు, త్రిధృతులు, త్రివిధ బుద్ధులు, త్రివిధకర్తలు, త్రివిధభక్తులు, త్రివిధవృత్తులకు ఇతడే ఆదిపురుషుడు. ఆజ్ఞాచక్రంలోని అవిద్యోపాధికుడయిన జీవుడు త్వం పదవాచ్యార్థం. సహస్రారచక్రంలోని మాయోపాధికుడయిన ఈశ్వరుడు తత్ పదవాచ్యార్థం. ఆజ్ఞాచక్రంలోని అవిద్యను; సహస్రారచక్రంలోని మాయను తొలిగిస్తే మిగిలిన ప్రత్యగాత్మ పరమాత్మల ఏకత్వమే కైవల్యస్థానం. ఇదే **మహావాక్యార్థం**.

తత్త్వమసి మహావాక్యవిచారణేగాక మహావాక్యచతుష్టయవిచారణ కూడా శుకచరిత్రలో చోటు చేసుకుంది. ఈ నాల్గు మహావాక్యాలు నాల్గు వేదాలలో వివరింప బడ్డాయి. **ఋగ్వేదంలో 'ప్రజ్ఞానం బ్రహ్మ'** అని, **యజుర్వేదంలో 'అహం బ్రహ్మాస్మి'** అని, **సామవేదంలో 'తత్త్వమసి'** అని, **అథర్వణవేదంలో 'అయమాత్మా బ్రహ్మ'** అని ఈ మహావాక్యాలు చోటు చేసుకొన్నాయి. ఇవి కూడా ఈశ్వర ఐక్య జ్ఞానాన్ని తెలియజేస్తూ ఉన్నాయి.

రామమూర్తి కవి వర్ణచతుష్టయాన్ని, ఆశ్రమచతుష్టయాన్ని, దేహచతుష్టయాన్ని, అవస్థా- చతుష్టయాన్ని అంతఃకరణచతుష్టయాన్ని వర్ణించాడు. ఆ తర్వాత జీవేశ్వరభావం విడిచి, ఐక్యపదం పొందినవాడు కైవల్యాన్ని పొందుతాడని చెప్పాడు.

**"మహిత భూతము వర్తమానంబు భావినా - నలవడు కాలత్రయంబునందు**
**బహు దివ్య దినవార పక్షమా సర్త్వయ - నాబ్దాది రూప కాలాక్రమమున**
**కెరలి వచ్చుచు బోవు కృతయుగ త్రేతాయు - గ ద్వారప కలియుగంబులనగ**
**జరిగెడు యుగ చతుష్టయ పరంపరలకు - లోక మందక యసాలోక్యముక్తి**
**సాను రూప్యముక్తి సామీప్య ముక్తి సా**
**యుజ్యముక్తులనగ నొప్పు నాల్గు**
**ముక్తులకును నాది మూలమై యుండు కై**
**వల్యమందు నిలుచు వాడు ఘనుడు.**" - శుకచరిత్ర 4-147

సాలోక్యముక్తి, సానురూప్యముక్తి, సామీప్యముక్తి, సాయుజ్యముక్తి అనే నాల్గు ముక్తులను పొందేవారినే ఆత్మవిదుడు, ఆత్మవిద్వరుడు, ఆత్మవిద్వరేణ్యుడు, ఆత్మవిద్వరిష్ఠుడు అని నాల్గు రకాలుగా ఉన్నారని చెప్పాడు.

వేదాల్లో చెప్పబడిన ఆచార క్రమాన్ని నిర్వర్తించి, గురుని సదుపదేశం పొందేవాడు **ఆత్మవిదుడు**. అఖిల క్రియల విధి సంన్యసించి గురుని సమ్ముఖమొంది శ్రుతివిచారయుక్తి శోభించి చిద్రూపభావంలో శాంతిని పొందేవాడు **ఆత్మవిద్వరుడు**. సమస్తాన్ని విడిచి శ్రుతులలో చెప్పిన గుణాలు కలిగి మధ్య మధ్య తన శరీరాన్ని మరచి చిదాత్మను పొంది శాంతి మగ్నుడయ్యేవాడు **ఆత్మవిద్వరేణ్యుడు**. అఖిలం తానై, తానే అఖిలమై సుప్తుడైనట్లు ఒకింత మేలుకోక ఎంతో గుణాతీతుడుగా బ్రహ్మరూపుడై ప్రకాశించేవాడు **ఆత్మవిద్వరిష్ఠుడు**.

**"ఈ నల్గురికి విరక్తులు**
**జ్ఞానములుపరతులు చిత్త శాంతులు సుఖముల్**
**న్యూనాదికములనుండును**
**గాని సుగతి యొకటి బోధకారణమగుటన్.**" - శుకచరిత్ర 4-153

అని చెప్పి కవి **తత్త్వపంచకలక్షణాన్ని** తెలియ జేశాడు. శ్రోత్రేంద్రియం, తనుగతత్త్వగింద్రియం, నేత్రేంద్రియం, జిహ్వేంద్రియం, ఘ్రాణేంద్రియం అనేవి ధీంద్రియపంచకం. ప్రాణం, అపానం, వ్యానం, ఉదానం, సమానం అనేవి ప్రాణపంచకాలు అని కవి తెలియజేశాడు. కాని పంచీకరణ భాష్యములోను, శ్రీసీతారామాంజనేయసంవాదంలోను దీన్ని గూర్చి చాల విపులంగా స్పష్టంగా వివరించడం కనిపిస్తుంది.

జ్ఞాత, మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం ఈ ఐదు ఆకాశం యొక్క ఐదు భాగాల వల్ల కలిగినవి కాబట్టి ఇవి **ఆకాశపంచకం** అయ్యాయి. వ్యాన, ఉదాన, సమాన, ప్రాణ, అపానాలు ఐదూ వాయువు యొక్క ఐదు భాగాలవల్ల కలిగినవి కాబట్టి **వాయుపంచక** మయ్యాయి. శ్రోత్రం త్వక్కు, చక్షు, జిహ్వా, ఘ్రాణాలు అయిదూ అగ్నియొక్క ఐదు భాగాల వల్ల కలిగాయి కాబట్టి **అగ్నిపంచకమ**య్యాయి. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు ఐదూ జలం యొక్క ఐదు భాగాల వల్ల కలిగాయి కాబట్టి **జలపంచక** మయ్యాయి. వాక్కు పాణిపాదగుహ్యగుదాలు ఐదూ పృథివియొక్క ఐదు భాగాల వల్ల కలిగాయి కాబట్టి **పృథివీపంచకమ**య్యాయి. ఇలా పంచభూతాల వల్ల కలిగిన ఇరవై ఐదు తత్త్వాలతో కూడినదే స్థూలశరీరం. శ్రోత్రం, త్వక్కు, చక్షువు, జిహ్వా, ఘ్రాణం అనేవి జ్ఞానేంద్రియాలు. ఈ జ్ఞానేంద్రియాలు ఐదు అగ్ని పంచకం. ఇవి అగ్ని అంశాలుగా ఉన్నా ఇవి ఏయే భూతాలతో చేరి ఉంటాయో ఆయా భూతతన్మాత్రలను గ్రహిస్తాయి.

వాక్కు, పాణి, పాదం, పాయువు, ఉపస్థ అనేవి కర్మేంద్రియాలు. ఇవి పృథివి, పంచకమై పృథివి అంశాలు అవుతున్నాయి. వాక్కు ఆకాశ కదంబంలోనిది కాబట్టి ఆకాశ గుణమైన శబ్దాన్ని పలుకుతూ ఉంటుంది. పాణి వాయుకదంబంలోనిది కాబట్టి వాయు గుణమైన స్పర్శను కలిగి ఉంది. పాదం ఇది అగ్నికదంబంలోనిది కాబట్టి అగ్నికార్యమైన గమనాన్ని చేస్తూ ఉంటుంది. గుహ్యం జలకదంబంలోనిది కాబట్టి జలకార్యమైన మూత్రాన్ని, శుక్లాన్ని విడుస్తూ ఆనందిస్తూ ఉంటుంది. పాయువు అంటే గుదం. పృథివి కదంబంలోనిది కాబట్టి పృథివి కార్యమైన మలవిసర్జన చేస్తూ ఉంటుంది. ఇలా వాక్కు, పాణి, పాదం, గుహ్యం, గుదాలు ఒక్కొక్కటి ఒక్కొక్క కార్యాన్ని చేయడం వల్ల ఇవి **కర్మేంద్రియాలు** అయ్యాయి.

**సమాన**వాయువు నాభిస్థానంలో నిలిచి జఠరాగ్నిని వెలిగిస్తూ అన్నరసాన్ని సకలనాడులకు పంచుతుంది. **వ్యాన**వాయువు శరీరంలో నఖశిఖపర్యంతం ఉంటూ అన్నరసాన్ని శరీరమంతా వ్యాపించేలా చేస్తుంది. **ఉదాన**వాయువు కంఠస్థానంలో ఉంటూ కంఠం, జిహ్వా, తాలువు, మూర్ధం మొదలైన అష్టస్థానాల గుండా శబ్దాన్ని పలికిస్తుంది. ఇదిగాక నిద్రావస్థలో సర్వేంద్రియాలను అవిద్యయందుచేర్చి మరల జాగ్రదవస్థయందు ఆ యా ఇంద్రియాలను యథారీతిగా ఆ యా స్థానాలలో చేరుస్తూ సకలప్రాణుల అన్నపానాదుల్ని తీసుకునేలా చేస్తుంది. **ప్రాణ**వాయువు హృదయస్థానంలో ఉండి నాసికా రంధ్రాల గుండా ఊపిరి తిత్తులందు ఉచ్ఛ్వాసనిశ్వాస రూపంగా సంచరిస్తూ ఉంటుంది. అందరికీ ఆకలి దప్పుల్ని కలిగిస్తూ ఉంటుంది. **అపాన** వాయువు అన్నాన్ని మ్రింగిస్తూ గుదస్థానంలో ఉంటూ మలాన్ని వెలుపలికి విసర్జింప చేస్తూ ఉంటుంది.

**పంచకోశాలు :**

**"అన్నమయము, సమీరమయము మనోమ**
**యంబు విజ్ఞానమయము సౌఖ్యమయమనగ**
**బంచకోశంబులవి స్వరూపమున**
**పైనొకటి గప్పికొనగ నేర్పడక యుండు."** - శుకచరిత్ర 4-163

అని చెప్పి అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయం అనే పంచకోశాలను పేర్కొని వాటి వివరణ కూడా శుకచరిత్ర కర్త ఇచ్చాడు.

**"అన్నజ సంభవంబన్నమయం బిది - గాను నేదీనిని గాంచువాడ**
**ప్రాణ వాక్ప్రభృతులు ప్రాణమయం బిది - గాను నేదీనిని గాంచువాడ**
**శ్రవణాది యుత మానసము మనోమయ మిది - గాను నేదీనిని గాంచువాడ**
**జ్ఞానేంద్రియములు ప్రజ్ఞయు బుద్ధిమయ మిది - గాను నే దీనిని గాంచువాడ**
**మానితజ్ఞాన మానందమయము నిదియు**
**గాను నేనును దీనిని గాంచువాడ**
**నని విచారించి కోశముల్ తనకు దాను**
**కోశములకును వేఱను కొనగవలయు."** - శుకచరిత్ర 4-166

**"అన్న కార్యాణాం సమూహోన్నమయః కోశః"** పంచీకరణభాష్యము, పుట-48.

ఆహార పరిణామ రూపమయిన ఈ స్థూలదేహమంతా **అన్నమయకోశం** అవుతుంది. ఇది కత్తికి ఒరవలె ఆత్మకు కోశంగా ఉండడం వల్ల 'కోశం' అనబడుతుంది.

ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన, నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయ అనే దశవిధ ప్రాణ వాయువులు స్థూల దేహమందుండేటప్పుడు అది **ప్రాణమయకోశం** అవుతుంది.

అన్నమయ, ప్రాణమయ కోశాలు రెంటితో గూడి మనస్సు మొదలయిన పూర్వోక్తాలైన పద్నాలుగు ఇంద్రియాలచేత, శబ్దస్పర్శాది విషయసంకల్పం మొదలయిన ధర్మాల్ని చేయటమే **మనోమయకోశం**.

విజ్ఞానమయ కోశాన్ని బుద్ధిమయ కోశం అని కూడా అంటారు. పైన వివరించిన మూడు కోశాలతో కూడిన అంతఃకరణంలో శబ్దాది విషయవిశేషాలను అందలి మేలుకీళ్లను చక్కగా విచారించి ఒక నిర్ణయానికి వచ్చే అంతఃకరణవృత్తుల్నే **విజ్ఞానమయకోశం** అంటారు. ప్రాణమయం, మనోమయం, విజ్ఞానమయం అనే మూడుకోశాలు చేరి సూక్ష్మశరీరం అవుతుంది. దీనినే **లింగశరీరం** అంటారు.

పై నాల్గు కోశాలకు కారణమయిన అవిద్య, అజ్ఞానంచేత ఆవరింపబడిన తన కారణ జ్ఞానం ఆనందరూపమయిన బ్రహ్మంలో మఱ్ఱి విత్తనంలో వృక్షంలా బీజరూపంగా లీనమై ఉండటమే **ఆనందమయకోశం**.

కారణ శరీరమందలి మలిన సత్వగుణం ప్రజ్ఞాయోగవృత్తులతో కూడినదై ఆనందమయ కోశమవుతుంది. ఈ కోశంలో ఆత్మ ఉన్నప్పుడు నేను సుఖవంతుడననే ప్రతీతి ఏర్పడుతుంది. **అన్నమయకోశమే** స్థూలదేహం.

రామమూర్తికవి నిత్యప్రళయం, నైమిత్తికప్రళయం, దైనందినప్రళయం, బ్రాహ్మము, ఆత్యంతిక ప్రళయాలనే పంచప్రళయాలను; అస్తిత్వం, జాతత్త్వం, దినవర్ధమానత్త్వం, పరిణామత్త్వం, క్షీణత్త్వం, నాశత్త్వం అనే షడ్భావాల్ని; కామ,క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనే అరిషడ్వర్గాల్ని; శోకం, మోహం, ఆకలి దప్పులు, జనన మరణాలు అనే షడూర్ముల్ని; ఆధారచక్రం, మణిపూరచక్రం, స్వాధిష్ఠానచక్రం, అనాహతచక్రం, విశుద్ధచక్రం, ఆజ్ఞాచక్రం అనే షట్కమలాల్ని; యజనం, యాజనం, అధ్యయనం, అధ్యాపనం, ప్రదానం, ప్రతిగ్రహం అనే షట్కర్మల్ని; ఉపసంహారం, అభ్యాసం, పూర్వం, ఫలం, అర్థవాదం, ఉపపత్తి అనే షడ్విధలింగాల్ని; ఆవరణ సప్తకం, ధాతుసప్తకం, అవస్థాసప్తకం, చైతన్యసప్తకం, అజ్ఞానభూమికా–సప్తకం, విజ్ఞానభూమికాసప్తకం అనే వాటిని; దశముని సప్తావస్థల్ని; చైతన్యసప్తకాల్ని; బోధసప్తకాల్ని; అష్టతత్త్వాల్ని; అష్టప్రకృతుల్ని; అష్టపురాల్ని; అష్టమదాదుల్ని; అష్టపాశాన్ని; నవవిధ తత్త్వాల్ని; నవవిధసంస్మృతుల్ని; నవవిధద్రవాల్ని; నవవిధద్వారాల్ని; దశవిధతత్త్వాల్ని వివరించాడు. వీటిలో కవి కొన్నిటిని వివరంగాను, మరికొన్నిటిని ప్రస్తావనా మాత్రంగాను పేర్కొన్నాడు. **దశవిధతత్త్వాల్ని** వివరిస్తూ కవి ఇలా తెలియజేశాడు.

**"ఘన తనూగతములై కర్ణ శష్కులికాది – కములైన దశ గోళకములు వెలయు**
**నాదశవిధ గోళకావాసలై దశ – పూషాదినాడులు బొదలు చుండు**
**నాదశనాడి బిలాంతరంబుల లోన – దశవిధానిలములు దగిలి మెలగు**
**నాదశానిలయుక్తమై దశేంద్రియ మనో – గ్రమున ధీమయ బిందు వమరుచుండు**

**నట్టి ధీమయబిందువునందుదోచు**
**నాత్మకళ దశవిధ కళలై వెలుంగు**
**నా కళాబుద్ధులన్యోన్యమై తనర్చు**
**ననిలరవము దశధ్వనులగుచు మ్రోయు."** – శుకచరిత్ర 4-265

ఆ దశగోళాలకు, దశనాడులకు, దశ ఇంద్రియానిలాలకు, దశ కళలకు, దశ నాదాలకు విలక్షణాత్ముండుంటాడు. ఇలా సంఖ్యాయుక్తమైన తత్త్వాల్ని తెలిపేది సాంఖ్యయోగం.

సాంఖ్యయోగం తర్వాత అమనస్కయోగాన్ని గూర్చి తెలియజేశాడు.

**4.4 అమనస్కయోగం :**

మనస్సు వాసనా రూపమై, విషయాసక్తమయి సంసార బంధానికి, నిర్విషయమయి మోక్షానికి హేతువు అవుతూ ఉంది. ఈ మాయా రూపమైన మనస్సును నశింప జేయడమే **అమనస్కం**. దీన్ని గూర్చి శుకచరిత్రకారుడు ఇలా వివరించాడు.

> **"కావున బంధముక్తులకు గారణమామనమంచు బెద్ద లెం**
> **తో వచియింతురాగమతతుల్వివరించును మాకు జూడ ద**
> **ద్భావము బంధకంబు తదభావము ముక్తిగ దోచుగానని**
> **ట్లై విలసిల్లు మానస లయంబమనస్కము నిశ్చయింపగన్."** – శుకచరిత్ర 4–282

ఇదే భావం అమృతబిందూపనిషత్తులో ఇలా ఉంది –

> **"మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః ।**
> **బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్ ॥"**

ఇందులో మనస్సుయొక్క గుణం వర్ణింపబడింది.

డా॥ రత్నాకర బాలరాజు గారు ఈ అమనస్కసిద్ధిని ఇలా వివరించారు. "స్థూల సూక్ష్మ ప్రపంచములను, చతుర్వింశతి తత్త్వములను వివేచించి, అవి యాత్మ స్వరూపములు కావని నిరాకరించి, అందలి పరబ్రహ్మ చైతన్యమును, సాధనచతుష్టయసంపన్నుడై పూర్ణాధికారి యగు ముముక్షువు గాంచవలయును. మహావాక్యచతుష్టయము **1. తత్త్వమసి, 2. అహం బ్రహ్మాస్మి, 3. అయమాత్మా బ్రహ్మ, 4. ప్రజ్ఞానం బ్రహ్మ** – అందలి త్వమ్ – అహం – ఆత్మా – ప్రజ్ఞానం అను నాల్గు పదములకు లక్ష్యార్థమైన ప్రత్యగాత్మయును తత్, బ్రహ్మపదములకు లక్ష్యార్థమైన, సచ్చిదానంద స్వరూపమగు పరమాత్మయు నొకటిగా నెఱిగి, అఖండసమరసైక్యము ననుభవించినచో కార్యకారణరూపమైన మనస్సు సూర్యప్రభయందు చీకటి లేనట్లు లేనిదే యగును. శరీరత్రయముననాత్మగా నిరసించి ఆత్మ స్వరూపస్థితినందుటయే అమనస్క సిద్ధి. శ్రీ సీతారామాంజనేయసంవాద సమాలోచనాత్మక పరిశీలనము, పుట – 379.

పరశురామపంతుల లింగమూర్తి కవి ఈ అమనస్కయోగాన్ని గూర్చి తన సీతా–రామాంజనేయసంవాదము కావ్యములో ఇలా అన్నారు –

వ. మనంబు కార్యాకారంబై సంకల్పంబు సంసారంబు సర్వ వాసనామయంబు బంధ మోక్షకరంబు నన నొప్పును. కారణా కారంబై యవిద్య ప్రకృతి యజ్ఞానంబు, మాయ యనం దనరు. అట్టి మానసంబు లేమియు యమనస్కంబు" – సీతారామంజనేయ సంవాదము 3–51

అంటే ఈ ప్రపంచం కారణప్రపంచం, కార్యప్రపంచం అని రెండు విధాలు. సర్వప్రపంచం మనసే కాబట్టి దానికి కారణరూపాన్ని ఆశ్రయించి అవిద్య, అజ్ఞానం, మాయ అనే వ్యవహారాల్ని కార్యరూపాన్ని ఆశ్రయించి సంకల్పం, సంసారం, సర్వవాసనమయం, బంధ మోక్షాలు అనేవి కారణకార్యాలవుతున్నాయి. ఇలా సర్వరూపమయిన మనస్సు యోగంలో ఉండదో అదే అమనస్కయోగం.

ఈ అమనస్కయోగసిద్ధికోసం కొత్తగా సంపాదించవలసిన సాధనాలు ఏవీ లేవు. బ్రహ్మస్వరూపం తెలిసినవారికి మనస్సు కన్పించదు. మనస్సు నశించటానికి జ్ఞానం కంటే ఇతర సాధనాలతో పనిలేదు. నిత్యానిత్యవస్తువివేకం, వైరాగ్యం, శమాదిషట్కసంపత్తి, మోక్షేచ్ఛ అనే నాలుగు జ్ఞానసాధనాల్ని సంపాదించాలి. ఆత్మావలోకనం చేయలేని వాని మనస్సు యథార్థజ్ఞానశూన్యతవల్ల నిగ్రహింపబడదు. మనిషి భ్రాంతివశగతుడు కాబట్టి అతన్ని చిక్కుల్లో పెడుతుంది. అలా కాక ఆత్మావలోకనం గల మహాత్మునికి మనస్సు లేనిదే అవుతుంది. కాబట్టి **అమనస్కయోగానికి విజ్ఞానం కంటే మించిన, సాధనం లేదు**. రామమూర్తికవి 48 పద్య గద్యల్లో అమనస్కయోగాన్ని గూర్చి వివరించాడు.

ఈ విధంగా శుకచరిత్రలో మూడు, నాలుగు ఆశ్వాసాలలో యోగశాస్త్రరహస్యాలు, వాటిని సాధించే మార్గాలు చక్కగా విశ్లేషింపబడ్డాయి. ముముక్షువునకు లేదా తత్త్వజిజ్ఞాసువునకు ఎంతగానో ఉపయోగపడే విధంగా యోగశాస్త్రరహస్యాలను సాంఖ్యాది యోగ మర్మాలను కవి తెలియజేశాడు. శుకచరిత్రను తెలియజేసే మిషతో తాను గ్రహించిన పారమార్థిక విషయాలను పాఠకులకు తెలియజేయడం రామమూర్తికవి ప్రత్యేకత.





# 5. అద్వైత తత్త్వకావ్యాల్లో శుకచరిత్ర స్థానం

**5.0** "సదసత్సదసచ్చేతి వికల్పాత్ప్రోగ్రదిష్యతే తదద్వైతం" ఉ.స. 2.16.33. సత్తు అసత్తు సదసత్తు లనే వికల్పాలకు పూర్వస్థితి అద్వైతం. ఈ అద్వైతతత్త్వాన్ని గ్రహించటం చాలా దుర్లభం. "All people can not take up this adwaita Philosophy, it is hard. First of all, it is very hard to understand in intellectually. It requires the sharpest of intellects, a bold understanding. Secondly it does not suit the vast majority of People (The Completge Works, Vol.I Page 404) 1984 Edition. By Swamy Vivekananda.

అద్వైతశాస్త్రాన్ని అందరూ స్వీకరించలేరు. అది కఠినతరం, మనసా దాన్ని గ్రహించడం కష్టసాధ్యమైన విషయం. దాన్ని గ్రహించడానికి సూక్ష్మబుద్ధితో పాటు అక్షరజ్ఞానం కూడా అవసరం. చాలామందిలో ఇవి అరుదు అని స్వామి వివేకానంద అభిప్రాయం. హిందూ తత్త్వశాస్త్రానికి అద్వైతతత్త్వం మకుటాయమానమని ఆచార్య యస్. యస్. సూర్యనారాయణ శాస్త్రిగారు తమ గ్రంథం 'శంకరాచార్య'లో పేర్కొన్నారు. 'In Indian Religion the term Yoga serves in general to designate any ascetic technique and any method of meditation " అద్వైతం ప్రస్తుతభారతీయవేదాంతవిజ్ఞానంలో అగ్రస్థానంలో ఉంటూ భారతీయుల జీవితంలో అత్యధిక ప్రాధాన్యం కల్గి ఉందని ప్రఖ్యాత పాశ్చాత్య వేదాంత వ్యాఖ్యాత డాక్టర్ పాల దేవ్ సేన్ చెప్పారు. "it is true, that even here in the sanctuary Vedantic metaphysics, the realsitc tendencies natural to man have penetrated, Producing the misinterpreting variations of Sankara's Advaita, known under the names of Visistha Advaita, Dwaita, Suddadwaita of Ramanuja, Madhwa, Vallabha, but India till now has not yet been seduced by their voices and of hundred vedanties fifteen perhaps adhere to Ramanuja, Five to Madhva, five to vallabha and seventy five to Sankaracharya" (The Philosophy of Devantha, అ. 1). అంటే వేదాంతతత్త్వసిద్ధాంతం పవిత్రస్థానంలో మానవునిలో స్వాభావికమైన ద్వైతభావాలు ప్రవేశించి, శంకరాద్వైతానికి వివిధ అపార్థాల్ని కలుగజేశాయి. అవి విశిష్టాద్వైత, ద్వైత, శుద్ధాద్వైతాలు. ఇవి వరుసగా రామానుజ, మధ్వ, వల్లభాచార్యులకు సంబంధించినవి. కానీ ఈనాడు భారత దేశంలోని వందమంది వేదాంతులలో 15% మంది రామానుజ సిద్ధాంతానికి, 5% గురు మధ్వ సిద్ధాంతానికి, 5% గురు వల్లభ సిద్ధాంతానికి, 75% మంది శ్రీశంకరాచార్య సిద్ధాంతానికి చెందుతారని చెప్పబడింది. దీన్ని బట్టి శంకరాద్వైతానికున్న ప్రముఖ స్థానం గ్రహించవచ్చు.

ఇంతటి విశిష్టత కల్గిన ఈ అద్వైతసిద్ధాంతం సాహితీవేత్తల్ని స్రష్టల్ని విశేషంగా ఆకర్షించింది.

ఉపనిషత్ సూత్రాలు అద్వైతసిద్ధాంతంతో సన్నిహితసంబంధం కల్గి శుద్ధ సిద్ధాంత ప్రతిపాదకంగా ఒప్పారాయి. స్మృతులు పరమగమ్యమైన బ్రహ్మవిద్యకే స్థానమిచ్చాయి. అఖండ అవ్యయానంద బ్రహ్మలయ రూప అద్వైత ముక్తినే స్మరిస్తూ, ప్రబోధించాయి. పురాణాలు కథారూపంలో సంఘ క్షేమాన్ని చేకూర్చేవిధంగా ధర్మశాస్త్రాల్లాగా బోధించాయి. శిఖర ప్రాయంగా అధ్యాత్మ విద్యను వివరించి తల్లక్ష్యమైన అద్వైతాన్ని చూపించాయి. తత్సాధనకై భక్త్యాదిమార్గాల్ని వివరించాయి. అలాగే రామాయణ భారతాదులు **అద్వైతభావఝరి**ని అన్నిచోట్లా ప్రవహింప జేయడానికి ప్రయత్నించాయి. ఈ అద్వైతభావం ఎలా అన్ని సాహితీరంగాల్లో చొచ్చుకొని పోయిందో సర్వసిద్ధాంతసౌరభం ఐదోభాగం పీఠికలో చక్కగా వివరిపంబడింది. "అద్వైత వాహిని ఉపనిషత్ క్షేత్రాలనుండి ఉబికి, బాదరాయణసూత్రాదుల బ్రవేశించి, పొంగి మన్వాది స్మృతుల ముంచి భాగవతాది మహాపురాణముల స్రవించి, రామాయణ భారతాది ఇతిహాసముల, శైవ శాక్తాది తంత్రములపై బొంగి ప్రవహించి, ఏకోన్ముఖముగ బౌద్ధ వాదమున ప్రవేశించి, ఆర్యాసంగ నాగార్జునాదులచే బోషింపబడి, ఏకప్రవాహముగ గౌడపాదుని కారికల ద్వార శంకరు జేరి యుండినట్లు పూర్వ గ్రంథమున నీ యద్వైత భావన ప్రభావమునబడి మనము ఒకించుక చూచి యున్నారము అనగా నీ అద్వైత పీయూష పానము జేయని రచయిత గాని, రచనముగాని పూర్వ మభావమని గవేషణాశీలునకు దోచక మానదు" సర్వసిద్ధాంతసౌరభము. 5వ భాగం శ్రీశంకరాద్వైతము. పుట 17.

వైదికమైన ఈ అద్వైతతత్త్వం కాలక్రమంలో బౌద్ధ, జైన, చార్వాకాది తత్త్వవిజృంభణంతో విరళమై క్షీణించింది. ఆ తర్వాత శ్రీశంకరభగవత్పాదాచార్యులు దీన్ని పునరుద్ధరించారు. అద్వైత తత్త్వ ప్రతిపాదనకు అన్యమత ఖండనకు సుమారు రెండు వందల గ్రంథాల్ని రచించాడు. వారి గ్రంథాలకు వివరణాత్మకంగాను, అనుసరణలు గాను అనేక శాస్త్ర గ్రంథాలు వెలువడ్డాయి.

ఆంధ్రులు ఈ అద్వైతతత్త్వాన్ని అభిమానించి ఎన్నో గ్రంథాల్ని సంస్కృతంలోనూ, తెలుగులోనూ వెలయించారు. ఇలా తెలుగులో వెలువడిన అద్వైతసాహిత్యంపై డా॥ సన్నిధానము రామతారకపరబ్రహ్మశాస్త్రి గారు పరిశోధన చేశారు. వారు ఆ యా గ్రంథాలను పరిశీలించి కొన్నిటికి సంక్షిప్తరూపసమీక్ష మరికొన్నిటికి వివరణాత్మకమైన సమీక్ష చేశారు.

శుకచరిత్ర కావ్యంలోని వస్తువును దృష్టిలో ఉంచుకొని తెలుగులో వెలువడిన కావ్యాల్ని పేర్కొని వస్తువులోనూ, కథనంలోనూ, వర్ణనలలోనూ శుకచరిత్ర కావ్యానికున్న ప్రత్యేకతను చెప్పడం ఈ ప్రకరణ ప్రదానోద్దేశం.

### 5.1 కావ్యాలు :

ఆ యా కావ్య వస్తువుల్ని పరిశీలించిన తర్వాత శుకుడు ముక్తికాంతను పెళ్లి చేసుకోవడం

వీటిలోని ప్రధాన వస్తువు. ఈ విషయాన్ని వర్ణించడం కోసం రామమూర్తి కవి ప్రబంధ ధోరణిని అనుసరించాడు. ముక్తికాంత వివాహాన్ని దృష్టిలో ఉంచుకొని తెలుగులో అనేక కావ్యాలు, యక్షగానాలు వెలువడ్డాయి.

ముక్తికాంతా పరిణయాన్ని వస్తువుగా గ్రహించి, తెలుగులో నాలుగు కావ్యాలు వెలువడ్డాయి. 1. శుకచరిత్ర, 2. పరతత్త్వప్రకాశిక, 3. శ్రీరామస్తవరాజము, 4. ముక్తికాంతాపరిణయము.

**5.1.1. శుకచరిత్ర :**

శుకుడు ముక్తికాంతను స్వయంవరంలో గెలుచుకోవడం ప్రధానేతివృత్తం.

**5.1.2 పరతత్త్వ ప్రకాశిక :**

ఈ గ్రంథం అముద్రితం. దీని రచయిత పెనుమత్స బుచ్చిరాజు, పరశురామ పంతుల రామమూర్తి కవి శుకచరిత్ర అనుకరణలు. ఇందులో ఎక్కువగా ఉండటం వల్ల దీని కర్త 18వ శతాబ్ది చివరిభాగంలోనో, 19వ శతాబ్ది పూర్వార్ధంలోనో జీవించి ఉంటాడని తోస్తుంది.

ఇందులో పరీక్షిత్తు కోరికపై శుకుడు గంగావతరణాన్ని; కపిల మహాముని దేవహూతికి పరమతత్త్వోపదేశం చేయడాన్ని వర్ణించాడు.

పరీక్షిత్తు భాగీరథీనదీతీరంలో ఉండే సమయంలో దేవర్షులు, బ్రహ్మర్షులు, వ్యాస పుత్రుడు శుకుడు అక్కడికి వచ్చారు. ఆ సమయంలో పరీక్షిత్తు శుకయోగీంద్రుని వాసుదేవుని జన్మ వృత్తాంతం తెలియజేయమన్నాడు. అప్పుడు శుకుడు గంగావతరణాన్ని, నారాయణుడు కర్దమ దేవహూతులకు కపిలుడు అనే పేరుతో పుట్టడాన్ని చెప్పాడు. కపిలమహర్షి తన తల్లియైన దేవహూతికి పరమతత్త్వోపదేశం చేయడానికి ఉపక్రమించడంతో మొదటి ఆశ్వాసం పూర్తవుతుంది.

ద్వితీయాశ్వాసంలో కపిలుడు దేవహూతికి పరతత్త్వాన్ని ఉపదేశించటం మిక్కిలి రసవంతంగా సాగింది. దీన్ని 'విశ్వతత్త్వ ప్రకరణోపదేశ విధానం' అని కవి చెప్పాడు.

తృతీయాశ్వాసంలో పరీక్షిత్తు, బ్రహ్మతత్త్వాన్ని ఉపదేశించడానికి అర్హులెవరని ప్రశ్నిస్తాడు. అందుకు శుకుడు తత్త్వబోధకు పనికిరాని వాని లక్షణాన్ని, తత్త్వబోధ చేయడానికి తగిన వాని లక్షణాల్ని, గురుశుశ్రూషవిధానాన్ని, సాధనచతుష్టయసంపత్తిని, ముముక్షువునకు ఉండవలసిన తీవ్ర ఆవేదనను, సజ్జనసాంగత్యమహిమను, ఆచార్యునివలన ఎరుగ వలసిన విద్యల్ని, సత్త్వరజస్తమో గుణ విభాగాల్ని, వైరాగ్యశాస్త్రంలోని క్రియ, భక్తిజ్ఞానబోధక విధానాన్ని అందలి అంతర్భాగాల్ని వివరించాడు.

చతుర్థాశ్వాసంలో విజ్ఞాన భేదాలలో, జీవశరీర భేదాల్ని తెలిపే సందర్భంలో జీవ ప్రతిపాదనను, లింగ పార్థివయాతనా శరీరాలలోని భేదాల్ని, పార్థివ శరీరానికి మూలమైన పిండోత్పత్తిని, అన్నమయాది పంచకోశాల్ని, ఆ పంచకోశ భేదాల వల్ల పుట్టిన పంచావస్థల యందలి భేదాల్ని ఆ అవస్థల వల్ల చరాచరాదులలో కలిగే రూప భేదాల్ని బ్రహ్మాది తృణ పర్యంతం గల జీవరాశులలో ధర్మార్థకామమోక్షాలు, సాధుచరితలు నిర్ద్వంద్వవిజ్ఞానప్రవర్తనలు వివరింపబడ్డాయి.

పంచమాశ్వాసంలో సర్వచరాచరాలలోని జాతిభేదాలు పంచకోశప్రవర్తనలు, వాటిలోని జీవధర్మాలు, బ్రాహ్మణోత్తమమహిమ, చతుర్విధపురుషార్థాలు, అందులో పరమధర్మమైన హంస తారక మంత్ర యోగ క్రమం. అందలి విశేషాలు తెలియజేస్తూ ప్రాణాయామ విధానాలు షట్చక్రాలు, హంస భేదాలు, హంస గతి, నాద బిందు కళలు, వాటిని సాధన చేయాల్సిన విధానం, ఫలితాలు తెలియ చేయబడ్డాయి. షష్ఠాశ్వాసంలో సాంఖ్యయోగం వివరింపబడింది. సప్తమాశ్వాసంలో అమనస్కం వర్ణింపబడింది. అష్టమాశ్వాసంలో **ముక్తికాంతాపరిణయము** చిత్రింపబడింది.

విదేహను పాలించిన జనకుడు, ప్రజ్ఞాసతి ద్వారా కనిపెంచిన ముక్తికాంత యౌవనవతి అయింది. ఆమెకు స్వయంవరం చాటించారు. ఆ స్వయంవరానికి పరీక్షిత్తు వచ్చి మాయా వాదులను గెలిచి, మాయాయంత్రాన్ని ఛేదించి ముక్తికన్యను వివాహం చేసుకొన్నాడు. ఈ ముక్తికాంతా పరిణయం కేవలం కల్పన మాత్రమే. కావ్యంలో వివాహం, శోభనం, ప్రభాత కాలకృత్యాలు, వనవిహారాదులు చక్కగా వర్ణింపబడ్డాయి.

ఈ కావ్య రచనను గూర్చి సన్నిధానము రామతారక పరబ్రహ్మశాస్త్రి గారు ఇలా అన్నారు. “అష్టమాశ్వాసమున వర్ణింపబడిన ముక్తికాంతా కల్యాణ ఘట్టమున మూడు పాళ్లకు పైగా గద్య పద్యములు పరశురామపంతుల రామమూర్తి రచించిన శుకచరిత్ర నుండి యథాతథముగా చేర్చబడియు, కొన్ని పద్యములలో ‘అరణి సుతుడు’ అనుచోట ధరణి సుతుడు అనియు, శుకయోగి యను చోట ‘నృపయోగి’ యనియు ఇట్లే పరీక్షిత్తున కనుకూలమైన మార్పులు కొన్ని చేయబడియు కన్పించుచున్నవి. ఇందుకు కారణములు నిశ్చయముగా జెప్ప వీలుగాదు.

ఇందు ముక్తికాంతా కల్యాణఘట్టమును చేర్చక గ్రంథమును సప్తమాశ్వాసముతో ముగించినను ఔచితీ లోపముండెడిది గాదు. శుకచరిత్రలోని పద్యములే యిందు చేర్చుట వలన నీగ్రంథమునకున్న ఘనత కొంత లోపించిన దనవచ్చు” ఆంధ్ర సారస్వతమునందలి అద్వైతతత్త్వకావ్యములు, ద్వితీయ సంపుటం, పుట – 304.

**5.1.3 శ్రీరామ స్తవరాజము :**

ఈ కావ్యాన్ని **ముమ్మడి మల్లన్న** రచించాడు. ఇది అముద్రితం. దీని ప్రతులు తిరుపతిలోని ప్రాచ్య లిఖిత భాండాగారంలో ఉన్నాయి. ఇందులో నాలుగు ఆశ్వాసాలు ఉన్నాయి. నాల్గో ఆశ్వాసం చివర పెద్ద వచనంలో మోక్షలక్ష్మి వివాహం వర్ణింపబడింది.

బ్రహ్మానంద నగరంలో సద్గురుడనే మహారాజుకు, ఆత్మకాంతకు పరమామృత కన్య జన్మించింది. ఆ కన్యకు యౌవనకాలంలో వివాహం చేయాలనుకొని రాజు స్వయంవరాన్ని చాటించాడు. ఆ స్వయంవరానికి వివిధ విద్వాంసులు వేంచేశారు. మోక్షలక్ష్మి స్వయంవరానికి వచ్చిన వారి విశిష్టతల్ని చెలికత్తెలు ఆమెకు తెలియజేశారు. స్వయంవరానికి "దేహమాత్మ, ప్రాణమాత్మ, సిద్ధులేయాత్మ, మనస్సేయాత్మ, జ్ఞప్తి యాత్మ, ఆనందమాత్మ, ఆత్మ అణువు, ఆత్మ విభుడు" అనేవాళ్లు వచ్చారు. వీరందరూ మాయా మార్గాల ద్వారా ఆత్మను సాధింప పూనుకొన్నవాళ్లే. వీరితోపాటు సద్గురూక్తిని కనడమే మోక్షమన్న తన నిర్ణయాన్ని తెలిపి, అన్యుల వాదాలన్నిటిని ఒక అద్వైతి ఖండించాడు. చివరికి విజయం ఈ అద్వైతిదేనని నిర్ణయించారు. అద్వైతికి, కల్యాణవేదిక, కన్యాదానం, తలంబ్రాలు పోసికోవటం, మంగళసూత్ర ధారణం, కంకణధారణం, మంగళ హారతులు వంటి అంశాల వర్ణన చోటు చేసుకుంది.

**5.1.4 ముక్తికాంతాపరిణయము :**

ఈ గ్రంథం అముద్రితం. దీని వ్రాతప్రతి తిరుపతిలోని ప్రాచ్య లిఖిత గ్రంథాలయంలో ఉంది. ఇది ప్రబంధపద్ధతిలో రచింపబడిన పద్యకావ్యం. దీనికర్త **వేగినాటి కొండనార్యుడు.** ముమ్మడి మల్లన రచించిన శ్రీరామస్తవరాజానికి వేగినాటి కొండనార్యుడు రచించిన ముక్తికాంతా పరిణయానికి ఎక్కువ పోలికలు ఉన్నాయని చెబుతూ డా॥ సన్నిధానము రామతారక పరబ్రహ్మ శాస్త్రిగారు ఇలా అన్నారు. "ముమ్మడి మల్లన యొక్క మోక్షలక్ష్మి కల్యాణమునకు కొండన్న యొక్క ముక్తికాంతా పరిణయమునకు కథయే గాక కొంచెమించుగా పదజాలము కూడా నొకటిగానే యున్నది. భేదమేమన మల్లన సుదీర్ఘ వచనములో సంగ్రహుగా వ్రాయగా కొండన్న ప్రబంధ పద్ధతిలో నొక ప్రత్యేక పద్యకావ్యముగ రచించాడు. విషయము రెండింటియందును ఒకటియే. ఇంకొకరిది మరియొకరు తప్పక చూచియే యుందురు. లేదా వీరిరువురును ఒకే మాతృకను గ్రహించి యుండవలెను. రచనలో మల్లనకంటె కొండన్న నిస్సంశయముగా నెన్నో రెట్లు ఘనుడు. కొండన్న ముందుగా పద్యకావ్యముగా వ్రాసిన దానిని చూచి మల్లన వచనముగా వ్రాసియుండునా? లేక మల్లన్న వచనముగా వ్రాసిన దానిని చూచి ముకుంద యోగి వచనమున వ్రాసిన వివేకసింధువును పద్యకావ్యంగా వ్రాసినట్లుగానే ముక్తికాంతా పరిణయమును గూడ

రచించియుండునా? చెప్పుట కష్టము. కొండన్న దత్తాత్రేయయోగి శిష్యుడైనచో దానిని వచనముగా వ్రాసి యుండునని తలంప వచ్చును" ఆంధ్ర సారస్వతము నందలి అద్వైత తత్త్వకావ్యములు. చతుర్థ సంపుటం పుట–36.

**5.2 యక్షగానాలు :**

తెలుగు సాహిత్య ప్రక్రియల్లో సర్వకళల సమాహారంగా పరిపూర్ణతను సంతరించుకొన్న దృశ్య రూపకం యక్షగానం. తెలుగులో అద్వైత తత్త్వబోధకాలైన యక్షగానాలు ఎన్నో ఉన్నాయి. వాటిలో ముక్తికాంతాపరిణయవృత్తాంతం, శుకచరిత్ర కథేతివృత్తం ఉన్న యక్షగానాలు పరిశీలించదగ్గవి.

**5.2.1 ముక్తికాంతా పరిణయము :**

ముక్తికాంతాపరిణయ ఇతివృత్తాన్ని తీసికొని వివిధ ప్రక్రియల్లో రచనలు చేశారు. వాటిలో **పరమానందతీర్థయతి** రచించిన **ముక్తికాంతాపరిణయము** మొదటిది. ఇది కల్పన సాంగరూపకంగా వ్రాయబడింది. సచ్చిదానందపురాన్ని దేశికసార్వభౌముడు పాలించేవాడు. అతడు కామాది శత్రువుల్ని క్షణంలో ఖండింపగల విక్రమ సంపన్నుడు. అతడు తన పుత్రిక ముక్తికాంతకు తగిన వరుని ఎంపిక కోసం స్వయంవరం చాటించాడు. స్వయంవరానికి అన్ని ఏర్పాట్లు జరిగాయి. సకల దేశాధిపతులు వచ్చారు. అంతఃపురంలోని కాంతలు ముక్తికాంతను చక్కగా అలంకరించారు. ఆ తర్వాత ఆమె చెలికత్తెలతో కూడి ఒయ్యారంగా స్వయంవరమంటపానికి వచ్చింది. స్వయంవరానికి వచ్చిన సకల మత, దేశాధిపతుల మత సిద్ధాంతాల్ని వాటిని అనుసరించి ముక్తి నిర్ణయాన్ని వివరించమని, ముక్తికాంత తన చెలికత్తె ఉపరతి ద్వారా కోరింది. ఆ సమయంలో జైన, బౌద్ధ, కాపాలిక, చార్వాక, మీమాంస, శైవ పాంచరాత్రులు చెప్పిన తర్కాన్ని విని ముక్తికాంత తృప్తి జెందలేదు. శుద్ధ సాత్త్విక ధర్మశోభితుడైన జ్ఞాన సిద్ధుడెవడో, ఎందున్నాడో అని ఆలోచిస్తూ ముక్తికాంత వచ్చింది. ఇంతలో ఒక నిర్మల ప్రదేశంలో ఆశీనుడై ఉన్న వేదాంత సిద్ధాంత పతిని చూసి మీమతం ఎలాంటిదని ప్రశ్నించింది. అతడు–

ద్విపద. "**మతములన్నియు మీరు మతము నామతము**
**మతము లేమియు గాని మతము సమ్మతము**
**గురుకుల వాసంబె కులము నా కెపుడు**
**గురుకుల వాసంబె గోత్రంబు తలప**
**గురుడె తల్లియు దండ్రి గురుడె దైవంబు**
**గురుడె కర్తయు భోక్త గురుడె దాతయును**

**వేదాంత సిద్ధాంత విశ్రుత కాంత**
**నాదాంతమే నాకు నామధేయంబు"**

అని చెప్పాడు. ఆ మాటలు విన్న ముక్తికాంత సంతోషస్వాంతయై అతణ్ణి వరించింది.

వివేకజీవేశ్వరుడు ముక్తికాంతాసక్తుడై మాయావిముక్తుడయ్యాడు. మాయావధూటి తనకు వివేకజీవేశ్వరునితో కలిగిన వియోగానికి దుఃఖిస్తూ ఉంటే జైన బౌద్ధ చార్వాక మతాధిపతులు లాలించి దగ్గరికి తీసికొన్నారు.

వివేకజీవేశ్వరుడు చక్కగా అలంకృతుడై కల్యాణమంటపానికి వచ్చాడు. ఆ సమయంలో దేశికుడు పూర్ణబోధ అనే మధుపర్కమిచ్చి వరుడికి కన్యాదానం చేశాడు. ఇచ్ఛాక్రియా భామలు సోమార్క కిరణాల్ని జ్యోతులుగా చేసి హారతి పట్టారు. ఆ పిదప వరుడు మూడు నాళాల్ని ముప్పిరిగా చేసి విధు బింబాన్ని తాళిబొట్టుగా గూర్చి మగువ కంఠంలో కట్టాడు. ఆ తర్వాత వధూవరులు కంకణధారులై హోమం చేశారు. గృహానికి వెళ్లి వివేకజీవుడు ముక్తికాంతను కూడి తన్మయుడై తనువు మరచి మోక్షసామ్రాజ్యసంపదకు ప్రభువై యభిలషిత సుఖాన్ని పొందాడు.

### 5.3 ఇతివృత్త నిర్మాణంలో ప్రత్యేకత :

కవి తన అభిరుచికి తగిన ఇతివృత్తాన్ని ఎన్నుకొని తన నేర్పుతో కావ్య వస్తువును సర్వాంగ సుందరంగా తీర్చిదిద్ది ప్రతిభతో ప్రాణం ప్రదానం చేస్తాడు. కొందరు కావ్య వస్తువును ఎన్నుకోవడంలో ఒక నిబద్ధత కలిగి ఉంటారు. దీన్ని గూర్చి సర్దేశాయి తిరుమలరావు గారు ఇలా అన్నారు. "కొందరు కవులు స్వావలంబతత్త్వాభినివేశులై కావ్యముల ఇతివృత్తముల నెన్నుకొందురు. ఆధునిక సాహిత్య దార్శనికుల పరిభాషలో ఇట్టి వారిని నిబద్ధకవులు (కమిటెడ్ రైటర్స్) అనవచ్చును. ఉద్యమాశయసిద్ధికి కవిత్వమును సాధనముగా నియోగించు కవి నిబద్ధ రచయిత" సాహిత్యతత్త్వము – శివభారతదర్శనము పుట–41. అద్వైత వేదాంత తత్త్వాన్ని ప్రబోధించటానికి తెలుగులో అనేక కావ్యాలు వెలువడ్డాయి. వీటిలోని ఇతివృత్తం ప్రధానంగా రెండు రకాలుగా ఉంది. 1. అధికారికము, 2. ప్రాసంగికము. ఫలముతోడి స్వస్వామి భావసంబంధమే అధికారము. అట్టి అధికారముచే గాని, అధికారిచే ఫలపర్యంతము నడుపుకొని వెళ్లబడునది **అధికారికము**, ముఖ్యమనియు దీనినందురు. రామాయణమున రామకథయే అధికారికము. ఏ ఇతివృత్తము ప్రధానేతి వృత్తమునకుపకారకమై స్వప్రయోజన సిద్ధిని కూడ పొందునో అది **ప్రాసంగికము**. రామాయణములో సుగ్రీవాదుల కథ ప్రాసంగికము" ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము. పుట – 179. శుకచరిత్ర కావ్యంలో ఇతివృత్తం

అధికారికము. మూలంలో భారతంలో ప్రాసంగిక ఇతివృత్తంగా ఉన్న ఈ కథను రామమూర్తికవి తన కావ్యానికి ముఖ్య ఇతివృత్తంగా గ్రహించాడు. తెలుగులో వెలువడిన అద్వైతతత్త్వ కావ్యాలలో కథా ప్రధానంగా ఉన్న కావ్యాలు అతిస్వల్పం. శుకచరిత్రంలోని కథలో ఏకసూత్రత ఉంది. ఈ పద్ధతి ఇతర అద్వైతతత్త్వకావ్యాల్లో అంతగా కన్పించదు. శుకచరిత్రలోని ఇతివృత్తం శుకుని జననంతో ఆరంభమై శుకనిర్యాణం వరకు సాగుతుంది. రామమూర్తికవి భారత శాంతిపర్వంలో భీష్ముడు ధర్మరాజుకు బోధించిన శుకచరిత్ర మూలంగా గ్రహించి దాన్ని తత్త్వవిషయవిస్తృతంగా పెంచి ఈ శుకచరిత్రను రచించినట్లు తెలుస్తూ ఉంది. శుకచరిత్ర ఒక వేదాంతగ్రంథం. ఈ కావ్యం సీతారామాంజనేయసంవాద కావ్యానికి వివరణాత్మకంగా వ్రాయబడింది. అంటే ఈ కావ్యం ప్రధానధ్యేయం అద్వైతతత్త్వప్రతిపాదన.

ధర్మరాజు "అపారసంసారసాగరోత్తానకమునకేది సాధనం?" అని శ్రీయోగజ్ఞాన పరిజ్ఞేయుడైన గాంగేయుని అడిగాడు. అంటే ఈ కథను బోధించినవాడు కూడా యోగం తెలిసినవాడు.

కథానాయకుడు శుకుడు. శుకుని తండ్రి వ్యాసుడు. అతడు మేరు పర్వతంలోని కర్ణికార వనంలో తపస్సు చేసికొంటూ ఉండేవాడు. వ్యాసుని వృత్తాంతం ద్వితీయాశ్వాసంతో ఆరంభమయింది. శుకచరిత్రలో శుకుడు ముక్తికన్యను పొందడం ప్రధానఫలం. ఈ ఫల సాధనోన్ముఖంగా కథ నడిచింది. కావ్య వస్తువు నిగూఢమైన అద్వైతతత్త్వపరంగా ఉంది. కావ్యంలోని పాత్రలు సహితం సంజ్ఞాత్మకంగా కన్పిస్తాయి.

వ్యాసభారతంలో కథ మేరుపర్వతంలోని కర్ణికారవనంలోని వ్యాసుని వృత్తాంతంతో ఆరంభమయింది. కానీ రామమూర్తి కవి మిథిలాపుర వర్ణనతో ప్రారంభించాడు.

రామమూర్తికవి "నా యొనరింప బూనిన శుకచరితంబను మహాప్రబంధంబునకు గథా నిబంధం బెట్టి దనిన" అని కథను ప్రారంభించాడు. అంటే శుకచరిత్రను ప్రబంధంగా వ్రాశాడని అభిప్రాయం. కావ్యంలో చాలా వరకు ప్రబంధ లక్షణాల్ని పొందుపరచడానికి ప్రయత్నించాడు.

రామమూర్తికవి 'శుకచరిత్ర'లో శుకుడు మునిబాలకులతో ఆటపాటల్లో కాలం గడపడం వర్ణింపబడింది. ఈ సందర్భంలో తిక్కన "ముని కుమారులతోడి యాటలు మరిగి లోకంబు తోటిపాటియై యాత్మానుసంధానము సేయలేక మెలగుచున్నంజూచి" అని వ్రాస్తే రామమూర్తి కవి, శాస్త్రచింతనల్ చేయక నాట పాటలటు జేకొని లోకముతోడి బాడియైయయ్యెడంజరించు – శుకునారసి" అని వ్రాశాడు. దీన్నిబట్టి రామమూర్తికవి వ్యాస భారతాన్ని గాక తిక్కన వ్రాసిన తెలుగు భారతాన్ని అనుసరించాడని తెలుస్తూ ఉంది.

శుకచరిత్ర కావ్యంలో రామమూర్తికవి కావ్యం ప్రారంభంలో, నడుమ, చివర భారతంలో లేని ఎన్నో వృత్తాంతాల్ని కల్పించాడు. ప్రథమాశ్వాసంలో జనకుడు పంచశిఖోపదేశాన్ని అనుసరించి సమాధి అనే యజ్ఞం చేసి ప్రజ్ఞాసతివల్ల ముక్తికన్యకు జన్మనిచ్చాడు. రెండో ఆశ్వాసంలో శుకుని జనన వృత్తాంతం వివరింపబడింది. మూడో ఆశ్వాసంలో శుకుడు సాధన చతుష్టయ సంపన్నుడై మోక్షసాధన మార్గాలలో సులభమార్గాన్ని తనకు బోధించమని వ్యాసుని ప్రార్థించాడు. వ్యాసుడు గురులక్షణం, గురుధ్యానం, శిష్యలక్షణం, శుశ్రూషావిధానం మొదలైన వాటిని బోధించాడు. ఆ తర్వాత ఉపాసనాక్రమం, పూజాక్రమం, స్మరణం అష్టాంగాలలతో కూడిన యోగం; అష్టసిద్ధులు, రాజయోగ లక్షణాలు, ముద్రాలక్షణం, ఆకాశ పంచక స్వరూపం, ప్రపంచోత్పత్తి ప్రకారం, ఈశ్వర హంస స్వరూపం, జీవహంస లక్షణం, సాంఖ్యయోగం, పరమాత్మ లక్షణం, తత్త్వమసి మహావాక్యార్థం, సాధన చతుష్టయం, మహావాక్య చతుష్టయ విచారణం, తత్త్వపంచక లక్షణం, షడ్భావ, షడూర్మి, షట్కమల, షట్కర్మ, షల్లింగాదులు, అష్టనవ, దశ సంఖ్యాత్మకాలైన ఇతర తత్త్వవిషయాలు, అమనస్కం మొదలైన వాటిని వివరించాడు. ఇలా కావ్యంలో దాదాపు రెండు ఆశ్వాసాలు (తృతీయ, చతుర్థ), అద్వైత తత్త్వ ప్రతిపాదన, యోగవివరణతో కూడి ఉన్నవి. ఇక్కడ ఇతివృత్తం నడక కొంత కుంటు పడింది. రామమూర్తికి తన తండ్రి సీతారామాంజనేయ సంవాదంలో పేర్కొన్న అంశాల్ని శుకచరిత్రలో వివరించడం ప్రధానం కాబట్టి భారతంలోని శుకుని వృత్తాంతాన్ని గ్రహించి వ్యాసుని ద్వారా తత్త్వోపదేశం చేయించడం సముచితంగా ఉంది.

పంచమాశ్వాసంలో శుకుడు వ్యాసప్రబోధితుడై మిథిలకు వెళుతుంటే నారదుడు అతనికి కన్పించి ముక్తికన్యా స్వరూపాన్ని వర్ణించాడు. వెంటనే శుకుడు విరహబాధాతప్తుడై మిథిలకు పయనమయ్యాడు. ఈ ఆశ్వాసంలోని కథ కవి స్వకపోలకల్పితమైంది. ఇందులో జనకుడు తన కుమార్తె ముక్తికన్యకు స్వయంవరాన్ని చాటించాడు. ఒక అవిద్యాయంత్రాన్ని నిర్మించి దాన్ని పడగొట్టిన ధృతిమంతుడికి తన కుమార్తెను ఇస్తానని వాగ్దానం చేశాడు. ఆ స్వయంవరానికి శుకాది యోగీశ్వరులేగాక, లోకాయత, చార్వాక, బౌద్ధ, మాధ్యమిక, దిగంబర, ప్రాభాకర, గాణాపత్య, సౌర, భైరవ, విష్ణు, రుద్ర, హిరణ్యగర్భాది మతస్థులు ముక్తికాంతా పరిణయ కుతూహలంతో వచ్చారు. శుకుడు వారినందరిని తన వాదపటిమతో అద్వైతతత్త్వగరిమను చాటి ఓడించి ముక్తికన్యను చేపట్టాడు. ఈ స్వయంవరవృత్తాంతాన్ని ఇతర కవుల్లాగే వర్ణించి తాత్త్విక విషయాల్లో లౌకిక అంశాల్ని ఆరోపించి, రామమూర్తి రమ్యంగా వర్ణించాడు. కావ్యం చివర ముక్తికాంతా సమాగమానంతరం శుకుడు యోగశక్తితో ఆకాశంలో ఖగేంద్రుడిలా ఎగిరి పోతూ ఉంటే వ్యాసుడు అతని వెంట పిచ్చివాడిలా వెళ్లడాన్ని కవి వర్ణించాడు. దారిలో

అచ్చరలు దిగంబరలై జలకేళి సలుపుతూ ఉన్నారు. వ్యాసుడు శుకుని వియోగాన్ని భరించలేక అతనిని ఎలుగెత్తి పిలుస్తూ వెళుతూ ఉంటే చరాచర నభోధరణులు ఓహో అని పలికాయట. జలకాలాడుతున్న దేవకామినులు వ్యాసుని చూసి సిగ్గు పొందారు. కానీ శుకుని చూసి ఎలాంటి సిగ్గు చెందలేదు. సుతుని ముక్తతకు తన సక్తతకు వ్యాసుడు సిగ్గు చెందాడు. ఆ తర్వాత శివుడు వచ్చి వ్యాసునూరడించి పుత్రసదృశమైన ఛాయ అతనిని ఎప్పుడూ అనుసరిస్తూ ఉంటుందని వరమిచ్చి వెళ్లిపోయాడు.

ఇంతవరకు వివరించిన కథాంశాలను బట్టి శుకచరిత్ర ప్రధానంగా అద్వైతతత్త్వ ప్రతిపాదనార్థం వ్రాయబడినట్లు తెలుస్తూంది. అయినా స్వీయ ప్రతిభాన్విత వివిధ రమ్యకల్పనలతో కావ్యాన్ని ప్రబంధ ఫక్కీలో నడిపి రామమూర్తి కవి తన ప్రత్యేకతను ప్రదర్శించుకొన్నాడు. ఇతర అద్వైతతత్త్వకావ్యాలలో లేని ప్రబంధలక్షణాలు ఇందులో ఎక్కువగా కన్పిస్తాయి.

**5.4 వర్ణనల్లో ప్రత్యేకత :**

కావ్యం ప్రధానంగా రెండు అంశాలను కలిగి ఉంటుంది. 1. కథాంశం, 2. వర్ణనాంశం. ఈ వర్ణనాంశం, కవి ప్రతిభకు నిదర్శనం. వర్ణనల్ని అనుసరించి ఒక్కొక్క కవికి ఒక్కొక్క శైలి ఉంటుంది. కవి వ్యక్తిత్వం ఆ కవి కృత కావ్యంలో ప్రతిఫలిస్తూ ఉంటుంది. కవి మనోభావానికి అతని రచన ప్రతిబింబంగా నిలుస్తుంది. ఎబెర్ క్రోంబె (Aber Crombe) అభిప్రాయం ఇట్లా ఉంది. "Style in the broadest sense which includes mood and spirit and the choice of matter as well as technique and language" (Principles of Philosophy, Preface) విస్తృతార్థంలో ఆలోచిస్తే కవి గ్రహించిన వస్తువు శిల్పం భాష ఆ సమయంలో కవి మనోభావాన్ని బట్టి ఉంటాయని అభిప్రాయం. అంటే ఏ వస్తువైనా సరే దాని బాహ్యాకారాన్ని, దాన్ని పురస్కరించుకొని ఉత్పన్నమయ్యే భావాల్ని, అంతరాకారాన్ని, దాన్ని పురస్కరించుకొని ఉత్పన్నమయ్యే భావాల్ని వర్ణించడమే వర్ణన.

తెలుగు సాహిత్యాన్ని పరిశీలిస్తే కొందరు కవులు తమ పాండితీ ప్రకర్షను ప్రదర్శించేందుకు వర్ణనలు ఎక్కువగా చేశారు. ఈ వర్ణనలు కాలక్రమంగా కావ్యసౌందర్యానికి న్యూనతను ఆపాదిస్తూ రసహీనంగా తయారయ్యాయి. కావ్యంలో వర్ణనలు ఎంత వరకు ఉండాలో తెలియజేస్తూ డా॥ కె.వి.ఆర్. నరసింహం గారు ఇలా అన్నారు. "వర్ణనలు కవులు తమ పాండిత్య ప్రకర్షకునై చేయరాదు. దృశ్యము కన్నులకు కట్టునట్లు చేయుటకు కథాకథనము పేలవము గాకుండ నూత్నచైతన్యము కలిగించుటకు వర్ణనము లావశ్యకములై యున్నవి."

(ప్రబంధములలో ప్రకృతి వర్ణనలు) రామమూర్తికవి తత్త్వప్రధానంగా శుకచరిత్రను వ్రాయాలను కొన్నాడు. దానితోబాటు తన కావ్యాన్ని ప్రబంధంగా కూడా తీర్చి దిద్దాలనుకొన్నాడు. అతని రచనలో వసుచరిత్రాది ప్రబంధాల ప్రభావం ఉందని చెప్పవచ్చు. శాంతరస ప్రధానంగా సాగిన ఈ కావ్యంలో శృంగార రసాత్మకాలైన ఎన్నో వర్ణనలు చోటు చేసుకున్నాయి. అన్ని ప్రబంధాల్లోలాగే కావ్యారంభంలో కవి మిథిలాపురాన్ని అందలి చాతుర్వర్ణాల వారిని, పురాధిపతి జనకుణ్ణి వర్ణించాడు.

ద్వితీయాశ్వాసంలో మేరుపర్వతం, కర్ణికారవనం, వసంత ఋతువు, గౌరీ శంకరుల వనవిహారం, ఘృతాచి సౌందర్యం, మన్మథ చంద్ర మలయానిలోపాలంబనం గంగానది మొదలైన వాటి వర్ణనలు చోటు చేసుకొన్నాయి. గౌరీ శంకరుల వనవిహార సందర్భంలో ఆది దంపతుల నర్మోక్తుల్ని చొప్పించిన తీరు కృతకంగా ఉంది. తత్త్వప్రధానమైన ఈ కావ్యంలో గౌరీ శంకరుల నర్మోక్తుల్ని చొప్పించడం అనవసరం. ఈ వర్ణన శృంగార రస ప్రాధాన్యం గల కావ్యాల్ని అనుకరించాలని చేసిన ప్రయత్నమే అవుతుంది.

మరోలా చూస్తే తపోవన వాతావరణంలో వసంత ఋతువును ప్రవేశపెట్టడం శృంగార రసోద్దీపనం కోసమే అని విదితమవుతుంది. కామాంతకుడు సహితం శివకామిని సహితంగా వసంత ఋతువులో వనవిహారం చేసినపుడు, వ్యాసుడు మాత్రం మనోనిగ్రహం సడలకుండా ఎలా ఉండగలడని ధ్వనింపజేయడానికే ఆది దంపతుల వన విహారాన్ని కవి వర్ణించినట్లు తోస్తుంది.

వేగినాటి కొండనార్యుడు ముక్తికాంతా పరిణయము అనే ప్రబంధాన్ని రచించాడు. ఈ కావ్యం ముమ్మడి మల్లన వ్రాసిన శ్రీరామస్తవరాజము చివర ఉండే **మోక్షలక్ష్మీకల్యాణము**తో ఎక్కువ పోలికలు కల్గి ఉంది. కథాకథనంలోనే గాక రెండిటిలోనూ పదజాలం కూడా ఒకే విధంగా ఉంది. మల్లన రచన వచన రచన కావడంవల్ల విషయం ఒకే ఆశ్వాసంలో ఉండడం వల్ల విషయప్రధానంగా ఉండి వర్ణనలులేక సంగ్రహంగా సాగింది.

కొండన అదే వస్తువును ఎన్నుకొని ఒక ప్రబంధంగా వ్రాయడం వల్ల వర్ణనాదుల్ని విశేషంగా పెంచి వ్రాశాడు. ఈ వర్ణనలు వేదాంతపరంగా, యోగపరంగా సాగాయి. ఈ కావ్యంలో పరకాంత యౌవ్వనలావణ్యం, ఆత్మారామకేళీవిలాసాదులు, మిథ్యాపురుష సూర్యాస్తమయం, ఆరూఢ జ్ఞాన భానూదయం వంటి వర్ణనలు ఉన్నాయి. ఇవిగాక వివాహమహోత్సవానికి చేసే ప్రయత్నాలు వధూవరుల్ని అలంకరించడం, వసంతోత్సవక్రీడలు, శోభనవిశేషాలు, వన విహారాదులు, ఆధ్యాత్మిక భావస్ఫోరకంగా వర్ణించబడటం విశేషం. ఈ కావ్యముయొక్క

గొప్పతనాన్ని గూర్చి వ్రాస్తూ డా॥ సన్నిధానము రామతారకపరబ్రహ్మశాస్త్రిగారు "కావ్యము లందు లౌకికశృంగారవర్ణనలు విశేషముగా చేయు కవులు తమ వర్ణనల నిందలి వర్ణనలతో పోల్చి చూచినచో నిందలి విశిష్టతను తమ వర్ణనలయొక్క పరమార్థమును గ్రహించి పరమార్థమెరుగని రచనల యొక్క ఫలితము కావ్య ప్రయోజనమగు విశ్వశ్రేయస్సు గూర్చుటకేగాక విషయలోలత్వమును పెంచుటే, యగు ననియు తెలిసికొని యుత్కృష్టరచనల కుద్యమించి యుత్తమ కావ్య నిర్మాతలు కాగలరు" ఆంధ్ర సారస్వతమునందలి అద్వైతతత్త్వకావ్యములు. చతుర్థసంపుటం, పుట–38.

16వ శతాబ్దికి చెందిన పరమానందతీర్థయతి **ముక్తికాంతాపరిణయము** అనే యక్షగానాన్ని రచించాడు. పరశురామ పంతుల రామమూర్తి తన శుకచరిత్రలో ముక్తికాంతా కల్యాణాన్ని వర్ణించాడు. విషయంలో దానికి ఈ యక్షగానానికి భేదం లేదు. కానీ వర్ణనలు, వివిధ మతస్థుల వాదాలు, ఈ యక్షగానంలో విపులంగా ఉన్నాయి. రామమూర్తి, పరమానంద తీర్థయతి, ఇద్దరి ఉద్దేశం అద్వైతసిద్ధాంతప్రతిపాదనే. జైన, బౌద్ధ, చార్వాకాది తత్త్వబోధకాలైన మతాల్ని నిరసించి, అద్వైతసిద్ధాంతం పరమగ్రాహ్యమని, ముక్తిప్రదమని వాదించడం రెండింటిలోనూ సమానంగానే కన్పిస్తుంది. పరమానందతీర్థయతి గ్రంథం యక్షగానపద్ధతిలో వ్రాయబడినా రచనా విధానంలో కవి ఆ పద్ధతిని పాటించలేదు. చిన్న చిన్న వచనాలు తప్ప మిగిలినవన్నీ ద్విపదలే. దరువులు కూడా ద్విపద పాదాలలోనే ఉన్నాయి. కాబట్టి ఇందులో ద్విపద కావ్య లక్షణాలే ఎక్కువగా ఉన్నాయి.

ఈ కావ్యంలో పెళ్లి భోజనాదుల్ని కవి చక్కగా వర్ణించాడు. ఈ వర్ణనలు చక్కని తాత్త్వికతను ప్రబోధించేవిగా ఉన్నాయి. ఉదా॥ భోజనాదుల వర్ణనలో "పంచభూతమ్ములింపగు వెన్నట్లు మంచిది తినుమని మరి యొకతె యిచ్చెను. దశ వాయువు లీతరమైన వడలు నీవశము గొమ్మని యవల యొకడి కిచ్చెను. దశేంద్రియములె బొబ్బట్లు మరువక తినుమని వడి నొకడికిచ్చెను. కరణములీ నాలుగు కడియపువుటట్లను, వరుసతో తినుమని వడి నొకడిచ్చెను. పంచతన్మాత్రలీ పసగల బూరెలు తుంచుకొని తినుమని యంచు నొకతె యిచ్చెను. తరమైన విద్యా తత్త్వములే ముగెడలు వెరువక తినుమని వేరొకడికిచ్చెను. శివతత్త్వములీల చెలువైన జున్నులు చవియిది తినుమని సఖి యొకతె యిచ్చెను."

ఇలా ఈ కావ్యంలో కథాభాగం స్వల్పంగాను, వర్ణనలు విశేషంగానూ ఉన్నాయి. ఆధ్యాత్మిక తత్త్వయుక్తవర్ణనలు ఇందులో ఎక్కువగా ఉన్నాయి. వివిధ మతాధిపతుల ఉపన్యాసాలు విశేషంగా చోటుచేసుకున్నాయి. మిగిలిన వర్ణనలు లౌకికమైనవే. అందులో విశేషాలు ఏమీ లేవు.

పురవర్ణనలు, బువ్వలు, గృహప్రవేశం మొదలైన వర్ణనలు తగ్గింపబడినా, ముక్తివధూవరుల పునస్సంధానవర్ణన విశేషంగా పెంచబడింది.

ఈ అధ్యాయంలో పరిశీలించిన అద్వైతరచనలన్నీ వేదాంత బోధకాలే. అద్వైతప్రతిపాదకాలే. అతిక్లిష్టమైన పారమార్థిక తత్త్వ రహస్యాలను, లౌకికస్పర్శతో సులభంగా బోధించడానికి అన్నీ ప్రయత్నించాయి. అన్ని రచనలు ముక్తికాంత చుట్టూ పరిభ్రమించాయి. యథోచితంగా, యథారుచి, యథాశక్తి శృంగారాన్ని చవి చూపించి, పరమార్థం వైపుకు పాఠకులను ఆకర్షించేందుకే ఇవి ప్రయత్నించాయి. అయితే శుకచరిత్ర వీటికంటే కొంత భిన్నంగా కన్పిస్తుంది. కవి ప్రతిభే దీనికి కారణం కావచ్చు.

ఇతివృత్తనిర్మాణంలోనూ, వర్ణనాకౌశలంలోనూ, శిల్పరమణీయకతలోనూ అద్వైత ప్రతిపాదక కావ్యాలలో **శుకచరిత్ర** ప్రత్యేకతను సంతరించుకొందనడంలో విప్రతిపత్తి లేదు.



# ఉపసంహారం

క్షీణ యుగంలోనూ అక్షీణసాహిత్యం ఆవిర్భవించింది. నూతన ప్రక్రియలతోబాటు నూతన వస్తువులను కూడా చేపట్టి రచయితలు విరివిగ రచనలు చేశారు. పాండితీ ప్రతిభా ప్రదర్శననే ప్రధానలక్ష్యంగా పెట్టుకొని రచనలు చేశారు. ఈ కాలంలో వర్ణనలు, శైలి ఇత్యాదులు సామాన్య–పాఠకునికి అందుబాటులో లేనంతగా సంక్లిష్టతను సంతరించుకొన్నాయి. ఈ సమయంలోనే వేదాంతగ్రంథాలు కూడా అనేకం వెలువడి ఆంధ్రసాహిత్యాన్ని పరిపుష్టం చేశాయి. వాటిలో పేర్కోదగ్గ ప్రౌఢప్రబంధం శుకచరిత్ర.

శుకచరిత్ర కర్త పరశురామపంతుల రామమూర్తి. ఇతడు పరశురామ పంతుల లింగమూర్తి కుమారుడు. వీరి వంశంలో ఎందరో కవులు జన్మించారు. వేదాంతులు ఉద్భవించారు. కవి తండ్రి లింగమూర్తి కవి కూడా గొప్పకవి. సీతారామాంజనేయసంవాద కర్త. కాబట్టి వీరి కుటుంబవాతావరణం సాహితీపరిమళభరితం. ఈ వాతావరణంలో పుట్టి పెరిగిన రామమూర్తి కవికి కవిత్వం వేదాంతవిచారం సులభంగానే ఒంటబట్టాయి. ఇతడు శుకచరిత్ర అనే ప్రబంధాన్నే గాక వేదాంతకీర్తనలు, జీవన్ముక్తి ప్రకరణము, ఈదులవాయి రామశతకం, పరశురామ–శతకద్వయం, మహీతనయామనోహరశతకం, వివేకసారము వంటి ఇతర గ్రంథాలను కూడా రచించాడు.

వేదాంతప్రతిపాదనకోసం శుకచరిత్ర రచింపబడింది. భారతంలోని శాంతిపర్వం నుంచి ఈ కథ గ్రహింపబడింది. కథావస్తువు ఐదు ఆశ్వాసాలలో నిబంధింపబడింది. “శుక జనన వృత్తాంతం విస్తృతంగా చెప్పబడింది. ముక్తికన్యక వృత్తాంతం కల్పింపబడింది. ‘ఘృతాచి’ వృత్తాంతం కల్పన. సంస్కృత సాహిత్యంలో శుకచరిత్ర, నారదీయపురాణం, దేవీభాగవతం, స్కాందపురాణం, శ్రీమద్భాగవతం, విష్ణుపురాణం, క్షేమేంద్రుని భారతమంజరి మొదలైన గ్రంథాలలోను వుంది.

జనకుడు యజ్ఞం చేయడం, “ముక్తికన్యక” జన్మించడం కథలోని కల్పనా నైపుణ్యానికి నిదర్శనం. పాత్రల స్వరూప స్వభావాలు సహజంగా చిత్రింపబడ్డాయి. వైవిధ్యం కొట్టొచ్చినట్టు కన్పిస్తుంది. వేదాంతప్రతిపాదనే ఈ కావ్యలక్ష్యం కాబట్టి పాత్రలన్ని కూడా ఆ లక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకొనే పురోగమించాయి. కవి పురవర్ణనలో ఆశ్వాలను, వృషభాలను వర్ణించారు. మేరుపర్వత వర్ణన మనోహరంగా చేశారు. వనవర్ణన మనోజ్ఞంగా ఉంది. ఈ కావ్యంలో శాంతం

అంగిరసంగాను, శృంగారాదులు అంగరసాలుగాను పోషింపబడ్డాయి. రామమూర్తి ఈ గ్రంథంలో వివిధ ఛందస్సులును వాడాడు. ఉపమ, ఉత్ప్రేక్ష, రూపకం, యమకం వంటి వివిధ అలంకారాలను ప్రయోగించాడు.

పతంజలి ప్రతిపాదించిన రాజయోగాన్ని కవి వివరించాడు. అష్టాంగయోగంలోని వివిధ అంగాలను విడమరచి తెలియజేశాడు. అష్టసిద్ధులను వివరించాడు. హఠయోగాన్ని సాంగోపాంగంగా సవిస్తరంగా తెలియజేశాడు. ప్రణవనాదం, దశవిధ నాదాలు, షట్కమలాలు, హంసస్వరూపం, లయయోగం, అమనస్కయోగం మొదలయినవి వివరింపబడ్డాయి.

అద్వైతకావ్యాలలో ముక్తికన్యాపరిణయానికి ప్రముఖస్థానం ఉంది. ముక్తి కన్యా పరిణయ కావ్యాల్లో శుకచరిత్రకు ఎంతో ప్రాధాన్యం వుంది. మొత్తానికి అద్వైతకావ్యాలన్నింటిలోనూ శుకచరిత్ర తలమానికమనడంలో విప్రతిపత్తి లేదు.

శుకచరిత్ర వేదాంతప్రతిపాదనలోనూ, వివిధయోగవిషయాలను విడమరచి చెప్పడంలోనూ జిజ్ఞాసువును లేదా ముముక్షువును తృప్తిపరచే గ్రంథం. ఈ గ్రంథం అవశ్యపఠనీయం. గ్రంథరచయిత పరశురామపంతుల రామమూర్తి ధన్యుడు.



# ఉపయుక్త గ్రంథ సూచి

## సంస్కృతం


1. అథర్వవేద సంహితా మూలం : ఆర్య సాహిత్యమండలి లిమిటెడ్, అజ్మీరు 1957
2. అథర్వ వేద భాష్యం - 20 కాండలు : రామ్‌లాల్ కపూర్ ట్రస్ట్, బహాల్ గఢ్ 1983
3. అధ్యాత్మ రామాయణము : హిందీ టీక సహితము, గీతాప్రెస్, గోరఖ్‌పూర్
4. అమరకోశము లింగాభట్టీయం : వావిళ్ల ఎడిషన్, మద్రాసు 1962
5. ఉపనిషత్సంగ్రహ : పండిత జగదీశ లాల్ శాస్త్రి మోతీలాల్ బనారసీ దాస్, ఢిల్లీ-7, 1980
6. ఉపనిషద్భాష్య - సానువాదఖండ - 4 బృహదారణ్యకోపనిషత్తు శంకరభాష్య : శంకరాచార్య, గీతాప్రెస్, గోరఖ్‌పూర్ 1968
7. ఋగ్వేద సంహితా మూలం : ఆర్య సాహిత్య మండలి లిమిటెడ్ అజ్మీరు, 1952.
8. ఋగ్వేద పరిచయః సం : విశ్వనాథ విద్యాలంకార (హిందీవ్యాఖ్యాత) రామ్‌లాల్ కపూర్ ట్రస్ట్, బహాల్ గడ్ సోనీపత్ జిల్లా, 1986
9. ఏకాదశోపనిషద్ : మోతీలాల్ బనారసీదాస్, ఢిల్లీ-7, 1966
10. కావ్యప్రకాశః 1,2 భాగాలు : మమ్మటాచార్య హిందీ అనువాదం కర్త రామసాగర్ త్రిపాఠి, మోతీలాల్ బనారసీదాస్, ఢిల్లీ-7
11. కావ్యాలంకార : శ్రీరుద్రటాచార్య శ్రీ నిమిసాధు వ్యాఖ్య మోతీలాల్ బనారసీదాస్, ఢిల్లీ-7,1983
12. కాశికా పదమంజరి వ్యాఖ్య, 2 భాగాలు : శ్రీహరదత్త మిశ్ర, సంస్కృత పరిషత్తు ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు, 1981

13. కుమారసంభవ : కాళిదాసు, ఆంగ్లవ్యాఖ్య ఎం.ఆర్. కాళే
మోతీలాల్ బనారసీదాస్, ఢిల్లీ,1981

14. కులార్ణవతంత్ర (సం.) : ఎడిటరు : తారానాథ విద్యారత్న
మోతీలాల్ బనారసీదాస్, ఢిల్లీ, 1975

15. కులార్ణవతంత్ర ఆంగ్లానువాద సహితం : డా॥ రామకుమార్ రాయ్,
ప్రాచ్య ప్రకాశన, వారణాసి – 2
74, ఎ., జగత్ గంజ్, 1983

16. కూర్మపురాణమ్ సంస్కృతం : ఎడిటర్ : రామశంకర భట్టాచార్య
ఇండోలాజికల్ బుక్ హౌస్, సి.కే.
31–10, నేపాలీ ఖపడా వారణాసి,1967

17. గురుగీత సంపాదక వర్గము : శ్రీభారతధర్మ మహామండ జగత్ గంజ్
వారణాసి

18. ఛాందోగ్యోపనిషత్తు : ఆంగ్ల వివరణ, స్వామీ స్వాహానంద,
శ్రీరామకృష్ణ మఠం, మైలాపూర్
మద్రాసు – 40, 1980

19. నానార్థరత్నమాలా నిఘంటు : ఇరుగపదండనాథ – వావిళ్ళ ఎడిషన్

20. నారదీయ మహాపురాణం : నాగ్ పబ్లిషర్స్, జవహర్‌నగర్
ఢిల్లీ – 7, 1984

21. నిరుక్త శ్లోక వార్తికం : నీలకంఠ సంపాదక – డా॥ విజయపాల
రామ్‌లాల్ కపూర్ ట్రస్ట్, బహాలగఢ్

22. పద్మపురాణము – 5 భాగాలు : మన్‌సుఖ్ రాయ్ మోర్, గురుమండల
గ్రంథమాలా, కలకత్తా

23. పంచదశీ : విద్యారణ్య ఆంగ్లానువాద
శ్రీరామకృష్ణమఠం, మద్రాసు.

24. పురశ్చర్యార్ణవ : ప్రతాపసిహ మహాదేవ, చౌఖంబా
సంస్కృత ప్రతిష్ఠాన, ఢిల్లీ–7

25. ప్రతాపరుద్రీయమ్ : రత్నాపణ వ్యాఖ్య, వావిళ్ల ఎడిషన్

26. భారత మంజరీ : క్షేమేంద్ర ఎడిటరు – శివదత్తపండిత మోతీలాల్ బనారసీదాస్, ఢిల్లీ, 1984

27. బృహదారణ్యకోపనిషత్ : శంకరాచార్య, స్వామీ మాధవానంద అద్వైత ఆశ్రమ, కలకత్తా, 1975

28. బ్రహ్మాండపురాణమ్ : వేదవ్యాస, మోతీలాల్ బనారసీదాస్ ఢిల్లీ

29. మహాభారతమ్ ప్రథమఖండ : వేదవ్యాస, హిందీవ్యాఖ్య, గీతాప్రెస్ గోరఖ్‌పూర్, 1988

30. మహాభారతమ్ పంచమఖండ శాంతిపర్వము : " , "

31. మహాభారతమ్ షష్ఠఖండ అనుశాసనిక పర్వము : " , 1989

32. మహాభారత ఖిలభాగ, హరివంశ : హిందీటీక, గీతాప్రెస్, గోరఖ్‌పూర్,1967

33. మత్స్యపురాణము : మన్‌సుఖ్‌రాయ్, గురుమండలి గ్రంథమాలా, కలకత్తా, 1954

34. మనుస్మృతి : కల్లూకభట్టు వ్యాఖ్య, చౌఖాంబా సంస్కృత సంస్థాన్, వారణాసి, 1982

35. యజుర్వేద సంహిత శుక్ల : ఉవ్వట మహీధర వ్యాఖ్య మోతీలాల్ బనారసీదాస్, ఢిల్లీ, 1978

36. యాజ్ఞవల్క్య స్మృతి : సంస్కృత వ్యాఖ్యతో చౌఖాంబా సంస్కృత సంస్థాన్, ఢిల్లీ, 1987

37. రఘువంశ, 1,2 సర్గ : కాళిదాసు, ఆంగ్లవ్యాఖ్య ఎం.ఆర్.కాళే మోతీలాల్ బనారసీదాస్, ఢిల్లీ, 1972

38. శ్రీరామకర్ణామృతం సం. : తెలుగుపద్యతాత్పర్యములతో వావిళ్ల ఎడిషన్, 1958

39. లింగపురాణమ్ : సంపాదక మండలి, గురుమండలి గ్రంథమాలా, కలకత్తా, 1960

40. వాయుపురాణమ్ : ఆనందాశ్రమ గ్రంథావళి – 49
ఆనందాశ్రమ గ్రంథమాల, పూనా, 1983

41. వాయుపురాణమ్ : నాగ్ పబ్లిషర్స్, ఢిల్లీ–7, 1983

42. వాల్మీకి రామాయణమ్ : రామకృత తిలక వ్యాఖ్య
ఇండోలాజికల్ బుక్ హౌస్, వారణాసి

43. విష్ణుపురాణమ్, హిందీటీక : గీతాప్రెస్, గోరఖ్‌పూర్

44. విష్ణుపురాణమ్ వైష్ణవాకూత చంద్రికా : రత్నగర్భ భట్టాచార్య,
గోపాల్ నారాయణదాస్, బాంబే,
1881శక. 1824

45. విష్ణుపురాణమ్, విష్ణుచిత్తీయ వ్యాఖ్య : గ్రంథమాలా కార్యాలయ, కాంచీ

46. శివపురాణమ్ : నాగ్ పబ్లిషర్స్, ఢిలీ–7, 1981

47. శివసహస్రనామ స్తోత్రం : స్వామీ చిద్భవానంద
శ్రీరామకృష్ణ తపోవనం, తిరుప్పరైత్తురై
పిన్ : 639115, 1985

48. శ్రీమద్ భగవద్గీత : శంకరాచార్య కృత వ్యాఖ్య, గీతాప్రెస్
గోరఖ్‌పూర్

49. శ్రీమద్దేవీ భాగవతం మూలము : పండిత పుస్తకాలయ, కాశీ, రాజా
దరవాజా, 1962

50. శ్రీమద్దేవీ భాగవతం ఆంధ్రానువాద సహితం, శ్రీ దేవులపల్లి శివరామయ్య : శ్రీవేంకటేశ్వర ఆర్ష భారత ట్రస్టు
హైద్రాబాద్

51. శ్రీమద్భాగవత మూలం : వేదవ్యాస, గీతాప్రెస్, గోరఖ్‌పూర్.

52. శ్రీమద్భాగవత : శ్రీధరీ టీకా, పండిత పుస్తకాలయం, కాశీ
1962

53. స్కంద మహాపురాణం 3 భాగాలు : నాగ్ పబ్లిషర్స్, ఢిల్లీ

54. సంన్యాస ఉపనిషద్స్ : శ్రీఉపనిషద్ బ్రహ్మేంద్ర యోగి వ్యాఖ్య
అడయార్ లైబ్రెరీ రీసెర్చి సెంటర్
అడయార్, మద్రాసు, 1983

55. సాంఖ్యసార : విజ్ఞానభిక్షు, ఎడిటర్ రామ్‌శంకర భట్టాచార్య, భారతీయవిద్యాప్రకాశన్, వారణాసి – 1, 1978

56. సిద్ధాంత శిఖామణి మూలం : శివయోగి శివాచార్య

57. సిద్ధాంత శిఖామణి తెలుగు వ్యాఖ్య : ఈశ్వర సత్యనారాయణ శర్మ సాధనగ్రంథమండలి, తెనాలి, 1961

58. సుభగోదయ స్తుతి : గౌడపాద, వ్యాఖ్యాత ప్రకాశనంద భారతి పృథివీ ప్రకాశన, వారణాసి, 1984

59. సుభగోదయ స్తుతి : గౌడపాద, ఎడిటరు రుద్రదేవ త్రిపాఠి, శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి కేంద్రీయ సంస్కృత విద్యాపీఠము, ఢిల్లీ, 1982

60. సౌందర్యలహరి సంస్కృతం : ఆద్యశంకరాచార్య, తెలుగు వ్యాఖ్యాత – ఈశ్వర సత్యనారాయణశర్మ, సాధనగ్రంథమండలి, తెనాలి

61. సౌందర్యలహరి : చదలువాడ జయరామశాస్త్రి అరుణా బుక్ హౌస్, 103, నారాయణ మొదలి వీథి, మద్రాసు–1

62. షట్చక్రనిరూపణమ్ : పూర్ణానందగిరి, వ్యాఖ్యాత : గోస్వామి ప్రహ్లాదగిరి, కృష్ణదాస్ అకాడమీ వారణాసి – 1, 1988

63. షట్చక్రనిరూపణమ్ : సంస్కృతం, హిందీటీక : శ్రీ స్వామీ హంస స్వరూప, విజ్ఞాన ప్రెస్, ఋషీకేష్, డెహరాడూన్ జిల్లా

**తెలుగు**

64. ఆంధ్రమహాభారతము ఆది, సభా పర్వాలు : నన్నయ, వావిళ్ల ఎడిషన్, 1962

65. ఆంధ్ర మహాభారతము శాంతిపర్వము : తిక్కన, వావిళ్ల ఎడిషన్, 1961

| | | |
|---|---|---|
| 66. ఆంధ్ర మహాభారతము అనుశాసనికపర్వము | : | తిక్కన, వావిళ్ల ఎడిషన్, 1961 |
| 67. ఆంధ్ర మహాభారతము అనుశాసనికపర్వము | : | తిక్కన, క్రిటికల్ ఎడిషన్, తెలుగుశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు, 1972 |
| 68. ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము | : | చెలమచెర్ల రంగాచార్యులు 1-9-625/8, శ్రీనివాస నిలయము విద్యానగరము, హైదరాబాదు, 1961 |
| 69. ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక పరశురామ శతక ద్వయము | : | రామమూర్తి 1929 |
| 70. ఆంధ్ర సారస్వతమునందలి అద్వైతతత్త్వకావ్యములు, 4 భాగాలు | : | డా॥ సన్నిధానం రామతారక పరబ్రహ్మ శాస్త్రి, శ్రీకాళీ గార్డెన్స్, నంబూరు, 1983 |
| 71. కావ్యాలంకార సంగ్రహము (సరస భూపాలీయము) | : | సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి యం. శేషాచలం అండ్ కో. మచిలీపట్నం-1, 1987 |
| 72. కూర్మ రాజీయము గోత్ర ప్రవరల వివరణము | : | పాలడుగు శేషాచలవర్మ, 1967 |
| 73. చరిత్రకెక్కని చరితార్థులు | : | డా॥ బి. రామరాజు, రచయిత చీకటిపల్లి, హైదరాబాదు, 1985 |
| 74. తెలుగు జానపద గేయ సాహిత్యము | : | ఆచార్య బి. రామరాజు, 1978 |
| 75. తెలుగు సాహిత్య సమీక్ష 2 భాగాలు | : | డా॥ జి. నాగయ్య, నవ్య పరిశోధక ప్రచురణలు, తిరుపతి, 1983, 1985 |
| 76. పద్మపురాణము సృష్టిఖండము, ఉత్తరఖండము | : | శ్రీపిసుపాటి చిదంబరశాస్త్రి, 1956 |
| 77. పరశురామపంతుల లింగమూర్తి జీవితము - సాహిత్యము | : | ఆచార్య దివాకర్ల వేంకటావధాని, శ్రీకేశవపంతుల నరసింహ శాస్త్రి, ఆంధ్రసారస్వత పరిషత్తు, హైదరాబాదు, 1976 |

78. రాజయోగసారము : తరిగొండ వెంగమాంబ, వావిళ్ల ఎడిషన్ 1950

79. వసుచరిత్ర : సోమకవి కృత, విద్వజ్జనరంజిని వ్యాఖ్య శౌంఠి భద్రాద్రిరామ శాస్త్రి, వావిళ్ల ఎడిషన్ జీర్ణప్రతి

80. వసుచరిత్ర : భావ ప్రకాశికా వ్యాఖ్య, శేషాద్రి రమణ కవులు, వావిళ్ల ఎడిషన్, 1954

81. విజయవిలాసము మూలం : చేమకూర వేంకటకవి, వావిళ్ల ఎడిషన్, 1962

82. విజయవిలాసము : హృదయోల్లాస వ్యాఖ్య, తాపీ ధర్మారావు విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు – 1

83. వివేకసింధువు : కొండనార్య, వావిళ్ల ఎడిషన్, 1930

84. వ్యాసవాణి : వేలూరి శివరామశాస్త్రి

85. శతకసముచ్ఛయము 2వ భాగం : ఆంధ్ర సాహిత్య పరిషత్తు, కాకినాడ ఇంటి నెం.1–22–65, రామారావుపేట

86. శుకచరిత్ర ప్రస్తుతం అలభ్యం : పరశురామపంతుల రామమూర్తి వాఙ్మయమండలి, బాపట్ల 1927

87. సీతారామాంజనేయసంవాదము : పరశురామపంతుల లింగమూర్తి వ్యాఖ్యాత : వఝ్ఝల నారాయణ శాస్త్రులు శ్రీ అరుణా బుక్ హవుస్, మద్రాసు–1

88ఎ. సీతారామాంజనేయసంవాదము వ్యాఖ్యాత : శ్రీ సంగశేషాచలశాస్త్రి : రవీంద్ర పబ్లికేషన్స్, పొందువ్వ వయా గణపవరం, పశ్చిమగోదావరి జిల్లా

88బి. శ్రీసీతారామాంజనేయ సంవాదము తాత్పర్యం : 1. వెన్నెలకంటి సుందరరామశర్మ విశేషార్థం : 2. వేదాంతం లక్ష్మయ్య : బ్రహ్మస్పర్శిని ప్రచురణలు 21/303 మురుగేశం కాంపౌండు కడప

88సి. శ్రీసీతారామాంజనేయ సంవాద సమాలోచనాత్మక పరిశీలనము (Ph.D. Thesis) : డా॥ రత్నాకర బాలరాజుగారు, అనంతపురం

89. హరివంశము : ఎఱ్ఱన, పరిష్కర్త : వేలూరి శివరామశాస్త్రి వావిళ్ల ఎడిషన్.

## హిందీ గ్రంథములు

90. అగ్నిహోత్ర సలేకర్ అశ్వమేధ పర్యంత – శ్రౌత యజ్ఞోం కా సంక్షిప్త పరిచయ : యుధిష్టర మీమాంసక రామ్‌లాల్ కపూర్ ట్రస్ట్, బహాల్‌గఢ్ 1984

91. ఆర్యోం కా ఆది దేశ్ ఔర్ ఉన్కి సభ్యతా : స్వామీ విద్యానంద సరస్వతి ఇంటర్నేషనల్ ఆర్యన్ ఫౌండేషన్ బాంబే – 50.

92. ఆర్ష యజ్ఞ విద్యా : డా॥ కుంపర్ లాల్ వ్యాసశిష్య ఇతిహాస విద్యా ప్రకాశన, బి–26, ధర్మకాలనీ నాంగలో ఈ, ఢిల్లీ–41.

93. ఇతిహాస్ పురాణోం కా అనుశీలన్ : శ్రీరామ శంకర భట్టాచార్య ఇండోలాజికల్ బుక్ హవుస్, వారణాసి మరియు జవాహరనగర్, ఢిల్లీ – 7

94. కాశ్మీర శైవ దర్శన్ : బలజిన్నాధ పండిత శాస్త్రి, శ్రీరణవీర కేంద్రీయ సంస్కృత విద్యా పీఠ, జమ్మూ, 1973

95. పంచ మహా యజ్ఞ విధి : స్వామీ దయానంద సరస్వతి, రాం లాల్ కపూర్ ట్రస్టు, బహాల్‌గఢ్, పిన్. 131021 హర్యానా 1987

96. పురాణ పరిశీలన్ : పండిత గిరిధర శర్మా బిహార్ రాష్ట్ర భాషా పరిషద్ పాట్నా, 1970

97. పురాణ విమర్శ : ఆచార్య బలదేవ ఉపాధ్యాయ, చౌఖంబా విద్యాభవన్, వారణాసి, 1987

98. పురాణ విషయాను క్రమణీ పురాణాను శీలన్ ప్రథమ భాగ – రాజనీతిక : డా॥ రాజ బలీ పాండేయ కాశీ హిందూ విశ్వవిద్యాలయ, వారణాసి 1957

99. పురాణోం మే భారతోత్తరవంశ : డా॥ కుంవర్ లాల్ వ్యాస శిష్య ఇతిహాస విద్యా ప్రకాశన్, ఢిల్లీ, 1988

100. పురాణోం మే ప్రాజ్మహా భారత కాలీన ఇతిహాస్ : డా॥ కుంవర్ లాల్ వ్యాస శిష్య ఇతిహాస్ విద్యా ప్రకాశన, ఢిల్లీ, 1990

101. పౌరాణిక కోశ్ : రాణా ప్రసాద్ శర్మ, జ్ఞాన మండల లిమిటెడ్, వారణాసి

102. మహా భారత కోశ్ : డా॥ రామ కుమార్ రాయ్, చౌఖంబా సంస్కృత సిరీస్ ఆఫీస్, వారణాసి, 1982

103. శ్రౌతయజ్ఞ మీమాంసా సంస్కృతం, హిందీ : యుధిష్ఠర మీమాంసక రాం లాల్ కపూర్ ట్రస్టు, బహాల్‌గఢ్ 1987

104. సత్యార్థ ప్రకాశ : స్వామీ దయానంద సరస్వతి ఆర్య సమాజ్ శతాబ్దీ సంస్కరణ రాం లాల్ కపూర్ ట్రస్టు, బహాల్‌గఢ్

105. హిందూ ధర్మకోశ : డా॥ రాజ బలీ పాండేయ ఉత్తర ప్రదేశ్ హిందీ సంస్థాన్, హిందీ సమితి మహాత్మా గాంధీమార్గ్, లక్నో, 1978


**ఆంగ్ల గ్రంథములు**


106. Alter Flowers (Prayers) : Advaita Ashramaa, Calcutta-14.

107. Anthology of Vedic Hymns : Swami Bhumananda Saraswati Savitri Devi, Begaria Trift, 2, Chowranghi Approach, Calcutta-13, 1984

108. A Concise Dictionary of Indian Philosophy : (Sanskrit, English) John Grimes, S. Radha Krishna Institute for Advanced Study in Philosophy, University of Madras - 5, 1988

109. Ancient Indian Traditions : F.E.Pargiter, Cosmo Publications, New Delhi-2, 1979.

110. Encyclopeadia of Yoga : Dr. Ramkumar Rai, Prachya Prakashan, Varanasi-2 1982

111. The Age of the Mahabharata War : N. Nagaraja Rao Bharat Bharati, Durgakunda Varanasi, 1978

112. The Students Sanskrit English Dictionary : V.S. Apte, Motilal Banarasidass Delhi - 7, 1965.

113. The Maha Bharata - Its Genesis and Growth A Statistical Study : M.R.Yardi Bhandarkar Oriental Research Institute, Poona

114. The Santi Parvan Introduction Part - III : SK Belvalkar and P.L.Vaidya, Bhandrakar Oriental Research Institute, Poona, BORI Research Unit Series - 7.

115. The Thirty Two Vidyas : Thiru K. Narayanaswami Aiyar, The Adyar Library and Research Centre, Adyar, Madras-20,1975

116. The Visvamitras and the Vasisthas : Umeshchandra Sarma Ph.D., Thesis, Vikas Publishers Aligarh, Published by the Author, 1975.

117. Puranic Encyclopaedia : Editor G Vettam Mani English Translator : Menon Motilal Banarsidass, Delhi-7, 1984

118. Yaska's Nirukta and Nighantu (Sanskrit-Tamil-English) part-I, and part - II : Agnihotram Ramanuja Tatachariar, Saraswati Mahal Library, Thanjavur - 1974

119. The number of RASAS Dr. V. Raghavan : The Adyar Library and Research (Vol.23) 1975 Edition Adyar - Madras-20.

**పత్రికలు**

1. వేదవాణి : హిందీ మాస పత్రిక, ప్రత్యేక సంచిక, గీతాప్రెస్, గోరఖ్‌పూర్

2. వేదవాణి : హిందీ మాసపత్రిక రాంలాల్ కపూర్ ట్రస్టు, బహాల్‌గఢ్

3. ది వేదాంత కేసరి : ఇంగ్లీషు మాసపత్రిక, శ్రీరామకృష్ణ మిషన్ మైలాపూర్, మద్రాసు

4. ప్రబుద్ధ భారత : ఇంగ్లీషు మాసపత్రిక, అద్వైత ఆశ్రమ, కలకత్తా



- అనుబంధం -

# శ్రీ శుకచరిత్ర - సమస్యలు - సమాధానాలు

- రచయిత -


## డా॥ నడిపినేని సూర్యనారాయణ

వినోదరాయునిపాలెం, ప్రకాశం జిల్లా.

**- శ్రీః -**

**ఓం శ్రీగురుభ్యో నమః**

# అనుబంధం - 1

# శ్రీశుకచరిత్ర - అద్వైతతత్త్వము

**వ్యాసరచయిత : డా॥ నడిపినేని సూర్యనారాయణ, 26.10.2011**

వేదములలోనే అద్వైతభావనలున్నాయి. ఇంద్రుడు, వరుణుడు, అగ్ని, మిత్రుడు, వాచస్పతి పేరులు వేరే కాని తత్త్వమొక్కటే. "**ఏకం సద్ విప్రాః బహుధా వదన్తి**" సత్యమొక్కటే కాని వేదవేత్తలు వేర్వేరుగా పేర్కొంటున్నారు. వామదేవర్షికృత **ఋగ్వేదసూక్తం** ఈ ఏకత్వాన్నే బోధిస్తుంది. ఈ వేదజ్ఞానాన్నే తత్త్వాన్నే ఆద్యశంకరాచార్యులు బోధించారు. పురశ్చర్యార్ణవతంత్ర పీఠికలో శేషరాజశర్మ అనువారిట్లా వ్రాశారు. "దార్శనికసిద్ధాంతాన్ని అనుసరించి తంత్రాలు మూడు రకాలు - అద్వైతం - ద్వైతం - ద్వైతాఽద్వైతం" వీటిని బోధించేవి.

శ్లో॥ తత్ర శాక్తతంత్రమ్ అద్వైతపరమ్ । శైవతంత్రమ్ ద్వైతపరమ్ ।
అద్వైతపరం చ । వైష్ణవతంత్రం తు ద్వైతపరమేవ ॥

కులార్ణవతంత్రం - పురశ్చర్యార్ణవతంత్రం - రుద్రయామళం - మున్నగు తంత్రగ్రంథాల్లో విభిన్న దేవీదేవతలను అద్వైతభావంతో పూజించాలని ఉంది. కాలానుగుణంగా, తంత్ర ఉపాసనా ప్రభావంతో తిక్కన మహాకవి - హరిహరాభేదతత్త్వాన్ని బోధించాడు.

పరశురామపంతుల రామమూర్తి తన శుకచరిత్ర - వేదాంత ప్రబంధంలో ఇష్టదేవతలను స్తుతిస్తూ పీఠికను వ్రాశాడు. ఈ కవి గొప్పయోగసాధకుడు, అద్వైతానుభవి, కనుక 14 పద్యాలలో అభేదదృష్టితో, అద్వైతతత్త్వాన్ని బోధిస్తూ, దేవతాస్తుతి చేశాడు. కవి శుకచరిత్ర ప్రారంభంలో దేవతాస్తుతి చేశాడు. ప్రథమపద్యం విష్ణుస్తుతి. అది శ్లేషతో కూడిన శివస్తుతి. 'చిద్భూమానందుడు మాధవుండు'. అ పదములను "విష్ణువు పరంగా, శివపరంగా కూడా విడదీసి అర్థం చెప్పవచ్చు. 'మాధవుడు - విష్ణువు, ఉమాధవుడు - శివుడు అని శ్లేష ప్రయోగించాడు కవి. రెండవ పద్యం శివస్తుతి. 3వ పద్యం బ్రహ్మస్తుతి. ఈ త్రిమూర్తులు గృహస్థులు. పత్నీ సహితులై తమ తమ కార్యాలను నెరవేరుస్తున్నారు. దేవతలకు, మానవులకు ప్రవర్తన ద్వారా మార్గదర్శకులవుతున్నారు.

ఈ కవి తన యిష్టదైవమయిన శ్రీరాముణ్ణి 5వ పద్యంలో వర్ణించాడు. అధర్మాన్ని ఆచరించే

వారిని శ్రీరాముడు శిక్షిస్తాడు. ఈ శ్రీరామవర్ణనలో అద్వైతభావన ఉంది. సీతారాములే సర్వస్త్రీ-పురుషులు. 1. శివపార్వతులు, 2. లక్ష్మీ విష్ణువులు, 3. వాణీబ్రహ్మలు, 4. స్వాహాఽగ్నులు, 5. శచీంద్రులు. ఈ అయిదు జంటలు శివశక్తులు. సీతారాముల అన్యరూపాలే. సర్వంబు నందున్న సుందరులు వీరే. వీరికి భేదమేలేదు. తంత్రసిద్ధాంతాన్ని అనుసరించి అభేదదృష్టితో 'ఐక్యత'ను ప్రతిపాదించాడు. భేదదృష్టితో సాధన చేసిన వాడు నరకానికి పోతాడని తంత్రశాస్త్ర-బోధ. సీతారాముల వర్ణన పరిశీలించండి.

**మ॥ గిరికన్యావృషభేంద్ర వాహనులు లక్ష్మీపక్షిరాడ్వాహనుల్**
**వరవాణీసతిహంసవాహనులు తత్ స్వాహాహవిర్వాహనుల్ ।**
**సరిశచ్యంబుద వాహనుల్ మొదలుగా సర్వంబునన్ గల్గు సుం**
**దరులున్ బూరుషులెల్లదామయిన సీతారాములన్ గొల్చెదన్.**

– కులార్ణవతంత్రం – తృతీయ ఉల్లాసంలో చెప్పబడి ఉన్న అద్వైతభావనను ఈ కవి గ్రహించాడు. శివుడు పార్వతికి సాధన విశేషాలను, అద్వైతతత్త్వాన్ని బోధించాడు. కులార్ణవ తంత్రంలోని శ్లోకాలు.

**శ్లో॥ శచీంద్రౌ రోహిణీచంద్రౌ స్వాహాఽగ్నీ చ ప్రభారవీ ।**
**లక్ష్మీనారాయణౌ వాణీధాతారౌ రాత్రివాసరే ॥**

**శ్లో॥ అగ్నీషోమౌ బిందునాదౌ దేవి! ప్రకృతిపూరుషౌ ।**
**ఆధారాధేయనామానౌ భోగమోక్షౌ కులేశ్వరి ॥**

**శ్లో॥ ప్రాణాపానౌ చ వాగర్థౌ ప్రియే! విధినిషేధకౌ ।**
**సుఖదుఃఖాది యద్ ద్వంద్వం దృశ్యతే శ్రూయతే మయా ॥**

**శ్లో॥ సర్వలోకేషు తత్ సర్వమావామేవ న సంశయః ।**
**పుంస్త్రీరూపాణి సర్వాణి చావయోరంశకాని హి ।**
**పరాప్రాసాదామంత్రోఽయం తస్మాత్ సర్వాత్మకో భవేత్ ॥**

ఈ క్రింద పేర్కొన్నవారందరు శివపార్వతుల అంశలేకాని అన్యులుకారు. 1. శచీంద్రులు, 2. రోహిణీచంద్రులు, 3. స్వాహాగ్నులు, 4. ప్రభారవులు, 5. లక్ష్మీనారాయణులు, 6. వాణీధాతలు, 7. రాత్రివాసరములు, 8. అగ్నిషోమములు, 9. బిందునాదములు, 10. ప్రకృతిపురుషులు, 11. ఆధారాధేయములు, 12. భోగమోక్షములు, 13. ప్రాణాపానములు, 14. వాగర్థములు, 15. విధినిషేధములు, 16. సుఖదుఃఖములు.

ఈ ద్వంద్వములన్నియు శివపార్వతుల అంశకములే. సోఽహం భావము పరాప్రాసాద

మంత్రం. సర్వమూనేనే , సర్వమూ నాయందే కలదు, అన్నదే అద్వైతభావన. పురశ్చర్యార్ణవం – ప్రథమతరంగలో – 10,11 శ్లోకాల్లో ఈ భావమే ఉంది.

**శ్లో॥ కాళీకం సారితారా రఘువర ! మురజిత్ శైలజా వల్లభానామ్ ।**
**ఐక్యం యుగ్మక్రమేణాఽగమగదితమభేదశ్చ శక్తిత్రయశ్చ ॥**

1. కాళీ, కంసారి (కృష్ణ), 2. తారా, రఘువర, 3. మురజిత్, విష్ణు, శైలజా వల్లభ (శివ), విష్ణువునకు, శివునకు అభేదమని దీనిలో చెప్పటం జరిగింది.

**శ్లో॥ రామస్య వక్ష్యే శివశక్తిరూపతామైక్యం చ సీతాహిమశైలకన్యయోః ।**
**శ్రీరామకామాన్తకయోరపి క్రమాదైక్యం తతో దేవపంచకమ్ ॥**

గౌరీ సీతలకు; శివ రాములకు (ఐక్యత) అభేదరూప ఉపాసన చెప్పబడింది. గణేశాది పంచదేవతలకు కూడ అభేదం చెప్పబడింది. పురశ్చర్యార్ణవం – 19 పుటలో భేదదృష్టితో ఉపాసన చేయరాదని – రుద్రయామళశ్లోకం ఉదహరించబడింది.

**శ్లో॥ న కుర్యాత్ భేదమేతేషాం కౌళికో వైష్ణవస్తథా ।**
**గణేశార్కహరీశానదుర్గాణాం పరమార్థవిత్ ॥**

**శ్లో॥ పూజయేదైక్యభావేన దేవీభక్తశ్చ బుద్ధిమాన్ ।**

1. గణేశ, 2. అర్క (రవి), 3. హరి, 4. ఈశాన, 5. దుర్గ – బుద్ధిమంతుడు పరమార్థ విజ్ఞాని – ఐక్యభావనతో ఈ ఐదుగురు దేవతలను పూజించవలెను. ఐక్యభావనతో కూడిన ఉపాసన ముక్తికి సులభమార్గము.

శుకచరిత్ర ప్రబంధకవి రామమూర్తి, తాంత్రికపరమార్థమును గ్రహించి తన ప్రబంధ పీఠికలో – ఏకత్వభావనను ప్రకటించాడు. కవి సీతారాములను, శివపార్వతులను, సరస్వతిని, శచీదేవిని స్తుతించాడు. 12వ పద్యంలో సీతాదేవి వర్ణన యోగశాస్త్రానుసారంగా, అద్భుతంగా చేశాడు. సీతాలలన పరమముక్తి, చైతన్యశక్తి, ప్రాణుల శరీరాల్లో నాడుల్లో సంచరిస్తూ ఉండే ప్రాణశక్తి. దీనిలో సోఽహం భావ ఉపాసన చెప్పబడింది. కవి పీఠికాభాగమును ముగిస్తూ, సంక్షిప్తంగా మరల దేవతా దంపతులను, ఐదు జంటలను స్మరించాడు.

**కం॥ " విషధరశయనుని నుతిగొని**
**విషధరభూషణుని బొగడి విషరుహభవునిన్**
**విషధరగమనుని బేర్కొని**
**విషధరనిభతనుని భక్తివినుతించియుటన్."**

విషము : జలము – కాలకూటము; విషధరము – మేఘము – సర్పము

1. విషధరశయనుడు = విష్ణువు, 2. విషధరభూషణుడు = శివుడు, 3. విషరుహభవుడు = బ్రహ్మ, 4. విషధరగమనుడు = ఇంద్రుడు, 5. విషధరనిభతనుడు = శ్రీరాముడు – శ్లేషతో చమత్కారయుతంగా వీరిని స్తుతించాడు. వీరి పత్నులను గూడ వరుసక్రమంలో స్తుతించాడు.

కం॥ మారమణిగొలిచి సతతము
మారమణికి మ్రొక్కి వాగ్రమణికిన్ పౌలో
మీరమణికి ఁగేల్మోగిచి క్ష
మారమణికుమారికిని నమస్కృతులిడుదున్.

1. మారమణి = లక్ష్మి, 2. ఉమారమణి = పార్వతి, 3. వాగ్రమణి = సరస్వతి, 4. పౌలోమీరమణి = శచీదేవి, 5. క్షమారమణికుమారి = సీతాదేవి.

ఈ అయిదుదేవతా యుగ్మములను కవి అభేదదృష్టితో స్తుతించాడు. కవి ప్రతిభావంతుడు. మహాయోగి – సాధకుడు కనుక చమత్కృతితో పీఠికను సృష్టించాడు. ఈ దేవతాస్తుతి సాధకులకు శ్రవణీయం – మననీయం కూడ. ఈ కవికి మార్గదర్శకుడు షణ్మతస్థాపనాచార్యుడైన ఆద్యశంకరాచర్య గురువర్యుడే. ఈ దేవతలను ఉపాసించినవారు ధన్యులు. ముక్తులు అవుతారు.

"ఓం తత్సత్".



**శ్రీః**

# అనుబంధం - 2

## మున్నుడి

**ఓం। సహ నావవతు। ఓం। సహ నౌ భునక్తు। సహ వీర్యం కరవావహై। తేజస్వినావధీతమస్తు మా విద్విషావహై।**

**ఓం శాంతిః శాంతిః శాంతిః ॥**

**శ్లో॥ విఘ్నధ్వాంతనివారణైకతరణిః విఘ్నాటవీహవ్యవాట్**
**విఘ్నవ్యాళకులస్య మత్తగరుడో విఘ్నేభపంచాననః।**
**విఘ్నోత్తుంగగిరిప్రభేదనపవిః విఘ్నాబ్ధికుంభోద్భవో**
**విఘ్నాఘౌఘఘనప్రచండపవనో విఘ్నేశ్వరః పాతు మామ్ ॥**

పరశురామపంతుల రామమూర్తి పంతులుగారు క్రీ.శ. 1750-1800 ప్రాంతములో వరంగల్లులో నివసించి, శుకచరిత్ర, వివేకసారము ప్రబంధములను రచించిరి. వీరి శుకచరిత్ర సవిమర్శక సమీక్ష అని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో పిహెచ్.డి. పట్టము కొరకు 1987 నుండి పరిశోధన చేసితిని. 1999లో పిహెచ్.డి. పట్టము పొందటం జరిగింది. ఈ పరిశోధనా క్రమంలో వాల్మీకి రామాయణం, మహాభారతం - విష్ణుపురాణం, శ్రీమద్భాగవతం, దేవీభాగవతం, స్కంధపురాణం, బ్రహ్మాండపురాణం, పద్మపురాణం, మత్స్యపురాణం, వామనపురాణం మున్నగు సంస్కృత, ఆంధ్ర గ్రంథములను పరిశీలించి, శుకుని వృత్తాంతము సేకరించడం జరిగింది. శ్రీ కృష్ణద్వైపాయనుని పుత్రుడు, శిష్యుడునైన శుకుని జీవితంలో ఎన్నో సమస్యలు చిక్కుముడులు తోచినవి. వానికి సమాధానములు ఆలోచించడం జరిగింది. ఉదాహరణమునకు శుకుని తల్లి ఎవరు? శుకుడు గృహస్థుడు? సంతతికలదా? శుకుడు ఒక్కడా? లేక ఎంతమంది? ఇంద్రుడు ఎవరు? బృహస్పతి ఎవ్వడు? ఈ విధమైన ప్రశ్నలకు సమాధానము కొరకు దాదాపు ఎన్నో రోజులు వివిధ గ్రంథములు పరిశీలించి విషయ సంగ్రహణము చేయుట జరిగింది. వానిని సమన్వయపరచి ఒక క్రమంలో 1993-94లో వ్రాయటం జరిగింది. తరువాత ఎంతో శ్రమకోర్చి 1999 మే లో పిహెచ్.డి పట్టమునకు - పరిశోధక వ్యాసము సమర్పించడం జరిగింది. కాని ఆ వ్యాసములో ఈ శుకచరిత్ర సమస్యలు - సమాధానాలు చేర్చుటకు అవకాశము లేకపోయినది. ఒకటి, రెండు విషయములు అందులో పొందుపరచడం జరిగింది. కాని ఆ విషయముపై పాఠకులకు సమగ్రమైన అవగాహన

కల్గించుట కర్తవ్యముగా భావించితిని. ఆద్యగురువులైన, కృష్ణద్వైపాయన వ్యాస, శుకదేవుల జీవితములోని అనేక భ్రమలను తొలగించుటకు ఈ సమస్యలు – సమాధానములు ద్వారా ప్రయత్నించితిని. ఈ గ్రంథము సమగ్రమని భావించుట లేదు. ఇంకను చర్చనీయాంశములెన్నో కలవు.

పండితులు పరిశోధకులు నూతన దృక్పథంతో మహాభారతం, పురాణములను పరిశీలించ వలెనని నా విన్నపము. ఈ గ్రంథమును సమగ్రంగా పరిశీలించి, అధ్యయనం చేసిన పిమ్మట నా ప్రయత్నమును హర్షింతురు గాక! **విద్వానేవ విజానాతి విద్వజ్జనపరిశ్రమమ్** అని ఆర్యోక్తి. విద్వాంసుని యొక్క పరిశ్రమను విద్వాంసులే గుర్తించగలరు. గుర్తించి, సజ్జనులనెడి హంసలు, క్షీరము, నీరము వేరు చేసెడి హంసలను బోలి, ఈ గ్రంథము నందు గుణ దోషములు గుర్తించి, గుణములను గ్రహింతురుగాక! దోషములను తెల్పిన మరు ముద్రణలో తొలగించుటకు ప్రయత్నింతును. ఈ గ్రంథము ఒక చర్చావేదిక అవుతుందని భావిస్తూ పాఠకులకు ప్రత్యేకముగా అధ్యయనం చేయాలని విన్నపం చేస్తున్నాను.

ఇట్లు
విద్వజ్జనవిధేయుడు
**డా॥ నడిపినేని సూర్యనారాయణ**
తెలుగు లెక్చరరు.



## - కథా పరిచయము -

సాత్యవతేయుడైన కృష్ణుడు మహాభారతం రచన చేసి, వేదములను వింగడించి వ్యాసుడను బిరుదు పొందెను. ఈయన 28వ ద్వాపరంలో ఉన్న 28వ వ్యాసుడు. ఈయన అష్టాదశ పురాణములను రచించెనని ప్రసిద్ధి. స్వల్పముగా ఈయన జీవితవృత్తాంతము మహాభారతములో కలదు. ఇతనికి శుకుడు, ధృతరాష్ట్రుడు, పాండురాజు, విదురుడు అను కుమారులు గలరు. మహాభారత యుద్ధకాలము నాటికే క్రీ.పూ. 3138, పాండురాజు, శుకుడు నిర్యాణము చెందారు. శుకుడు మహాయోగి. కృష్ణవ్యాసుడు తన ప్రముఖశిష్యులతో (జైమిని, వైశంపాయనుడు, పైలుడు, సుమంతుడు) బాటుగా శుకునకు కూడ వేదములు బోధించెను. వారి జీవితమునకు సంబంధించిన కొన్ని అంశములు పురాణములలో కలవు. మహాభారతం శాంతిపర్వంలోని మోక్షధర్మఖండంలో శుకుడు జనకుని ఆస్థానం సందర్శించినట్లు, జనకుని వలన సంశయములు తొలగి, నారదుని బోధతో ముక్తుడగుట కలవు. నారదీయపురాణం, దేవీభాగవతం, పద్మ-పురాణం, హరివంశం, బ్రహ్మాండపురాణం, స్కంధపురాణంలో కూడా శుకుని వృత్తాంతం కొలది మార్పులతో కలదు.

కృష్ణద్వైపాయనుడు సంతతికొరకు మేరుపర్వతం మీద శివుని గూర్చి నూరేండ్లు తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమై పంచభూతములతో సమానమైన పుత్రుడు జన్మిస్తాడని వర మొసంగాడు. అప్పటికి కృష్ణవ్యాసుడు గృహస్థుడయ్యెనని కథలో ఎక్కడ చెప్పలేదు. అగ్నికార్యార్థము అరణులను గ్రహించి మథిస్తున్నాడట. అగ్నికార్యము గృహస్థులకే విహితమైనది. అప్పుడు ఆకాశమున ఘృతాచి అను అప్సరస కనబడినది. ఆమెను చూచి వ్యాసుడు మోహితుడయ్యెను. ఘృతాచిని తలుస్తున్న వ్యాసుని వీర్యము అరణిలో పడింది. వ్యాసుడా అరణిని మథించుచుండగా అరణి నుండి అగ్నితుల్యుడైన పుత్రుడు జన్మించాడు. ఆకాశగంగ వచ్చి స్నానము చేయించింది. అప్సరసలు నాట్యము చేశారు. గంధర్వులు గానము చేసిరి. సిద్ధులు కూడా వచ్చారు. ఇంద్రుడు వచ్చాడు. అరణి నుండి జన్మించుటచే అరణేయుడని పేరు. శుకరూపమున నున్న అప్సరస ఘృతాచి దర్శనము వలన కల్గిన ఆనందపారవశ్యమున పతనమైన భూసుర వ్యాస వీర్యమునుండి పుట్టుట చేత శుకుడని పేరు కలిగింది. కృష్ణాజినము, కనకపు దండము, గగనమునుండి వచ్చి శుకుని చెందెను. బ్రహ్మ కనకపు కమండలువు నిచ్చెను. ఈశ్వరుడు వచ్చి శుకునిని వేదరీతిగా ఉపనీతుని గావించెను. శుకునికి దేవగురువైన బృహస్పతి గురువయ్యెను. శుకుడు ఆటపాటలతో కాలము గడుపుచుండెను. వ్యాసుడు ధర్మములు బోధించి, జనకుని దగ్గరకు మిథిలకు పొమ్మని తెలిపెను. శుకుడు మిథిలకు

పోయి, జనకునితో సంభాషించి, తిరిగి జ్ఞానియై ఆశ్రమమునకు వచ్చెను. ఆశ్రమములో ఘోరమైన సాధనలు చేసెను. చివరకు నారదుని ఉపదేశము పొంది శుకుడు ముక్తుడయ్యెను.

ఈ శుకవృత్తాంతము పఠించిన వారికి అనేకమైన సంశయములు కలుగుచున్నవి.

శుకుడు ఒక్కడేనా? లేక ఎక్కువమందా? అరణి కాష్ఠమా? లేక అరణి అను పేరుగల స్త్రీయా? వ్యాసుడు ధరించిన ఘృతాచి ఎవరు? శుకజనన కాలమునాటి ఇంద్రుడు ఎవరు? ఇంద్ర నిర్వచనము ఏమిటి? గంధర్వులు ఎవరు? అప్సరసలు ఎవరు? పితరులు ఎవ్వరు? శుకుని జీవిత వృత్తాంతమునకు సంబంధించిన ఎన్నో సమస్యలు కలవు. వాటిని పరిశోధించి మన ప్రాచీన గ్రంథములు ఆధారంగా సమాధానాలు సాధించడం జరిగింది. గత ఇరువది సంవత్సరాలుగా ఎన్నో గ్రంథములు పఠించి "తేనెటీగలు తేనెను సంగ్రహించి, ఉపభోగ్య మొనర్చినట్లు విషయసేకరణచేసి, బుద్ధిబలంతో వింగడించి సమగ్రంగా పాఠకులకు సమర్పించడమైనది". శుకుని జీవితం సమస్యలు, సమాధానాలు పాఠకులు శ్రద్ధతో చదివి రచయిత కృషిని అభినందింతురుగాక; విషయవిశ్లేషణ చేసిన పాఠకులకు పురాణవిషయాలకు సంబంధించి ఎన్నో భ్రాంతులు తొలగిపోగలవని ఆశ. ఆకాంక్ష.



**శుకులు ఎందరు?**

**రామాయణ కాలమున ముగ్గురు శుకులున్నారు.**

1. రావణుని మంత్రి : శుక సారణులు ఇరువురు రావణుని మంత్రులు. ఈ శుకుని రావణుడు రాముని దగ్గరకు రాయబారము పంపెను. (వాల్మీకి రామాయణము యుద్ధకాండము 25,28,29 అధ్యాయాలు).

2. పంచగంధర్వపతులలో శుకుడొకడు. దక్షిణదిశలోనున్న ఋషభపర్వతప్రాంత రాజ్యము నేలువాడు రోహితుడను గంధర్వుడు. అక్కడ వనముల కధిపతులైన వారిలో శుకుడొకడు శైలూషుడు - గ్రామణి, ఋక్షుడు - శుకుడు - బభ్రుడు. శైలూషో గ్రామణీః శుకో బభ్రూస్తథైవ చ - 1.

3. శరభవానరుని కుమారుడు శుకుడు. ఈ శుకుని భార్య వ్యాఘ్రి. వారి కుమారుడు ఋక్షుడు (బ్రహ్మాండపురాణ - 3/8-208)

4. శుకుడు - ఒక చంద్రవంశపురాజు (భాగవతం - 9వ స్కంధ)

5. పాండవులకు బాల్యమున విలువిద్య నేర్పిన యాదవవీరుడు. శర్యాతి పుత్రుడు పృషతుడు.

ఆ పృషతుని పుత్రుడు శుకుడు. ఇతడు దాతలయందు శ్రేష్ఠుడు. శతశృంగ పర్వతమున పాండవులు నివసించుచున్నపుడు వారి బాల్యమున ఈ శుకుడు వారికి గురువయ్యెను. (మహాభారతం - ఆదిపర్వం - 123వ అధ్యాయం)

6. గాంధారరాజు సుబలుని పుత్రుడు శుకుడు. శకుని సహోదరుడు. భారత యుద్ధమున ఇరావంతుని చేతిలో మరణించెను. (ఆంధ్రమహాభారతము - భీష్మపర్వము, 3వ ఆశ్వాసం - 91వ వచనము)

7. శుకమహర్షి : యోగాచార్యుడు : దక్షిణపాంచాల దేశమునకు రాజులైన, విభ్రాజునకు, అతని పుత్రుడైన అణుహునకు సమకాలికుడు. ఈ శుకుడు - తన కుమార్తె కృత్విని అణుహునకు నిచ్చెను. కృత్వి అణుహుల పుత్రుడే యోగాచార్యుడైన బ్రహ్మదత్తుడు. ఈ బ్రహ్మదత్తుడు హస్తినాపురప్రభువైన ప్రతీపునకు సమకాలికుడు. ఈ శుకుడు పరాశర కులోత్పన్నుడు అని హరివంశమున భ్రాంతితో చెప్పబడినది. ఇతనిని శుక్రుడని కూడా చెప్పారు. ఈ శుకుని భార్య పీవరి. రెండవ శుకుని భార్య ఏకశృంగ (గో) వీరికి ఆరుమంది కుమారులని వేట్టంమణి తన పౌరాణికకోశమున వ్రాసిరి - భూరిశ్రవన్- శంభు - ప్రభు - కృష్ణ - గౌర - (సౌర - సౌర ప్రభ) దేవశ్రుత. వేట్టంమణిగారు ఇరువురు శుకులను ఒక్కటిగా భ్రమించి వ్రాసిరి.

8. కృష్ణద్వైపాయన వ్యాసుని పుత్రుడు. శిష్యుడు కూడ. ఇతడు బ్రహ్మవేత్త. బృహస్పతి యయిన దేవాపి శిష్యుడు కూడ. జనకునితో సంభాషించి వచ్చి గృహస్థుడయ్యెను. ఈయన భార్య ఏకశృంగ(గో) అని భూలోకమున పిలుతురు. 'యోగోత్పత్తి' అని కూడా పేరు. కావ్యలను పితరుల మానసకన్య వీరికి సంతతి కలదు.

బ్రహ్మదత్తుని మాతామహుడును, కృష్ణద్వైపాయన వ్యాసుని పుత్రుడగు శుకుడును ఒక్కరే అని భ్రమపడినందున పురాణములలో వీరి సంతతి విషయమున భిన్నత్వము గోచరించుచున్నది. ఇది ప్రత్యేకముగా పరిశీలింపదగిన అంశము. 7,8 సంఖ్యగల శుకుల విషయమున భ్రాంతితో ఒకరి విషయములు వేరొకరికి చెప్పబడినవి. 7వ సంఖ్య గల శుకుడు 27వ పరివర్త యుగమున వ్యాసుని పుత్రుడు. 8వ సంఖ్యగల శుకుడు 28వ పరివర్త యుగమున వ్యాసుని పుత్రుడు. 360 సంవత్సరములు ఒక పరివర్త యుగము.

9. బాదరి యను పరాశరుని పుత్రుడు : బదర అను ఋషి పుత్రుడు బాదరి. ఇతడు శ్యామపరాశరులలో నొకడు. ఈ బాదరి పుత్రుడు బాదరాయణుడు. పౌత్రుడు

బాదరాయణి శుకుడు. ఈ బాదరాయణి శుకునకు బ్రహ్మరాతుడు, ఉపేంద్ర దత్తుడని విష్ణుభాగవతమున పేరులు కలవు.

10. వ్యాసపత్ని వటిక : వారి కుమారుడు శుకుడు, పుట్టినంతనే ఇతడు తపస్సు చేయుటకు పోయెను. పిమ్మట పింగళా లేక పింజలా అను భార్యవలన వ్యాసుడు కపింజలుడు అని పేరుగల శుకుని పొందెను. (స్కంధపురాణము నాగరఖండము 147,148 అధ్యాయములు)

11. పద్మావతి శ్రీనివాసుల వివాహము జరుగును. అపుడు వారి దగ్గర నుండి వివాహము జరిపించిన బ్రాహ్మణుడు (స్కంధ పురాణ) ఈ పది, పదునొక సంఖ్యగల శుకులు. పౌరాణిక, కల్పిత పాత్రలని తోచును. (వైష్ణవ ఖండము – 7వ అధ్యాయము)

12. పద్మపాదాచార్యుని తండ్రి "కీరశర్మణః", అని పద్మపాదాచార్యుడు గార్గ్యః కీరశర్మణః అని తన నిరుక్తశ్లోక వార్తికంలో చెప్పెను. కేరళదేశస్థుడు. శుకశబ్దమునకు బదులే కీర శబ్దము వాడబడినది. (భాగవతమాహాత్మ్యము పద్మపురాణాంతర్గతము).

13. లీలాశుకుడు అను పేరుగల బిల్వమంగళుడు. ఇతడు కృష్ణభక్తుడు. కృష్ణకర్ణామృత కర్త. కేరళ దేశస్థుడు. తల్లిపేరు నీలి. తండ్రి పేరు దామోదరుడు. ఈతని గురువు ఈశనదేవుడు. పరమహంస పరివ్రాజకుడు బిల్వమంగళస్తోత్రమును రచించెను. కృష్ణ కర్ణామృత ప్రథమసర్గాన్తశ్లోకమున ఈ విషయములు కలవు.

14. శుకుడు శుకనాడి అను తమిళజ్యోతిషగ్రంథకర్త. కాలము తెలియదు.

15. శుకుడు 16వ శతాబ్దిలోని కాశ్మీరదేశపు చరిత్రకారుడు "ప్రాజ్యభట్టు" అను వాని శిష్యుడు. ఈతడు అక్బరు సమకాలికుడు. రాజతరంగణీసారః అను గ్రంథమును రచించెను. ఈ గ్రంథము ముద్రితము.

16. శుకదేవాచార్య సిద్ధాంత ప్రదీప అను నింబార్కమత గ్రంథమును రచించిన వేదాన్తి. భాగవతమునకు నూతనమైన టీక వ్రాసెను. పురాణవిమర్శ 574 పుట.

17. శుకుడు, శుకాచార్య, 16వ శతాబ్ది భేదవాదసమర్థకుడు మధ్వాచార్యుని అనుసరించును. ఈశ్వరునికి ప్రకృతికి భేదము సత్యమని చెప్పెను. అవతారపూజ చేయుట చెప్పెను. భాగవత పురాణమును తన వాదమునకు ఆధారముగ గ్రహించెను. బ్రహ్మసూత్ర ఆంధ్రీకరణము రత్నాకర బాలరాజు పుట 106.

18. హరశుకదేవ జ్యోతిష శాస్త్రవేత్త. జ్యోతిషసారః అను సంస్కృత గ్రంథమును రచించెను.

కేశవ ప్రసాద శర్మ ద్వివేదకృత హిందీ టీకతో ఈ జ్యోతిషసార గ్రంథము అచ్చు అయినది.

19. పురాణ సమూహమును ప్రవచించు వ్యక్తికి శుకుడు అని పేరు. పురాణములకు సామూహికముగా శుకము అనిపేరు.

**శ్లో॥ పురాణం చంపకాభాసం శుకవక్త్రం చ తుందిలమ్ ।**
**అక్షసూత్రాభయం జ్ఞేయం నానాభరణభూషితమ్ ॥**

20. శుకుడను పేరుగల రాక్షసుడు ఆషాఢమాసంలో సూర్యరథము నందుండును. శుకుడను సూర్యకిరణము. భగవాన్ సూర్య అను గ్రంథము గీతాప్రెస్ 1998 ఎడిషన్.

**శ్లో॥ వసిష్ఠో హ్యరుణో రంభాసహజన్యస్తథా హూహూ ।**
**శుకః చిత్రస్వనశ్చైవ శుచిమాసం నయన్త్యమీ ॥**

ఆషాఢమాసంలో వసిష్ఠుడు ఋషి, సహజన్యుడు నాగుడు, రంభ అప్సరస, హూహూ గంధర్వుడు, శుకుడను రాక్షసుడు, చిత్రస్వనుడు సూర్యరథము ననుందురు.

21. శుకుడు అస్త్రము పేరు.

22. శుకుడు పక్షికి పేరు.

23. శుకుడు అగ్నికి పేరు.

**శ్లో॥ ఆథర్వః పవమానస్తు నిర్మథ్యకవిభిః స్మృతః**
**స జ్ఞేయో గార్హపత్యోఽగ్నిః తస్య పుత్రద్వయం స్మృతః ।**
**శంసస్త్వాహవనీయోఽగ్నిః స్మృతో యో హవ్యవాహనః**
**ద్వితీయస్తు సుతః ప్రోక్త శుకోగ్నిః యః ప్రణీయతే ॥**

అథర్వఋషి పవమానుడు, గార్హపత్యాగ్నిని సృజించెను. దానికి పుత్రద్వయము అనగా రెండు అగ్నులు ఆహవనీయము, దక్షిణాగ్ని జనించినవి. ఈ దక్షిణాగ్నికే శుకుడు అని పేరు. ఈ శుకాగ్ని అన్వాహార్యపచనమున కుపయోగింతురు. ఇవి మూడును త్రేతాగ్నులు. శుక శబ్దముపై ప్రాచీనులకపారమైన ప్రీతి కనుక పుత్త్రులకు, ఇతర అమహత్తులకు పశుపక్ష్యాదులకు పెట్టి ఆనందించిరి.

**7,8 సంఖ్యగల శుకుల విషయము సిద్ధాంతము :**

7వ శుకుడు శుకనామధేయుడు కాక శుక్రుడు. ఈతని భార్య గో, ఈతడు భార్గవుడు.

విశ్వేశ్వరుని శిష్యుడు. అపర్ణాదేవికి ప్రీతిపాత్రుడైన పుత్రుడు. ఈ విశ్వేశ్వరునకు రుద్రుడు మహాదేవుడు, విశ్వరూపుడని పేర్లు. ఈయన సాంఖ్య యోగాచార్యుడు. వాయుపురాణం – 72వ అధ్యాయంలో వీరిని గూర్చి గలదు.

**శ్లో॥ మహాయోగబలోపేతా మహదేవముపస్థితా ।**
**దన్తకాణ్వో శనాతస్య పుత్రో వై భృగునందన ॥** (వాయు 16/73)

ఈతని పుత్రి కృత్వి. బ్రహ్మదత్తుని మాత. అణుహునిభార్య. ఈతడు పాంచాల రాజు విభ్రాజుని సమకాలికుడు, యోగాచార్యుడు. 8వ సంఖ్యగల శుకుడు పరాశర గోత్రము వాడు. కృష్ణవ్యాసపుత్రుడు. సత్యవతీ పౌత్రుడు. ఈతని పుత్రులు 3,4 అని భిన్నముగా నున్నది. మహాభారతము హరివంశము అంతిమరూపము దాల్చిన నాటికే ఈ శుకుల విషయమున భ్రాంతి ఏర్పడినది. శుక్ర పదమున్నచోట శుక అని మార్చిరి. కాలక్రమమునుబట్టి ఇరువురు భిన్నులని తెలియును. పీవరి ఈతని భార్య. కృష్ణగౌరశంభు ముగ్గురు పుత్రులు. పురాణానుసారముగ వీరి సంతతి విషయమును గూర్చి ప్రత్యేకముగా చర్చ చేయబడును.

ఎవ్వరి భార్య ఎవరు? ఎవరి సంతతి ఎవ్వరు? అని పురాణములలో సంశయము కలుగు అంశములున్నవి. వానిని ప్రత్యేకముగా చర్చించుట అవశ్యకము. మహాభారతయుద్ధమునకు పూర్వము క్రీ.పూ. 3500 నుండి 3200 వరకు ఈ మధ్యకాలమున ఇరువురు ప్రసిద్ధులైన సాంఖ్యయోగాచార్యులు కలరు. వారిలో ఒకరు శుక్రుడు. వేరొకడు శుకుడు. పైన 7,8 సంఖ్యలలో పేర్కొన్న శుక్ర శుక ఆచార్యులు వీరే. విశ్వావసువు యాజ్ఞవల్క్యునితో సాంఖ్యయోగాచార్యులను గూర్చి చెప్పెను. **మహాభారతము** శాంతిపర్వమున 319 అధ్యాయములో 60,61 శ్లోకాలలో వీరి ప్రశంస గలదు.

**శ్లో॥ భృగోః పంచశిఖస్యాస్య కపిలస్య శుకస్య చ ।**
**గౌతమస్యార్ష్టిషేణస్య గర్గస్య చ మహాత్మనః ॥** – 319/60

**శ్లో॥ నారదస్యాసురేశ్చైవ పులస్త్యస్య చ ధీమతః ।**
**సనత్కుమారస్య తతః శుక్రస్య చ మహాత్మనః ॥** – 319/61

హరివంశములో 18వ అధ్యాయం శ్రాద్ధకల్పములో ఇరువురను భిన్నులుగా చెప్పిరి. వైభ్రాజలోకములో బర్హిషదులను పితరులు కలరు. వారు యక్షగంధర్వరాక్షసులచే పూజింపబడుచున్నారు. వారు పులస్త్యసంతతి వారి మానసకన్య (పెంపుడు కూతురు) పీవరి. శుకుని భార్య పరాశరకులమున పుట్టిన వాడు ఈ శుకుడు. వ్యాసునకు అరణికి పుట్టెను. ఈ శుకుడు పీవరి అనువారికి నల్గురు పుత్రులు కల్గిరి.

1. కృష్ణుడు, 2. గౌరుడు, 3. ప్రభుడు, 4. శంభుడు.

కృత్వి అను కుమార్తె కలిగినది. ఈ కృత్వి అణుహుని భార్య. ఈమె పుత్రుడు బ్రహ్మదత్తుడు. యోగాచార్యుడు పాంచాల రాజు ఈ శుకుడు సత్యవతీ పౌత్రుడైనచో బ్రహ్మదత్తునకు మాతా మహుడగుటకు వీలులేదు. బ్రహ్మదత్తునికి పిమ్మట చాలాకాలమునకు సత్యవతి కృష్ణవ్యాసుడు కార్ష్ణి శుకుడు ఉన్నారు. కనుక బ్రహ్మదత్తుని మాతామహుడు సత్యవతి పౌత్రుడు కాడనుట సిద్ధాంతము. హరివంశమున వేరొక శుకుని గూర్చి చెప్పబడినది. వసిష్ఠుని సంతతివారు సుకాలులు అను పితరులు కలరు. ఈ సుకాలుల మానసకన్య గో. ఈమెకే ఏకశృంగా అనిపేరు. వసిష్ఠుని గోత్రము గల కన్యను వివాహమాడిన ఈతడు భిన్నుడు. శుక్రుడు భృగుమహర్షి గోత్రము వాడు శుక్రుడు ఈతని పేరు.

1. శుక్రుడు, 2. శుకుడు, 3. రుద్రవిశ్వరూపుడు. ఈ ముగ్గురు సాంఖ్యయోగాచార్యులు. విశ్వావసువు సాంఖ్యయోగాచార్యులను గూర్చి యాజ్ఞవల్క్యునితో చెప్పెను. మహాభారతము శాంతిపర్వము 319 అధ్యాయము 60,61,62,63 శ్లోకములు.

**శ్లో॥ కశ్యపస్య పితుశ్చైవ పూర్వమేవ మయా శ్రుతమ్ ।**
**తదనంతరం చ రుద్రస్య విశ్వరూపస్య ధీమతః ॥**

శుక్రుడు – శుకుడు వీరిద్దరిని ఒక్కరుగా భ్రాంతిచే భావించి శుకచరిత్ర కథ చెప్పిరి. హరివంశములో శ్రాద్ధకల్పమున ఇరువురను భిన్నులుగా చెప్పిరి. 18వ అధ్యాయం. శుకచరిత్ర కథలోని కథానాయకుడు శుకుడు ఎప్పుడో ముక్తుడయ్యెనని తాను అతనిని చూడలేదని నారదుడు పదేపదే చెప్పగా వింటినని భీష్ముడు ధర్మరాజుతో పల్కెను. శాంతిపర్వం 323 అధ్యాయంలో శుకుని ధర్మరాజు భీష్ముడు ఎరుంగనట్లు, శుకుడంతకుముందే ముక్తుడైనట్లు కలదు.

**శ్లో॥ కస్యాంచోత్పాదయామాస శుకం వ్యాసస్తపోధనః ।**
**నహ్యస్యజననీం విద్మ జన్మ చాగ్ర్యం మహాత్మనః ॥** – శాంతిపర్వం – 323–2

నారదుడు, వ్యాసుడు, శుకుని గూర్చి భీష్మునికి చెప్పిరి. భీష్ముని మాటలు.

**శ్లో॥ ఏతదాచష్ట మే రాజన్ దేవర్షిర్నారదః పురా ।**
**వ్యాసశ్చైవ మహాయోగీ సంజల్పేషు పదే పదే ॥** – శాంతిపర్వం – 333–41

భీష్ముడు శుకుని ఎరుంగనట్లు చేసిన ప్రసంగము అసంగతము. కృష్ణవ్యాసపుత్రుడు శుకుడు ధర్మరాజునకు పితృసమానుడు. భీష్మునకు పుత్రతుల్యుడు. ధర్మరాజు భీష్ముడు శుకుని బాగా ఎరుగుదురు. వ్యాసశుకులు ధర్మజుని రాజసూయయజ్ఞమున పాల్గొనిరి. సభాపర్వము 33 అధ్యాయము 33,34 శ్లోకములు శుకునకు వైయాసకి అరణేయుడు కార్ష్ణి అని పేర్లు గలవు.

**మహాభారతయుగమున గల వ్యాసశుకులు :**

ఎందరో వ్యాసులు, ఎందరోశుకులు మహాభారతయుగమున ప్రసిద్ధులైన వ్యాసులు ముగ్గురు కలరు. భారతయుద్ధమునకు పూర్వము ఇద్దరు శుకులు. తరువాత ఒకరు మొత్తము ముగ్గురు కలరు. మహాభారతము హరివంశము సామవిధాన బ్రాహ్మణము విష్ణుపురాణము వీని ఆధారముగా వంశవృక్షమును తెలుపవచ్చును.

1. బ్రహ్మదత్తుని మాతామహుడైన శుకుడు (ఇతడు వాస్తవమునకు శుక్రుడు)
2. కృష్ణవ్యాసుని పుత్త్రుడు 'కార్ష్ణి' శుకుడు
3. బాదరాయణ వ్యాసుని పుత్రుడు బాదరాయణి శుకుడు

ఈ క్రింద కనబరచిన వంశవృక్షమును పరిశీలించినచో ముగ్గురు వ్యాసులు. ముగ్గురు శుకులున్నట్లు స్పష్టమగును.

పాంచాలరాజులు వారి బంధువులు వ్యాసుడు – 1, హస్తినాపుర రాజులు వారి బంధువులు హరివంశం 32 అధ్యాయం

| | |
|---|---|
| విభ్రాజుడు శుకుడు–1 | ఋక్షుడు |
| అణుహుడు కృత్వి (శుకుని పుత్రి) | భీమసేనుడు, ప్రతీపుడు |
| బ్రహ్మదత్తుడు జైగషవ్యుని శిష్యుడు | శంతనుడు, గంగ సత్యవతి |
| విష్వక్సేన శిష్యుడు వ్యాసుడు–2 | భీష్ముడు విచిత్రవీర్యుడు |
| జైమిని శుకుడు–2 | ధృతరాష్ట్ర పాండు |
| పౌష్పాంజి శుకపుత్రజయాదులు | దుర్యోధన ధర్మరాజు |
| పారాశర్యాయణ | పరీక్షిత్తు |
| బాదరాయణ – 3వ వ్యాస | జనమేజయ |
| బాదరాయణి – 3/తాండి శాట్యయన | భీమసేన |

సామవిధాన బ్రాహ్మణమున (3–9–81) గురుపరంపర ఇట్లున్నది :– "సోయం ప్రాజాపత్యో విధిః తమిమం ప్రజాపతిః బృహస్పతయే ప్రోవాచ బృహస్పతిర్నారదాయ నారదో విష్వక్సేనాయ విష్వక్సేనో వ్యాసాయ పారాశర్యాయ, వ్యాసః పారాశర్యో జైమినయే, జైమినిః పౌష్పింజాయ పౌష్పింజ్యః పారాశర్యాయణాయ, పారాశర్యాయణో బాదరాయణాయ, బాదరాయణః తాండి శాట్యయనిభ్యాం, తాండి శాట్యయనినే బహవః" బదర – బాదరి – బాదరాయణ– బాదరాయణి (3వ శుకుడు) బాదరి పౌత్రుడు బాదరాయణి – ఈ బాదరి శ్యామపరాశరులనొకడు హరివంశము – 32 అధ్యాయము, 67,68 శ్లోకములు.

ఋక్షస్య తు ద్వితీయస్య తు భీమసేనో భవత్సుతః – 32/67
ప్రతీపో భీమసేనస్య ప్రతీపస్య తు శంతనుః – 32/68
దేవాపిః బాహ్లీకశ్చైవ త్రయ ఏవ మహారాథాః –

కృత్వి తండ్రియైన శుకుడు తండ్రి వ్యాసుని వలన ధర్మములను విని ముక్తుడయ్యె నని తెలియును. ఈ శుకుడు పాంచాల రాజు విభ్రాజుని సమకాలికుడు. అణుహుని మామ, బ్రహ్మదత్తుని మాతామహుడు. ఈతనికి నలుగురు పుత్రులు కృష్ణుడు, గౌరుడు, ప్రభుడు, శంభుడు కలరు. ఈ ఒకటవ శుకుని (శుక్రునికి) పిమ్మట ఎంతో కాలమునకు దాదాపు 200 ఏండ్ల తరువాత రెండవ శుకుడు కలడు. హరివంశములో ముక్తుడైన వాడు కృత్వి తండ్రి యని స్పష్టముగా గలదు. ఈ ఇరువురును ముక్తులే. వీరు సాంఖ్యయోగాచార్యులు. కాని జరిగిన ఘటనలు ఎవ్వరికి అన్వయించునో సమాధానము మృగ్యము.




సోదరుడు శుకుడు

పాండవుల బాల్యగురువు, శుకుడు

1. కృష్ణవ్యాసుని పుత్రుడు శుకుడు

2. గాంధారి సోదరుడు శుకుడు

3. పాండవులకు బాల్యమున విలువిద్య నేర్పిన శుకుడు – ఈ ముగ్గురు కూడ సమకాలికులే.

దేవాపికి శుకుడు పౌత్రునితో తుల్యుడు. ధృతరాష్ట్రునకు, పాండురాజునకు సోదరుడు. భీష్మునకు పుత్రసముడు. సత్యవతి వ్యాసుని తల్లి. శంతనుని భార్యయగుటచే భీష్మునకు కూడ మాత యగును. శుకునకు పరీక్షిత్తు 3వ తరము వాడు, జనమేజయుడు నాల్గవ తరము వాడు. తరమునకు 30 ఏండ్లు లెక్కించిన జనమేజయునకు శుకునకు 120 ఏండ్లు ఎడము ఉండును. శుకుడు పరీక్షిత్తు అంతిమకాలమున, (పరీక్షిత్తు జీవిత కాలము 96 ఏండ్లు)




జనమేజయుని యౌవన కాలమున ఉండుటకు అవకాశమే లేదు. పరీక్షిత్తు జనమేజయుల కాలమున బాదరాయణ వ్యాసుడు బాదరాయణి శుకులు ఉండిన ఉండవచ్చును. వీరికి, వారికి గల సంబంధము మృగ్యము.

శుకుడు (శుక్రుడు) అపర్ణాదేవికి ప్రీతిపాత్రుడు. శిష్యుడు. పుత్రుడు. గురుపత్ని అపర్ణ హరివంశము స్పష్టము చేస్తుంది. ఇతడు యోగాచార్యుడు. క్రీ.పూ. 3500 ప్రాంతము అరణి తల్లి వ్యాసుడు తండ్రి పరాశరగోత్రము వాడు పాంచలరాజు విభ్రాజుని కాలమువాడు. ఈ విభ్రాజుడే సమ్రాట్టు ఇంద్రుడు. ఇక బ్రహ్మదత్తుని కుమారుదు విష్వక్సేనుడు. ఈతని శిష్యుడు వ్యాసుడు. ఇంకొకడు ఈతడే కృష్ణవ్యాసుడు. ఈ కృష్ణవ్యాసుని పుత్రుడు శుకుడు. ఇంకొకడు వ్యాసభీష్ములు సోదరులు. సమకాలికులు. వ్యాసునకు సాత్యవతేయుడు భీష్మునకు గాంగేయుడు

అని పేర్లు శంతనునితో వీరికి గల బంధుత్వము స్పష్టము. సత్యవతి పౌత్రుడే శుకుడు. ఈ 2వ శుకుని గురువు దేవాపి. బృహస్పతి యోగాచార్యుడు. మహాభారతయుద్ధము క్రీ.పూ. 3138 కాగా అంతకు పూర్వమే ఈ శుకుడు కలడు. ఇతని తల్లి పేరు స్కందపురాణము ననుసరించి వటికయని చెప్పవచ్చును. పింజలా కపింజలా అని చెప్పవచ్చునా సమాధానము మృగ్యము.

1. జనకుని సభకు పోయిన శుకుడు ఎవరు? కార్ష్ణి వైయాసకి పోయెనని శాంతిపర్వములో కలదు. కనుక జనకుని సభకు పోయినది ఈ 2వ శుకుడు కావచ్చు లేక ఇరువురును పోయి వుండవచ్చును. కృష్ణవ్యాస పుత్రుడు పోయి యుండవచ్చును. జనకుడను పేరుగల రాజులు ఎందరో కలరు.

2. అరణి మథనము మొదటి శుకునికి సంబంధమున్న కథయేమో ఇరువురి తల్లులు అస్పష్టముగా కలదు.

3. అప్సరసల కథ కేవలం కల్పనము. కృష్ణవ్యాసుని తక్కువ చేసి చూపును. ఈ ఇరువుని ఒక్కరిగా భావించుటయే సమస్యలకు మూలమైనది. హరివంశములోని అంశములకు, శుకచరిత్రలోని అంశములకు రచయిత ఒక్కరేనా! కృష్ణవ్యాసుడు చెప్పినచో ఈ అంశములందు భిన్నత్వమునకు తావుండదు. భిన్నత్వముండుటచేత వేర్వేరు వ్యక్తులు చాలాకాలము తరువాత ఈ అంశములను చెప్పిరని తలంపవచ్చును. శుకుల విషయమున అన్ని అంశములందు సమన్వయము సాధించుట దుర్ఘటమైన కార్యముగా దోచును. ధర్మజుని రాజసూయయాగమున వ్యాసుడు బ్రహ్మ, బృహస్పతి కాగా శుకుడు హోతయయ్యెను. బ్రహ్మవై బృహస్పతి అని పెద్దల వాక్యము. శుకుడు బాల్యము నుండియే సన్న్యాసి యనుటకు ఇది విరుద్ధముగా నున్నది. వ్యాసుడు శుకుడు జనమేజయుని సర్పయాగమునకు వచ్చినట్లు కలదు. మహాభారతం ఆదిపర్వం 53వ అధ్యాయం 7వ శ్లోకం.

అది 53/7 సదస్యశ్చాభవత్ వ్యాసః పుత్రశిష్య సహాయవాన్. అసితుడు దేవలుడు నారదుడు కూడ వచ్చిరి. బహుప్రాచీనులు కూడ వచ్చిరని ఈ సందర్భమున కలదు. ఇది భ్రామక పాఠమనియు అప్పటికి వ్యాసశుకులు జీవించియుండరని కుంపర్‌లాల్ వ్యాసశిష్య (ఢిల్లీ యూనివర్సిటీ) వారు అభిప్రాయపడిరి. కృష్ణద్వైపాయనుడు శుకుడు కూడ ధర్మరాజు రాజసూయమునకు అట్లే జనమేజయుని సర్పయాగమునకు వచ్చిరనుట అసంగతము. వీరిద్దరు బహుదీర్ఘజీవులయిననే అది సాధ్యమగును. అందుకే వ్యాసుని చిరంజీవిగాను, శుకుని స్వర్గగామిగాను చెప్పుచున్నారు.

27వ పరివర్త యుగములోని జాతూ కర్ణ్యవ్యాసుడు 28వ పరివర్తయుగములోని కృష్ణవ్యాసునకు గురువని పురాణప్రసిద్ధి. వైష్ణవ పురాణములో వేదవ్యాసులు 28 మంది అని చెప్పబడినది. శైవపురాణములో వేదవ్యాసుల స్థానములో 28 కలియుగారంభములందు (28 పరివర్తయుగములో) 28 మంది యోగాచార్యులు వారికి గల నలుగురేసి యోగాచార్యశిష్యులు చెప్పబడిరి. లింగపురాణము పూర్వభాగము 24వ అధ్యాయము 124 నుండి 131 శ్లోకములు పరిశీలింపవలెను. 28వ పరివర్తయుగమున కృష్ణద్వైపాయనుడు యోగాచార్యుడు. ఆయనకు నలుగురు యోగాచార్యశిష్యులు కలరు.

**శ్లో॥ అష్టావింశే పునఃప్రాప్తే పరివర్తే క్రమాగతే ।**
**పరాశరసుతః శ్రీమాన్ విష్ణుః లోకపితామహః ।**
**యదా భవిష్యతి వ్యాసో నామ్నా ద్వైపాయనప్రభుః ॥**

**శ్లో॥ తదా షష్ఠేన చాంశేన కృష్ణః పురుషసత్తమః ।**
**వసుదేవాద్యదుశ్రేష్ఠో వాసుదేవో భవిష్యతి ॥**

**శ్లో॥ తత్రాపి మమ తే పుత్రాః భవిష్యన్తి తపస్వినః ।**
**కుశికశ్చైవ గర్గశ్చ మిత్రః కౌరుష్య ఏవ చ ॥**

కుశికుడు – గర్గుడు – మిత్రుడు – కౌరుష్యుడు. ఈ నల్గురు కృష్ణద్వైపాయన వ్యాసుని శిష్యులు. యోగాచార్యులు. ఇది కాయావతారము. అప్పుడే లకులీ అను యోగి అవతరించెను. పురాణానుసారముగ యోగాచార్యపరంపరను గూర్చి పరిశోధించి వ్రాయవలసి వుంది.

**కృష్ణవ్యాస శుకుల కాలము :**

భారతీయ పరంపర కాలగణన ప్రకారము క్రీ.పూ. 3102 నుండి కలియుగము ప్రారంభమైనది. ఈ కలియుగము కృష్ణ నిర్యాణము నుండి ప్రారంభమైనది. అంతకు 36 సంవత్సరముల ముందు మహాభారతయుద్ధము క్రీ.పూ. 3138లో జరిగినది. క్రీ.పూ. 3138 లో నవగ్రహయోగము అను విచిత్రపరిస్థితి ఏర్పడినది. కలియుగం ఆరంభం 18–2–3102 బి.సి కు సరియైన ప్రమాది నామ సంవత్సర చైత్ర శుద్ధపాడ్యమికి సరియైన ఉగాది నాడు జరిగింది. ఆనాడే కలియుగాది అంటే కలియుగం ఆరంభించిన రోజు. మహాభారత యుద్ధము క్రీ.పూ. 3138లో జరిగినది.

మహాభారతయుద్ధము క్రీ.పూ. 3138 అని ఎక్కిరాల వేదవ్యాస్ గారు వ్రాసిరి. కలియుగారంభమునకు 125 ఏండ్లు ముందుగా శ్రీకృష్ణుని జననం. శ్రీకృష్ణుని జననము 19–7–3228 క్రీ.పూ. అని ఎక్కిరాల వేదవ్యాస్‌గారు వ్రాసిరి. శ్రావణ మాసం బహుళపక్షం

- బుధవారం అష్టమీతిథి రోహిణీనక్షత్రం అర్ధరాత్రి వృషభలగ్నం. కలియుగారంభమునకు శ్రీకృష్ణుని వయస్సు 125 సంవత్సరముల 7 మాసములు. శ్రీ టి.వి. రామన్ గారు కూడ శ్రీకృష్ణుని జనన తేదీ 19-7-3228 క్రీ.పూ. అని వ్రాసిరి. శ్రీకృష్ణుని కంటె వ్యాసుడును, శుకుడును వయస్సులో పెద్దవారు కనుక కనీసం వంద ఏండ్లు పూర్వులు కావచ్చును.

శ్రీకృష్ణునకు ధర్మజుడు - మేనత్త కుమారుడు. సమవయస్కుడు. ధర్మరాజునకు వ్యాసుడు తాత. ధర్మజుని రాజసూయమునకు వచ్చి బ్రహ్మ అయ్యెను. కృష్ణవ్యాసుడు కార్ష్ణి శుకుడు క్రీ.పూ. 3300 ప్రాంతము వారు. క్రీ.పూ. 3346లో వ్యాసుని జననము. క్రీ.పూ. 3343లో దేవవ్రత గాంగేయుని జననం. చిత్రాంగదుడు క్రీ.పూ. 3260. క్రీ.పూ. 3256 విచిత్రవీర్యుడు. కృష్ణుని కంటె వ్యాసుడు 118 ఏండ్లు పెద్ద. కృష్ణనిర్యాణసమయమునకు (క్రీ.పూ.3102) కృష్ణవ్యాసుని వయస్సు 233 ఏండ్లు. పురాణోం మే ప్రాగ్మహాభారత కాలీన ఇతిహాస్ కుంపర్‌లాల్ వ్యాసశిష్య పుట 619.

విష్వక్సేనుడు పారాశర్యవ్యాసుని గురువు. ఈ విష్వక్సేనుడు బ్రహ్మదత్తుని తనయుడు. పరమర్షి పారాశర్యవ్యాస్‌నే యోగవిద్యావిష్వక్సేన్ సే సీఖీథీ - సామవిధాన బ్రహ్మాణ్ మే గురు శిష్య పరంపరా లిఖీహై. వ్యాసుడు మహాభారత యుద్ధమునకు పూర్వము అనగా క్రీ.పూ. 3357 ప్రాంతమున వేదశాఖా ప్రవర్తన చేసెను. వ్యాసుడు కృష్ణుని కంటె 150 సంవత్సరములు పెద్ద ప్రతీపుని రాజ్య కాలము వి.పూ. 3404 నుండి 3365 వి.పూ. వరకు (క్రీ.పూ.3461 నుండి 3422) ఇది బ్రహ్మదత్తుని కాలము 569 పుట. మొదటి శుకుడు (వాస్తవమునకు శుక్రుడు) క్రీ.పూ. 3460 - 3500 ప్రాంతమున నుండెను. అపర్ణాదేవికి మానసపుత్రుడు. యోగాచార్యుడైన బ్రహ్మదత్తునకు మాతామహుడు. కృష్ణవ్యాసుడు బాదరాయణవ్యాసుడు ఇద్దరు భిన్నులు. కృష్ణద్వైపాయన్ ఔర్ బాదరాయణ్ దోనోం ఏక్‌నహీహై పుట 38.

శ్రీనింభార్క వేదాంతము ఆచార్య లలిత కృష్ణగోస్వామి (హిందీ) శ్రీనింబార్క పీఠ మహాజనీటోలా. వి. శ. 2029 (క్రీ.శ. 1972 ఎడిషన్). శుకుని జననము కూడ క్రీ.పూ. 3260 ప్రాంతము అగును. ఈ శుకుడు సత్యవతీ పౌత్రుడు. వ్యాసుడు దీర్ఘజీవి. ఈ జంట రెండవ వ్యాస శుకులు. కృష్ణవ్యాస బాదరాయణ వ్యాసులు ఇద్దరు భిన్నులని సిద్ధాంతము. ఆచార్య లలిత కృష్ణగోస్వామి తన నింబార్క, వేదాంత అను గ్రంథములో 38 పుటలో చెప్పిరి. ఈ సిద్ధాంతమును సామవిధాన బ్రాహ్మణము ఆధారముగా కుంపర్ లాల్ వ్యాస్‌శిష్యగారు కూడ సమర్థించిరి. సభాపర్వం 33 అధ్యాయం 34 శ్లోకం.

పారాశర్యవ్యాసుని (కృష్ణుని) గురువు బ్రహ్మదత్తుని కుమారుడైన విష్వక్సేనుడు వ్యాసుడు.

భారత యుద్ధమునకు 150 సంవత్సరములు పూర్వము 3357 క్రీ.పూ. వేదశాఖా ప్రవర్తన చేసెను. వ్యాసుడు శ్రీకృష్ణుని కంటె 150 సంవత్సరములు పెద్ద (8) దీనినిబట్టి వ్యాసుని కాలము 3228+150 = 3378 క్రీ.పూ. అగును. ఈ వ్యాసుడు 3340 – 3100 మధ్య 240 ఏండ్లు జీవించి యుండెను. భీష్మునివలె వ్యాసుడు దీర్ఘజీవి యనక తప్పదు. ఈ వ్యాస శుకులు ధర్మరాజు రాజసూయయాగమునకు వచ్చినట్లు మహాభారతము సభాపర్వమున కలదు. స్వయం బ్రహ్మత్వమకరోత్ తస్య సత్యవతీసుతః సభా 33 అ – 34 శ్లో. వీరి మరణము ఎప్పుడు ఎట్లు జరిగెనో ఎక్కడ చెప్పబడలేదు. సమాధానము మృగ్యము.

మొదటి శుకుడు క్రీ.పూ. 3460/3500 ప్రాంతమున నుండెను. రెండవ వ్యాసుని కాలము 3300 అని తలంచిన, శుకుని కాలము 3250 క్రీ.పూ. అగును. ఈ వ్యాస శుకులకు పూర్వులు మొదటి వ్యాస శుకులు కలరు.

విభ్రాజుడు – శుకుడు
అణుహుడు – కృత్వీశుకపుత్రి – 2
బ్రహ్మదత్తుడు – 3
విష్వక్సేనుడు – ఈతని శిష్యుడు వ్యాసుడు – 4
శుకుడు – 2వ శుకుడు – 5

1వ శుకునకు, 2వ శుకునకు 5 తరముల ఎడమున్నది కనుక మొదటి శుకుడు 3250+200 = క్రీ.పూ. 3450 కాలమున నుండును. ఈ ఒకటవ శుకుడే అపర్ణాదేవికి ప్రీతిపాత్రుడైన శిష్యుడు, పుత్రుడు. హరివంశమున ఈ విషయము కలదు. పూర్వభాగము. 2వ ఆశ్వాసము ఎర్రన రచన. అప్పరమేశ్వరికి గృత్రిమ పుత్రుడైన శుక్రుడు యోగాశ్రయుండై పరగె ఈతని భార్య గో. ఈతడు భృగువంశమువాడు. ఈతనికి పాంచాలరాజులైన విభ్రాజుడు అణుహుడు బ్రహ్మదత్తునకు చుట్టరికము కలదు. ఈ శుకుని తండ్రి వ్యాసుడు విభ్రాజుని కాలమువాడే. 1వ శుకుడు వాస్తవమునకు శుక్రుడు శుభాగమ పంచకములో శుక సంహిత కలదు. దీనిని శుక్రసంహితయని పేర్కొనినారు. శుకసంహితాయాం, శుక్రసంహితాయాం అని భిన్నముగా చెప్పుట కలదు. బ్రహ్మదత్తుని మాతామహుడు శుకుడు కాదు శుక్రుడు. ఇతడు కృష్ణవ్యాసుని పుత్రుడగుటకు వీలులేదు. కృష్ణవ్యాసుడు కార్ష్ణి శుకుడు బ్రహ్మదత్తుని తరువాత కాలమువారు. మేనా – శైలరాట్ వీరి పుత్రికలు అపర్ణ ఏకపర్ణ ఏకపాటల అపర్ణ మహాదేవుని పత్నియైనది. వీరికి ముగ్గురు పుత్రులు కలరు. 1. దన్తుడు, 2. కాణ్వుడు, 3. ఉశనుడు వాయుపురాణము 72 అధ్యాయము. ఈ ఉశనుడే యోగాచార్యుడు బ్రహ్మదత్తుని మాతామహుడు. ఏకపర్ణ అసితుని భార్య. యోగాచార్యుడు, వీరి పుత్రుడు దేవలుడు. ఏకపాటల

శతశిలాకుని పుత్రుడైన జైగీషవ్యుని భర్తగా పొందినది. ఈ జైగీషవ్యుని పుత్రులు శంఖలిఖితులు శిష్యుడు బ్రహ్మదత్తుడు వీరందరు యోగాచార్యులు. వీరందరు భారతయుద్ధమునకు 300 ఏండ్లు పూర్వమున్నారు. ప్రతీపుని కాలమునకు పూర్వము మొదటి వ్యాసశుకులున్నారు. తరువాత రెండవ వ్యాస శుకులున్నారు. వ్యాసుడు ఒకడు కాదు వ్యాసనామమొక ఉపాధి. ఎందరో వ్యాసులు కలరు. ఎందరో శుకులు కలరని సిద్ధాంతము.

బాదరాయణ బాదరాయణి పిమ్మటివారు పరీక్షిత్తు. జనమేజయుని కాలము వారు ఈ ముగ్గురు వ్యాసులు ముగ్గురు శుకులు భిన్నులైనను ఒక్కటిగా భావించుటచే సమస్య ఉత్పన్నమైనది. శుకస్థానమున శుక్ర అని ప్రయోగము. అప్సరసల వృత్తాంతములో కలదు. దానిని శుకుడు అని సరిచేసినారు. అందుచేతనే వ్యాసుడు చిరంజీవి యనియు, శుకుడు స్మర్తృగామి అని శ్లోకములు పరంపరగా చెప్పుచున్నారు.

**శ్లో॥ అశ్వత్థామా బలిః వ్యాసో హనుమాన్ విభీషణః ।**
**కృపః పరశురామశ్చ సప్తైతే చిరజీవినః ॥**

1. అశ్వత్థామ, 2. బలి, 3. వ్యాసుడు, 4. హనుమంతుడు, 5. విభీషణుడు, 6. కృపుడు, 7. పరశురాముడు ఈ ఏడుమంది చిరంజీవులు.

**శ్లో॥ శ్రీదత్తో నారదో వ్యాసః శుకశ్చ పవనాత్మజః ।**
**కార్తవీర్యశ్చ గోరక్షో సప్తైతే స్మర్తృగామినః ॥**

1. శ్రీదత్తుడు, 2. నారదుడు, 3. వ్యాసుడు, 4. శుకుడు, 5. హనుమంతుడు, 6. కార్తవీర్యుడు, 7. గోరక్షుడు ఈ ఏడుమంది స్మర్తుగాములు అనగా స్మరించిన వారి దగ్గరకు ప్రత్యక్షముగా వచ్చి కన్పడుదురు. ఇవి పరంపరగా చెప్పబడుచున్న శ్లోకములు. వీనికి ప్రాచీనమైన లిఖిత ఆధారము లేదు. ఒక పిహెచ్.డి. గ్రంథమున ఉదాహృతము.

**శుకసంతతి**

శుకుడు వ్యాసునకు అరణికి పుట్టినవాడు. పరాశరకులోద్భూతుడు. పీవరి ఈతని భార్య. పీవరి యోగపత్ని, యోగమాత, శుకునకు, పీవరికి పుట్టిన పిల్లలు : 1. కృష్ణుడు, 2. గౌరుడు, 3. ప్రభుడు, 4. శంభుడు, 5. భూరిశ్రుతుడు. కన్య కీర్తిమతి. ఈమె అణుహుని భార్య. బ్రహ్మదత్తుని తల్లి. శుకుడు మహాయోగియై సర్వవ్యాపియై ముక్తుడైనాడు. 1. వాయుపురాణము ననుసరించి శుకసంతతి.

**శ్లో॥ కృష్ణం గౌరం ప్రభుం శంభుం తథా భూరిశ్రుతం చ వై ।**
**కన్యాంకీర్తిమతీం చైవ యోగినీం యోగమాతరమ్ ॥**

**శ్లో॥ బ్రహ్మదత్తస్య జననీ మహిషీత్వణుహస్య తు ।**

కాళి–పరాశరుని వలన కృష్ణద్వైపాయనుని కన్నది. ద్వైపాయనునకు అరణికి శుకుడు పుట్టెను. శుకునకు పీవరికి 5గురు పుత్త్రులు, ఒక కుమార్తె కలిగిరి. శుకుని పుత్త్రిపేరు ఋచీ అని ఇందున్నది 3వ అ॥ 174వ శ్లోకం.

**శ్లో॥ ఉత్పద్యన్తే చ పీవర్యాం షడిమే శుకసూనవః ।**
**భూరిశ్రవాః ప్రభుః శంభుః కృష్ణో గౌరశ్చ పంచమః ॥**

**శ్లో॥ కన్యా కీర్తిమతీ చైవ యోగమాతా దృఢవ్రతా ।**
**జననీ బ్రహ్మదత్తస్య పత్నీ సా త్వణుహస్య ॥**

శుకునకు పుత్రులు 1. భూరిశ్రవుడు, 2. ప్రభుడు, 3. శంభుడు, 4. కృష్ణుడు, 5. గౌరుడు కల్గిరి. కన్య కీర్తిమతి కలిగినది. ఆమె అణుహుని భార్య, బ్రహ్మదత్తుని తల్లి. వాయుపురాణములో 70వ అధ్యాయములో భూరిశ్రవుడని చెప్పి, 73వ అధ్యాయమున భూరిశ్రవుని బదులు భూరిశ్రుతుడు అని చెప్పినాడు పురాణకర్త కృష్ణద్వైపాయన వ్యాసుని కుమారుడైన శుకుడు తన కుమార్తెను అణుహునకు ఇచ్చి వివాహము చేసెను అని చెప్పెను. ఇది అసాధ్యము. బ్రహ్మదత్తుని కుమారుడైన విష్వక్సేనునకు శుకుని తండ్రి వ్యాసుడు శిష్యుడు. 200 ఏండ్లు పూర్వమున్న అణుహునకు శుకుడు పిల్లనిచ్చుట అసాధ్యము. కృత్వి కీర్తిమతి అను పేరులు స్త్రీ తండ్రి కృష్ణవ్యాసుని పుత్రుడు కాక వేరొకడు కావలెనని సిద్ధాంతము. సత్యవతీ పుత్రుడైన వ్యాసుడు, బ్రహ్మదత్తుని మాతామహుడైన శుకుని తండ్రి వ్యాసుడు ఇద్దరు భిన్నులు. దాదాపు 200 ఏండ్లు కాలము ఎడములో జీవించి యుండిరి. కాలనిరూపణములో ఈ విషయము గలదు.

**2. హరివంశము ననుసరించి శుకసంతతి :**

అన్ని పురాణములలో వ్యాసునకు – అరణికి పుట్టినవాడు శుకుడని కలదు. ఆతని భార్య పీవరి. వారి పిల్లలు 1. కృష్ణుడు, 2. గౌరుడు, 3. ప్రభుడు, 4. శంభుడు, 5. కుమార్తె కృత్వి. ఆమె అణుహుని భార్య, బ్రహ్మదత్తుని తల్లి.

**శ్లో॥ కృష్ణం గౌరం ప్రభుం శంభుం కృత్వీం కన్యాం తథైవ చ ।**
**బ్రహ్మదత్తస్య జననీం మహిషీం త్వణుహస్య చ ॥** 13

సంస్కృత హరివంశములో కృష్ణవ్యాసుని పుత్త్రుడైన శుకుని గూర్చి చెప్పిన పిమ్మట వేరొక శుకుని గూర్చి చెప్పబడినది. అతడు వాస్తవమునకు శుక్రుడు. అతని భార్య ఏకశృంగ. వారి సంతతిని గూర్చి **హరివంశము** మౌనము వహించినది.

**శ్లో॥ తేషాం వై మానసీ కన్యా యా గౌర్నామ్నా దివి శ్రుతా ।**
**తవైవ వంశే యా దత్తా శుకస్య మహిషీ ప్రియా**
**ఏకశృంగేతి విఖ్యాతా సాధ్యానాం కీర్తివర్ధినీ ॥** 14

ఈ రెండవ శుకుని తల్లి ఎవరో పుత్రులు ఎవ్వరో స్పష్టముగా హరివంశమున చెప్పబడలేదు.
3. ఎఱ్ఱన తన హరివంశమున ఏడుమంది శుకుని పుత్రులను పేర్కొనెను.

**తే॥ అలఘుయోగాఢ్యపపీవరి యనగనొప్పు**
**నింకనప్పరాశరసుతు డిద్ధతేజు**
**దరణి గనియెదు పుత్రునుదాత్తయోగ**
**ధరుని శుకుని భర్తగ బ్రమోదమున జెందు.** 2-118

అమ్మహాభాగుండయ్యోగిని యందు గృష్ణుండు, గౌరుండు, ప్రభుడు, శంభుండు, ఋతుండు, జయుండు, భూరియన నేడ్వుర కొడుకులను గీర్తిమతి యను కన్యకను గనంగల వాడా కన్నియ యణుహుండను రాజునకు బత్నియై యోగసిద్ధుండగు బ్రహ్మదత్తుంగనియెదు - 2/119-15. ఎఱ్ఱన అధికముగా చెప్పినవారు 1. ఋతుండు, 2. జయుండు, 3. భూరి

**విష్ణుపురాణము ననుసరించి శుకసంతతి (విష్ణుభట్టీయ వ్యాఖ్య - శ్రీధరీ వ్యాఖ్య) :**

**శ్లో॥ పరాశరో కులోత్పన్నో శుకో నామ మహాయశః**
**వ్యాసాదరణ్యాం సంభూతో విధూమోఽగ్నిరివ జ్వలన్ ।**
**సా తస్య పితృకన్యాయాం పీవర్యాం జనయిష్యతి**
**కృష్ణం గౌరం ప్రభుం శంభుం తథా భూరిశ్రుతం జయం**
**కన్యాం కీర్తిమతీం షష్ఠీయోగినీం యోగమాతరమ్ ॥** 16

శుకునకు పీవరికి జన్మించిన పుత్రులు - అయిదు మంది.

1. కృష్ణుడు, 2. గౌరుడు, 3. ప్రభుడు, 4. శంభుడు మరియు 5. భూరిశ్రుతుడైన (వేదపండితుడైన) జయుడు. కన్య ఆరవది కీర్తిమతి. భూరిశ్రుతుడు అనుదానిని భూరిఋతుండు అని ఎఱ్ఱన భావించి మొత్తము 7 మంది పుత్రులని చెప్పినట్లు తోచుచున్నది.

**4. మత్స్యపురాణములో శుకసంతతి :**

వ్యాసపుత్రుడు శుకుడు. అతని భార్య పీవరి. వారికి నల్గురు పుత్రులు. 1. కృష్ణుడు, 2. గౌరుడు, 3. ప్రభుడు, 4. శంభుడు కలిగిరి. కృత్వియను కన్య కలిగినది. అణుహునికి భార్య బ్రహ్మదత్తుని తల్లి.

**శ్లో॥ భవిష్యతి చ తే కన్యా కృత్వీ నామ యోగినీ ।**
**పాంచాలాధిపతిర్దేయా మానుష్యస్య త్వయా తదా ॥**

**శ్లో॥ జననీ బ్రహ్మదత్తస్య యోగసిద్ధా చ గౌః స్మృతాః ।**
**కృష్ణో గౌరః ప్రభుః శంభుః భవిష్యన్తి చ తే సుతాః ॥** 17

మత్స్యపురాణములో రెండవ శుకుని గూర్చి చెప్పబడినది.

**శ్లో॥ శుకస్య దయితా పత్నీ సాధ్యానాం కీర్తివర్ధినీ ॥** 18

ఈ గౌ అను నీమె శుకునకు ఇష్టమైన భార్య. ఆమె సాధ్యుల కీర్తిని వృద్ధిచేసినది. ఇచ్చట వీని సంతతిని గూర్చి పురాణకర్త చెప్పలేదు.

**5. కూర్మపురాణములో శుకసంతతి :**

**శ్లో॥ ద్వైపాయనాద్ శుకో జజ్ఞే భగవానేవ శంకరః**
**అంశాంశేనావతీర్యోర్వ్యాం సంప్రాప పరమం పదమ్**

**శ్లో॥ శుకస్యాస్యా భవన్ పుత్రాః పంచాత్యన్తతపస్వినః ।**
**భూరిశ్రవాః ప్రభుః శంభుః కృష్ణో గౌరశ్చ పంచమః ।**
**కన్యా కీర్తిమతీ చైవ యోగమాతా ధృతవ్రతా ॥**

ద్వైపాయనునకు శుకుడు శంకర భగవానునివలె జన్మించెను. ఈయనది అంశావ తారము. పరమపదమును పొందెను. శుకునకు పీవరికి 5 మంది పుత్రులు. 1 కుమార్తె కలిగిరి. 1. భూరిశ్రవుడు, 2. ప్రభుడు, 3. శంభుండు, 4. కృష్ణుడు, 5. గౌరుడు, 6. కన్యా కీర్తిమతి. కూర్మపురాణములో బ్రహ్మదత్తుని వృత్తాంతము లేదు. కృత్వి అణుహుని భార్య అని లేదు. ఇందులో భూరిశ్రుతుండు జయుడు అని వీరి పేర్లు లేవు. ఆంధ్ర కూర్మ పురాణము.

**6.** ఆ శుకమహర్షికి, భూరిశ్రవసుండును, ప్రభుండును, శంభుండును, కృష్ణుండును, గౌరుండు నన నైదుగురు తపోనిధులును, యోగమాతయు ధృతవ్రతయగు కీర్తిమతియును కన్యకయు గలిగిరి (20), 5 మంది పుత్రులు, కీర్తిమతియు పేర్కొనబడిరి. బ్రహ్మదత్తుని వృత్తాంతము లేదు.

**7. పద్మపురాణములో శుకసంతతి :**

కృష్ణ, గౌర, శంభులని శుకుని పుత్రులు ముగ్గురని దీనిలో కలదు. కృత్తి, కుమార్తె పేరు. పాంచాల రాజు సాత్వతుని భార్య, బ్రహ్మదత్తుని తల్లి వ్యాసపుత్రోశుకః అని ఇందున్నది. స్పష్టముగా కృష్ణద్వైపాయన అని లేదు. పీవరి ఈ శుకుని భార్య.

**శ్లో॥ భవిష్యతి చ తే కన్యా కృత్తీ నామాథ యోగినీ**
**పాంచాలపతయే దేయా సాత్త్వతాయ తు సా తదా ।**
**జననీ బ్రహ్మదత్తస్య యోగసిద్ధాంతగా స్మృతా**
**కృష్ణశ్చ గౌరశ్చ శంభుశ్చ భవిష్యతి తే సుతాః ॥** 21

దీనిలో రెండవ శుకుని ప్రసక్తిగాని, ఆయన భార్య గౌ (ఏకశృంగ) ప్రసక్తి గాని లేదు.

**8. ఆంధ్ర పద్మపురాణములో శుకసంతతి :**

ఆంధ్రీకర్త పిసుపాటి చిదంబరశాస్త్రి, సృష్టిఖండము 186,187 పద్యాలలో శుకసంతతిని తేల్చెను. వ్యాసమహర్షి పుత్రుడు శుకుడు. పీవరి వాని భార్య. కృత్వి వాని కుమార్తె. కృత్వి సాత్వతుని భార్య. పాంచాలరాజు అణుహునకు సాత్వతుడని మరియొక పేరు. 1. కృష్ణుడు, 2. గౌరప్రభుడు, 3. శంభుడి అను ముగ్గురు పుత్రులు గౌర, ప్రభు ఇద్దరిని కలిపి గౌరప్రభు అని దీనిలో కలదు.

**దేవీభాగవతములో శుకసంతతి :**

దేవీభాగవతము 1వ స్కంధము 19వ అధ్యాయములో శుకసంతతిని గూర్చి కలదు. వ్యాసపుత్రుడు శుకుడు (40 నుండి 43 శ్లోకములు) శుకుని భార్య పీవరి. కృష్ణ, గౌరప్రభు, భూరి, దేవశ్రుత అను నలుగురు పుత్రులు కీర్తి అను కన్యక పేర్కొనబడిరి. గౌర ప్రభు అని వేరుగా ఇద్దరని చెప్పక, గౌరప్రభు అని ఒక్కటిగా చెప్పబడినది. శంభు పదము విడిచి పెట్టబడింది. శుకసంతతి వివిధ పురాణములలో ఉన్న అంశములు పట్టిక రూపములో చూపించబడినవి. జయుడు అను పేరు హరివంశములో మాత్రము కలదు.

భూరిశ్రుతుడు, భూరిశ్రవుడు అని భిన్నులుగా చెప్పబడిరి. భూరి, భూరిశ్రుతుడు, భూరిశ్రవుడు భిన్నత్వమునకు కారణమేమిటో అస్పష్టము. పురాణములలో ఈ విషయమున ఏకవాక్యత లేదు. 3,4,5,6,7 అని శుకసంతతి భిన్నముగా కలదు. వేరొక శుకుడు ఏకపర్ణా గో అనునామె భర్త (వాస్తవమునకు శుక్రునకు కూడ సంతతియుండుటచే ఇద్దరి సంతతిని ఒకటిగా భావించుటచే ఈ భిన్నతవ్వము కలిగినది.)

**క్షేమేంద్రుని భారతమంజరిలో శుకసంతతి :**

క్షేమేంద్రుడు శుకుని పుత్రుల పేర్లు చెప్పలేదు. శుకునకు పీవరికి కృత్వి అను కుమార్తె పుట్టినది. అపత్యాని పిల్లలు అను బహువచనము వాడెను. ఎంత మంది పుత్రులు అని చెప్పలేదు. కూర్మపురాణము బ్రహ్మాండపురాణము ప్రాచీనములు చారిత్రక సత్యమును చెప్పెను. శుకునికి బ్రహ్మదత్తునకు గల సంబంధము వీనిలో లేదు.

## పురాణములలో శుకసంతతి పట్టిక.

| నెం. | పురాణము పేరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | వాయుపురాణము | కృష్ణ | గౌర | ప్రభు | శంభు | భూరిశ్రవ | భూరిశ్రుత | | ఋచి కీర్తిమతి | 6+1 |
| 2. | హరివంశము | కృష్ణ | గౌర | ప్రభు | శంభు | | భూరిశ్రుత | జయ | కీర్తిమతి | 6+1 |
| 3. | ఎర్రన హరివంశము | కృష్ణ | గౌర | ప్రభు | శంభు | భూరి | ఋతుండు శ్రుతుండు | జయుడు | కీర్తిమతి | 7+1 |
| 4. | మత్స్యపురాణము | కృష్ణ | గౌర | ప్రభు | శంభు | | | | కృత్వి | 4+1 |
| 5. | కూర్మపురాణము | కృష్ణ | గౌర | ప్రభు | శంభు | భూరిశ్రవ | | | కీర్తిమతి | 5+1 |
| 6. | ఆంధ్రకూర్మపురాణము | కృష్ణ | గౌర | ప్రభు | శంభు | భూరిశ్రవ | | | కీర్తిమతి | 5+1 |
| 7. | పద్మపురాణము | కృష్ణ | గౌర | | శంభు | | | | కృత్వీ | 3+1 |
| 8. | ఆంధ్రపద్మపురాణము | కృష్ణ | గౌరప్రభ | ప్రభు | | | | | కృత్రీ (కృత్వీ) | 3+1 |
| 9. | దేవీభాగవతము | కృష్ణ | గౌరప్రభ | | | భూరి | దేవిశ్రుత | | కీర్తి | 4+1 |
| 10. | బ్రహ్మాండపురాణము | కృష్ణ | గౌర | ప్రభు | శంభు | భూరిశ్రవ | భూరిశ్రుత | | కీర్తిమతి | 6+1 |
| 11. | క్షేమేంద్ర భారతమంజరి పుత్రుల పేర్లు లేవు. అపత్యాని అని ప్రయోగము. బహువచనము | | | | | | | | కృత్వీ | |

**శుకుడు = వైయాసికి మాధ్యమాధ్వర్యుడు :**

వ్యాసుని కుమారుడైన శుకుడు మధ్యమాధ్వర్యుడని బ్రహ్మాండపురాణమున కలదు. (పుట 5) మోతీలాల్ బనారసీదాస్, ఢిల్లీ.

**శ్లో॥ చరకా ధ్వర్యకా ధ్వర్యునమస్యుః బ్రహ్మచారిణః ।**
**వైయాసికి శుకో విద్వాన్ లౌకి భూరిశ్రవస్తథా ॥**

**శ్లో॥ ప్రజాదర్పః కహోదశ్చ యాజ్ఞవల్క్యోఽథ శౌనకః ।**
**అనంగో నిరతాలశ్చ మధ్యమాధ్వర్యవస్తుతే ॥**

అధ్వర్యుడనగా యజ్ఞకర్మలను ఆచరించువాడు. వ్యాసుని కుమారుడైన శుకుడును అతని పుత్రుడైన భూరిశ్రవుడును అధ్వర్యులు. వీరు యజ్ఞకర్మలను ఆచరించిరని సిద్ధాంతము.

అధ్వర్యం యాతి అధ్వర్యుః యజ్ఞమును బొందువాడు. (యజుర్వేదపండితుడు లింగాభట్టీయము 446 పుట)

16మంది ఋత్విజులు యజ్ఞమున పనిచేయుదురు. వసంతాది ఋతువులందు యాగము చేయించువారు.

**శుకుడు కులపతి :**

మహాకవి తిక్కన శుకుని కులపతి అని తెలిపెను. శుకుడు జనకుని దగ్గరకు పోయెను. మిథిలాధిపతి జనకుడు కులపతియైన శుకుని సన్మానించి, ఆదరించి, గోవును దానముగా నిచ్చెను. శుకుడా గోవును పరిగ్రహించెను. ఇందు రెండంశములు గలవు. 1. శుకుడు కులపతి. 2. శుకుడు గోదానమును పరిగ్రహించెను. మూలమున లేని కులపతి పదమును తిక్కన సార్థకముగా వాడెను.

**కం॥ లలితాక్షతములగు సుమం**
**బుల బూజితుం జేసి యర్ఘ్యమును గోవును న**
**క్కులపతికి నిచ్చె విధిపరి**
**కలనజ్ఞుండైన యతడు గైకొనియె దగన్.** 25

**1. శుకుడు కులపతి :**

కులము వంశము ఇల్లు : – కులాని = ఇండ్లు

కులాని దశ పంచ వా – మహాభారతం

అయిదు లేక పదియిండ్లు అని అర్థము

సజాతీయగణం కులం - అమరకోశ (2-6-41)

కులపతి శబ్దమునకు గృహపతి, గృహస్థుడని అర్థము

కులపతి గృహపతి సమానార్థకములు.

వసిష్ఠుడు, శౌనకుడు, కణ్వుడు వీరు కులపతులు.

మహాభారతము ఆదిపర్వమున (సంస్కృతం) శౌనకుని కులపతి అని వ్యాసుడు చెప్పెను.

**2. శౌనకుడు కులపతి గృహపతి :**

1. శౌనకస్య కులపతే : (1-4-1)
2. భగవాన్ కులపతిస్తు శౌనకో (1-4-4)
3. విద్వాన్ కులపతి : (1-4-6)
4. కులపతికి బదులుగా గృహపతి కూడ వాడబడినది (1-4-12)

అల్లసాని పెద్దన తన మనుచరిత్రలో ప్రవరుని కులపతి యనెను.

సీ॥ కెలకుల నున్న తంగెటిజున్ను గృహమేధి
యజమానుడంక స్థితార్థపేటి....
మరుదేశపథమధ్యమప్రప కులపతి
యాకటికొదవు సస్యము కుటుంబి - మను- 1అ.66ప

కులపతి గృహస్థుడు అని అర్థము. ఈ పద్యమున పెద్దన గృహమేధి యజమానుడు వాస్తవ్యుడు, కాపు, సంసారి, భవన భర్త, కులపతి, కుటుంబి అనుపదములను సమానార్థకములుగ వాడెను. కనుక శుకుడు కులపతి యనగా కుటుంబి అని అర్థము.

**3. శ్రీకృష్ణుడు కులపతి :**

(భాగవతము 5-6-18) నేత. భాగవతమున శ్రీకృష్ణుడు కులపతి అని కలదు. దానికి శ్రీధరుడు తన టీకలో అర్థము వ్రాసెను. కులస్య పతిః నియన్తా కులపతిః. కులమును (వంశమును) నియంత్రించి కాపాడువాడు. గంగన తన భాగవతఆంధ్రీకరణములో శ్రీకృష్ణుని కులగురువు అని చెప్పెను. (5/90). యామునాచార్యకృత స్తోత్రరత్నములో కూడ 5వ శ్లోకమున కులపతి పదము వాడబడినది. ఆద్యస్య నః కులపతేః వకుళాభిరామం. దీనిలో కులపతి పదమునకు కుటుంబమునకు పెద్ద అని అర్థము (II). దీనిని బట్టి వశిష్ఠుడు, శుకుడు ఆ వంశమునకు పెద్దలని తెలియును. వశిష్ఠుడు కులపతి కణ్వుడు. కులపతి వాల్మీకి. కులపతియని

వివిధ గ్రంథములలో కలదు. కులస్య మునిసమూహస్య పతిః కులపతిః అని మల్లినాథుని వ్యాఖ్యా. (రఘువంశము 1వ సర్గ – 5వ శ్లోకము). శుకుడు కులపతి యనగా ముని సమూహమునకు నేతయని అర్థము.

కులపతి పదమునకు నిర్వచనము చెప్పు రెండు ప్రసిద్ధ శ్లోకములు కలవు. కాళిదాసు గ్రంథముల వ్యాఖ్యలలో వీనిని వ్యాఖ్యాతలుదాహరించిరి. రాఘవభట్టు అభిజ్ఞానశాకుంతల వ్యాఖ్యలో వీని నుదాహరించెను.

**శ్లో॥ ఆచార్యః బహుశిష్యాణాం మునీనామగ్రణీయస్తు యః ।**
**వ్రతయజ్ఞాదికర్మాఢ్యః స వై కులపతిః స్మృతః ॥**

**శ్లో॥ మునీనాం దశసాహస్రం యోఽన్నపానాదిపోషణాత్ ।**
**అధ్యాపయతి విప్రర్షిరసౌ కులపతిః స్మృతః ॥**

కులపతి యనగా మునులలో అగ్రణి. బహుశిష్యులకు ఆచార్యుడు. వ్రతయజ్ఞాది కర్మాఢ్యుడు. 10వేల మంది శిష్యులను అన్నదానాదులచే పోషించి, యధ్యాపనము చేయు బ్రహ్మర్షిని **కులపతి** అందురు. **కులస్య ఛాత్రవర్గస్య పతిః పాలకః అన్నదానపోషణపూర్వకం అధ్యాపకో మునివిశేషః** అని వాచస్పత్య నిఘంటువున కలదు. కులపతి యనగా ప్రముఖ అధ్యాపకుడు బ్రహ్మర్షి. శుకుడు కులపతి కనుక వసిష్ఠ గణమునకు నేత యనియు, గృహస్థుడనియు, అధ్యయనము, అధ్యాపనము కర్తవ్యములుగా నిర్వహించిన బ్రహ్మర్షియనియు సిద్ధాంతము. శుకుడు జనకుడిచ్చిన గోవును పరిగ్రహించెను. పరిగ్రహము సన్న్యాసికి నిషిద్ధము. కనుక శుకుడు అప్పటికి సన్న్యాసి కాలేదని సిద్ధాంతము. **నారదపరివ్రాజకోపనిషత్తు**లో సన్న్యాసికి పరిగ్రహము నిషిద్ధము అని కలదు.

**శ్లో॥ తృష్ణా క్రోధోఽనృతం మాయా లోభమోహౌ ప్రియాప్రియే ।**
**శిల్పం వ్యాఖ్యాన యోగశ్చ కామో రాగః పరిగ్రహః ।**
**అహంకారో మమత్వం చ చికిత్సా ధర్మసాహసమ్ ॥**
**ప్రాయశ్చిత్తం ప్రవాసశ్చ మంత్రౌషధగరాశిషః ।**
**ప్రతిషిద్ధాని చైతాని సేవమానో వ్రజేదధః ॥** – 27

కదాపి ప్రతిగ్రహం న గృహ్ణీయాత్ అని ఉపనిషద్ బ్రహ్మేంద్రుడు తన వ్యాఖ్యలో చెప్పెను. అందులోనే షష్ఠోపదేశము 27 శ్లోకములో సంన్యాసి నిష్పరిగ్రహుడు కావలెనని కలదు. దానమును స్వీకరించరాదని భావము. 196వ పుటలో సంన్యాసులు (నిష్పరిగ్రహాః) నిష్పరిగ్రహులు కావలెనని కలదు. అపరిగ్రహః అని కూడ కలదు. సంన్యాస ఉపనిషత్తులలో

బహుధా ఈ విషయము కలదు. శుకుదు గోదానమును గ్రహించు నాటికి సంన్యాసి కాదు. కాని శుకుడు పరమహంసయని గ్రంథములలో బహుధా కలదు. యాజ్ఞవల్క్యోపనిషత్తు 6వ వచనములో కలదు. "**తత్ర పరమహంసా నామ సంవర్తకాఽరుణి శ్వేతకేతు దూర్వాస ఋభు నిదాఘ దత్తాత్రేయ శుక వామదేవ హారీతక ప్రభృతయోఽవ్యక్త లింగాఽవ్యక్తాచారా అనున్మత్తా ఉన్మత్తవదాచరన్తః**"

భిక్షుకోపనిషత్తు 196వ పుట (సంన్యాస ఉపనిషత్తులు.) "అథ పరమహంసా నామ సంవర్తకాఽరుణి శ్వేతకేతు జడభరత దత్తాత్రేయ శుక వామదేవ హారీతక ప్రభృతయోఽష్టౌ గ్రాసాంశ్చరన్తో యోగమార్గే మోక్షమేవ ప్రార్థయన్తే".

| యాజ్ఞవల్క్య ఉపనిషత్తు పేర్కొన్న పరమహంసలు | భిక్షుకోపనిషత్తు పేర్కొన్న పరమహంసలు |
|---|---|
| సంవర్తక | సంవర్తక |
| అరుణి | అరుణి |
| శ్వేతకేతు | శేతకేతు |
| దూర్వాస | జడభరత ఈ పేరు అధికంగా చేరినది |
| ఋభు | ఇచ్చట దూర్వాస, ఋభు, నిదాఘుల |
| నిదాఘ | పేర్లు లోపించినవి |
| దత్తాత్రేయ | దత్తాత్రేయ |
| శుక | శుక |
| వామదేవ | వామదేవ |
| హారీతక | హారీతక |

శుకుని పేరు రెండింటిలో కలదు. **శుకో ముక్తః వామదేవో ముక్తః** అన్న వాక్యము ప్రసిద్ధి చెందినది. వీరు యోగసాధకులు పరమహంసలు. అవధూతలు. ఆచారములను త్యజించిరి. చిహ్నములను తీసివేసిరి. అష్టగ్రాసములు (ఎనిమిది ముద్దలు) ఆహారముగా గ్రహించుచుండిరి. వారు ఉన్మత్తులు కాకపోయినను ఉన్మత్తులవలె ప్రవర్తించుచుందురు. శుకుడు పరమహంస. అవధూత నారదుని ఉపదేశము వలన సన్న్యాసియై యోగసాధనలు చేసి భక్తిమార్గప్రవర్తకుడై జీవితచరమదశలో పరమహంస అయ్యెనని సిద్ధాంతము. అరణి యనగా నెవరు? మథించుట యనగానేమి? వ్యాసునికి భార్య కలదా? వ్యాసుడు గృహస్థుడా? శుకుని తల్లి యెవరు? ఈ ప్రశ్నలకు పురాణములలో అస్పష్టముగా సమాధానములు గలవు. వానికి సమాధానములు వెదకి స్పష్టము చేయుట ఆవశ్యకము.

తల్లిపేరుతో వచ్చిన శుకుని నామములు. ఆరణేయుడు. అరణి సుతుడు. అరణీ గర్భసంభవుడు. అరణి, అరణీ స్త్రీలింగములు. అరణి ఒక స్త్రీ పేరు. అరణియనగా కాష్ఠము. అగ్నిపుట్టించునది యని నిఘంటుగత అర్థము.

స్త్రీ నామమునకు ఇయ ప్రత్యయము చేరిన అపత్యార్థము పుత్రుని పేరు వచ్చును.

1. అంబికా + ఇయ = ఆంబికేయ
2. గంగా + ఇయ = గాంగేయ
3. కద్రూ + ఇయ = కాద్రవేయ
4. సత్యవతీ + ఇయ = సాత్యవతేయ
5. శకుంతలా + ఇయ = శాకుంతలేయ
6. ద్రౌపదీ + ఇయ = ద్రౌపదేయ
7. రేణుకా + ఇయ = రైణుకేయ
8. వాసవీ + ఇయ = వాసవేయ
9. కుంతీ + ఇయ = కౌంతేయ
10. సరస్వతీ + ఇయ = సారస్వతేయ
11. అరణీ + ఇయ = ఆరణేయ (శుక)

అంబికా, సత్యవతీ, శకుంతలా, రేణుకా, కుంతీ, సరస్వతీ, వాసవీ, గంగా, కద్రూ, అరణీ ఇవి అన్నియు స్త్రీల నామములు. వాటి నుండి అపత్యార్థమును బోధించు పదములు ఏర్పడినవి. అరణి స్త్రీ శబ్దము నుండి ఆరణేయ (శుక) పదము ఏర్పడినది. అంతేకాని అరణి కాష్ఠము కానేరదు. శుకుడు అరణి పుత్రుడే. దేవతారణి దేవతల తల్లి అదితి. అరణి వ్యాసుని భార్య. శుకుని కన్న తల్లియని సిద్ధాంతము. అరణి శబ్దము స్త్రీ మాత్రము భార్య అనే అర్థములో వాడబడింది. నిమి భార్యకు మిథి జన్మించుటను గూర్చి చెప్పిన శ్లోకము వాయుపురాణము 27వ అధ్యాయం 5వ శ్లోకం. అరణి నిమి భార్య. అరణ్యాం కాష్ఠమందు అని ఇచ్చట అర్థము చెప్పుట కుదరదు.

**అరణ్యాం మథ్యమానాయాం ప్రాదుర్భూతో మహాయశాః ।**
**నామ్నా మిథిరితి ఖ్యాతో జననాజ్జనకోఽభవత్ ॥**

మధ్యమానమైన అరణి నుండి (నిమి భార్యకు) మిథి జనించెను. వాయుపురాణము 35వ అధ్యాయం 23వ శ్లోకము. ఆనందాశ్రమ గ్రంథమాల 1983 ఎడిషన్.

**శ్లో॥ పురారణీ గర్భమదత్త దివ్యం తపఃప్రకర్షాదదితిః పురా యమ్ ।**
**శక్రం చ యో దైత్యగనావరుద్ధం గర్భావమానేన భృశం చకార ॥**

పూర్వము అదితి అనెడి అరణి గర్భము ధరించి దైత్యగణములను నాశము చేయు ఇంద్రుని పుత్రునిగా పొందెను. పితరౌ పితరులు తల్లిదండ్రులు మాతాపితరౌ అను సమాసము ఏకశేషవృత్తి కాగా, మాతా శబ్దము లోపించి "పితరౌ" అని ద్వివచనములో నుండును. దీనిలో ద్వివచనమున్నందున "తల్లి" శబ్దార్థము కూడా ఇమిడియున్నది.

**శ్లో॥ వాగార్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే ।**
**జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ ॥** 29

జగత్తునకు మాతాపితలు, పితరులు, పార్వతీపరమేశ్వరులు. కాళిదాసు "జగత్తును సృష్టించిన మాత పార్వతి" అని చెప్పెను. పార్వతీపరమేశ్వరులు ఇద్దరు జగత్తునకు తల్లిదండ్రులు. శుకునకు మాత యుండదా? అది కాష్ఠమా? ఈ భావన అసంగతము. శుకుని మాతృమూర్తి అరణి వ్యాసుని ధర్మపత్ని. క్షేమేంద్రుడు తన భారతమంజరిలో శుకుడు పితరులకు నమస్కరించి మోక్షసాధనకు పోయెనని చెప్పెను.

**శ్లో॥ శ్రుత్వేత్యవాప్తనిర్వేదః శుకః త్యక్త్వా స్వయమాశ్రయమ్ ।**
**ఆమన్త్ర్య పితరౌ యోగీ యయౌ శ్రేయః సమాధయే ॥**

శుకుడు పితరులకు (తల్లిదండ్రులకు) ఆ మంత్రణము చెప్పి శ్రేయః సాధనమునకు పోయెను. శుకుని తల్లి అరణి వ్యాసునితోనే ఆశ్రమమున కలదని స్పష్టముగా దీనివల్ల తెలియుచున్నది. "ప్రాచీనకాలమునుండి శబ్దసాదృశ్యమువలన అనేక కాల్పనిక అభిప్రాయములు గల కథలు సృష్టించబడినవి" వ్యాసునికి అరణి అను భార్య వలన శుకుడు జనించెను. తరువాతి కాలమున 'అరణి' యనగా కాష్ఠమని తలంచి కాష్ఠమునుండి శుకుడు జనించెనని కథను కల్పించిరి – శ్రీరామ శంకర భట్టాచార్య అనువారు "ఇతిహాస్ పురాణోం కా అనుశీలన్" అను తన హిందీ గ్రంథములో పై అభిప్రాయమును తెల్పిరి.

ఈ విషయమునే అనేక ఉదాహరణములతో, పర్గిటర్ మహాశయుడు తన "ఎన్షియంట్ ఇండియన్ హిస్టారికల్ ట్రెడిషన్స్" అను గ్రంథములో సమగ్రముగ చర్చించిరి. వేదకాలమున – 5వేల ఏండ్లకు పూర్వము జంతువుల పేర్లు – పక్షుల పేర్లు – జడముల పేర్లు – విచిత్రములైన భావనామములు – మనుష్యులకు పెట్టుచుండిరి.

ఉదా:– ఋక్ష, ఋషభ, కురంగ, వత్స, రురు, శకుని, హంస, శుక, ఉలూక, అశ్వత్థ, ప్లక్ష, నల, ముంజ, శక్తి, మన్యు మున్నగు నామములు పురుషులకు కలవు. మాలతీ, పద్మినీ,

సునందా, ఇంద్రసేనా, సత్యవతీ, మాలినీ, అరణీ, ఘృతాచీ, సన్నతి, ఊర్వశీ, గో మున్నగునవి స్త్రీల పేర్లు. పేర్లను బట్టి విచిత్రమైన కథలను కల్పించిరి.

**1. శుక జననవృత్తాంతము :** ఒక అద్భుతమైన కల్పన చేయబడినది. వ్యాసుని భార్య అరణి. అగ్నిని పుట్టించు కాష్ఠముగా కల్పన చేయబడినది. శుకుడు కాష్ఠము నుండి జనించెనని కల్పించిరి.

**2. ద్రోణుని జనన వృత్తాంతము :** భరద్వాజుడు అనువాని భార్య ద్రోణి. ఆమెకు ద్రోణుడు జనించెను. కాని ద్రోణి (కుండ) యని భావించి ద్రోణుడు కుండలోనుండి జనించెనని కల్పించిరి. శుకుడు కాష్ఠము నుండి జనించుట, ద్రోణుడు 'ద్రోణి' (కుండ)లో నుండి జనించుట, వేదశాస్త్ర విరుద్ధములు కనుక అసత్యములు. శుకుడు అరణి యను స్త్రీకి జనించెను. వ్యాసుడు గృహస్థుడు.

వ్యాసుడు అగ్నిచికీర్షతో అరణిని మథించుచుండెను. ఘృతాచి యను అప్సరస ఆకాశమున ప్రత్యక్షమైనది. వ్యాసుడు కామమోహితుడు కాగా ఘృతాచి వంచన చేయనెంచి, "శుకి" యైనది. ఆయన వీర్యము అరణియందు బడినది. అరణి నుండి శుకుడు జనించెను. అగ్నిచికీర్షయనగా "అగ్నిని పుట్టింపవలె॥నను కోరిక. అగ్ని యజ్ఞముచేయుట కుపయోగించును. అగ్నివంటివాడే సత్పుత్రుడు. తన కార్యములను తన తదనంతరము కూడ కొనసాగించును. గార్హపత్యాగ్ని నుండి, ఆహవనీయాగ్ని, దక్షిణాగ్ని పుట్టును. ఒక అగ్నినుండి వేరొక అగ్ని పుట్టినట్లు, తండ్రివలన కుమారుడు పుట్టును. బ్రహ్మచారి అగ్నికార్యము చేయనక్కరలేదు. గురువుగారి అగ్నిలోనే మూడు సమిధలను వేయును. సంన్యాసికి అగ్నికార్యముతో పనిలేదు. ఆచరింపడు కూడ. వ్యాసుడు అగ్నిచికీర్షతో అరణిని మధించుచుండెననగా గృహస్థుడు లేదా వానప్రస్థుడు కావలెను. వీరు అగ్ని కలిగియుండి అగ్నికార్యమును – యజ్ఞమును చేయుదురు. కనుక వ్యాసుడు గృహస్థుడు. గర్భాదానసంస్కారము ద్వారా జాయయగు అరణితో కూడి పుత్రుని పొందెను. వ్యాసుడు గృహస్థాశ్రమమును త్యజించలేదు. గృహస్థుడై సంతతిని పొందెను.

స్త్రీపురుషుల సంయోగమువలన స్త్రీ గర్భమును ధరించును. దశమమాసమున తల్లిదండ్రుల వలన సంక్రమించిన శరీరముతో పుత్రుడు జనించును. ఈ విషయమును వేదములు, స్మృతులు, శాస్త్రములు సమర్థించుచున్నవి. అట్లుగాక కాష్ఠము (అరణి) నుండి బాలుడు జనించుట వేద, స్మృతి, శాస్త్రములకు విరుద్ధము కనుక అసత్యము. తిరస్కరింపదగినది.

**వేదముల సమర్థన :**

**1. శ్లో॥ ధాతః శ్రేష్ఠేన రూపేణాస్యానార్యాగవీన్యోః!**
**పుమాంసం పుత్రమాధేహి దశమే మాసి సూతవే ॥** – 31

పదవ నెలలో పుత్త్రుడు జన్మించును.

2\. శ్లో॥ **ఏజతు దశమాస్యో గర్భః జరాయుణా సహ ।** – 32

పదవనెలకల గర్భము (జీవుడు) జరాయువుతో బయటకు వచ్చుగాక.

3\. శ్లో॥ **తస్మాత్ ఋత్వియాత్ స్త్రియః ప్రజాం విందన్తే ।** – 33

4\. శ్లో॥ **యథా వాతో యథా వనం యథా సముద్ర ఏజతి ।**
**ఏవాత్వం దశమాస్య సహావేహి జరాయుణా ॥**
ఓ దశమాస్యుడా! జరాయువుతో బయటకు రమ్ము
దశమాస్యుడు : దశమాసముల బిడ్డ – 34

స్త్రీ జాయ – పుత్త్రుని ఇచ్చునది. 'కులపా' వంశమును రక్షించునది. వైదిక ఋషులు స్త్రీని గౌరవించిరి. స్త్రీ నీచ వర్గమని భావించి నిందించుట వేదవిరుద్ధమే. సామవేదమునకు సంబంధించిన మైత్రేయోపనిషత్తులో (200 పుట) కల అంశము :- "**భగవన్ ఇదం శరీరం మైథునాదేవోద్భూతం**" ఈ శరీరము స్త్రీ పురుషుల మైధునము వలననే పుట్టినది. "దశమే మాసి సూతయే" అని బృహదారణ్యకోపనిషత్తులో కలదు. వేదములు ఘంటాపథముగా స్త్రీ పురుషుల మైథునము వలన పుత్రునికి శరీరము లభించుననియు, దశమ మాసమున జనించుననియు చెప్పుచున్నవి. స్మృతులు, మహాభారతము, పురాణములు ఈ విషయమును సమర్థించుచున్నవి. ఆదిపర్వం 74 అధ్యాయం – 63 శ్లోకం.

1\. శ్లో॥ **అంగాదంగాత్ సంభవసి హృదయాదధిజాయతే ।**
**ఆత్మా వై పుత్త్ర నామాసి సజీవ శరదః శతమ్ ॥** – 35

ఓయీ పుత్రా! నీవు స్త్రీ పురుషుల శరీరముల సంయోగముచే కలుగుచున్నావు. నా ఆత్మయే నీవు పుత్త్రుడవుగా జన్మించుచున్నావు. నూరేండ్లు జీవించుదువు గాక! దీనినే నన్నయ ఆంధ్రమహాభారతమున స్పష్టముగ చెప్పెను. (ఆదిపర్వం 3వ ఆశ్వాసం – 221 వచనం) 2. మఱియు గర్భయోనియందు ఋతుపుష్పరససంయుక్తంబగుచు రేతంబుగాడ్పుచేతంబ్రేరితంబయి కలసిన నందు పంచతన్మాత్రలు పొడవయి (లొడలయి) క్రమంబుననవయవంబులేర్పడి లబ్ధయోనులయి యుద్భవిల్లి... మనుష్య యోనులంబుట్టి..." శుక్లశోణితముల కలయికచే బాలుని శరీరము ఏర్పడును. తిక్కన మహాభారతమున ఈ విషయమునే చెప్పెను. – 36

కం ॥ ఎనయగ శుక్లము శోణితమును బెరసి వెలంది గర్భమున నెలకొను – 37.

శ్లో॥ **యే గుణాః పురుషస్యేహ యే చ మాతృగుణాః తథా**
**అస్థి స్నాయుశ్చ మజ్జా చ జానీమ పితృతో గుణాః ।**

**త్వగ్మాంసశోణితం చేతి మాతృజాన్యపి శుశ్రుమ**
**ఏవమేతాన్ ద్విజశ్రేష్ఠ వేదే శాస్త్రే చ పఠ్యతే ॥** – 38.

ఎముకలు, స్నాయువులు, మజ్జ అను త్రిధాతువులు తండ్రి నుండి బిడ్డకు సంక్రమించును. అట్లే త్వక్కు, మాంసము, రక్తము, మేధ ఈ నాలుగును తల్లి నుండి బిడ్డకు సంక్రమించును. ఈ విషయము వేదశాస్త్రములలో స్పష్టముగా కలదు. ధర్మపత్నివలన పుత్రుడు జన్మించును. తండ్రియే కుమారుడుగా జన్మించును. భర్త తన వీర్యరూపమున భార్య గర్భమున ప్రవేశించి మరల పుత్రుడుగా జనించును. అందుచేతనే భార్యకు జాయ అని పేరు అని మనువు చెప్పెను.

**5. శ్లో॥ పతిః భార్యాయం సంప్రవిశ్య గర్భో భూత్వేహ జాయతే ।**
**జాయయాస్తద్ధి జాయాత్వం యదస్యాం జాయతే పునః ॥** – 39

స్త్రీ పురుషుల కలయికచే శుక్లశోణితముల కలయికచే జీవుడు తల్లిగర్భమున దేహమును ధరించును. ఆ జీవుడు తల్లి గర్భములో నవమాసములు జఠరాగ్నిజ్వాలలచే కాల్చబడును. దశమ మాసమున జనించును. ఈ విషయమును పద్మపురాణము స్పష్టము చేసినది.

**శ్లో॥ స్త్రీ పుంసో సంయోగాత్ సంపాతే శుక్రశోణితయోః ।**
**ప్రవిశన్ జీవః శనకైః సర్వకర్మణా దేహమాదత్తే ॥**

**శ్లో॥ మాతృగురూదర్యాం కఫమూత్రపురీషపూర్ణాయామ్ ।**
**జఠరాగ్నిజ్వాలాభిః నవమాసం పచ్యతే జంతుః ॥**

## శాస్త్ర సమర్థన

**సుశ్రుతుడు :** గర్భాదానసంస్కారము వలన జితేంద్రియులు. ధర్మాత్ములు జనించుదురు. స్త్రీ పురుషుల ఆహారము – ఆచారములు, చేష్టలు ఎట్లుండునో, దానిననుసరించి పుత్రుడు జనించును. గర్భాధానసంస్కారమునకు ముందు రోజులలో స్త్రీపురుషులు (భార్యాభర్తలు) శుద్ధసాత్వికాహారమును భుజింపవలెను. స్త్రీ పురుషుల కలయికచే జనించు పుత్రుడు వారి గుణములతోనే విలసిల్లును. "**కారణమును అనుసరించి కార్యము జరుగునని**" ఆచార్యుల వచనము.

**శ్లో॥ ఆహారాచారచేష్టాభిః యాదృశీభిః సమన్వితౌ ।**
**స్త్రీపుంసౌ సముపేయతాం తయోః పుత్రో పితాదృశః ॥** – 41.

**గౌడపాదుడు (సాంఖ్యశాస్త్రము) :–**

గౌడపాదుడు సాంఖ్యకారిక 39లో శరీరములు మాతాపితృజములు (మాతాపితృజాః)

అని వ్రాసెను. “మాతాపితృజా, షట్ కౌశికాః తత్రమాధీతోలోమలోహితమాంసాని, పితృతస్తు స్నాయ్వస్తిమజ్జాన ఇతి” షట్కోశాః – అని వ్యాఖ్యాత వివరణము (వాచస్పతిమిశ్ర) ఋతు– కాలమున మాతాపితలు కలయికచే, శుక్లశోణితముల మిశ్రీభావముచే శరీరము ఏర్పడును.

**సిద్ధాంతము :** వ్యాసుని వీర్యము కాష్ఠమున పడుట – వెంటనే శుకుడు జనించుట వేదశాస్త్ర విరుద్ధము. కనుక అసత్యములు. వ్యాసునకు ధర్మపత్నియైన అరణికి శుకుడు జనించెను. అరణి గర్భవతియై దశమమాసమున శుకుని కనెను.

**అరణిని మథించుట యనగానేమి?**

అరణి స్త్రీయనియు, వ్యాసుని భార్యయనియు నిరూపించబడినది. మథ్ధాతువు నుండి, మథ్నాతి, మథ్నామి క్రియలు ఏర్పడును. మథ్నాతి భార్యను కలియుచున్నాడు. అని కాత్యాయన శ్రౌతసూత్రములలో కలదు. కాత్యాయన శ్రౌత సూత్రము. చతుర్దశ ఖండిక. ప్రాగ్ముఖం ఉదంగ్ముఖోః పవిష్టో మన్థయతే రేతో మూత్రమితి చైకే స్రావణం కుర్యాత్ (మంథే ద్రేతో అని పాఠాంతరము) మథించు భార్యను కూడు, మంథయతే మథించుచున్నాడు. భార్యను కూడుచున్నాడు. “ఇచ్చట మథ్” ధాతువు పురుషుడు స్త్రీతో రమించుటను సూచించుచున్నది. అరణిని మథించుచున్నాడనగా అరణిని కూడుచున్నాడని అర్థము. **సంసారము చేయుట యజ్ఞకార్యమువలె పవిత్రమైనది. పురుషుడు ఊర్ధ్వారణి, స్త్రీ అధరారణి, పుత్రుడు అగ్ని. ఇది మనోహర రూపకము.** అంతేకాని వాస్తవమునకు శుకుని తల్లి “అరణి” కాష్ఠము కాదు. శుకుడు అగ్ని కూడ కాదు. గురువు ఊర్ధ్వ అరణి శిష్యుడు అధరారణి. విద్యాధ్యయనము వలన పుట్టిన జ్ఞానము అగ్ని. ఇది కూడ ఉపనిషత్తులలోనున్న మనోహరరూపకము మాత్రమే. గర్భాదానమంత్రములు బృహదారణ్యకోపనిషత్తు అంతిమ భాగమున కలవు. గర్భాదాన సంస్కారము పవిత్రమైనది. నిందనీయము కాదు. దీనిని “పుత్రమంథక్రియ” అందురు. బోధాయనగృహ్యసూత్రములలో కూడ ఈ విషయము కలదు.

**“అహమస్మి సా త్వం ద్యౌరహం పృథివీ త్వం రేతోఽహం రేతో భృత్వమ్”** – 42.

నిశ్చితమైన మాంగలికకృత్యముల నాచరించి, పతి పత్ని నాగలింగము చేసికొని ఈ పై మంత్రమును పఠించును. నేను ప్రాణమును. నీవు వాక్కువు. నేను సామమును నీవు ఋక్కువు. నేను ద్యౌ (ఆకాశము, స్వర్గము) నీవు భూమివి” – మనము ఆనందముతో కూడి పుత్రుని పొందుదము. గర్భాదానము రాత్రియందు జరుగవలెను. పగలు నిషిద్ధము. పగలు గర్భాదానము జరిగిన అల్పభాగ్యులు, అల్పవీర్యులు, అల్పాయుష్కులు జనింతురు. అందుచే అరణిని వ్యాసుడు మథించినది రాత్రియే. పగలు మాత్రము కాదు. గర్భాదానమును పతియే చేయును. ప్రాచీన–

కాలమున భర్త లేనిచో దేవరగర్భాదానము చేయు పద్ధతి కలదు. వ్యాసుడు పగలు "అరణిని మథించెనన్నచో, అతడు శాస్త్రవిరుద్ధకార్యములను ఆచరించెనని, నీతిబాహ్యుడని చెప్పవలసి వచ్చును. రాత్రియందే అరణిని కూడి గర్భాదానము చేసెనని సిద్ధాంతము" – ఈ సిద్ధాంతముతో వ్యాసుని మానసిక వ్యభిచారము చేసెనను దోషమును తొలగించవచ్చును.

"అరణి కాష్ఠమును మథించుట – అందుండి శుకుడు జనించుట" బాహ్యమునకు వ్యర్థమని తోచు కల్పన మాత్రమే.

**అప్సరసలు ఎవరు? గంధర్వులు ఎవరు?**

1. సూర్యో గంధర్వః తస్యఽ మరీచయోఽ ప్సరసః
2. చంద్రమా గంధర్వః తస్య నక్షత్రాణ్యప్సరసః
3. వాతో గంధర్వః తస్యాపోఽ ప్సరసః

సూర్యుడు గంధర్వుడు. అతని మరీచులు అప్సరసలు. మరీచులనగా త్రసరేణువులు (కిరణములు). చంద్రుడు గంధర్వుడు. నక్షత్రములు అప్సరసలు. (వాత) వాయువు గంధర్వుడు. వాయువు ద్వారా వచ్చెడి జలము అప్సరస. ఆప్సు అంతరిక్షే సరన్తి : అంతరిక్షమున పయనించునది – సూర్యకిరణము.

అరబ్ దేశపు స్త్రీలు అప్సరసలు. పాశ్చాత్యుల పరిపాటిలో ద్వీపము నేటి సోవియట్ లాండ్. శ్వేత వర్ణముగల అచ్చటి స్త్రీలు అప్సరసలు. "ఘృతాచీ మేనకా ఊర్వశీ" ఇవి సూర్యకిరణములు పేర్లు. అప్సరసలు దేవవేశ్యలని అద్భుత కల్పన. వేదశాస్త్రవిరుద్ధము. అప్ సరస్ రక్తము వీర్యమున సంచరించునది. "జీవశక్తి, చైతన్యశక్తి"ని అప్సరస అనవచ్చును. గంధర్వులు వీరు ఒక జాతి ప్రజలు. హిమాలయమున కావల వసించిరి.

"అరబ్బుదేశస్థులను గంధర్వులు అందురు". వరుణః ఆదిత్యో రాజేత్యాహతస్య గంధర్వాః విశః శతపథబ్రాహ్మణము. వరుణుడు రాజు. అతని ప్రజలు గంధర్వులు. ధర్మ మేఘ సమాధిని పొందిన మహాయోగులు. జీవన్ముక్తులు గంధర్వులు. సూర్యుడు, చంద్రుడు వాతము (వాయువు) వీరు గంధర్వులు.

"గాం వేద వాచం ధరతి ఇతి గంధర్వః
గం బ్రహ్మ తద్ధరతీతి గంధర్వః
పరబ్రహ్మను మనస్సున ధరించువాడు – వేదాన్తవేత్త – విద్వాంసుడు
గాం వేద వాచం ధారయతి విచారయతీతి గంధర్వః ।
వేదవాక్కులను మననము చేయువాడు గంధర్వుడు – 48.

సామగుడు – సామవేదపండితుడు గంధర్వుడు ।

యజ్ఞమండపమున నున్న బ్రాహ్మణులు (సదస్యులు) గంధర్వులు ।

"సదస్య బ్రాహ్మణస్య గంధర్వత్వం ఉక్తం అథవా వేదజ్ఞో విద్వాన్ ॥ –49

**వేదవిద్వాంసుడు గంధర్వుడని సిద్ధాంతము :** శుకుడు జనించగా గంధర్వులు వచ్చి పాడిరి. అప్సరసలు నాట్యము చేసిరి. సామవేద పండితుడు సామగానము చేసెను. ఆ వేద పండితులు భార్యలు నృత్యము చేసిరి" అని భావము.

**ఘృతాచి సమస్య :** కృష్ణ 'వ్యాసుడు' అరణిని మథించుచుండగా ఆకాశమున ఘృతాచియను అప్సరస ప్రత్యక్షమైనది. వ్యాసుడు మోహితుడు కాగా అతనిని వంచించుటకు ఘృతాచి శుకి రూపమును దాల్చినది. వ్యాసుడు దానిని ముద్దిడి కౌగిలించుకొనెను. ఈ కథననుసరించి ఘృతాచి యనగానేమి? ఆకాశమున వచ్చుట ఎట్లు? 'శుకి' యగుట అనగానేమి? వ్యాసుడు ముద్దిడుట, కౌగిలించుకొనుట యనగానేమి? ఈ ప్రశ్నలకు సరియైన సమాధానమును అన్వేషించి సారమును చెప్పుట కర్తవ్యము. బాహ్యముగా "వ్యాసుడు పరస్త్రీ వ్యామోహముచే ఘృతాచియను స్త్రీని కాంక్షించి ముద్దిడుకొని, కౌగిలించుకొనెనని తోచును. కాని వాస్తవమునకు వీనిలో గూడార్థమున్నది. పరిశీలించవలెను.

### ఘృతాచి వివిధార్థములు

పూర్వకాలమున ఘృతాచి అను పేరుకల స్త్రీలు ఎందరో కలరు.

1. ప్రమతి (వాశిష్ఠుడు) – ఘృతాచి; రురుడు వీరి పుత్రుడు.
2. కుశనాభుడు – ఘృతాచి; 100 మంది కన్యకలు జనించిరి.
3. రుద్రాశ్వుడు (భద్రాశ్వుడు) – ఘృతాచి; వీరికి పదిమంది పుత్రులు – 10 మంది పుత్రికలు జనించిరి – ఈ పదిమంది కన్యకలు అత్రి భార్యలు.
4. విశ్వకర్మ – ఘృతాచి; వీరికి పుత్రుడు జనించెను.
5. ఘృతాచి అర్జునునితో ప్రసంగించెను.
6. ఘృతాచి అష్టావక్రునితో మాట్లాడెను.
7. ఘృతాచికి దేవవతియను కూతురు పుట్టినది.

ఈ అంశములన్నియు పౌరాణికకోశమున కలవు. ప్రాచీనకాలమున స్త్రీలకు ఘృతాచి యను పేరు కలదు.

**1. ఘృతాచి :** మహాదేవి : గాయత్రీ స్వరూపమహాదేవీ ఘనారిమండలా ఘూర్ణీ ఘృతాచీ ఘనవేగినీ 50 (వ్యాసుడు దేవీ ఉపాసకుడని పరంపరగా చెప్పుచున్నారు.)

2. **ఘృతాచి :** (అప్సరస) త్రసరేణువు సూర్యకిరణము తేజస్సు.

3. **ఘృతాచి :** (రాత్రి – సూర్యకిరణములను త్రాగునది) కౌత్సవ్య నిఘంటు – 74

**4. ఘృతాచిధియం కర్మ :** దేనియందు ఘృతము చేయబడునో అకర్మఘృతాచి మిత్రం హువేపూతదక్షం 1 వరుణం చరిశాదిసమ్ ధియం ఘృతాచీంసాధన్తా.

**దీనికి ఉవ్వటవ్యాఖ :** "ఘృతాచీం యేన కర్మణా ఘృతముచ్చర్యతే హూయతే తత్కర్మ

**మిత్ర = సూర్య, ప్రాణ :** వరుణ – అపాన – సూర్యుడును, వాయువును బాహ్యమున కలవు. అంతరమున శరీరమున ప్రాణమును అపానమును కలవు. వీని సమన్వయము చేయు బుద్ధి ఘృతాచీ.

**5. ఘృతాచ్యసి జుహూర్నామ్నా ఘృతాచ్యస్యుపభృన్నామ్నా ఘృతాచ్యసిధ్రువా నామ్నా**

జుహూ :– ఉపభృత్ – ధ్రువా అను మూడు రకములైన గరిటెలు నెయ్యి పాత్రలలో నుండి తీసి యజ్ఞమున వేయుటకు ఈ గరిటెలు ఉపయోగపడును. జుహూ మున్నగు గరిటెలకు (తెడ్డులకు) చివర చిలుకముక్కు ఆకారముండును. ఇది నేయి జారుటకు ఏర్పాటు అర్ధచంద్రాకారము.

6. నేతిలో ముంచిన సమిధకు **ఘృతాచి** అని పేరు.

**యజ్ఞమునకు తగిన కాలము :** బ్రాహ్మణునకు వసంతర్తుతువు : క్షత్రియునకు గ్రీష్మర్తువు, వైశ్యునకు శరదృతువు విహితములు. ఉక్త ఋతువులలో అమావాస్య లేక పూర్ణిమా తిథులయందు అగ్న్యాధానము చేయవలెను. **వసన్తే బ్రహ్మణోఽగ్నీ నాదధీత గ్రీష్మే రాజన్యశరదీ వైశ్యః** అగ్నిసాధ్యమైన కర్మ చేయుటకు అపత్నీకునకు అధికారము లేదు. యుధిష్ఠిరమీమాంసకకృత "శ్రౌతయజ్ఞోంకా సంక్షిప్త పరిచయ" అను హిందీ గ్రంథములో వివరములు గలవు. సూర్యరథము ఘృతాచి (సూర్యకిరణము).

1. మాఘమాసమున (తపోమాసమున) సూర్యుని రథముపై అన్యదేవ గణములతో ఘృతాచి యుండునని భాగవతమున నవమస్కంధమున, (20–5) ద్వాదశస్కంధమున కలదు. దీనికి భిన్నముగా ఇతర పురాణములన్నింటిలో కలదు. **భగవాన్ సూర్య** అను గీతాప్రెస్ వారి పుస్తకంలో పూషా సూర్యుని ధ్యానం ఈ విధంగా ఉన్నది.

**శ్లో॥ పూషా ధనంజయో ధాతా సుషేణః సురుచిస్తథా ।**
**ఘృతాచీ గౌతమశ్చేతి తపోమాసం నయన్త్యమీ ॥**

తపోమాసం ఆశ్వినమాసం. ఈ మాసంలో సూర్యుని రథంలో పూష – ఆదిత్యుడు ఉండును. గౌతముడు ఋషి. ఘృతాచి అప్సరస. సురుచి గంధర్వుడు. ధనంజయుడు అను నాగుడు, సుషేణుడను యక్షుడు, ధాతా అను రాక్షసుడు వీరందరు సూర్యుని రథంలో ఆశ్విన మాసంలో ఉంటారు. శరదృతువులో ఆశ్విన మాసమున సూర్యుని రథముపై ఘృతాచి యుండును. ఈ విషయము విష్ణుపురాణమున, బ్రహ్మాండపురాణమున, లింగపురాణమున, మత్స్యపురాణమున, కూర్మపురాణములలో కలదు. ఎక్కువగా పురాణములన్నియు ఈ విషయమును బలపరచినవి.

ఘృతాచి అను అప్సరస సూర్యుని రథమందు ఆశ్విన మాసమున నుండును. ఆశ్వినము శరదృతువు అగును. ఘృతాచిని చూడగా వ్యాసునివీర్యము అరణియందు పడినది. కనుక అది గర్భాధానకాలము. ఈ ఘృతాచీ పదమునకు సూర్యకిరణము అను అర్థమును గ్రహించవలెను. ఘృకరణదీప్త్యో గృ, ఘృ సేచనే = ఘృతం జలం జలమును త్రాగునది = సూర్యకిరణము (సూర్య ప్రకాశము) పగలు ఘృతాచి (సూర్యకిరణము) కనబడినది. మరల కనబడకుండా మాయమైనది. సూర్యకిరణముల ప్రకాశము లోపించగా రాత్రి వచ్చినది. జుహూ తెడ్డు రూపమున మంథక్రియ చేయుటకు వ్యాసుని ఆకర్షించినది. దాని సాహాయ్యమున వ్యాసుడా మంథక్రియ గర్భధాన సంస్కారమును ముగించెను. పగలు స్త్రీ పురుషుల సంగమము నిషిద్ధము. కనుక వ్యాస అరణుల సంగమము రాత్రి యందే జరిగినది.

ఆశ్విన మాసమున గర్భాధానము కనుక దానికి 10వ మాసమున ఆషాఢ మాసమున శుకుని జననము జరిగినదని సిద్ధాంతము. 1. ఆశ్వయుజము, 2. కార్తికము, 3. మార్గశిరము, 4. పుష్యము, 5. మాఘము, 6. ఫాల్గునము, 7. చైత్రము, 8. వైశాఖము, 9. జ్యేష్ఠము, 10. ఆషాఢము. దశమాస్యుడైన శుకుడు అరణి గర్భము నుండి దశమమాసమున (ఆషాఢమున) జనించెను. ఇది సిద్ధాంతము. నాస్తి మాతృసమో గురుః – 54 తల్లితో సమానమైన గురువు లేడు. మాతృమాన్ పురుషో వేద (వేదవచనము) తల్లి కలవాడు జ్ఞానము పొందును. తల్లికి ప్రథమస్థానము అరణి ధన్యురాలు. దీనివలన వ్యాసుడు ఘృతాచి యను అప్సరస (అన్యకాంత)పై వ్యామోహము కలవాడు అను నింద, భ్రాంతి తొలగును.

1. ఘృతాచిని చూచి భరద్వాజుడు కామపీడుతుడయ్యెను. ఆయన వీర్యము స్కలితము కాగా ద్రోణి (కుండ) యందుంచిరి. ఆ ద్రోణి నుండి ద్రోణుడు జన్మించెను. (మహాభారతము ఆదిపర్వము 129వ అధ్యాయము)

2. ఘృతాచిని చూడగానే భరద్వాజుని వీర్యము పడినది. ఆ వీర్యము వలన శ్రుతావతీ అనుకూతురు పుట్టినది. పర్ణపుటము శ్రుతావతి జన్మస్థానము. ఆమె తపస్సు చేసి ఇంద్రుని భర్తగా పొందినది. (శల్యపర్వము 48వ అధ్యాయము)

3. శరద్వంతుని వృత్తాంతము (కృపుని జన్మ). 4. అగస్త్య, వసిష్ఠుల జన్మ (మహాభారతము – విష్ణుపురాణము). 5. కుంభుని జన్మ (యోగవాసిష్ఠం).

ఈ కల్పనలు కూడ అద్భుతములే. ఘృతాచి సూర్యకిరణము. ఆశ్వయుజమాసమున గర్భాదానసంస్కారము జరిగెనని సిద్ధాంతము. పైకి అసభ్యముగానున్నను వీనిలో గూఢార్థము కలదని సిద్ధాంతము.

## వ్యాసుని తపస్సు

వ్యాసుడు పుత్త్రార్థమై నూరేండ్లు మేరుపర్వతముపై తపస్సు చేసెను. నూరేండ్లు తపస్సు చేయుట మానవునికి సాధ్యమా? మేరుపర్వతము ఏది? ఈ ప్రశ్నలకు సమాధానము చెప్పవలెను. మానవుని వయస్సు నూరేండ్లు – అయిన వ్యాసుడు ఎట్లు వంద ఏండ్లు తపస్సు చేసెను. శతాయుర్వై పురుషః (పురుషుడు నూరేండ్లు వయస్సు కలవాడు). శతం వర్షాణి పురుషాయుషో భవన్తి. దేవతల ఆయువు మూడువందల ఏండ్లు. "దేవాన్ అబ్రవీదేతాని యూయం త్రీణి శతాని వర్షాణాం సమాపయథేతి" – (జైమిని బ్రాహ్మణ). వ్యాసుడు దేవత్వము పొందినను 300 ఏండ్లు ఆయువు. 100 ఏండ్లు ఎట్లు తపస్సు చేసెనను సంశయము కలుగును. ఇటువంటి అద్భుతములే కొన్ని కలవు.

1. రాముడు పదునొకండు (11) వేల ఏండ్లు రాజ్యము చేసెను. (రామాయణము – బాలకాండ– 30 సం॥ 6 నెలల 20 రోజులు)

2. అయిదువేల ఏండ్ల వయస్సు కల బాలుడు అకాలమరణమును పొందెను. (13 సం॥ 10 నెలల 20 రోజులు)

3. అపర్ణ 2వేల ఏండ్లు తపస్సు చేసెను (ఏడు = దినము) 5 సం॥ 6 నెలల 20 దినములు.

4. ఏకపర్ణ ఏకపాటల వేయేండ్లు తపస్సు చేసిరి. (హరివంశము) (2 సం॥ 9 నెలల 10 రోజులు)

5. కార్తవీర్య అర్జునుడు దత్తుని గూర్చి 10వేల యేండ్లు తపస్సు చేసెను. (హరివంశము), 27 సం॥ 9 నెలల 10 రోజులు.

6. భరతుని రాజ్యకాలము 27 వేల వర్షములు – 75 సం॥ 4 మాసములు.

7. సగరుని రాజ్యకాలము 30వేల వర్షములు – 83 సం॥ 4 మాసములు.

8. అలర్కుని రాజ్యకాలము 66వేల సంవత్సరములు. అనగా 183 సం॥ల 4 మాసములు.

ఇవి దివ్యసంవత్సరములలో చెప్పినవి. మానవుల దినమును దివ్యవర్షముగా గణించు పద్ధతి వచ్చినది. దానివలన ఇన్ని వేల సంవత్సరములని చెప్పుట జరిగినది. ఈ కాలములు అద్భుతములుగా తోచును. వాస్తవము భిన్నముగా నున్నది. వాల్మీకి రామాయణము ఉత్తరకాండ – 73వ సర్గ 5వ శ్లోకమునకు టీక వ్రాయుచు టీకాకర్త ఇట్లు వ్రాసెను. "వర్షశబ్దోఽత్ర దినపరః" ఈ తిలక వ్యాఖ్య ఆధారముతో సంవత్సరమును దినముగా లెక్కించవచ్చును. వ్యాసుని తపస్సు నూరు ఏండ్లు (శతం సమాః) అనగా నూరు దినములని అర్థము. ఇది సిద్ధాంతము. శుకచరిత్ర ప్రబంధకర్త రామమూర్తి దీనిని చెప్పక విడిచిపెట్టెను.

**వ్యాసుడు తపస్సు చేసిన మేరుపర్వతము :–** ప్రాచీన దేశవర్ణమునకు నాభి స్థానము మేరువు. ఎత్తగునేలకు మేరువు అని పేరు. మేరువనగా చీనాయనిగాని, తుర్కీయనిగాని తోచును. జలప్రళయము జరిగెను. మనువు సృష్టి నశించగా సుమేరు పర్వతముపై పునః సృష్టిని చేసెను. మేరు సుమేరు నామములు హిమవత్పర్వతమునకు గలవు. కాశ్మీరుకు ఉత్తరముగా నున్న హిమాలయ ప్రదేశము కేదార్‌నాథ్ పరిసర పర్వతము హిమాలయముయొక్క రెండవ పేరు మేరువు.

**శ్లో॥ హిమాలయోఽభిధానోఽయం ఖ్యాతో లోకేషు పావనః ।**
**అర్ధయోజనవిస్తారః పంచయోజనమాయతః ॥**
**శ్లో॥ పరిమండలయోర్మధ్యే మేరుః ఉత్తమపర్వతః ।**
**తతః సర్వాః సముత్పన్నాః వృత్తయో ద్విజసత్తమాః ॥**
**శ్లో॥ ఐరావతీ వితస్తా చ విశాలాదేవికాకుహూ ।**
**ప్రసూతిర్యత్ర విప్రాణం శ్రూయతే భరతర్షభ! ॥ – 61**

మహాభారతశ్లోకములను దివ్యానంద సరస్వతి ఉదహరించెను. పవిత్ర హిమాలయము ప్రపంచమున ప్రసిద్ధి కెక్కి యుండెను. ఇందు అరయోజనము వెడల్పు, ఐదు యోజనముల చుట్టుకొలత గలిగిన మేరువు కలదు. దానిపై మానవోత్పత్తి జరిగెను. గంగానది కాలువలుగా పారుచున్న ప్రదేశము సుమేరువు.

**శ్లో॥ అస్తి శ్రియః పద్మ సుమేరునామ్నా ।**
**సమస్తకల్యాణనిధిః గిరీంద్రః ॥ – 62**
**శ్లో॥ మందాకినీ యచ్ఛిరేవహన్తీ**
**కుల్యాపథాభ్యన్తరసంప్రవిష్టా ।**
**బాలేవ తద్రక్షణసంప్రవృత్తా**
**దినే దినే సించతి పుష్పవాటికమ్ ॥ – 63**

మేరుపర్వతముపై మందాకినీ కాలువగా చీలి పారుచున్నది. అక్కడ పుష్పవనములను బాల వలె జలమును చల్లి రక్షించుచున్నది. పద్మ పురాణములో మేరుపర్వత వర్ణన కలదు. భూమి ఖండములో 27 నుండి 31 శ్లోకాలు. బంగారము రత్నములు అధికముగా గలది. దశయోజన విస్తీర్ణము గలిగి, దుగ్ధ వర్ణజలము కలిగిన హ్రదమున్న ప్రదేశము మేరువు.

**శ్లో॥ శిఖరాద్గిరి రాజస్య మేరోః పుణ్యాన్ మహోదయాత్ ।**
**హిమక్షీరసు వర్ణస్తు ప్రవాహః పతతే భువిః ॥**

**శ్లో॥ దశయోజనమానేన తత్ర గంగా హ్రదో మహాన్ ।**
**మహాతోయేన పుణ్యే చ విమలేన విరాజతే ॥ - 64**

మేరుపర్వతముపై గంగానది ప్రవహించుచున్నది.

**శ్లో॥ మేరుశృంగతటోల్లాసి గంగాజల రయోపమాః ।**
**దృష్ట్వా యస్మిన్ మునే ముక్తాహారస్యోల్లాసశాలినః ॥ - 65**

ఏడు నదులు జన్మించిన స్థానము బిందుసరము లేక మానససరోవరము. దేవికానది ఉద్గమస్థానము - అదే మేరుప్రదేశము. శుకుడు జనకుని దగ్గరకు వచ్చి ప్రసంగించి, తిరిగి శిశిరశైలమునున్న తండ్రి ఆశ్రమమునకు వచ్చెను. శిశిరశైలము హిమాలయమే. వ్యాసుడు స్నానార్థమై "ఆకాశగంగా ప్రపాత ప్రదేశమునకు జనియె" - 66. శుకుడు తండ్రిని విడిచి కైలాసశిఖరమునకు పోయెను. రెండు అత్యంత పీతశ్వేతంబులు మేరు హిమవంతంబు లందె గడుచుం గదిసి యుండె. - 67. శుకుడు మందాకినీ మీద చదలజేరువంజనియె.

**కం॥ విమలాత్ముఁడు పారాశ**
**ర్యమునీంద్రుడు శిష్యులను మహాభారత పం**
**చమములగు వేదముల మే**
**రుమహీధరవాసియై కరుణ జదివించెన్.** - 68.

వ్యాసుడు మేరుపర్వతముపైనుండి కరుణతో శిష్యులకు నాలుగు వేదములను, మహాభారతమును చదివించెను. వ్యాసుడు మేరు పర్వతవాసి. హిమవంతము వంటిదే వేరొక పర్వతశిఖరము మేరువని పై వాక్యము వలన తెలియును. మేరువు అన్ని లోకములకు మధ్య కేంద్రబిందువుగా నున్నదని ఆంధ్రప్రబంధకర్త అభిప్రాయము. ఆకాశమున నాగకన్యలు అప్సరసలు నాట్యము చేయుటకు వీలు లేదు. వారు నాట్యము చేయుచున్నట్లు మేరుపర్వతముపై నిర్జరనది ప్రవహించుచున్నట్లు కవి వర్ణించెను.

**మేరుపర్వతము :** నిర్ఝరనది ఉద్గమ ప్రదేశమని సిద్ధాంతము. శివునకు గల నామములలో (శివసహస్రనామములు) 1. మేరుధామా (503 పేరు), 2. కైలాసగిరివాసీ (660 పేరు) అని శివునకు రెండు పేర్లు కలవు. శివుడు మేరు పర్వతముపై నివసించును. కైలాసగిరిపై నివసించును. వ్యాసుడు కూడ శివుని నివాసస్థానమైన మేరువుపై తపస్సు చేసెనని సిద్ధాంతము.

**శుకుని గురువు : బృహస్పతి :** దేవతలు ఎవరు? దేవగురువు ఎవరు? సమాధానము చెప్పుట అవశ్యకము.

**1. దేవతలు నిర్వచనము :** దివు ధాతువునకు అచ్ ప్రత్యయము చేరును. ద్యుతి స్తుతి కాంతి గతి గలిగిన పదార్థము, సూర్యాగ్ని, పర్జన్యన ద్యశ్వాది ప్రకాశము గల ద్యుస్థానీయ దేవతలు. సూర్యకిరణములు సద్గుణములు మున్నగునవి. దేవ శబ్దమునకు విద్వాంసుడని అర్థము. సిద్ధయోగులు శుద్ధమైన ఇంద్రియములు దేవశబ్ద వాచ్యులగుదురు. దేవగణములు అనగా జ్ఞానుల సమూహము.

**విద్వాంసో హి దేవాః – 69 :** స్వామీ దయానందసరస్వతి తన గ్రంథములలో బహుధా ఉదాహరించెను. (అర్యాభివినయ). దేవతలు శక్తిసంపన్నులు గనుక వారి ఆయువు 300 ఏండ్లు. దేవాన్ అబ్రవీదేతాని యూయం త్రీణి శతాని వర్షాణాం సమాపథేతి. దీనిని కుంపర్‌లాల్ వ్యాసశిష్య తన పురాణోంమే ఇతిహాస్ అను గ్రంథములో (96వ పుట) ఉదాహరించెను. దేవత్వము అనునది మానవులు సాధించిన సద్గుణ సంపత్తియే.

**2. దేవగురువు బృహస్పతి :** బృహస్పతి దేవతలకు పురోహితుడయ్యెను.

**బృహస్పతిర్వై దేవానాం పురోహితః । – 71,** నకులుడను పేరుగల ఋషి మంత్రద్రష్ట బృహస్పతి పదవిని ప్రాచీనకాలములో పొందెను. ఇతడు దర్శించిన సూర్యస్తుతి అధర్వవేదములో 7-14-42, యజుర్వేదములో 4-25, సామవేదములో 4-1-3లో కలదు. వ్యాసుడనునది పదవియైనట్లే, బృహస్పతి యనునది కూడ పదవియే. ఎందరో ఈ బృహస్పతి పదవిని పొందిరి.

**బృహస్పతిర్వై బ్రహ్మ – బ్రహ్మ వై బృహస్పతిః । – 72.** బ్రహ్మ – బృహస్పతి = ఈ రెండును సమానార్థకములు. వీనికి, వేద విద్వాంసుడు, వేద రక్షకుడు అని అర్థములు కలవు. చతుర్వేద పండితుడు 48 ఏండ్లు బ్రహ్మచర్యవ్రతమును అవలంబించిన ఆదిత్య బ్రహ్మచారి బృహస్పతి యగును. బృహస్పతి పదవిని పొందిన వ్యక్తులు ఎందరో కలరు. భిన్నులైనను ఒక్కటిగా భావించుటచే భ్రమ కలిగినది. "యజ్ఞమే బ్రహ్మ ఏక్ ఋత్విక్ హోతథా" – 73. యజ్ఞమును ఆచరించు ఋత్విక్కులలో ప్రథముడు బ్రహ్మ.

**2. బృహస్పతిసవము :– వాజపేయయాగమే బృహస్పతిసవము.**

**శ్లో॥ బృహస్పతిసవో వా ఏష యద్ వాజపేయమ్ ॥ – 74**

వృద్ధుడైన బ్రాహ్మణుడు బృహస్పతి సవమును చేయును. దీనిని గూర్చి కుంపర్‌లాల్ వ్యాసశిష్య తన ఆపస్తంభ కల్పమే యజ్ఞవిద్యా అను పుస్తకములో (పుట 188) విస్తృతముగా తెల్పెను. బృహస్పతి సవమును ఆచరించి బృహస్పతి దేవతలకు బ్రహ్మ – పురోహితుడయ్యెను. ఈ బ్రహ్మ – బృహస్పతియే ఇంద్రునకు ప్రధానమంత్రి.

స ఏష బృహస్పతి సవే। బృహస్పతిరకామయత దేవానాం పురోధాం గచ్ఛేయమితి। స ఏతేనాఽయజత దేవానాం పురోధామగచ్ఛత్ – (పురోధాం = పౌరోహిత్యము). బృహస్పతి సవమును ఆచరించిన పిమ్మట, ఆ పురోహితుడు బ్రహ్మయగును. చతుర్వేదవేత్త ఋత్విక్కులలో శ్రేష్ఠుడు అథర్వవేదక్రియలనాచరించు ప్రధాన పురోహితుడితడే, బృహస్పతి సవ = వాజపేయ యాగమును గూర్చి తైత్తిరీయ బ్రాహ్మణములో వివరణము కలదు. దేవాపి బృహస్పతి యయ్యెను. శంతనుని సోదరుడు దేవాపి, శంతనుని రాజ్యకాలములో 12 ఏండ్లు కాటకము వచ్చెను. వర్షములు కురవలేదు. వర్షము కురియుటకై వర్షకామ చేయించెను. అప్పుడా వరుణయజ్ఞమున బ్రహ్మత్వము నాచరించెను. అందుచే దేవాపి – బ్రహ్మ – బృహస్పతి యయ్యెను. దేవాపి అమరతతికి నుపాధ్యాయుడయ్యెను.

**ప॥ బాహ్లికాగ్రజుండగు దేవాపి యమరతతికి**
**అమరె నుపాధ్యాయుడుగా సుమహితుడు. – 75**

**శ్లో॥ దేవాపిస్తు ప్రవవ్రాజ వనం ధర్మపరీప్సయా।**
**ఉపాధ్యాయస్తు దేవానాం దేవాపిరభవన్మునిః ॥ – 76**

దేవాపి దేవతలకుపాధ్యాయుడయ్యెనని పురాణములలో కలదు. మహాయోగబలసంపన్నుడైన దేవాపి **కలాప** గ్రామమున నుండెను.

**శ్లో॥ దేవాపి యోగమాస్థాయ కలాపగ్రామమాస్థిత – 77**

ప్రతీపునకు దేవాపి – శంతనుడు – బాహ్లీకుడు ముగ్గురు పుత్రులు. శంతనుడు రాజయ్యెను. దేవాపి అడవికి పోయి తపస్సు చేసెను. దేవాపి దివ్యవాణిగల ఋషి. మంత్రద్రష్ట. దేవాపి విశ్వామిత్రునివలెనే తపోబలమువలన బ్రాహ్మణుడయ్యెను. అందు దేవాపి కొండిక ప్రాయంబున తపంబునకుంబోయి భార్గవచ్యవననకు కృతకపుత్రుండై **దేవతలకు నాచార్యుండయ్యె – 78.**

హరివంశములో దేవాపి దేవతలకు గురువయ్యెనని ఎఱ్ఱన తెల్పెను. దేవాపి పితృరాజ్యమును పరిత్యజించెను. తపస్సుచేసి దివ్యత్వమును పొంది ఋషి అయ్యెను. దేవాపి మహాయోగి.

యోగము నవలంబించి కలాప గ్రామముననున్నాడు. ఈ కలాప గ్రామములు రెండున్నట్లు పురాణములలో వివరములున్నవి. 1. కైలాసమునకు ఉత్తరదిశలో ఊర్వశీ పురూరవులు నివసించినది. 2. కృష్ణద్వైపాయన వ్యాసుడు జన్మించినది. ఇది నేటికిని యమునానది యొద్దన ఝాంసీనగర సమీపమున ఉత్తరప్రదేశ్‌లో "కల్పి" అను పేరుతో కలదు. దేవాపి దేవతలకు ఆచార్యుడయ్యెనని బృహస్పతి పదవినందెననియు అతడే శుకునికి గురువనియు నిర్ణయము.

దేవాపికి శుకుడు పౌత్రస్థానీయుడు. సత్యవతి శంతనుని భార్య. సత్యవతీపౌత్రుడు శుకుడు కూడ. దేవాపి, శంతనులకు పౌత్రుని వంటివాడే. అందుచే బృహస్పతియైన దేవాపి శుకునకు విద్యలు చెప్పిన గురువని సిద్ధాంతము.

**ఇంద్రుడనగా నెవరు? :-** శుకునకు ఇంద్రుడు మాయనివస్త్రములిచ్చెను. ఆకాశమునుండి కృష్ణాజినము, నవరత్నయుతమగు కనకంపు దండంబు శుకునికొరకై పడినవి. కమలభవుడు కనకంపు గమండలువు నిచ్చె శుకునితో – సంబంధము – చుట్టరికముగల ఇంద్రుడెవరని ప్రశ్న? వేదములలో ప్రయోగింపబడిన ఇంద్ర శబ్దమునకు విభిన్నార్థములు కలవు. జీవాత్మ సమ్రాట్ వణిజుడు పరమాత్మ పరమైశ్వర్యవంతుడు. ఇంద్రుడనగా వణిజుడు. **ఇంద్రమహం వణిజం చోదయామి – 79.** ఇంద్రుడనగా సమ్రాట్. రాజసూయయాగమును చేసినవాడు. **ఇంద్రశ్చ సమ్రాట్ వరుణశ్చ రాజా – 80.**

**శ్లో॥ యేనేష్టం రాజసూయేన మండలస్యేశ్వరశ్చ యః ।**
**శాస్తి యశ్చాజ్ఞయా రాజ్ఞః స సమ్రాట్ ॥ 81**

**శ్లో॥ సోఽశ్వమేధసహస్రేణ రాజసూయశతేన ।**
**తోషయామాస దేవేశం స్వర్గం లేభే తతః ప్రభుః ॥ – 82**

శంతనుడు సమ్రాట్టు. వేయి అశ్వమేధములను, నూరు రాజసూయ యాగములను చేసెను. హిందూధర్మకోశ – పుట 145లో ఐంద్రమహాభిషేకమును గూర్చి కలదు. ఐతరేయ బ్రాహ్మణమున కూడ దీని వివరములు కలవు. రాజసింహాసనారోహణమునకు, దీనికి సంబంధము కలదు. ఇంద్రుడు స్వర్గారోహణమునకు చేసిన క్రియలు దీనిలో కలవు. కనుక ఐంద్రమహాభిషేకము అని పేరు. పురోహితుడు రాజు శరీరమున ఇంద్రుని గుణములను స్థాపించుచు మంత్రములను పఠించును. ప్రతిజ్ఞలను చేయించును. దీనితో ఆ రాజు సమ్రాట్టు ఇంద్రుడు అగును. ఈ ఐంద్రమహాభిషేకమును పొందిన రాజులు ఎందరో ప్రాచీన కాలమున కలరు. వారిని ఇంద్రులనవచ్చును. ఇంద్ర శబ్దమునకు సమ్రాట్టు అని అర్థము. రాజ్యాంగ వ్యవస్థలో ప్రసిద్ధముగా నున్నది. దిలీపుడు సమ్రాట్టు (రఘువంశ), శంతనుడు సమ్రాట్టు.

ధర్మసుతుడు సమ్రాట్టు. రాజసూయయాగము చేసెను. శుకునకు వస్త్రాదుల నిచ్చినది సమ్రాట్టు శంతనుడని సిద్ధాంతము.

**పితరులు :–** శుకుడు పితరుల కన్యను పీవరి యనుదానిని పరిణయమాడెను. ఆ పితరులెవరు నిర్వచించవలసిన అవసరము కలదు. అనూచానవేదవిద్వాంసులు వేదజ్ఞానము నందరికి అందించువారు; వేదప్రచారకులు–సంఘమును రక్షించువారు; పితరులు–సత్యజ్ఞానబోధ చేయువారు. పితరులు సూక్ష్మశరీరము కలవారు. వీరికి త్రసరేణ ప్రమాణ శరీరముండును.

**సత్యజ్ఞానేన దానేన జనాని పాన్తి రక్షన్తి తే పితరాః జ్ఞేయాః – 83**

**శ్లో॥ అజ్ఞో వై భవతి బాలః పితా భవతి మంత్రదః – 84**

మంత్రదీక్షను ఇచ్చి మంత్రమును బోధించిన వేదజ్ఞులు పితరులు. మంత్రమును చెప్పిన గురువులు పితరులు.

**శ్లో॥ సభాచమాసమితిశ్చావతాం ప్రజాపతేర్దుహితరౌ సంవిదానే ।**
**యేనాసంగచ్ఛా ఉపమాసశిక్షాచ్చారువదాని పితరః సంగతేషు ॥ – 85**

హిందీ వ్యాఖ్యానములో ప్రొ॥ విశ్వనాథ విద్యాలంకార్ ఇట్లు వ్రాసిరి. "సభా – సమితికే సదస్యోంకో సభాపతి, ఉన్కే సంమానర్థ "పితర్" కహతాహై, వే సామ్రాజ్యకే రక్షక్ హై అతః పితర్ హై" సభాపతి, సభ, సమితి సభ్యులను వారి సంమానార్థము" పితరులారా అని సంబోధించును. వారు సామ్రాజ్యరక్షకులు గనుక పితరులు అని పిలువబడుచున్నారు. సభాసమితిలోని సభ్యులు పితరులు. వారి మానసకన్య (వారి పెంపుడు కన్య) ను శుకుడు వివాహమాడెనని సిద్ధాంతము. 'పీవరి' యను కన్య శుకుని భార్య అని పురాణములలో కలదు.

**పరాశరులు :–** శక్తి కుమారుడు పరాశరుడు. ఈ శక్తిపేరుగల వేరొకడున్నట్లు తెలియును. ఋగ్వేదసూక్తముల ఋషులలో గౌరవీతి శాక్త్యః – పరాశరశాక్త్యః" అని ఇరువురు కలరు. ఒక శక్తి యనువాని కుమారుడు పరాశరుడు. వేరొక శక్తి కుమారుడు గౌరవీతి అని తెలుస్తుంది. పరాశరులు ఆరు వర్గములు. వర్గమునకు 5 మంది చొప్పున మొత్తం 30 మంది పరాశరులున్నారు. మత్స్యపురాణము 201 అధ్యాయము ననుసరించి

1. గౌర పరాశరులు 5 మంది
2. నీల పరాశరులు 5 మంది
3. కృష్ణ పరాశరులు 5 మంది
4. శ్వేత పరాశరులు 5 మంది
5. ధూమ పరాశరులు 5 మంది
6. ఊష్మప పరాశరులు 5 మంది

మొత్తం 30 మంది కలరు. ఈ 30 గోత్రప్రవరల పేర్లు వాయుపురాణము 9వ

అధ్యాయములో పరాశరులు 8 పక్షములుగా, పక్షమునకు 5 మంది చొప్పున మొత్తం 40 మంది కలరు. అట్లే ఏకాదశ వసిష్ఠ పక్షములును కలవు. వాయుపురాణం 9వ అధ్యాయము 87,88 శ్లోకాలు.

**శ్లో॥ శ్వేతాః కృష్ణాశ్చ గౌరశ్చ శ్యామా ధూమ్రా సమూలికాః**
**ఊష్మపాః దారకాశ్చైవ నీలాశ్చైవ పరాశరాః ।**
**పరాశరాణామష్టైతే పక్షా ప్రోక్తా మహాత్మనామ్ ॥**

1. వేదవ్యాఖ్యాత హరిస్వామి పారాశర్యుడే. 2. విష్ణుయశుడు అను పేరుగల కల్కి కూడ పారాశర్యుడే. ఈ కల్కికి యాజ్ఞవల్క్యుడు పురోహితుడు. ఇంద్రప్రమతియే మరల విష్ణుయశుడుగా పుట్టెను.

**శ్లో॥ కల్కి విష్ణుయశో నామ పారాశర్యప్రతాపవాన్ ।**
**దశమో భావ్యః సంభూతో యాజ్ఞవల్క్యపురస్సరః ॥ - విష్ణుపురాణ 36 అ 104 శ్లో**

**శ్లో॥ మానవః స తు సంజజ్ఞే దేవస్యాంశేన ధీమతః ।**
**పూర్వజన్మని విష్ణుర్యం ప్రమతిర్నామ మహావీర్యవాన్ ॥ - 36 అ 110 శ్లో**

వసిష్ఠ శాక్త్య పారాశరాః. ఇవి ఋషి ప్రవరలు. జాతూకర్ణ్యులకు - 3 ఋషి ప్రవరలు కలవు. వసిష్ఠ అత్రీ జాతుకర్ణ్య వసిష్ఠ ఆర్త బోధ పాటవ.

పరాశర గోత్రము వారు నేటికిని గలరు. శ్యామాపరాశరులు 5 మందిలో బాదరి యొకడు. ఈ బాదరి పుత్త్రుడు బాదరాయణుడు. అతని పుత్త్రుడు బాదరాయణి. భాగవతము ప్రకారము ఇది శుకదేవునకు ఇంకొకపేరు. భాగవతం 1/7/11, మత్స్య 201-37 ప్రకారము గోత్రలు ప్రవరలు చెప్పబడును. గోత్రనామములు వ్యక్తి నామములుగా భావించి భ్రమపడుచున్నారు. పాణిని సూత్రములలో 4/1/96, 4/1/97 వసిష్ఠ, పరాశర గోత్రముల వారి ప్రసక్తి కలదు. కృష్ణ - రణ - అను పేరుగల వ్యక్తుల సంతతియే కార్ష్ణాయణ - రాణాయణ. ఈ రెండును గోత్ర ప్రవరలు. వీరు వసిష్ఠులే. కృష్ణుని సంతతివారే కార్ష్ణాయణులు (వ్యాససంతతి). మత్స్య పురాణములో 200-201 అధ్యాయములలో ఈ విషయము కలదు. మత్స్యపురాణం - 200 అధ్యాయం - 35వ శ్లోకం.

**శ్లో॥ కార్ష్ణాయణాః కపి సుఖాః-కాకేయస్థా జపాతయః ।**
**పుష్కరః పంచమశ్చైషా కృష్ణా జ్ఞేయాః పరాశరాః ॥**

కృష్ణపరాశరులు 5 గోత్ర ప్రవరలు కల్గియుండిరి. అందు కార్ష్ణాయణులు ఒక ప్రవర

గలవారు. పురాణములలో ఏడుగురు మంత్ర కృదృషులు వసిష్ఠులు పేర్కొనబడిరి – వసిష్ఠ – శక్తి – పరాశర ఇంద్ర ప్రమతి – భరద్వసు – మైత్రావరుణి – కుండిన ఈ పేర్లే కాలక్రమమున గోత్ర ప్రవరలుగా మారినవి. మత్స్యపురాణం – 201 అధ్యాయం – 5 శ్లోకం కార్ష్ణాయణి ప్రవరను పేర్కొంటుంది. ఇది కృష్ణ వ్యాసుని సంతతిని సూచిస్తుంది. అరణి భర్త కృష్ణవ్యాసుడు. అతని పుత్రుడే కులపతియైన శుకుడు. వాయుపురాణము – 9వ అధ్యాయము వసిష్ఠునకు కపింజల ఘృతాచికి కుశి (కుణి) అనువాడు ఇంద్రప్రతిముడై పుట్టెను. ప్రమతి ఇంద్రప్రతిముడని బిరుదుపొందెను. ఇతడు వాసిష్ఠుడు. పారాశర్యుడు ఘృతాచి ఈతని భార్య. రురుడు పుత్త్రుడు ప్రమద్వర కోడలు. కల్కి పారాశర్యుడు. 'శంబల' గ్రామమున జన్మించెను. గంగాయమునా సంగమ ప్రదేశమున ప్రాణత్యాగము చేసెను. ఇదియే వ్యాసుడు జన్మించిన కలాప గ్రామము. దేవాపి తపస్సు చేసిన కలాప గ్రామము. వ్యాసుడు ఒక్కడు కాదు. ఇదియొక ఉపాధి. ఎందరో వ్యాసులు కలరు. కృష్ణద్వైపాయనుని అతని శిష్యులను కలపి వ్యాసపంచకము అంటారు. నేటికిని ఎందరో ఆంధ్ర బ్రాహ్మణులుపారాశర్యులే. పరాశరముని సంతతి భారతదేశమం దంతట విస్తరించింది. శూద్రులనబడు కమ్మవారిలో కూడ పరాశర గోత్రము వారు కలరు. (కూర్మరాజీయము – పాలడుగు శేషాచలవర్మ 1970 ఎడిషన్. వశిష్ఠుడు – శుకుడు పరాశరుడు – వ్యాసుడు – వీరు చంద్రవంశజుల గోత్ర ఋషులై యున్నారు. (కూర్మరాజీయము పుట. 62) కృష్ణపరాశరుని తరువాత కాలంలో ఆయన శిష్యవర్గంలో ఒక పరాశరుడు గలడు. అతడే పరాశర సంహితను వ్రాసెను. వ్యాసుని తరువాత నాల్గవతరమువాడు పరాశరుడు కూడ వ్యాసుడయ్యెను. (వేదవ్యాస పరంపర – కుంపర్‌లాల్ వ్యాసశిష్య) ఎందరో వసిష్ఠులు – పరాశరులు వ్యాసులు కలరని సిద్ధాంతము. వాల్మీకి రామాయణంలో అయోధ్యకాండ 31వ సర్గ 37వ శ్లోకంలో – వసిష్ఠుని పుత్త్రుడు సుయజ్ఞుడు అని కలదు.

**శ్లో॥ వసిష్ఠపుత్త్రం తు సుయజ్ఞమార్యమ్ ।**
**త్వమానయాశు ప్రవరం ద్విజానామ్ ॥**

సుయజ్ఞుడు వసిష్ఠుని పుత్రుడు. అతడు తేజస్వి. వేదవేత్త. అతనిని పిలుచుకొని రమ్మని రాముడు లక్ష్మణునితో పల్కును. ఈ సందర్భములో పేర్కొన్న వసిష్ఠుడు ఆది వసిష్ఠుడు కాక వేరొకడని సిద్ధాంతము.

**శంకరుడు**

శుకుడు ముక్తుడుకాగా వ్యాసుని దుఃఖము పోగొట్టుటకు శంకరుడు ప్రత్యక్షమై శుకుని ఛాయను (పుత్రుని ఛాయను) ఇచ్చెను. ఆ శుకుని ఛాయను వ్యాసుడు చూచుచు స్వస్థలమున

మురియుచుండెను. అది అన్ని వైపుల కన్పడును. తెలుగు ప్రబంధములలో అంబికావిభుడు, శంకరుడు, పురవైరి, పినాకహస్తుడు, మహాదేవుడు అనుపదములు వాడబడినవి. వ్యాసుడు "రుద్రునిచేత ఓదార్చబడినాడు (శాంతిపర్వం నెం.3 అధ్యాయం - 39 శ్లోకములోనున్న రుద్రపదమును ప్రబంధకర్త వాడలేదు. పురవైరి వాడెను. రుద్రుడనగా నెవరు? ఛాయనిచ్చుట యేమి? ఛాయ అనగానేమి? వీనికి సమాధానములు చెప్పుటావశ్యకము.

**రుద్ర నిర్వచనము :** 44 ఏండ్లు బ్రహ్మచర్య వ్రతమును పాటించి విద్యలు గ్రహించిన బ్రహ్మచారి - రుద్రకోటి ఆచార్యుడు. - 86. రుద్రుడనగా వ్రాత్యుడు. మహాయోగి - శ్రీ సంపూర్ణానంద నిర్వచనము చెప్పెను. - 87. రాజ్యాంగ వ్యవస్థలో రుద్రుడనగా సేనాపతి. రుద్రస్య విశ్వరూపస్య. విశ్వరూపుడను పేరుగల రుద్రుడు మహాభారతకాలమునకు కొంత పూర్వము కలడు. ఈయన సాంఖ్యయోగాచార్యుడు (శాంతిపర్వము). రుద్రులు ముక్తాత్మలు, సిద్ధులు, యోగశాస్త్ర ప్రవర్తకులు. రుద్రుడనగా భేదాభేదదృష్టితో సాధనచేసి సిద్ధిపొందిన మహాయోగి. మంత్రేశ్వర్ ఔర్ మంత్ర మహేశ్వర్ శ్రేణి యోంకే భేదాభేద దృష్టివాలే సిద్ధ రుద్ర్ కహలాతేహై । - 88 మాలినీ విజయవార్తిక శ్లోకములు ఆధారముగా ఈ నిర్వచనము చెప్పబడినది. ఇది యే రుద్రుని సరియైన నిర్వచనము.

**శ్లో॥ ఇత్థం తంత్రం రుద్ర శివ భైరవాఖ్యం స్థితం త్రిధా ।**
**వస్తుతో హి త్రిధైవేయం జ్ఞానసత్తా విజృంభతే ।**
**భేదాభేదేన తథా చాభేదసంధినా ॥ - 89**

శుకుని ఛాయను వ్యాసునకిచ్చినవాడు రుద్రుడు - రుద్రకోటికి చెందిన బ్రహ్మచారి. మహాయోగి సిద్ధుడు.

**ఛాయ నిర్వచనము సమన్వయము :** ఛాయలను గూర్చిన వివరములు తిక్కన భారతము శాంతిపర్వములో కలవు. కర్మ సంజనిత విశేషతం గలుగు ఛాయలు - 90.

జీవావస్థలు ఛాయలైయుండును. జీవుని ఛాయలు ఆరు రంగులలో నుండును. ఈ ఛాయను ప్రస్తుతము ఆరా అనుచున్నారు. జీవుని ఛాయలు 1. కృష్ణము, 2. ధూమ్రము, 3. హరితము, 4. హారిద్రము, 5. రక్తము, 6. శుక్లము. ఇవి ఆరు వర్ణములు యోగసాధకులకు మనసును కేంద్రీకరించినపుడు అనుభవమునకు వచ్చును.

స్థూలశరీరము నాధారము చేసికొని దృష్టి గోచరమగును. స్థూలశరీరము లేనిచో సాధ్యము కాదు. భారతమునననుసరించి ఉత్తమ, మధ్యమ, అధమ, ఛాయలు (ఆరా) కలవు. శుక్లచ్ఛాయ

శ్రేష్ఠమైనది. విష్ణువును భావించు వారు ఈ శుక్లచ్ఛాయ కలిగి యుండును. తిక్కన శాంతిపర్వము పంచమాశ్వాసము.

**ఛాయా :-** స్థానము : గృహము : గురుకులము శిష్యులతో కూడిన ఇల్లు. ఛాయోల్లంఘనము గురువుల నింద అర్థములు కలవు. ఛాయయనగా ప్రాణము. "ఆత్మనః ఏష ప్రాణో జాయతే యథైషా పురుషో ఛాయైతస్మిన్నేతదాతతం మనోకృతేనాయాత్యస్మిన్ శరీరే। " -91. ఛాయయనగా జీవుని చేతన శక్తి (కఠోపనిషత్తు). ఛాయయనగా దేహి : జీవుడు : చిత్ ప్రతిబింబభూతుడగు జీవుడు జీవశక్తిని ఛాయ అందురు. - 92.

**శ్లో॥ యథైవాపాంగతః సేతుః ప్రవాహస్య నిరోధకః ।**
**తథా శరీరగాచ్ఛాయా జ్ఞాతవ్యా యోగిభిః సదా ॥ -93**

దీని వ్యాఖ్యాత ఉపనిషద్ బ్రహ్మేంద్రయోగి - "శరీరగా చిచ్ఛాయా" జీవశక్తిః - శరీరమునందున్న జీవశక్తియే చైతన్యశక్తియొక్క ఛాయ. దీనిని తెలుసుకొనుయోగమును దేహచ్ఛాయ జ్ఞానవిధి చిచ్ఛక్తి యోగము. ఛాయపురుషయోగము" అని అందురు. దీనిని సాధించిన యోగి తన మరణకాలమును ముందే ఎరుంగును. ఛాయ జీవుడు సగుణ బ్రహ్మము (నిర్గుణ బ్రహ్మము - అకాయం) శ్రీ కనుమర్తి మార్కండేయశర్మగారు (1900-1920) ఉపనిషత్తులను "శ్రీమదాంధ్రఉపనిషద్దీపము" అను పేరుతో ఆంధ్రీకరించిరి.

ఈ యాత్మ ఛాయగా హృదయంబునందుండు

సీ ॥ నిటనెన్న నూఱు నొక్కటియునాడు । లొప్పారు వాటిలో
నొక్కొకనాడికి నూరు నూర్వంతున నూలుకొనును ॥ ...

**హృదయమునందుండు ఛాయ జీవుదే :-** దీని ఆధారముగా చెప్పిన శుకుడు ముక్తుడైనప్పటికి కూడ మరల స్థూలశరీరమును గ్రహించి ఈ లోకమున నివసించెనని చెప్పవలసి వచ్చును. ఇది విముక్తుడైన శుకునికి చెప్పుట అయుక్తము.

**ఛాయ పుత్రుడు సంతతి :**

**తే ॥ ప్రాణమును ధారవోసి ఈ ప్రకృతిలోని**
**నిఖిల జీవులు తమ ఛాయ నిలుపుకొనును**
**ఎంత తీయందనమ్మొ మాతృత్వమన్న**
**కానరాదమ్మకన్న జగాన మిన్న.**

శ్రీమానాప్రెగ్గడ సుబ్బరాయకవి తన శ్రీమాత ఖండ కావ్యములో ఛాయ శబ్దమును పుత్రుడు

సంతతియను అర్థములో వాడెను. సకల జీవులు తమ ఛాయను (సంతతిని) నిలుపుకొనును. ఇది సహజసిద్ధమైన కోరిక "**పితా పుత్రేవ జాయతే**" పితయే పుత్రుడగునను సిద్ధాంతమును నిది బలపరచును. వ్యాసునకు ప్రత్యక్షమైన రుద్రుడు (శివుడు) మహాయోగి యోగాచార్యుడు శుకుని ప్రతిబింబమును (ఛాయను) అనగా శుకుని సంతతిని 'కృష్ణ' గౌర శంభు మున్నగు వారిని వ్యాసునికి చూపించి యోదార్చెను. ఈ శుకసంతతిని చూచి వ్యాసుడు ఆనందముగా శేషజీవితమును గడిపెనని సిద్ధాంతము.



# అధోసూచిక


1. వాల్మీకి రామాయణము - కిష్కింధకాండ - 41 అధ్యాయం, 43 శ్లోకం.
2. అచార్య బలదేవోపాధ్యాయ - పురాణ విమర్శ (హిందీ) గ్రంథ ప్రారంభము శుకచిత్రము.
3. వ్యాసుడు - బ్రహ్మాండపురాణము (సం) 1-2-11,12 శ్లోకాలు పుట
4. డా॥ ఏ. వేదవ్యాస ఐ.ఎ.యస్., పిహెచ్.డి. కల్కిభగవానుదు ప్రపంచ ప్రళయం, 93 ఏప్రిల్ - 13, 13,12 పుటలు.
5. డా॥ ఏ. వేదవ్యాస్ ఐ.ఎ.యస్., పిహెచ్.డి. శుభవార్త మాసపత్రిక 1993 ఏప్రిల్ పుట 62.
6. శ్రీ బి.వి. రామన్ - నోటబుల్ హోరస్కోప్స్ - ప్రథమ జాతకం 30,31 శ్లోకాలు.
7. వేదవాణి మాసపత్రిక హందీ 1989 డిసెంబరు - భారత యుద్ధకాలం. మీమాంస - వ్యాసము.
8. కుంపర్‌లాల్ వ్యాసశిష్య - పురాణోం మే ప్రాగ్మహాభారత కాలీన ఇతిహాస్ పుట 622
9. వేదవ్యాసుడు - పద్మపురాణము -సృష్టిఖండము - 51వ అధ్యాయము 7వ శ్లోకము.
10. హరిప్రసాద్ శివప్రసాద్
11. వ్యాసుడు - వాయుమహాపురాణము 73వ అధ్యాయము 30,31 శ్లోకాలు
12. వ్యాసుడు - వాయుమహాపురాణము 70 అధ్యాయ- 85,86 శ్లోకాలు.
13. వ్యాసుడు - హరివంశము - 18 అధ్యాయ - 53 శ్లోకము
14. వ్యాసుడు - హరివంశము - 18 అధ్యాయ - 58 శ్లోకము.
15. ఎఱ్ఱన - హరివంశము - పూర్వభాగం, 2వ అధ్యాయము 118, 119 పద్యవచనాలు
16. వ్యాసుడు - విష్ణుపురాణము - 4వ అంశ 19వ అధ్యాయము విష్ణుభట్టీయము శ్రీధరీ టీకలో ఉదాహరింపబడినది.
17. వ్యాసుడు - మత్స్యపురాణము - 15 అధ్యాయ - 9,10 శ్లోకాలు
18. వ్యాసుడు - మత్స్యపురాణము - 15 అధ్యాయ - 11 శ్లోకము.
19. వ్యాసుడు - కూర్మపురాణము - 19వ అధ్యాయ - 25,26,27 శ్లోకాలు.
20. బ్రహ్మశ్రీ మొలుగు చంద్రమౌళీ శాస్త్రి - ఆంధ్రకూర్మపురాణము 6వ అశ్వాస - 102వ వచనం.
21. వ్యాసుడు పద్మపురాణము - సృష్టిఖండము 9వ అధ్యాయం 40,41 శ్లోకాలు.

22. వ్యాసుడు – బ్రహ్మాండపురాణము – 9వ అధ్యాయం – 93 శ్లోకం.
23. వ్యాసుడు – బ్రహ్మాండపురాణము – 10వ అధ్యాయము – 81 శ్లోకం.
24. క్షేమేంద్రుడు – భారతమంజరి – హరివంశము – 127 శ్లోకము.
25. తిక్కన – ఆంధ్రమహాభారతము – శాంతిపర్వము – షష్ఠాశ్వాసము 267 పద్యం.
26. అల్లసాని పెద్దన – మనుచరిత్ర – 1వ ఆశ్వాసం – 66 పద్యం.
27. సంన్యాసోపనిషత్తులు – నారద పరివ్రాజకోపనిషత్తు – 5,6 శ్లోకాలు 80 పుట
28. సంన్యాసోపనిషత్తులు – ఉపనిషద్ బ్రహ్మేంద్రయోగి వ్యాఖ్య 83 పుట
29. కాళిదాసు – రఘువంశము – 1వ సర్గ – 1వ శ్లోకము.
30. క్షేమేంద్రుడు – భారతమంజరి – శాంతిపర్వము 117 శ్లోకము.
31. – అధర్వవేదము – 5వ అధ్యాయము – 25 మంత్రము
32. – యజుర్వేదము – 8వ అధ్యాయము – 25 మంత్రము
33. – కృష్ణయజుర్వేదము – 2వ అధ్యాయము – 5,1 మంత్రము
34. – ఋగ్వేదము – 5 మండలము – 78 సూక్త – 8 మంత్రము.
35. వ్యాసుడు – మహాభారతము (సం) ఆదిపర్వం – 74 సర్గ – 63 శ్లోకము.
36. నన్నయ – ఆంధ్రమహాభారతము – ఆదిపర్వం – 3వ ఆశ్వాసం – 227 వచనం
37. తిక్కన – ఆంధ్రమహాభారతము – అశ్వమేధపర్వం – 1వ ఆశ్వాస – 187 పద్యం
38. వ్యాసుడు – మహాభారతము – శాంతిపర్వము – 305 అధ్యాయ – 5,6 శ్లోకాలు
39. మనువు – మనుస్మృతి – 9వ అధ్యాయము 8 శ్లోకము.
40. వ్యాసుడు – పద్మపురాణము – సృష్టిఖండము – 9వ అధ్యాయము, 8,9 శ్లోకాలు.
41. సుశ్రుతుడు – సుశ్రుత సంహిత – శారీరక అధ్యాయ 2, శ్లోకము 46
42. బోధాయన గృహ్యసూత్రములు – 1-7-1-18
43. యజుర్వేదము – 18 అధ్యాయము – 39,40,41 మంత్రాలు
44. కుంపర్‌లాల్ వ్యాసశిష్య ఆర్షయజ్ఞవిద్యా – 11 పుట
45. ఆర్.జి. భండార్‌కర్ – శైవవైష్ణవమతముల పరిశీలనము – 287 పుట
46. కుంపర్‌లాల్‌వ్యాసశిష్య పురాణోం మే ఇతిహాస్ పుట 34
47. హరిహరానందారణ్య – పతంజలియోగసూత్రవ్యాఖ్య 4వ అధ్యాయము 29 సూత్ర
48. స్వామీభూమానంద – వేదముల వ్యాఖ్య – అన్థోలజీ ఆఫ్ వేదిక్ హైమన్స్
49. స్వామీభూమానంద – గోపథబ్రాహ్మణ ఉత్తరభాగము – 2 అధ్యాయ – 11 మంత్రము
50. వ్యాసుడు – దేవీభాగవతము – 12వ స్కంధ – 4వ అధ్యాయం – 46 శ్లోకము

51. యజుర్వేదము - 33 అధ్యాయము - 57 మంత్రము.
52. వాజసనేయసంహిత - యజుర్వేదము - 2 అధ్యాయ - 6 మంత్రము
53. వ్యాసుడు - విష్ణుపురాణము - 2వ అంశ - 10వ అధ్యాయము - 11వ శ్లోకము.
54. వ్యాసుడు-మహాభారతం - అనుశాసనికపర్వం - 10వ అధ్యాయము - 65వ శ్లోకము
55. శతపథబ్రాహ్మణం - 12/4, 11/5
56. జైమిని బ్రాహ్మణం - 1/3
57. కుంపర్‌లాల్ వ్యాసశిష్య - పురాణోం మే ఇతిహాస్ - పుట 96.
58. వాల్మీకి - రామాయణము - తిలకవ్యాఖ్య - 1088 పుట ఉత్తరకాండ - 73సర్గ - 5వ శ్లోకవ్యాఖ్య.
59. వేలూరి శివరామశాస్త్రి వ్యాసవాణి - పుట 120
60. పాలడుగు శేషాచలశర్మ - కూర్మరాజీయము - పుట 8
61. స్వామి దివ్యానందసరస్వతీ - ఆర్యోంకా అదిదేశ్ ఔర్ ఉన్కీ సభ్యత - పుట 199
62. సుకుమారకవి శ్రీకృష్ణవిలాసకావ్యం - 1వ సర్గ - 1వ శ్లోకం.
63. సుకుమారకవి శ్రీకృష్ణవిలాసకావ్యం - 1వ సర్గ - 14వ శ్లోకం.
64. వ్యాసుడు - పద్మపురాణము - భూమిఖండము - 101 అధ్యాయ 27,29 శ్లోకాలు.
65. యాజ్ఞవల్క్య ఉపనిషత్తు - 16వ శ్లోక - 223 పుట (సంన్యాసోపనిషత్తు)
66. తిక్కన - మహాభారతము - శాంతిపర్వం 6వ ఆశ్వాసం - 310 వచనం
67. తిక్కన - మహాభారతము - శాంతిపర్వం 6వ ఆశ్వాసం - 398 వచనం
68. తిక్కన - మహాభారతము - శాంతిపర్వం 6వ ఆశ్వాసం - 399 పద్యం
69. శతపథబ్రాహ్మణము - 3/7/3/10
70. జైమిని బ్రాహ్మణము - 1/3
71. ఐతరేయ బ్రాహ్మణము - 8-26
72. ఐతరేయ బ్రాహ్మణము - 1/13 శతపథబ్రాహ్మణము 3।1।4।15
73. కుంపర్‌లాల్ వ్యాసశిష్య - పురాణోం మే ఇతిహాస్ - పుట 72
74. శతపథబ్రాహ్మణము - 5/2/1/19
75. జనమంచి శేషాద్రిశర్మ - తెలుగు బ్రహ్మపురాణము - 11వ అధ్యాయం, 701,702
76. వ్యాసుడు - వాయుపురాణము - 37 అధ్యాయ - 231 శ్లోకము.
77. వ్యాసుడు - భాగవతము - 9వ స్కంధ - 22 అధ్యాయం - 17 శ్లోకము.
78. ఎఱ్ఱన - హరివంశము పూర్వభాగము - 3 ఆశ్వాస - 105 పద్యం.

79. అథర్వవేదము – తృతీయ కాండ 15 మంత్ర
80. యజుర్వేదము – అష్టమాధ్యాయము – 37 శ్లోకము
81. అమరకోశము (లింగాభట్టీయము) 469వ పుట
82. వ్యాసుడు – మహాభారతము – ఆదిపర్వము 96 అధ్యాయ – 2వ శ్లోకము.
83. **స్వామి దయానందసరస్వతి – పంచమహాయజ్ఞవిధి.**
84. మనువు – మనుస్మృతి – 20వ అధ్యాయం – 153 శ్లోకము.
85. అథర్వవేదభాష్యం – 7వ కాండ – 1వవ అనువాక – సూక్త – 13, మంత్ర – 1 పుటలు 18,19 ప్రొఫెసర్ విశ్వనాథ విద్యాలంకార.
86. స్వామీ దయానంద సరస్వతి – పంచమహాయజ్ఞవిధి – పుట 46
87. డాక్టర్ సంపూర్ణానంద – అథర్వవేద – వ్రాత్యకాండవ్యాఖ్య శ్రుతి ప్రభా.
88. బలజిన్నాథపండిత – కాశ్మీరీశైవదర్శన్ – పుట 154
89. మాలినీ విజయవార్తికము – 1వ అధ్యాయము – 391, 392 శ్లోకాలు.
90. తిక్కన – మహాభారతము – శాంతిపర్వము – 5వ ఆశ్వాసము – 406 వచనం
91. ప్రశ్నోపనిషత్తు – 3వ ప్రశ్న – 3వ మంత్రం
92. పరశురామపంతుల లింగమూర్తి – సీతారామాంజనేయ సంవాదము – 2వ ఆశ్వాసము – 104 వచనము.
93. వరాహోపనిషత్తు – పంచమ అధ్యాయ – 41 శ్లోకము (సంస్కృత వ్యాఖ్యాత : ఉపనిషద్ బ్రహ్మేంద్రయోగి)
94. శ్రీకనుపర్తి మార్కండేయశర్మ – శ్రీమదాంధ్ర ఉపనిషద్దీపము – ప్రశ్నోపనిషత్తు – 3 ప్రశ్న – 6వ మంత్రం.
95. శ్రీమానాప్రెగ్గడ సుబ్బరాయకవి : శ్రీమాత ఖండ కావ్యము– 63 పద్యం – 28వ పుట.

ఓం

రిఫరెన్స్ : శ్రీ విద్యార్ణవతంత్రమ్ – శ్రీవిద్యారణ్యముని విరచితమ్.

ప్రాచ్యప్రకాశన్ : వారణాసి – 1986.

ఊర్ధ్వామ్నాయగురుపరంపర – షోడశీవిద్య.

ఉపాసకులు ప్రథమాశ్వాస – 52 నుండి 71 శ్లోకముల వరకు పరిశీలించవలెను.

52వ శ్లో॥ కపిలోఽత్రిర్వసిష్ఠశ్చ సనకశ్చ సనందనః ।
భృగుః సనత్సుజాతశ్చ వామదేవశ్చ నారదః ॥

53వ శ్లో॥ గౌతమః శునకః శక్తిర్మార్కండేయాశ్చ కౌశికః ।
పరాశరః శుకశ్చైవాంగిరాః కణ్వస్తథైవ చ ॥

54వ శ్లో॥ జాబాలిశ్చ భరద్వాజో వేదవ్యాసః తథైవ చ ।
ఈశానో రమణశ్చైవ కపర్దీ భూధరః తతః ॥

55వ శ్లో॥ సుభటో జలజశ్చైవ భూతేశః పరమస్తతః ।
విజయో భరతశ్చైవ పద్మేశః సుభగస్తతః ॥

56వ శ్లో॥ విశుద్ధః సమరశ్చైవ కైవల్యశ్చ గణేశ్వరః ।
సుపాద్యో విబుధో యోగో విజ్ఞానోఽనంగ విభ్రమౌ ॥

57వ శ్లో॥ దామోదరః చిదాభాసః చిన్మయశ్చ కళాధరః ।
వీరేశ్వరశ్చ మందారః త్రిదశః సాగరో మృడః ॥

58వ శ్లో॥ హర్షః సింహశ్చ గౌడశ్చ వీరోఽఘోరో ధ్రువస్తతః ।
దివాకరః చక్రధరః ప్రమథేశశ్చతుర్భుజః ॥

59వ శ్లో॥ ఆనందభైరవో ధీరో గౌడః పావక ఏవ చ ।
పారాశర్యః సత్యనిధీ రామచంద్రస్తతః పరమ్ ॥

60వ శ్లో॥ గోవిందః శంకరాచార్య ఏకసప్తతిసంఖ్యకాః ।
శంకరాచార్యశిష్యాశ్చ చతుర్దశః దృఢవ్రతాః ॥

**74,75 శ్లోకాలలో "దీక్ష" లేకున్నను భక్తితో గురుక్రమమును తెలిసికొని మంత్రజపము చేసినచో సిద్ధి లభించునని 'శ్రీవిద్య' దేవి శ్రీ విద్యారణ్యమునికి వరము నొసంగినదని కలదు. పండితులు దీనిని గుర్తించవలెను.**

# 71మంది శ్రీవిద్యాగురువులు - పంచదశీమంత్రము

(పంచదశి - క ఏ ఈ ల హ్రీం, హ స క హ ల హ్రీం, స క ల హ్రీం) శ్రీం చేర్చిన షోడశి యగును.

| | | | |
|---|---|---|---|
| 1. కపిల | 19. జాబాలి | 37. గణేశ్వర | 55. గౌద |
| 2. అత్రి | 20. భరద్వాజ | 38. సుపాద్య | 56. వీర |
| 3. వసిష్ఠ | 21. వేదవ్యాసః | 39. విబుధ | 57. అఘోర |
| 4. సనక | 22. ఈశాన | 40. యోగ | 58. ధ్రువ |
| 5. సనందన | 23. రమణ | 41. విజ్ఞాన | 59. దివాకర |
| 6. భృగు | 24. కపర్ది | 42. అనంగ | 60. చక్రధర |
| 7. సనత్సుజాత | 25. భూధర | 43. విభ్రమః | 61. ప్రమథేశ |
| 8. వామదేవ | 26. సుభట | 44. దామోదర | 62. చతుర్భుజ |
| 9. నారద | 27. జలజ | 45. చిదాభాస | 63. ఆనందభైరవ |
| 10. గౌతమ | 28. భూతేశ | 46. చిన్మయ | 64. ధీర |
| 11. శునక | 29. పరమ | 47. కళాధర | 65. గౌద |
| 12. శక్తి | 30. విజయ | 48. వీరేశ్వర | 66. పావక |
| 13. మార్కండేయ | 31. భరత | 49. మందార | 67. పారాశర్య |
| 14. కౌశిక | 32. పద్మేశ | 50. త్రిదశ | 68. సత్యనిధి |
| 15. పరాశర | 33. సుభగ | 51. సాగర | 69. రామచంద్ర |
| 16. శుక | 34. విశుద్ధ | 52. మృడ | 70. గోవింద |
| 17. అంగిరస్ | 35. సమర | 53. హర్ష | 71. శంకరాచార్య |
| 18. కణ్వ | 36. కైవల్య | 54. సింహ | |

21 వేదవ్యాసః - 67 పారాశర్య ఇద్దరు భిన్నులు. 16 శుకుడు కాగా 21 వేదవ్యాసుడు. కనుక ఈ వేదవ్యాసుని కంటే పూర్వుడు శుకుడు. 55 - గౌద, 65 - గౌద. ఇద్దరు 'గౌద' ఆచార్యులు కలరు. 65 - గౌద ఆచార్యునకు 70 - గోవిందాచార్యునకు మధ్య నలుగురు ఆచార్యులున్నారు, గుర్తించవలెను.

శంకరాచార్యుని శిష్య ప్రశిష్యులు ఎందరో కలరు. 1. శంకర 2. పద్మపాద 3. బోధ 4. గీర్వాణ 5. ఆనందతీర్థ - ఈ అయిదుగురు సంన్యాస శిష్యులు. 6. సుందర 7. విష్ణుశర్మ 8. లక్ష్మణ 9. మల్లికార్జున 10. త్రివిక్రమ 11. శ్రీధర 12 కపర్థి 13 కేశవ 14 దామోదర - ఈ తొమ్మిది మంది గృహస్థ శిష్యులు.

విష్ణుశర్మ శిష్యుడు ప్రగల్భాచార్యుడు. ఈ ప్రగల్భాచార్యుని శిష్యుడే విద్యారణ్యుడు. ఈ విద్యారణ్యుడే "శ్రీ విద్యార్ణవ తంత్ర" గ్రంథకర్త. (13,14 శతాబ్దులు).